తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-4

ఆగస్టు 26, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

# "అండజ భీము దండ డడ దండ"

ఎక్కడున్నావు గొంగళీ?– అంటే, వేసినచోటే అన్నట్లు, కాశ్మీర్ సమస్యా పరిష్కారంలో తిరిగి ప్రతిష్టంభన ఏర్పడింది. ఇండియా పాకిస్తానులు రెండూ తాత్కాలికంగా కాశ్మీర్‌లో యుద్ధవిరామం అవలంబించినా లాభం లేకపోయింది. మొన్న 22 వ తారీకు నాడు ఢిల్లీలో సమావేశం కావలసిన ఇండియా. పాకిస్తాన్ ప్రతినిధుల సమావేశం రద్దు కావించడంతో, యీ కాశ్మీర్ సమస్య ముగియడ మెప్పటికో ఎంత అభిజ్ఞులైన వారికీ బోధపడడం లేదు. ఢిల్లీ సమావేశం ఎందుకు రద్దయింది? స్పష్టమైన కారణాలు యింకా ప్రకటింపబడలేదు. అందుకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలు — ఇండియాతో, పాకిస్తాన్‌తో కాశ్మీర్ కమీషన్ నడిపినవి–యిప్పట్లో బహిరంగం చెయ్యడానికి కమీషన్ సభ్యులు విముఖంగా ఉన్నట్టు తెలుస్తున్నది. వారు విపరీతమైన ఆశావాదులు. ఇవాళ కాకపోతే రేపయినా కాశ్మీర్ సమస్య విజయవంతంగా పరిష్కరించగల మనే వారి విశ్వాసం. అందుకే వారు సున్నితమైన చర్చలతో కూడిన ఆ ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రకటించ దలచుకో లేదు.

కాని, యీ మిత్రరాజ్య సమితి కాశ్మీర్ సంఘసభ్యులు తమ కార్యంలో విఫలు లయారని నిస్సందేహంగా నిరూపించబడింది. కాశ్మీర్‌లో పోరాడుతున్న ఉభయపక్ష సేనలూ ఆక్రమించుకున్న ప్రదేశాలకు మధ్య సరిహద్దులు నిర్ణయించడంతో కృతకృత్యులైనట్లు సమితి సభ్యులు భావించారు. భావించి ఉభయరాజ్యాలకూ మధ్య ఢిల్లీలో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఆ చర్యలో ఉపజ్ఞపాలు కంటె ఉత్సాహపుపాలే ఎక్కువ.

సమావేశం జరగకండా పోవడానికి అతి ముఖ్యమైన కారణం కాశ్మీర్‌లోని "ఆజాద్ సేన" అనబడే దుండగీడులను నిరాయుధుల్ని చేసి వెనక్కు రప్పించడానికి పాకిస్తాన్ అంగీకరించకపోవడమేనని రుజువైంది. వీళ్ళ విషయంలో తన బుద్ధికందిన తర్కశాస్త్ర మంతా పాకిస్తాన్ వినియోగిస్తున్నది. మొదటి వార్తల ప్రకారం యీ "ఆజాద్ సేన" తన సైన్యంలో భాగమే ననీ, అందువల్ల దానిని నిరస్త్రం చెయ్యడం అనే

ప్రసక్తే అప్రస్తుతమనీ, పాకిస్తాన్ వాదించినట్లు ప్రకటించబడింది. అయితే, ఆగస్టు తీర్మానం ప్రకారం, ఉభయసమ్మతంగా సంధి జరిగిన ఉత్తరక్షణం తన సైన్యాల్ని కాశ్మీర్ భూభాగం నుండి ఉపసంహరించడానికి పాకిస్తాన్ అంగీకరించింది. అందువల్ల సర్దుకొని పాకిస్తాన్ యింకో ప్రకటన చేసింది. ఈ ప్రకటన ప్రకారం, యీ ఆజాద్ కాశ్మీర్ సేనలు కేవలం "ఆజాద్ కాశ్మీర్" ప్రభుత్వానివి; అందువల్ల వాటి భవితవ్యం నిర్ణయించవలసింది ఆ ప్రభుత్వం కానీ తాము కాదు—యిదీ వరస.

ఢిల్లీ సమావేశం ఏర్పాటు చేసి, చర్చించవలసిన అంశాల పట్టికను రెండు రాజ్యాలకూ కమీషన్ పంపించి, వాటిపై వారివారి వ్యాఖ్యలు చూసిన వెంటనే సమావేశం రద్దుచేసింది. దీనిని బట్టిచూస్తే, అటువంటి సమావేశం ఫలప్రదం అవుతుందనే నమ్మకం కమీషన్ సభ్యులకు మొదటినుంచీ ఉన్నట్లు గోచరించదు. నేరం తమపై ఉంచుకోక, తాము చెయ్యవలసినదంతా చేశామనీ, ఇండియా పాకిస్తానులలో సమరసభావం కొరతవడిందనీ లోకానికి చూపించడానికే వీరిట్లా ప్రవర్తించారా అనిపిస్తుంది. యుద్ధ విరమణసంధికి యీ రెండు ప్రభుత్వాలు పట్టుపడుతున్న షరతులేవో కమీషన్ సభ్యులకు కొత్త కాదు. వాళ్లు ఢిల్లీ సమావేశంలో చర్చించవలసిన అంశాలపై చేసిన వ్యాఖ్యలు యిదివరకటి వాటికంటె భిన్నంగా ఉండి ఉండవు. అటువంటప్పుడు యీ ఢిల్లీ సమావేశ ప్రయత్నం దేనికి? భద్రతాసంఘం ముందు తమపరువు నిలబెట్టుకుందికే కమీషన్ సభ్యు లీయెత్తు యెత్తారని అనక వీలులేదు.

అడుగడుగునా యీ కాశ్మీర్ కమీషన్ సభ్యులు వేస్తున్న తప్పటడుగుల వల్ల సమస్యా పరిష్కారానికి ఆస్కారం యింకా దూరమైపోయింది. రేపు సెప్టెంబరు మొదటివారంలో ప్లెబిసైట్ నిర్వహణకు కాశ్మీర్ రావలసిన ఎడ్మిరల్ నిమిట్జ్ ప్రయాణం ఆపుచేయవలసి ఉంటుంది. అయినా జరిగిన దానికి ఇండియా విచారించవలసిన అవసరం లేదు. కమీషన్‌వారు ఆగస్టు 13న సూచించిన షరతులు ఇండియాకంటె పాకిస్తాన్‌కే లాభదాయకంగా ఉండి ఉండేవి. ఆజాద్ కాశ్మీర్ సేనల్ని నిరాయుధుల్ని చేసి ఉపసంహరిస్తే, ప్లెబిసైట్ తనకు వ్యతిరేకంగా వస్తుందని పాకిస్తాన్ భయం. తను ఆక్రమించుకున్న కాశ్మీర్ భాగం ఏమయినా సరే వదలకూడదనే పట్టుదల పాకిస్తాన్ చూపిస్తున్నది. భద్రతాసంఘం పరువు ప్రతిష్ఠలకే యిదొక చక్కని పరీక్ష. నేడు మిత్రరాజ్యసమితి ప్రధాన కార్యాలయంలో జరుగుతున్న తర్జనభర్జనలు గమనిస్తే పాకిస్తాన్ అవలంబిస్తున్న కుటిలత్వం ఎంత శోచనీయమైనదో తెలుస్తుంది. భద్రతాసంఘం నిజంగా చిత్తశుద్ధి కలదైతే, పాకిస్తాన్ ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకువచ్చి, దానిని దారికి తేవాలి — లేనినాడు ప్లెబిసైట్ జరక్కపోవడం, యుద్ధం జరగడం-యివీ ఫలితాలు. ఇండియా ప్రభుత్వం అన్నిటికీ సిద్ధపడే ఉన్నది.

కొత్త దృక్పథం

# మన దేశం - కార్మిక సమస్య

మోపర్తి వెంకటరమణయ్య

యంత్ర యుగంతో పాటు ఉద్భవించిన సమస్యలలో కార్మిక సమస్య చాలా ముఖ్యమయింది. నేడు ప్రపంచములోని దేశాలన్నీ యీ సమస్యతో సతమత మవుతున్నవి. ఒక విధంగా ఆధునిక నాగరికత యొక్క మనుగడ యీ సమస్యను జయప్రదంగా పరిష్కరించటం పైనే ఆధారపడి ఉన్నదని చెప్పవచ్చును. పెట్టుబడిదారీ ఆర్థిక విధానం యీ సమస్యను పరిష్కరించలేదని తేలిపోయింది. ఇక కమ్యూనిజం యీ సమస్యను పూర్తిగా పరిష్కరించ గలదని చాలామంది ఆశించారు. కాని వర్గపోరాటాన్నే సంఘాభివృద్ధికి మూలంగా పరిగణించిన కమ్యూనిజం కార్మికవర్గానికి తగని ప్రాముఖ్యం యిచ్చి, సంఘంలో వివిధ వర్గాలకు గల సంబంధాల్ని సరిగా అవగాహన చేసుకోలేక తికమక పడుతున్నది. కార్మిక సమస్యను సంఘశ్రేయస్సు దృష్టితో చూడక కమ్యూనిస్టులు రాజకీయ పోరాటంలో కార్మికవర్గాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకుంటున్నారు. దీనితో కార్మికుల శ్రేయస్సు, యితర ప్రజల శ్రేయస్సు విభిన్నము లైనవనే అపోహ ప్రబలి యీ సమస్య మరింత క్లిష్టతర మయింది. ఇట్టి పరిస్థితులలో స్వతంత్ర దేశంగా ఉద్భవించిన ఇండియా ఆర్థికంగాను, రాజకీయంగానూ కూడా స్థిరపడాలంటే యీ కార్మిక సమస్యను జయప్రదంగా పరిష్కరించుకోవటం యెంతైనా అవసరం.

పారిశ్రామికంగా వెనుకబడి ఉన్న మన దేశంలో యింతవరకు బలంతమైన కార్మికవర్గం యేర్పడలేదు. కాని రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలోను మన దేశంలో కొంతవరకు పరిశ్రమలు తలయెత్తటానికి అవకాశం కలిగింది. వానితో పాటు శ్రామికవర్గంకూడా మొలకెత్తింది. అయితే మన దేశంలోని పెట్టుబడిదారీ విధానానికి, కార్మికవర్గానికి మధ్య పుట్టుకతోనే పోరాటం ప్రారంభంకావటం ఆశ్చర్యకరంగా తోచకపోదు. కాని దీనికి కారణం లేకపోలేదు. పాశ్చాత్యదేశాలలోవలెనే మన దేశంలోకూడా పెట్టుబడిదారీ విధానం తొలిరోజులలో అభివృద్ధికరపాత్ర నిర్వహించ కలిగి వుంటే యీ పోరాటం యిప్పట్లో సంభవించేది కాదు. ప్రపంచమందంతటా పెట్టుబడిదారీ విధానం మనుగడే అసంభవమైపోయి, దాని పతనం పూర్తిఅవుతున్న యీ శతాబ్దంలో మన దేశంలో తలయెత్తిన పెట్టుబడిదారీ విధానం 'గుంటపూలు' పూయక తప్పదు. ప్రపంచంలో ఒకభాగమయిన ఇండియా ఇతరభాగాలలో సంభవించే సంఘటనల ప్రభావానుండి తప్పించుకోజాలదు. ఈదృష్టితో చూస్తే మనదేశంలో కార్మిక సమస్య కొద్ది కాలంలోనే యింత క్లిష్టమైనదిగా యెలాపరిణమించిందో తేలికగా బోధపడుతుంది.

దీనినిబట్టి మనదేశంలో కార్మికవర్గం సంఖ్యాబలంలో వెనుకబడివున్నా, ప్రాముఖ్యంలో తీసిపోదని, కార్మికసమస్యా పరిష్కారాన్ని వాయిదా వేయ వీలులేదని ఒప్పుకోకతప్పదు. ఈసమస్య సరిగా పరిష్కారమయేది, లేనిది ప్రభుత్వ ఆర్థిక విధానంమీదా, కార్మిక నాయకత్వంమీదా ఆధారపడి ఉంటుంది. ఇంతవరకూ మన ప్రభుత్వ ఆర్థిక విధానంగాని, దేశంలోని కార్మికోద్యమంగాని పరిశీలిస్తే ఆశాభావంతో ఉండటానికి యెక్కువ అవకాశం కనిపించటం లేదు.

నేడు మన ప్రభుత్వం పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని అనుసరిస్తున్నదన్న విషయం నిర్వివాదాంశం. ఈ విధానం కార్మిక సమస్యను విషమింప జేస్తుందేకాని ఉపశమింప జేయలేదు. దీని ఫలితం అప్పుడే రుచిచూస్తున్నాంకూడా.

గడచిన రెండు మూడు సంవత్సరాలలో దేశమంతటా కార్మిక సమస్యలు ఉధృతంగా లేచినై. ఈ సమ్మెలకు కేవలం కమ్యూనిస్టుల ప్రచారమే కారణం అనటం సరికాదు. కార్మికుల అసంతృప్తిని కమ్యూనిస్టులు తమ లక్ష్య సాధనకు వినియోగించుకొన ప్రయత్నించారు, అంతే. ఈ సమ్మెలను అణచుటకు ప్రభుత్వం బలప్రయోగం చేయటంతో దేశంలో అసలు కార్మికోద్యమమే దెబ్బతిన్నది. స్వతంత్ర కార్మికోద్యమ నిర్మాణానికై పాటుపడుతున్న వారిపని కష్టమయిపోయింది. ఈమధ్య దేశంలో సమ్మెలు లేకపోవటానికి కారణం కార్మికులు సంతృప్తిచెంది ఉండటమే అనుకోవటం భ్రమ. గత రెండు మూడేళ్ళలో కమ్యూనిస్టుల ప్రేరేపణచే అనాలోచితంగా జరిగిన సమ్మెలలో నూటికి 90-కి పైగా పూర్తిగా భగ్నమైనయి. దీనితో కార్మికులు నిస్పృహా, పరాజయ మనస్తత్వం ప్రబలి నిస్సహాయ స్థితిలో పడివున్నారు. నేటి కార్మిక లోకంలోని ప్రశాంతత స్మశానంలోని ప్రశాంతత వంటిది. నివురు కప్పిన నిప్పువలెవున్న అసంతృప్తి అవకాశం లభించగానే భగ్గుమనక మానదు. ఈ ఉపద్రవం సంభవించకముందే జాగ్రత్తపడి కార్మికులఅసంతృప్తిని తొలగించటం శ్రేయస్కరం.

మనదేశంలో కార్మిక నాయకత్వంకూడా వాంఛనీయమైనదిగా లేదు. కార్మికులు తమ ఆర్థిక, వైజ్ఞానికాభివృద్ధికై సంఘటితులగుటకు బదులు జాతీయవాదులుగాను, వామపక్షీయులు-ముఖ్యంగా కమ్యూనిస్టులు-గాను చీలదీయబడ్డారు. బ్రిటిష్‌వారు ఇండియా పాలించినంతకాలం మన రాజకీయనాయకులు కార్మికులను సామ్రాజ్యవాద వ్యతిరేక సమరంలో ఒకసాధనగా ఉపయోగించుకున్నారు. ఇండియా స్వతంత్రదేశం కాగానే కార్మికులు పెట్టుబడిదారుల దయాదాక్షిణ్యాలకు వదలివేయబడ్డారు. తిరిగి కమ్యూనిస్టులు, యితర రాజకీయపార్టీల వారు జాతీయప్రభుత్వ వ్యతిరేకపోరాటంలో కార్మికులను పనిముట్లుగా ఉపయోగించుకొనజూస్తున్నారు. ఈ విధంగా కార్మికులు పలువైపులకు లాగబడుతున్నారు. దీనికితోడు మన కార్మికులు బీదరికంలోను, విద్యావిహీనతలోను పడివుండుటవలన తమ కాళ్ళమీద తాము నిలబడలేని స్థితిలో ఉన్నారు. సాంఘిక జీవితంలో తాము నిర్వహించవలసిన ప్రముఖ పాత్రను, సమాజంలో యితరుల శ్రేయస్సుకు, తమ శ్రేయస్సుకుగల అవినాభావ సంబంధాన్ని గ్రహించలేక కేవలం కడుపు కక్కుర్తితో అరచేతిలో స్వర్గం చూపించే రాజకీయ పార్టీల వలలో పడుతున్నారు. అందుకనే నిజంగా కార్మికుల ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికై పాటుపడే వారికంటే, వేతనాభివృద్ధి ఆశచూపి చీటికిమాటికి సమ్మె చేయించేవారే తమ శ్రేయోభిలాషులని భ్రమ పడుతున్నారు. దీనికై కార్మికులను నిందించి ప్రయోజనం లేదు. వారి దుస్థితే యిందుకు ముఖ్యకారణం.

ప్రస్తుతం మనదేశంలో మూడు కార్మిక సంస్థలున్నవి. (1)అఖిలభారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, (2) అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, (3) హింద్ మజ్దూర్ సభ. వీటిలో జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ పూర్తిగా కాంగ్రెస్ వారి ఆధ్వర్యమున పనిచేస్తున్నది. కాంగ్రెస్ ప్రభుత్వాలు అనుసరిస్తున్న ఆర్థిక విధానానికి అనుకూలంగా కార్మికోద్యమాన్ని నడిపే ఉద్దేశ్యంతో కొంతమంది కాంగ్రెస్ ప్రముఖులు యీ కార్మిక సంస్థను స్థాపించారు. ప్రభుత్వం వారి దృష్టిలో యీ కార్మికసంస్థ ఒకయెత్తు, యితర కార్మిక సంస్థలన్నీ ఒకఎత్తు. ఈ సంస్థకే సకల సదుపాయాలు కలిగించి ప్రోత్సహిస్తున్నారు. ఈ కార్మికసంస్థ కాంగ్రెస్ పార్టీకి తోకగా ఉండక స్వతంత్రంగా పని చేస్తుందనే విషయం అనుమానాస్పదమే! పైగా కాంగ్రెసు వారు క్రమేణా యితర కార్మిక సంస్థలన్నిటిని అణగద్రొక్కి దేశంలోని కార్మికవర్గాన్ని యావత్తూ తమ అదుపులో ఉంచుకొని తద్వారా యితర రాజకీయ పార్టీలకు పలుకుబడి లేకుండా చేయ ప్రయత్నిస్తారని చాలామంది భయపడుతున్నారు.

ఇక అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ పూర్తిగా కమ్యూనిస్టుల చేతులలో ఉంది. గడచిన సంవత్సరం కమ్యూనిస్టులు కానివారందరు యీ సంస్థ నుండి

తప్పుతున్నారు. ఏ దేశంలోనైనా కార్మిక సంస్థలను సాధనంగా ఉపయోగించుకొని రాజకీయాధికారాన్ని చేజిక్కించుకోవటమే కమ్యూనిస్టుల యెత్తుగడ. గత యుద్ధానంతరం పడమటి యూరపు దేశాలలో కమ్యూనిస్టులు అనుసరించిన విధానాలే యిందుకు ప్రబల నిదర్శనము. ఒక్క చెకోస్లావాకియాలో మాత్రం వారి పాచిక పారింది. ఫ్రాన్స్, ఇటలీలలో యిదే పంథా అవలంబించారు కాని లాభం లేకపోయింది. ప్రభుత్వ విధానాలను భగ్నం చేయాలన్నా, లేక ప్రభుత్వాన్ని కూలద్రోయాలన్నా వీరు కార్మికులను ప్రయోగిస్తూ ఉంటారు. కమ్యూనిస్టులకు "జనరల్ స్ట్రయిక్" బ్రహ్మాస్త్రం లాంటిది. కార్మిక శ్రేయస్సు కంటె తమ లక్ష్య సాధనయే కమ్యూనిస్టులకు ముఖ్యం. ఉదాహరణకు లండన్ రేవు కార్మికుల సమ్మె తీసుకుందాం. అసలు సమ్మె అమెరికాలోని రెండు కార్మిక సంఘాల మధ్య తగాదాతో ప్రారంభమయింది—ఒకటి ఉత్తర అమెరికా నావికుల అంతర్జాతీయ సంఘం (S. I. U.), రెండవది కెనడా నావికుల సంఘం (C. S. U.). ఈ రెండవ సంఘం కమ్యూనిస్టుల పలుకుబడిలో ఉంది. 194న అక్టోబరులో S. I. U. వారు నౌకా యజమానులతో క్రొత్త ఒడంబడిక చేసుకున్నారు. కాని C. S. U. నాయకులు మధ్యవర్తి సంఘమువారి తీర్పును తిరస్కరించి సమ్మె ప్రారంభించారు. (ఈ మధ్యవర్తి సంఘంలో C. S. U. నియమించిన ప్రతినిధి కూడా ఉన్నాడు.) కాని S.I.U. నావికులు సమ్మెలో చేరక తమ పనిని యథాప్రకారం కొనసాగించారు. చివరకు యిది S.I.U. కును, C.S.U. కును మధ్య పోరాటంగా పరిణమించింది. అనేక మంది నావికులు తమ పొరపాటు గ్రహించి S. I. U. లో చేరనారంభించారు. దీనితో స్వదేశంలో నావికుల తోడ్పాటు కోల్పోయిన C. S. U. నాయకులు విదేశాల రేవులలో సమ్మె చేయవలసిందని తమ సభ్యులకు తాఖీదు పంపించారు. బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ వారు కెనడాలోని తమ సోదరుల కేక అందుకొని లండన్‌లోని రేవు కార్మికులను సమ్మె చేయవలసిందని ప్రోత్సహించ నారంభించారు. కెనడా కార్మికుల న్యాయమైన కోర్కెల కోసం యీ సమ్మె జరుగుతున్నదని తప్పుడు ప్రచారం ప్రారంభించారు. ఈ విధంగా లండన్ రేవు కార్మికులు కమ్యూనిస్టు ప్రచారానికి లోనై తమకు యేవిధంగాను సంబంధంలేని సమ్మెలో పాల్గొని చావు బ్రతుకుల మధ్య తన్నుకొంటున్న బ్రిటన్ ఆర్థికాభివృద్ధికి అపాయం తెచ్చిపెట్టారు. ఈవిషయంలో నిష్పక్షపాత దృష్టికలవారెవరూ లండన్ రేవు కార్మికుల చర్యను సమర్థించలేరు. వీరు సంఘ శ్రేయస్సుకు వ్యతిరేకంగా ప్రవర్తించారనటంలో సందేహం లేదు. అసలు యీసమ్మె చేయించటానికి కమ్యూనిస్టుల ముఖ్యోద్దేశ్యం మార్షలు ప్లానుకు విఘ్నం కలిగించటమే. ఇందుకు కార్మికులను ఉపయోగించుకున్నారు. "ప్రపంచ కార్మికులారా, ఏకముకండు", అన్ననినాదాన్ని వక్రమార్గంలో అనుసరిస్తున్నారు. మనదేశంలో కమ్యూనిస్టులది కూడా యిదే పంథా. వారి కార్మికోద్యమం యెప్పుడూ రష్యా విదేశాంగవిధానాన్ని అనుసరించి నడుస్తూ ఉంటుంది

లండన్ కార్మికుల సమ్మె విషయంలో ఒక విషయం గమనార్హం. ఇంత విపత్కరపరిస్థితులు యేర్పడినా బ్రిటిష్ ప్రభుత్వం సమ్మెను నిషేధించలేదు. కార్మికులకు నచ్చచెప్పటానికి ప్రయత్నించారేకాని బల ప్రయోగం చేయలేదు. హెరాల్డు జె. లాస్కి చెప్పినట్లు యిక్కడే బ్రిటిష్ కార్మికోద్యమానికి, రష్యా కార్మికోద్యమానికి తేడా కనబడుతుంది. రష్యా కార్మికులు దేశ ఆర్థిక విధానంలో యెంత ప్రముఖ పాత్ర నిర్వహించినా వారికి స్వేచ్ఛ లేదు. తమకు యిష్టమున్నా, లేకపోయినా ప్రభుత్వ ఆర్థిక విధానాని కనుకూలంగా మెలగవలసి ఉంటుంది. సమ్మెచేసే హక్కు లాగివేయబడింది. బ్రిటన్‌లో అలాకాక కార్మికులకు సంపూర్ణ స్వేచ్ఛ ఉన్నది. ప్రభుత్వ ఆర్థిక విధానం తమకు నచ్చనప్పుడు స్వేచ్ఛగా విమర్శించవచ్చును. ఆ విధానాన్ని మార్పించ ఆందోళన చేయవచ్చును. అవసరమైతే సమ్మెచేసే హక్కుఉంది. ఇంత స్వేచ్ఛ ఉన్నా బ్రిటిష్ కార్మికులు చీటికి మాటికి సమ్మెచేయరని, కొన్నికొన్ని పరిశ్రమలలో యీమధ్య అసలు సమ్మెయే జరుగలేదని అంటాడు లాస్కి.

రష్యాలో కార్మికుల క్రమ శిక్షణ కమ్యూనిస్టు పార్టీ చేతా, ప్రభుత్వంచేతా విధింపబడ్డది. బ్రిటన్‌లో వారి క్రమశిక్షణ స్వచ్ఛందమైనది.

మనదేశంలో క్రొత్తగా నెలకొన్న హింద్ మజ్‌దూర్ సభవారు, దేశంలో రాజకీయ పార్టీలతో సంబంధంలేని స్వతంత్ర కార్మికోద్యమం నిర్మించటమే, తమ ఆదర్శమని చెపుతున్నారు. సోషలిస్టుల హింద్ మజ్‌దూర్ పంచాయత్, రాడికల్ హ్యూమనిస్టుల కార్మిక ఫెడరేషన్, ఫార్వర్డు బ్లాక్ నాయకుడైన రూయికర్ నాయకత్వమున ఉన్న కార్మిక సంఘము, ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నుండి చీలిపోయిన కార్మిక సంఘాలు కలిసి హింద్ మజ్‌దూర్ సభగా యేర్పడినవి. వీరు కార్మిక ఉద్యమాన్ని రాజకీయ లక్ష్య సాధనంగా ఉపయోగించక, కేవలం కార్మిక శ్రేయస్సునే ప్రధానంగా భావించి, కార్మికుల ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికి కృషి చేస్తామంటున్నారు. వీరిలో రాడికల్ హ్యూమనిస్టులు మాత్రం రాజకీయ పార్టీ కాకపోయినా, సోషలిస్టులు, ఫార్వర్డు బ్లాకువారు ఒకవంక కార్మిక నాయకులుగాను, మరోవంక రాజకీయ పార్టీ నాయకులుగాను పనిచేస్తున్నారు. వీరు కార్మిక సమస్యలను యెంతవరకు తమ పార్టీల లక్ష్యములనుండి వేరుచేసి చూడగలరో సందేహాస్పదం. ఏమైనా వీరి చిత్తశుద్ధిని కాలమే నిర్ణయించాలి. ఈనాడు మనదేశంలో కార్మికులలో పెద్దలోపం, వారు నాయకత్వంకై యితరులపై ఆధారపడవలసి రావటం. కార్మికేతరులు కార్మికులకు నాయకత్వం వహించటంకంటె, కార్మికులనుండే నాయకులు తయారుకావటం చాలా అవసరం. అప్పుడు కార్మికులు తమకాళ్లపై తాము నిలబడగలిగి, యితరుల చేతులలో కీలుబొమ్మలుగా ఉండే దుర్దశ తప్పుతుంది. కార్మికులు విద్యావంతులు అయిన నాడే యిది సంభవమవుతుంది. ఇందువలన మన దేశంలోని కార్మిక సంస్థలు కేవలం ఆర్థిక దృష్టితోనే ఉండక, సభ్యుల సాంస్కృతికాభివృద్ధికికూడా తీవ్రకృషి చేయాలి. కార్మిక వయోజన పాఠశాలలు, కార్మికుల క్లబ్బులు మొదలైనవి యిందుకుబాగా తోడ్పడతవి.

# స్వదేశీ ఉద్యమం కావాలి

వర్గవ్యవస్థలో అనేక వైరుధ్యా లుంటాయి. ఇతరుల శ్రమమీద జీవితం గడిపే వాడు భూతదయ అవలంబించి లాభం లేదు. ఒక వర్గం పట్ల మరొకవర్గం నీతిమాలి ఉండక జరగదు. వర్గ విభజన లేని సమాజంలో సామరస్యం సాధ్య మయ్యే అనేక శక్తులమధ్య వైరుధ్యం ఉంటుంది. అటువంటి శక్తులలో జాతీయ అంతర్జాతీయ భావాలనుకూడా చేర్చవచ్చు. ప్రతిదేశమూ ఆత్మ క్షేమంకొరకు ఇతరదేశాలతో ఘర్షణపడి పోటీ పడుతున్న దశలో జాతీయతకూ అంత ర్జాతీయతకూ పొసగదు. జాతీయత ఫాసిస్టు విధానానికి దారి తీస్తుందనే నినాదం బయలు దేరుతుంది.

ఇటువంటి నినాదాలలో కొంత అర్థం ఉన్నది గాని జాతీయవాదాన్ని అకారణంగా విసర్జించ డం చాలా మూర్ఖమవుతుంది. జాతీయభావాలు లేకుండా ఏజాతీ సమైక్యం కాలేదు, అంత ర్జాతీయవాదానికి దోహదం చేయలేదు. జాతీయ భావాల ప్రాబల్యంలేకుండా విప్లవాలు జరగా లంటే అవి ఎన్నటికీ జరగవు. జాతీయోద్యమా లను పీడించే వర్గాలకు నైవేద్యం పెట్టకుండా ఉంటే ఆ ఉద్యమాలు అంతర్జాతీయవాదానికి దారి తీయగలవు.

మన దేశంలో కాంగ్రెసువారు నడిపినదే ఆఖరు జాతీయోద్యమం. అది 1947 ఆగస్టు 15 న అంతమయింది. మనం స్వాతంత్ర్య దిన మని జరుపుతున్నది మన ఆఖరు జాతీయోద్య మంయొక్క వర్థంతి అని అందరూ జ్ఞాపకం ఉంచుకోవటం అవసరమేమో.

ప్రతి జాతీయోద్యమం వెంటా కొన్ని నూతన సాంఘిక శక్తులకు చైతన్యం కలుగుతుంది; కొంత నూతన సంస్కారం సాగి జనాన్ని ఊపగట్టు తుంది; కొంత స్వార్థత్యాగమూ, దీక్షా ప్రజలను ఆవహిస్తాయి; కొందరు కొత్త నాయ కులు ఏర్పడతారు.

ఈనాటి ప్రజాజీవితం చూస్తే దీన్ని ఉత్తేజపరచటానికి ఇటువన్ని ఎంత అవసరమో సులభంగా బోధపడుతుంది. దేశ మంతటా స్వార్థమూ, పక్షపాతమూ, అవినీతీ పెచ్చు రేగిపోయింది; ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ జీవితం స్తంభించిపోయి కళలూ, సాహిత్యమూ కూడా కిలమెక్కి ఉన్నాయి; ప్రజలు నిస్పృహ చెంది ఉన్నారు; ఎంత వెతికినా ఇప్పుడున్న నాయకుల స్థానం ఆక్రమించేవారు కనపడరు— ఈ నాయకులను చూస్తే, వీరు గత జాతీయో ద్యమంలో ముందుకు వచ్చినవారు, కాని వీరి భాష ఇవాళ ప్రజలకు అర్థం కావటం లేదు. ప్రజల కష్టాలను గురించి నాయకు లేమి భావిస్తు న్నారో, వాటిని తొలగించటానికి వారు ఏమి చేశారో చేయనున్నారో మధ్యతరగతి విద్యార్థి కులకే సరిగా బోధపడటం లేదు.

ఇండియాకు స్వాతంత్ర్యం లభించినాక జాతీ యోద్యమాలతో పని తీరిపోయింది కొద్దిమంది కోటీశ్వరులకు మాత్రమే. పెళ్ళి తరువాత కనుములాగా యుద్ధం యొక్క సత్ఫలితాల వెను వెంటనే వారికి స్వాతంత్ర్యం యొక్క సత్ఫలి తాలు కూడా పూర్తిగా దక్కాయి. తక్కువ తరగతి ధనికవర్గాలు ఏ జాతీయోద్యమమూ అవసరం లేకుండానే పరిస్థితులు బాగుపడతా యని ఆశిస్తున్నారు. మిగిలిన వర్గాలు కేవలమూ నడిసముద్రంలో ఉన్నాయి.

ఇవాళ ఏ జాతీయోద్యమం సాగినా అది ఒడుదుడుకులు లేకుండా సాగాలంటే దానికి కాంగ్రెసు ప్రభుత్వాల అండ ఉండటం మంచిది. కాంగ్రెసును ప్రతిఘటించి సాగించ దలిస్తే విప్ల వమే సాగించవచ్చు. కాంగ్రెసు నిఘంటువులో విప్లవమనే మాట తుడిచిపెట్టుకు పోయింది.

కాంగ్రెసు ప్రభుత్వాలు బలపరచ తగిన ముఖ్యమైన ఒక జాతీయోద్యమం ఏమంటే విదేశీ వస్తు బహిష్కరణం. ఇటువంటి ఉద్యమంయొక్క అవసరం ఎంతైనా ఉన్నది. మనకున్న



దల్లా స్వర్గింపదగినది ఒక్కటే. అందు లో సాధ్యమైనంత ఎక్కువ భాగం యంత్రసామగ్రి దిగుమతి కింద

వినియోగం కావలసి ఉన్నది. మన ఎగుమతి వ్యాపారం నానాటికీ క్షీణిస్తున్నది. దీనితో పాటు దిగుమతులు హెచ్చటం కూడా జరిగితే దేశం ఆర్థికంగా చాలా కష్టాల పాలవుతుంది.

విదేశీ వస్తు బహిష్కారం చేసి మనం బతకగలమా? ఎంతవరకు బతకగలం? ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకోవాలి. యుద్ధం రోజులు స్మరిస్తే మనకు సమాధానం తెలుస్తుంది.

యుద్ధకాలంలో ఏం జరిగింది? మనకు పైనుంచి దాదాపు ఏమీ సరుకు అందలేదు. దేశంలో ఉన్న పరిశ్రమలు విధి విరామమూ లేకుండా పనిచేశాయి గాని వాటిద్వారా ఉత్పత్తి అయిన సరుకులో అధిక భాగం ప్రజలకు అందలేదు. దానివల్ల ప్రజలకు హాని కలిగింది. ముఖ్యంగా తిండిదొంగలు లక్షలాది జనాన్ని పొట్టన పెట్టుకున్నారు.

విదేశీవస్తు బహిష్కరణవల్ల ఈ దుష్ఫలితాలు లేకుండా చూసుకోవచ్చు. యుద్ధం రోజుల్లో అనేకవస్తువులు లేకుండా జరుపుకున్నాం. ఇప్పుడూ జరుపుకోగలం. యుద్ధకాలంలోలాగ మనం కోటానకోట్లు స్టెర్లింగు నిలవచేయ నవసరంలేదు. మన దేశీయపరిశ్రమలు ఉత్పత్తిచేసే సరుకంతా ప్రజలు వినియోగం చేసుకోవచ్చు.

వాడుక సరుకులను మూడు తరగతులుగా విభజించవచ్చు: ప్రాణావసరాలూ, జీవితావసరాలూ, వేడుక వస్తువులూనూ. ఇందులో ప్రాణావసరాలను (ఆహారం, మందులూ వగైరా) సాధ్యమైనంతవరకు దేశంలోనే తయారు చేసుకుంటూ తప్పనిసరి అయినవాటిని పైనుంచి దిగుమతి చేసుకోవాలి. యంత్రసామగ్రిని ప్రాణావసరాలకింద చేర్చాలి. జీవితావసరాలను దేశంలోనే పూర్తిగా తయారుచేయటానికి పథకాలు తయారుచేయాలి. ఈ పథకాలు సాధ్యమైనంత త్వరలో పూర్తిచేసుకుంటూ అంతదాకా వాటిని కనీస మొత్తాలలో దిగుమతి చేసుకోవాలి. వేడుకవస్తువులను పూర్తిగా బహిష్కరించాలి. వీటిలో విదేశీ సినిమా చిత్రాలనుకూడా చేర్చాలి.

ఈవిధంగా చేసినట్టయితే దేశసంపద పెంపొందటమేకాక ప్రజాజీవితం శీఘ్రమే చక్కబడుతుంది.

ఇది ఒక ఉద్యమంగా ఆరంభమై ప్రజల జీవితం అన్నిముఖాలా అలుముకోవాలి. మన ఆర్థికసమస్యకు రాజకీయ అంతర్జాతీయ మొహమాటాలు అడ్డం రారాదు. ఇటువంటి ఉద్యమాన్ని కాంగ్రెసు ప్రభుత్వం బలపరచాలి, కాని తానే గుత్త తీసుకోరాదు. ఇటువంటి ఉద్యమాన్ని కోటీశ్వరులు బలపరచరు, ప్రతిఘటిస్తారు కూడాను. వారికి విదేశీ గుత్తదార్లతో సన్నిహిత సంబంధాలున్నాయి. కాని ప్రజలు ప్రభుత్వాన్ని బలపరిచి తీరుతారు. వారు కొద్దిపాటి నష్టాలకు లోనైనప్పటికీ, ఈ కష్టాలెందుకు వచ్చాయో తెలిస్తే, సంతోషంతో భరిస్తారు.

ఈ సందర్భంలో విదేశీ పెట్టుబడులను వేడుక సరుకుగా భావించటం మంచిది. మన రాజకీయాలలో వేలుపెట్టకుండా విదేశీ పెట్టుబడిదార్లు మన ఉత్పత్తిని హెచ్చించరు. మన ఆర్థిక సమస్యలలో జోక్యం కలిగించుకునే విదేశీ రాజకీయాలు విదేశీ సరుకుకన్నకూడా ఉపద్రవకరమైనదని భావించాలి.



ఒక సినిమా డైరెక్టరుగారు చురుకైన అభ్యుదయ చిత్రం తీయడానికి చర్చించారు. అందులో కథానాయకుడు బీద గుమాస్తా. అంచేత గుమాస్తాగారి మోటారు, బంగళా, తోటా అన్నీ చాలా పాతగా కనబడేటట్టు చూపించ దల్చుకున్నారు. గుమాస్తా గారి దాసదాసీజనం, వంటవాళ్లు, అంతా బీదగా గోచరిస్తారట.

# మన జనాభా ఒత్తిడికి మందేమిటి?

ఎ. వి. హనుమంతరావు

గడచిన ఏభై సంవత్సరాలలో అవిభాజ్యభారత దేశపు జనాభా సుమారు 11 కోట్లు పెరిగింది. ఈ పెరుగుదల మొత్తపు జనాభాలో నూటికి 40-వ వంతు. పోల్చి చెప్పాలంటే-ఇది ఫ్రాన్సు, జర్మనీ మొత్తపు జనభాలతో సమానము. ఇట్టి విపరీతపు పెరుగుదలకు కారణము మన జనన మరణముల రేట్లు చాలా అధికము. అధికారులు జననపు రేటు 1,000కి 34 అని, మరణముల రేటు 24 అని 1931లో అంచనా వేశారు. ప్రభుత్వపు జనాభా సంఖ్యలు సేకరించడములో గల లోటుపాట్లచేత జననముల రేటు 1,000-కి 40, మరణము రేటు 30అని ఊహించడం అసలు సత్యానికి దగ్గరగా ఉంటుంది.

దేశంలో పుట్టుకలు మొత్తపు స్త్రీ జనాభాలో సంతానవతులయే వయస్సులో ఉన్న స్త్రీల నిష్పత్తిమీద ఆధారపడి ఉంటాయి.ఇంకా నిశితంగా చెప్పాలంటే వారిలో వివాహితలైన వారి నిష్పత్తిమీద ఆధారపడి ఉంటాయి. ఈ నిష్పత్తి 1931 అంచనా ప్రకారము నూటికి 46.47. మన దేశములో మొత్తము పుట్టుకలకు, సంతానవతులయే స్త్రీలకుగల నిష్పత్తి 222 అని నిర్ణయించబడింది. ఇది మన స్త్రీల సంతానవతులయే శక్తిని నిరూపిస్తుంది. ఇట్టి నిష్పత్తి ఇంగ్లండులో 123 అని అంచనా.

ఇక మరణముల సంఖ్య చాలా అధికము. ప్రతి సంవత్సరము 1 కోటి 10 లక్షలమంది మరణిస్తారని అంచనాలు. ఒక్క మలేరియా వ్యాధికే సుమారు 30 లక్షలమంది ఆహుతి అవుతున్నారు. క్షయ, స్ఫోటకము మొదలైన వ్యాధులు ప్రతి ఏడూ, తప్పకుండా భారత జనాభాను దిగమ్రింగుతున్నవి. సర్ జాన్ మెగా 1933లో మనదేశంలో పురటాళ్ళయిన స్త్రీలలో 1000-కి 34 మంది మరణిస్తారని అంచనా వేశారు. దేశంలో పుట్టే పిల్లల మొత్తంలో నాలుగోవంతు మొదటి సంవత్సరము నిండక ముందే మరణిస్తున్నారు. వారిని పెంచడానికయే ఖర్చు పెద్దవారికయే ఖర్చులో నాలుగోవంతు అనుకుంటే, మనము మన జాతీయపు టాదాయములో నూటికి $22\frac{1}{2}$ పదిహేను ఏండ్లు నిండని పిల్లలపై ఖర్చు పెడుతున్నాము. ఇది దేశానికి ఏ విధంగానూ ఉపయోగపడని ఖర్చు.

దేశంలో ఉత్పత్తి వృద్ధికాకుండా, జనాభా పెరుగుతుంటే సగటున మనిషికి జాతీయపు టాదాయము తగ్గిపోతుంది. యుద్ధకాలపు ద్రవ్యోల్బణముచేత మన జాతీయపు టాదాయము రెండింతలైనా డబ్బుయొక్క కొనుగోలు శక్తి తగ్గిపోవడముచేత నిజంగా అది తగ్గిపోయింది. భారతీయుని సగటు ఆదాయము ఇంత తక్కువగా ఉండుటకు కారణములలో, వివిధ ఉత్పత్తి మార్గములలో జనాభా ఒత్తిడి చాల ఎక్కువగా ఉండుట ఒకటి. ఉత్పత్తి వృద్ధిచేయుటకు ప్రథమంగా ఈ జనాభా ఒత్తిడి సమస్యను పరిశీలించ వలసి వున్నది.

ఉత్పత్తికి ముఖ్యమార్గములు- వ్యవసాయము, పరిశ్రమలు. దేశం యీమధ్య పారిశ్రామికముగా అభివృద్ధి చెందినప్పటికీ, జాతీయపు టాదాయములో కొద్దిభాగము తప్ప మొత్తము వ్యవసాయమునుంచే వచ్చుచున్నది. దేశములో నూటికి 70 మంది ఉద్యోగము వ్యవసాయము. వ్యవసాయము ఇంత ముఖ్యమైనప్పటికీ, సగటున ఒక ఎకరపు వ్యవసాయపు టుత్పత్తి, కొన్ని ఇతర దేశములతో పోల్చినప్పుడు నూటికి 40 వ వంతు. దీనికి ఇతర కారణములు చాలా ఉన్నప్పటికీ, భూమిమీది జనాభా ఒత్తిడి, జనాభా సమస్యకు సంబంధించిన కారణము. అంటే వ్యవసాయకునికి తగినంత భూమి లేదన్నమాట.ఉదాహరణకు బెంగాలులో 1939 లో సగటున

వ్యవసాయకునికి ఒక్కనికి ఒక ఎకరము భూమి ఉన్నదని అంచనా వేయబడ్డది. అదీకాక వ్యవసాయకులలో ఎక్కువమంది, ఇతర ఉత్పత్తి మార్గములలోనికి పోలేనివారే కాబట్టి భూమి యజమానికి ఎక్కువ కౌలు చెల్లించవలసి వస్తున్నది. కౌలు, సంవత్సరానికి కావలసిన మూలధనంపైని వడ్డీలు పోగా, భూమి నుండి వచ్చే రాబడి వ్యవసాయకుని తిండికి మాత్రమే అతి కష్టముమీద సరిపోతున్నది. భూమికి సారము పెట్టుటకు అతనికి రాబడి చాలడము లేదు. దీనికి ఫలితముగా భూమికీ తగిన సారము లేదు. అందుచేత ఉత్పత్తి తక్కువ. వ్యవసాయపు టుత్పత్తి తక్కువగా ఉండటానికి గల ఇతర కారణములలో మన వ్యవసాయకులు, ముఖ్యముగా ఆహార ధాన్యాదులను మాత్రమే పండిస్తూ ఎక్కువ రాబడి నిచ్చే పశుపెంపకం, కోళ్ల పెంపకం మొదలైనవాటిని అశ్రద్ధ చేయుచున్నారు. కాని జనాభాలో ఎక్కువ భాగం బీదవారైన వ్యవసాయకులే గనుక పాలు, పండ్లు, గ్రుడ్లు మొదలైన ఖరీదు గల వస్తువులను కొనలేరు. అందుచేత మన కొనుగోలు శక్తి అభివృద్ధికానిదే, వ్యవసాయపు టుత్పత్తికి మార్కెట్టు ఉండదు. మార్కెట్టు లేనిదే ఉత్పత్తి అభివృద్ధి కాదు. ఈవిధంగా మన వ్యవసాయము సుడిలో చిక్కుకొని అభివృద్ధి కావటములేదు. దానిని తొలగించడానికి ముఖ్యంగా భూమిపై గల జనాభా ఒత్తిడిని తగ్గించవలసి ఉన్నది.

ఇదేవిధంగా పరిశ్రమల్లోకూడా, శ్రామికుని కూలి సగటు ఉత్పత్తి చాల తక్కువగా ఉన్నది. పారిశ్రామికపు టుత్పత్తి దేశంలోని మార్కెట్టు మీద ఆధారపడి ఉంటుంది. ప్రజలలో ఎక్కువ మంది వ్యవసాయముమీద ఆధారపడి ఉండటం, వ్యవసాయపు టుత్పత్తి తక్కువ కావటముచేత-వారి కొనుగోలు శక్తి ఎక్కువయేటంతవరకు మార్కెట్టు అభివృద్ధి పొందుటకు అవకాశము లేదు.

ఇక దేశవిభజన జరిగి స్వతంత్రము వచ్చిన తరువాత, మన జనాభా సమస్యయొక్క తీవ్రత ఏమీ తగ్గలేదు. నాల్గోవంతు జనాభా పాకిస్తానుకు పోయినా, నాల్గోవంతుకన్నా ఎక్కువ విలువచేసే ఆహారపదార్థాలు పండించే భూములు పాకిస్తాను భాగమునకు వెళ్ళినవి. పంజాబు గోధుమ భూములు, బెంగాలు వరి భూములు, పోవడంవల్ల మన ఆహారసమస్య క్లిష్టతరమైనది. జనాభా సమస్యమాత్రము విభజన పూర్వము కంటె ఏమీ మార్పుచెందలేదు.

ఈవిధముగా దేశములో ప్రతి సంవత్సరము 1 కోటి 45 లక్షలు పుట్టి, అందులో 1 కోటి 10 లక్షలమంది మరణించడంవల్ల మన నికరపు పెరుగుదల 35 లక్షలు. ఇది మొత్తము జనాభాలో నూటికి ఒకటి. ఈ పెరుగుదలకే ఇన్ని పుట్టుకలు, ఇన్ని మరణములు లేకుండా పొందవచ్చును. జనన మరణముల రేట్లను తగ్గించడం పురోభివృద్ధి నాశించే జాతి లక్షణం. దేశానికి ఉపయోగపడకుండా, బాల్యంలోనే మరణించే జనాభామీద పెట్టే ఖర్చును తప్పకుండా తగ్గించవలసివున్నది. అందుకై, భూమిలో ఉత్పత్తి ఎక్కువచేసి, అభివృద్ధిచెందిన వైద్య సహాయమిచ్చి మరణములరేటు తగ్గించవలసిన బాధ్యత ప్రభుత్వముపై నున్నది. సంతాన నిరోధక మార్గములద్వారా జననపు రేటును తగ్గించవలసిన బాధ్యత సాంఘికవేత్తలపై నున్నది. వివిధ ఉత్పత్తి మార్గములలోగల జనాభా ఒత్తిడిని తగ్గించడం ప్రాథమిక సమస్య.



ఒక శుభ దినాన్ని, శుభ లగ్నాన్ని ఆయనకు తొమ్మిదో సుపుత్రు డుదయించాడు. ఆ వార్త విని ఆయనగారు అరుగుమీద కూలబడిపోయాడు, "హారి భగవంతుడా, యీ సంతానాన్ని ఎలా పోషించడం!" అని. ఇంట్లో ముసలమ్మ అది విని "పుట్టించినవాడు పెట్టి పొయ్యడా నాయనా?" అంది.

"ఈ రోజుల్లో పెట్టి పోషిస్తున్నది రేషనువాళ్లు తల్లీ!" అని మూలిగాడు పిల్లల తండ్రి.

"ఊరూర ఇంటింట"

# 'స్వాతంత్ర్య' పురాణం

జ. వి. ల

స్వాతంత్ర్యం. స్వాతంత్ర్యం. అరవై యేళ్ల వాడావిడి. ఎన్ని గొంతుకలు చించుకోబడ్డాయో, ఎన్ని బల్లలు గ్రుద్దబడ్డాయో. ఎన్ని ప్రాణాలు ఆహుతి అవలేదు. గడచిన సంగతులు యీ దిక్కుమాలిన జన్మకు అప్పుడే మరుపు. ఎంతచెప్పినా మానవులం.

అప్పుడే రెండుసంవత్సరా లైపోయింది. అనేకమార్పులు. ఒకదాంట్లో ఏమిటి, అనేక విషయాల్లో——

అసలు స్వరాజ్యం రానిక్రితం ప్రతివాడి నోట్లోనూ స్వరాజ్యం స్వరాజ్యం అన్నమాటే. ఆబాలగోపాలం యీ మాటను మంచినీళ్ళ ప్రాయంగా వాడేవారు. ప్రతి విషయానికి స్వాతంత్ర్యం ఒక మూలకారణ మైపోయింది. స్వతంత్రం లేకపోవడం ఒక పెద్ద ప్రతిబంధకం. ఆ రోజుల్లో యిలా అనడం ఒక పెద్ద పరిపాటి.

వెనకటికి ఒకాయన పెళ్ళిభోజనం చేస్తూ వంట బ్రాహ్మణ్ణి 'పులిహారలో ఉప్పు తక్కువైం దేమిటయ్యా?' అని అడిగాడు. 'చిత్తం, ఇంకా స్వరాజ్యం రాలేదు- ఉప్పు కరువుగా ఉంది' అంటూ సీరియసుగా చేతిలో ఉన్న చారుగోకర్ణం ఊపుతూ అతగాడు చరచరా నడచి పోయాడు.

ఇంకోచిత్రం ఏమిటంటే ఓసారి మంగలాడు ఓ పెద్దమనిషికి గడ్డం గీస్తుంటే తెగి రక్తం రావడం మొదలుపెట్టింది. పాపం ఆయన మంగలాణ్ణి కాస్త మందలించక తప్పిందికాదు. వాడు వెంటనే అన్నాడు: 'బాబూ, స్వరాజ్యంవస్తేనే కాని మంచికత్తులు రావండి' అని.

స్వాతంత్ర్యం వస్తే దేశం తల్లక్రిందు లైపోతుందని, గొప్ప మార్పులు వచ్చేస్తాయని మూలనున్న ముసలమ్మల దగ్గరనుంచి ఎంతో ఆందోళనపడేవారు. కొంతమంది భావం ఇది ఏదో పెద్ద శక్తి అని.

మా బామ్మ స్వాతంత్ర్యం వచ్చేస్తోంది అని చెప్పేసరికి ఏదో పెద్ద ప్రళయం వచ్చి పడుతుందని అనుకొనేది. 'నాయనా, వెనక ఒక సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చి పట్టపగలే చీకటి అయిపోయింది. ఎప్పుడూ చీకటే ఉంటుందంటే భయపడ్డాం ఇప్పుడు ఏ భూకంపాలు వస్తాయో! నేను పెద్దదాన్ని అయిపోయాను, జాగ్రత్త!' అంటూండేది.

ఇంకా వింత అయిన భావాలు ఉండేవి కొంతమందిలో. నాకోసారి నలుగురి ఆడవాళ్ళ సంభాషణలు వింటూంటే శ్రావణ భాద్రపదాల కథ జ్ఞాపకం వచ్చింది. ఒకావిడ అంటోంది, "స్వాతంత్ర్యం వచ్చేస్తోందిట. తరువాతనుంచి అత్తగార్ల మాట కోడళ్లు వింటారా?" అందులో ఒక ముసలావిడ అంది అమాయకంగా: "స్వాతంత్ర్యం ఎక్కడనుంచి బయలుదేరి వస్తోందర్రా!"

స్వతంత్రం వచ్చాక అంతా తలక్రిందులై పోతుందని నమ్మినవాళ్లలో మా చలమయ్య సిద్ధాంతిగా రొకడు. "స్వతంత్రం వచ్చిందంటే అన్నీ చవకనుకో. రూపాయి వస్తువు పావలా అయి పూరుకుంటుంది. అప్పుడు నీ సంగతి చెప్పాలా" అంటూ భార్యదగ్గర రోజూ అరగంట ఉపన్యసించి. పాపం ఆవిడచేత వారానికి మూడు సార్లు బొబ్బట్ల రొట్టె కాల్పించుకు తినేవాడు. మొన్న ఆగస్టు 15-వ తారీఖున అరుగుమీద నుంచుని "దిక్కుమాలిన స్వాతంత్ర్యం-ఎవరు సంతోషించనూ" అని సణుక్కున్నాడు.

ఇంటరు పరీక్ష ఎనిమిదిసార్లు తప్పిన మా రావుగాడి మాటలు నాకు నవ్వొస్తో ఉండేవి. 'స్వతంత్రం రానీరా, అసలు పరీక్ష లుండవు"

అనేవాడు. నాకోసారి యీమధ్య కనిపించి వెఱ్ఱి మొహంవేసి అన్నాడు, 'స్వాతంత్ర్యం వచ్చింది గాని...' అని.

కాని స్వతంత్రం వచ్చాక కావలసినంత మార్పు......మనుష్యుల భావాల్లో, ఉద్దేశాలలో—అన్నిటికంటే ముఖ్య విషయం స్వరాజ్యం అంటే తీరని అసంతృప్తి. ప్రతివాడూ రాజకీయవేత్త, విమర్శకుడు. ఎక్కడ చూచినా 'ఏం స్వాతంత్ర్యం అండీ, అంతా బూటకం!' అన్నగొడవే. ఇల్లా అని పారేస్తూ ఉండడం పెద్ద పరిపాటయింది చాలామందిలో- క్రొత్త వ్యక్తుల పరిచయానికి, రైల్లో స్థలం సంపాదించడానికి. ఇంకా యికర్రతా 'ఏం స్వాతంత్ర్యం' అంటూ పెదిమలు విరిచేస్తూ యిచ్చే ఉపన్యాసాల వాడకం చాలా ఎక్కువైంది. ఒక్కొక్కప్పుడు యీ ప్రసంగాలు వింటూంటే, అరిగిపోయిన గ్రామఫోను సూదితోటి 'అబ తేరెసివా' రికార్డు వినడం జ్ఞాపకం వస్తుంది.

ఇటీవల ఒక పెద్దమనిషి అరకప్పు కాఫీ త్రాగి, కాఫీబల్ల విరిగేటట్టు అరగంట స్వరాజ్యంమీద ఉపన్యసించి, చివరికి హోటలు మేనేజరు ఏదో హడావిడిలో ఉండగా, 'దేశంలో మోసం చాలా యెక్కువైపోయింది' అంటూ పెద్దబాధ పడుతున్నవాడిలా బయటకు జారాడు.

రైల్వేరాజకీయవేత్తల విషయంకూడా తమాషాయే. నే నొకసారి రైల్లో ప్రయాణంచేస్తూ బెడ్డింగు సీటుమీద పరచి కూర్చున్నా. ఒకచోట ఒకాయన రైలు ఎక్కగానే పెద్ద శ్రమపడుతున్నట్లు నా మొహం కేసి చూశాడు. అక్కడనుంచి నాతో పెద్ద పూర్వపరిచయ మున్నవాడిలా స్వరాజ్యం స్టేటు వెయ్యడం మొదలు పెట్టాడు. స్టేటు ధోరణి నాకు తెలుసు కనుక సీరియస్‌గా ఉన్నాను. 'కొద్దిగా జరుగుతారా' అంటూ ఇంకా ఏదో అనబోతోంటే, నేను 'యింకా యిద్దరు ఉన్నా'రన్నాను. దానితోటే ఆయన మొహం ఒక్కసారి ఎఱ్ఱబడింది.

ఈఅసంతృప్తి కాలేజీ స్టూడెంట్సులోకూడా వ్యాపించింది. మొన్న యిద్దరు స్టూడెంట్సు సినిమా హాల్లో బీడీపట్టి లెంటూ అనుకొంటున్నారు: కో ఎడ్యుకేషన్ బాగా వృద్ధిచెయ్యాలని ఒక్కడికీ తెలియదేరా! ఏం స్వరాజ్యం, ఏం ఎడ్యుకేషన్ డిపార్టుమెంట్సు!"

మద్యపాననిషేధం అందరికీ కష్టంగానే ఉందన్నాడు మొన్న ఒకాయన ఏదో మాటవచ్చి. నేను ఏమని ప్రశ్నించాను. 'ఈ నిషేధం ప్రవేశపెట్టాక మా చాకలాడు బట్టలు సరిగ్గా తేవటం మానేశాడండి ... ఏం స్వాతంత్ర్యమో కాని' అంటూ ఒక నిట్టూర్పు విడిచాడు.

మొన్న ఆగస్టు 15 వ తారీఖున ఒక చిత్రం జరిగింది. ఒక వ్యక్తి 'శ్రీరామచంద్ర, ఏం స్వరాజ్యం' అంటూ సినిమా అయిపోగానే ఆ గుంపులో ఎవడో వెనకాలవాడి తోపుతో బయట పడ్డాను. నేను పలకరించగా 'ఏం సినిమా అండి మహాశయా, ఏదో స్వాతంత్ర్య దినం కదా, అని వచ్చా యీ రోజు' అంటూ చెమటకి ఒంటికి అంటుకున్న లాల్చీని లాక్కుంటుంటే పాపం ఆయన మొహంకేసి చూశా. అరచెయ్యి దళసరిని పెట్టిన అర్ధణాకాసంత కుంకం బొట్టూ తడిసి మొహం అంతా ఖరాబై పోయింది.

నల్లమందు వాడేవాళ్ళ అవస్థ ఇంక చెప్పలేం. కాస్త పెద్దకోటా వాళ్ళకి మరీ బాధ. మా యగ్గయ్య తాత అంటూ వుండేవాడు రోజూ - "విధవ కరువురోజులు. నాకు అధమపక్షం కుంకుడు గింజంత నల్లమందు ఉంటేనే గాని రోజెళ్ళదు" అని.

అనా కవరు అణావున్నర 'అయి, యిప్పుడు దేశ అయి పూరుకోవడం ఒక కారణం చాలా మందికి. 'నేను కాపురానికి వచ్చిన క్రొత్త రోజుల్లో కవరు అనా. వారం అయేటప్పటికి రెండు కవర్లు వ్రాసి పారేసేవారు మా ఆయన. ఇప్పుడు ఇదేంఖర్మో ఉత్తరాలు కూడా వ్రాసుకోనివ్వరు గావును' అంది ఒకావిడ క్రొత్తగా పెళ్ళయిన ఒక పిల్లతోటి.

ఇంకా చాలా మార్పులు వచ్చాయి. స్వాతంత్ర్య చిహ్నాలు ప్రతి చోట్లోనూ కనిపించదమే. ఎక్కడ చూసినా నాయకుల పేర్లు, ఫొటోలు, పుస్తకాలు.

ఒకసారి రైల్లో వెడుతూంటే శుద్ధ ఖద్దరు వేషంతో ఓ పెద్దమనిషి ఎక్కాడు. రైలు కదలగానే తెలుగులాడి గాడుగలాగ స్వతంత్రం మీద

ఉపన్యాసం దంచుతోంటే రైళ్లో కొంతమంది గంగిరెద్దులా తలకాయలు ఊపడం మొదలు పెట్టారు. వెంటనే 'కస్తూరిబాయి మాత్రలు— అజీర్ణానికి దివ్యమైన ఔషధం' అంటూ ధోరణి మార్చాడు, చేతిలో ఉన్న సంచిలోంచి ఒక సీసా తీసి.

ఒకటేమిటి - ఇటువంటి పేర్లు చాలా వాటికి ఉన్నాయి. జవహర్‌లాల్ కేఫ్, గాంధీ వస్త్రం, పటేలు బీడీలు, పట్టాభి క్షవరశాల, వగైరా.

రైళ్ళలో వచ్చిన మార్పుకూడా చాలా గమనించతగ్గదే. నాలుగు క్లాసు లల్లా మూడు రంగుల జండాలా మూడై పోయాయి. జరిగిన గందరగోళం ఏమిటంటే-ఇంటరు తరగతికి ఉన్న INT లో T ని పూర్తిగా బహిష్కరించడం, N ని రెండు వంతులు బహిష్కరించడం అయే టప్పటికి ఇంటరు సెకండు క్లాసై ఊరుకుంది.

మూడు భాషలు-రాష్ట్రానికి ఒకటి, దేశానికి ఒకటి, అంతర్జాతీయంగా ఒకటి. ఏత్తైపాట్ల ఉన్న తెలుగు ముప్పైమూడుపాట్లు అవడం, 'గ్రైండ్ మవర్ కందిపచ్చడి బనాతీ హై' అన్నట్టు! తెలుగుభాష త్రివర్ణ భాష అయిపోవడం.

ఇంకా వచ్చాయి మార్పులు. బెజవాడ విజయవాడగా మారడం, కోకనాడ కాకినాడ అవడం ఇత్యాదులు. ఈపేర్లు మారిన క్రొత్తరికంలో ఒకమార్పు జరిగింది.

ఒకబళ్లో తెలుగు మాష్టారు పేర్లు మారిన క్రొత్తలో ఒకరోజు క్లాసుకు వచ్చి బోర్డుకేసి చూశాడు. ఆయన్ని అందరూ తెలుగు పంతులు గారని పిలవడంవల్ల, పెనంమీదఉన్న పెసరట్టును తిరగేసినట్టు, తెలుగును తెగులు చేసి 'తెగులు పంతులు' అని పెద్ద అక్షరాలతో వ్రాసి ఉంది. మేష్టారు యీ అక్షరాలు కళ్ళ పడగానే ఒక దీర్ఘ శ్వాస విడిచాట్ట.



# 'కాలే కడుపుకి, మండే బూడిద'

వై. శేషగిరిరావు

శర్మ 24 వ తారీఖునే పెట్టీ బేడా సర్దేశాడు. సీత వచ్చి అడిగింది, 'ఎప్పుడేమిటండీ ప్రయాణం' అని. 'ఎల్లుండే, 27 వ తారీఖునేగా కాలేజీ' అన్నాడు.

'మూటా, ముల్లే కట్టేశారు బాగుంది. కొంచెం ఆవకాయ కూడా తీసుకెళ్ళరాదండీ- మళ్ళీ యే సెలవులకి రానంటున్నారు కూడా నూ. ఇక్కడ నుంచి యెవళ్లూ వచ్చేవాళ్లు కూడా లేరు' అంది.

'ఆఁ ఎందుకే' అని తోసేశాడు పెళ్లాం మాట శర్మ. హాస్టల్లో కూరలు బాగా వుండవుగా మరి. అదీగాక యెప్పుడూ యే కూటో చేస్తున్నా డాయె నాయరు. ఏదో కాలే కడుపుకి మండే బూడి దన్నట్టు తింటున్నాడు శర్మ. ఎప్పుడు కూర బాగుండకపోయినా సీత అన్నమాటలు జ్ఞాపకానికి వస్తున్నాయి శర్మకి.

వెళ్లేవాడు. ఆఁ బాగా చెప్పావే. కొంచెం ఆవకాయ జాడీలో పెట్టి యియ్యి అనవచ్చా. అహాఁ వద్దులే అన్నాడు.

కూరా అదీ బాగుండకపోయినా అందరి లాగా సర్దుకు తినేసే రకమా అంటే శర్మ చాలా పట్టుదల మనిషి. ఇష్టంలేని కూరంటే దాని మొహమే చూడ్డు. ఇలా యెన్నాళ్ళని కూర మానేస్తాడు. ఆ చారు మెతుకుల్తో కాలక్షేపం చేస్తాడు. శర్మని చూసినప్పుడల్లా జాలి వేస్తుంది నాకు.

పోనీ, ఎవరు మాత్రం వేసుకుంటున్నారు గనక యిక్కడ ఆవకాయ. అందరిలాగే నేనూ, నలుగురితో పాటూ నారాయణా అని సమాధాయించుకుందామా అనుకున్నాడు శర్మ. కానీ అప్పుడప్పుడు గాజుగ్లాసుల్లో వేసుకుని తెచ్చుకుంటున్నారు ఆవకాయ కొందరు. అది చూసినప్పుడల్లా శర్మకి నోరూరుతుంది. ఆనాడు

బొత్తిగా ఒక్కముద్దా నోటికెక్కదు. ఇంతకీ శర్మ నవాలిగాని, యెవరి నవాల్సిన పనీ లేదు. ఆపిల్ల మొగుడిమీది మమకారంచేత అవకాయ తీసుకెళ్ళండి అంటే అహఁ వద్దులే అంటాడా ? వెఱ్ఱిమొహం.

పోనీ జరిగిందేదో జరిగింది. అవకాయ తెచ్చుకున్న వాళ్ళని ఒక పెచ్చు నాకూడా యిస్తారా అని అడుగుదామా అంటే శర్మకి భయం. ఎప్పుడూ అలా అడిగినవాడు కాడాయె.

పోనీ యింటికో వుత్తరం వ్రాసి అవకాయ పంపమందామా అంటే యేమనుకుంటారో అని భయం శర్మకి. మొదట్లో పట్టుకెళ్ళ మన్నప్పుడు ఒద్దు ఒద్దని యిప్పుడు వుత్తరం యేమంటూ వ్రాస్తాను అనుకున్నాడు శర్మ.

పోనీ శర్మే యింటికి వెళ్ళకూడదా అన్న అనుమానం కలగవచ్చు. సెలవ లివ్వగానే యింటి కెందుకు వొచ్చావురా అని అడుగుతారా-వాళ్ళకి మాత్రం తెలియదూ? ఏదో పెళ్ళాన్ని చూడ్డాని కొచ్చా డనుకోరూ? లేదా, శర్మ చెపితేమాత్రం తప్పా యేమిటీ? శర్మకి అపాటి ధైర్యం లేదన్న మాట నిజమే. లేకపోతే పిచ్చివాడు- అమ్మా. నువ్వు కలలో కొచ్చావే అని చెప్పరాదూ. చాటుగుండా సీతని అవకాయ యివ్వవె అని తెచ్చుకుంటే తీరిపోను. ఆది శర్మకి తోచలేదు. సెలవ లివ్వకుండా సెలవపెట్టి యెందు కొచ్చావురా అంటారనే భయం.

పోనీ యింటికి వెళ్ళిపోయి యేమిరా వచ్చా వంటే- కొంచెం జ్వరం తగిలింది; అంచేత అక్కడ సదుపాయంగా వుండదని వచ్చేశాను- అని చెప్పవచ్చు. కాని జ్వరం అంటే అవకాయ పట్టు కెళ్ళడానికి కాదుగదా, అక్కడ రుచేనా చూపిం చరు అని జంకాడు శర్మ.

తెలివి తక్కువవాడు కాకపోతే అమ్మా నాకొన్ని యివ్వావా అవకాయ. సీతని ఏ అర్ధ రాత్రప్పుడో దగ్గిరికి పిలిచి, 'అవకాయి తినాలని వుంటే, అందుకోసమేవచ్చాను' అంటే యివ్వకపో తుందా. కానీ, యేమో అర్థంపర్థం యెరగంది. తను నిజంగా జ్వరంగానే వున్నాడనుకుని యివ్వ దేమో కూడాను. ఒకవేళ యిస్తుందే అను కున్నా—అవకాయి, కుండలోంచి తీస్తూంటే అమ్మేనా, నాన్నేనా చూశారంటే కొంప మునుగుతుంది. ఈ ఆలోచనలతో శర్మకి యింటి దగ్గరనుంచి అవకాయ తెచ్చుకోవడం కష్ట మని పించింది.

ఒకలా చెయ్యవలసింది శర్మ. పెళ్ళాన్ని పుట్టింటికి పంపమని వుత్తరం వ్రాసి, అక్కడకి వెళ్ళి తెచ్చుకోవలసింది. కాని తండ్రి కేమంటూ వ్రాస్తాను అని భయం వేసింది.

ఇంతకీ ఆ కూరలు తినలేకుండా వున్నాడు శర్మ. యెప్పుడూ అవకాయిమీదే మనసు. 'ఏమి టండీ శర్మగారూ, మీ రెప్పుడూ కూరే తినరూ' అన్నాడు పక్కని కూర్చున్నాయన.

ఇక్కడ తెలివి వుపయోగించాడు శర్మ. 'ఏమిటోనండీ. అసలు యింటిదగ్గిరే సరిగ్గా తినను నేను కూరలు. ఈ కూరలు యేమి వంటండీ, వెధవవంట రుచీపచీ వుంటేగా. అందులో ఆ నాయరుగాడు కారం ఉప్పూ తగలెయ్యడు. ఇంటిదగ్గరైతే కూరలెందుకు లెండి అసలు. ఆ అవకాయ వేసి కలిపేమా అంటే...' అని ఓచిన్న లెక్చరిచ్చాడు శర్మ.

ఆయనకి నిజంగా జాలి వేసింది శర్మమీద. 'అయ్యో, యిన్నాళ్ళనించీ చెప్పారు గాదేమండీ. నేను తెచ్చుకున్న అవకాయ అంతా ఐపోయి నట్లే. కాని ఒక్క పెచ్చుండాలన్న జ్ఞాపకం. ఉందంటే తప్పకుండా యిస్తా'నన్నాడు.

శర్మ ఆయనతో వెళ్ళి పెచ్చు తెచ్చు కున్నాడు. శర్మకి బ్రహ్మానందమైంది. కాని అమాయకుడు ఆ పెచ్చు అప్పుడు తినెయ్యాలి సింది, మర్నాడు భోజనంలో తిందామని దాచాడు.

వడ్డన అయినతరువాత పొట్లాం విప్పు తున్నాడు శర్మ. విస్తట్లో వేసుకుందా మనుకునే సందర్భంలో 'యేమిటోయ్ శర్మా, మా కెవళ్ళకీ లేందే నీకేమి' టంటూ ఆ పొట్లాం వూళ్ళాక్కని ఒకేమారు నోట్లో వేసుకున్నాడు, ఆ పక్క కామేడు.

శర్మ కేమనడానికీ నోరు రాలేదు.

**కాంగ్రెసుకు హితవు:**

# 'ఆలస్యాదమృతం విషం'

గోగినేని ఉమామహేశ్వరరావు

అసలు ఎన్నికలు ఎన్నేళ్ళ కొకసారి జరగాలన్న విషయంమీద రకరకాల అభిప్రాయాలున్నవి. తర్జన భర్జనలు చేసి చివరకు మన రాజ్యాంగ పరిషత్తు అయిదేళ్ళ పరిమితిని నిర్ణయించింది. 1935 నాటి చట్టంలోకూడా అంతే వున్నది. అమెరికాలో మాత్రం నాలుగేళ్ళ కొకసారే ఎన్నికలు జరుపుకుంటారు. మూడేళ్ళను మించిన వ్యవధి కూడదనేవాళ్ళుకూడా కొంద రున్నారు. ఈ సమస్యమీద వాద ప్రతివాదాలకు ఎంతైనా అవకాశ మున్నది. ఎన్నిక అయినవారు ప్రభుత్వ నిర్వహణను అవగాహన చేసుకొని దారినపడి, నిలద్రొక్కుకుని నిదానంగా సావధానంగా సమాలోచించుకొని, పట్టుమని ఏదైనా అమలుజరిపి, ఆచరణలోను ప్రయోగంలోను అనుభవంవల్ల తేలిన సవరణలుచేసి మేము చేయగలిగినది యిదని చూపించడానికి తగినవ్యవధి ఉండాలని, నేటికి మాటికి ఎన్నికలైతే అంతులేని వ్యయప్రయాసలని, అడుగడుగునా విధానాలు మారి ఇవాళ ఉన్నది రేపు, రేపున్నది మరునాటికి మారిపోతే ప్రభుత్వ నిర్వహణ కుంటువడి కుంటివాని చందమైపోతుందని ఒక వాదన. నేడు మన రాష్ట్రంలో ఒకే పార్టీలో పెత్తనం చేసేవాళ్ళు మారే సరికే యింత చిందర వందరగా ఉంటున్నదే మరి పార్టీలే మారడానికి అవకాశ మున్నప్పుడు ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. ఈమధ్య రాష్ట్రశాసనసభా నాయకత్వాలకై వెన్నుపోట్లు పెచ్చరిల్లిపోయిన వికటాటాలు, పోరాపోరీ పోరాటాలు చూసి కొందరు యేటేటా ఎన్నికలు లేకుండా చెయ్యాలంటున్నారు. కాదు – ఆ మాత్రమైనా పట్ట పగ్గాలు లేకుంటే గగనవీధి కెగిరిపోతారు, కండ్లు నెత్తికెక్కి చుక్కలలోకి చూస్తూ ఉంటాయి, ముకుత్రాడు వెయ్యకపోతే మాటవినరు, కళ్ళెంలేని గుర్రాన్ని ఎక్కితే కంచెపాలు కావలసిందేనని మరొక వాదన. "నోరూరగ చవులుబుట్ట" చెప్పి చెప్పి వోట్లు కాజేసి, గద్దె లెక్కిన పిదప ప్రజల విన్నపాలను విజ్ఞప్తులను, అర్జీలను మహజర్లను, మొరలను మొత్తుకోళ్ళను "చూస్తాము", "ఆలోచిస్తా"మని పెడచెవిని పెట్టే ఘనులు త్వరత్వరగా ఎన్నికలు జరుగుతుంటేనే కాని ప్రజలతో కాళ్ళబేరానికి రారని, "ఆలోచించి" పారం చెప్పడానికి ప్రజలకు అవకాశం లభించదని వీరివాదన. అదీ నిజమే; ఇదీ నిజమే – ఏదీ కాదనడానికి వీలులేదు. అందుకే ఇవి రెండూ సమన్వయ పరచుకొని నిర్ణయించుకోవాలి. కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక లోగడ యేటేటా జరుగుతూ ఉండేది. రానున్న నూతన నిబంధనావళి ప్రకారం మూడేళ్ళపాటు మారకూడదని తేల్చారు.

ఏ రాజ్యాంగంలోనైనా ఎన్నికల కాలపరిమితి నిర్ణయించినాకూడా కొంచెం అటుయిటుగా జరపడానికి అవకాశం ఉండేటట్లు సడలించుతారు. అయిదేళ్ళంటే అక్షరాలా అయిదేళ్ళకే సాధ్యపడక పోవచ్చునని అత్యవసర పరిస్థితులను ఎదుర్కొనడానికి అనువుగా ఈ నిబంధన చేరుస్తారు. కాని ప్రభుత్వాధికారంలో ఉన్న వర్గానికి, చేతులో ఉన్న దానిని చూస్తూ చూస్తూ వదలలేక, నాలుగురోజులు గడిచినా గడిచినట్లేనని చెప్పి ఏవేవో కారణాలు కల్పించి, మిషలు సృష్టించి కాలయాపన చేయడానికి అవకాశం ఉంటుంది. కాని ఈ అవకాశాన్ని సరియైన వారెవ్వరూ ఉపయోగించుకోకూడదు. ఒకవేళ ఉపయోగించుకో చూచినా తింటున్నది ఒంటబట్టకుండా, కంటికి నిద్రపట్టకుండా ప్రతికక్షులు గగ్గోలు, గందరగోళము చేస్తాయి. ఇప్పటి మన రాష్ట్ర శాసనసభలకు 1950 అంతానికి కాని, 1951 ఆదికిగాని అయిదేళ్ళ ఆయుష్షు నిండి కాలదోషం పడుతుంది. మరి, నాటికి

సంజీవి ప్రయోగించి మరి కొన్నాళ్లు బ్రతికించడమా లేక గడువు గడవగానే ఎన్నికలు జరపడమా!

నూతన రాజ్యాంగ రచన ఇంకనూ తొలి ప్రతి కానేలేదు. సర్వాంగసుందరంగా తయారు కావడం ఎప్పటికో! 1950 జనవరి 26 కు సిద్ధం చేస్తా మంటున్నారు. ఎంతవరకు అవుతుందో చూడాలి. నూతన రాజ్యాంగంలో ఎన్నికలన్నీ వయోజన వోటింగు పద్ధతిని జరగాలని నిర్ణయించారు. ఆ కార్యక్రమమంటే మాటలు కాదు, బ్రహ్మాండమైనపని. కోటాను కోట్ల వోటర్ల పట్టికలు ముద్రించడానికి ఇండియాలోని ముద్రణాలయాలన్నిటికీ దీర్ఘకాలంపాటు చేతినిండా పని ఉంటుంది. లభ్యమైన ప్రతి కాగితం ముక్కా ఖర్చుచేసినా దానికి పూర్తిగా చాలదు. కొన్ని రాష్ట్రాలలో ఇంకా వోటర్ల నికర సంఖ్య కూడా తేలలేదే—మరి ఎప్పటికి ఒడ్డునబడేటట్లు? ఇంకా అథమపక్షం రెండేళ్ళయినా పట్టకపోదని తోస్తున్నది.

ఎన్నికలు ఎప్పుడా ఎప్పుడా అని ప్రజలలో తహ తహ కనబడుతున్నది. కాని ఫలానా అప్పుడు జరుగుతా యన్న సూచనలు మాత్రం చూచాయగా నైనా కనరావడం లేదు. ఇది నిశ్చితమన్న అధికార ప్రకటన లేదు. ఈ మధ్య పండిత నెహ్రూ మరొక పదిహేను నెలలైనా పడుతుందని చెప్పారు. కేంద్రమంత్రి కిద్వాయ్ మరొక మూడు నెలలు కలిపారు. ఎప్పటి కప్పుడు హెచ్చింపులు తప్ప తీసివేతలు లేవు. వినాయకుని పెండ్లి ఎప్పుడూ రేపే నంటారే- ఎవరిని కదిలించినా ఇదుగో అదుగో అనడం, వాయిదాల మీద వాయిదాలతో విసిగి వేసారి పోవలసి వస్తోంది.

ఈ ఎన్నికల విషయంలో ఎవరికి అనువైన ధర్మపన్నాలు వారు వల్లిస్తున్నారు. వయోజన వోటింగు కార్యక్రమం దరీదాపూ దొరకని మహా సముద్రమని, ఇప్పటిలో తేలే వ్యవహారం కాదని ప్రభుత్వంవారు. కాదు మా నెత్తిన కట్టు కోలేమన్న భయంతో కావాలని ఆలస్యం చేస్తున్నారని ప్రతిపక్షులు. కాంగ్రెసులోనే హతాశులైన కొందరు, నిజంగానే సదుద్దేశంతో కొందరు, పాత వోటర్లతోనే ఎన్నికలు త్వరలో జరపాలని వాదిస్తున్నారు. ఉన్నపదవులు ఊడిపోతాయేమోనని వణికిపోయే వారికి ఇది గిట్టకపోవచ్చును. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, వగైరా వయోజన వోటింగును ఎగగొట్టడానికి కాంగ్రెసు యెత్తిన యెత్తని దూషించవచ్చు. కాని అలాంటి ఉద్దేశమే ఉంటే రాజ్యాంగంలోనే ఏదో పదేళ్ళ పాటు వయోజనవోటింగు లేకుండా చేసి ఉండవచ్చునే.

ప్రస్తుత పరిస్థితులను పరిశీలిస్తే ఇప్పటిరాష్ట్ర శాసన సభలకు గడువు పూర్తికాకముందే, అంటే రానున్న వేసవిలోనే, ఎన్నికలు జరపడం శ్రేయస్కర మనిపిస్తున్నది. లేనిచో వాటికి మన రాష్ట్రంలోని జిల్లాబోర్డుల గతే పడుతుందన్న మాట. మనకు జిల్లాబోర్డు ఎన్నికలు జరిగి పదేళ్లు దాటినా ఇంకా మోక్షం సిద్ధించలేదు. వెంటనే ఎన్నికలు జరిపితే కాంగ్రెసుకు తన నిజస్థితి తెలియవస్తుంది. బొంబాయి, కలకత్తా అపజయాలు చూచి నిస్పృహ చెందేవారికి, అవి పాటించదగినవి కావని వాదించే వారికి వాస్తవిక స్థితిగతులు బోధపడతాయి. అంతే కాక మద్రాసు, పశ్చిమ బెంగాల్, తూర్పు పంజాబు, మధ్య రాష్ట్రంవంటి రాష్ట్రాలలో ప్రస్తుత శాసనసభా రాజకీయాలు ఎంతో అధ్వాన్నంగా ఉన్నవి. శ్రుతిమించి రాగాన పడిపోయిన వీటిని చక్కబరచడానికి వెంటనే ఎన్నికలు జరపడం అవసరం. అది కాంగ్రెసుకే కాక ఆ రాష్ట్రాలకు, దేశానికికూడా క్షేమదాయకం. ఈచర్య కాంగ్రెసుకు మరింత శ్రేయస్కరం. ఏమంటే ఎన్నికలు మరెన్నాళ్ళు వాయిదా వేస్తే అవి అంతగా దిగజారిపోయే సూచనలు గోచరిస్తున్నవి. అంతర్గత వ్యవహారాలలోను, ప్రభుత్వ నిర్వహణలోనూకూడా ప్రబలిపోయిన జాడ్యాన్ని నివారించడానికి ఇది చాలావరకు ఉపయోగపడవచ్చు. పశ్చిమ బెంగాలుకు ఉపయోగించనున్న ఔషధాన్నే తక్కిన రాష్ట్రాలకు వాడడం అవసరం.

అదీ కాక రాజ్యాంగ పరిషత్తు 1950 మొదటిలో రాజ్యాంగ రచనాకృషిని ముగిస్తుంది. ఇప్పుడది అర్థనారీశ్వరవేషంగా రాజ్యాంగ

నిర్ణయ సంఘంగా మాత్రమే కాక మధ్యమధ్య శాసన సభగాకూడా వ్యవహరిస్తున్నది. ఇక మీద ఆరెండు పాత్రలలో ఒక్కటి మాత్రమే మిగులుతుంది. అప్పుడు రాష్ట్రాలలోను, కేంద్రంలోనూకూడా శాసన సభ్యత్వం అనుభవిస్తున్న 120 మంది సభ్యులు అదోయిదో విరమించుకోవలసి వస్తుంది. లేకుంటే అది చట్టవిరుద్ధం. అలాంటప్పుడు రాష్ట్ర సభ్యత్వాలే ఉంచి కేంద్రానికే క్రొత్త ఎన్నికలు జరపడం సులువని, క్షేమకరమని లోగడ అనుకున్నారు. ఎలాగా 120 మందికి ఎన్నికలు జరిపేటప్పుడు, అందరికీ జరిపితే పోతుంది కదా.

ఈమధ్య వెలువడిన పత్రికావార్తలు చూస్తే పండిత నెహ్రూ, సర్దార్ పటేల్ యిరువురూ త్వరలోనే రాష్ట్ర శాసనసభలకు 1935 చట్టం క్రింద ఎన్నికలు జరపాలని తలపోస్తున్నట్లు తెలుస్తున్నది. ఇది అభినందించవలసిన విషయం. కాని కేంద్రానికి ఆపద్ధతి పనికిరాదు. ఏమంటే ఆ చట్టంప్రకారం వందమంది సభ్యులు మత ప్రాతిపదికమీద ఎన్నిక అవుతారు. మరి నలభై మందిని కేంద్రప్రభుత్వం నియమిస్తుంది. ఆ కాలానికి సరిపోయింది కాని, ఇప్పుడది కుదరని పని. పైగా సంస్థానాల ప్రాతినిధ్యం సమస్యకూడా ఉంది. కాబట్టి ఇప్పటి రాజ్యాంగ పరిషత్తు సభ్యులవలెనే పది లక్షల ప్రజానీకానికి ఒకరు చొప్పున-రాష్ట్ర, సంస్థాన శాసనసభ్యులు ఎన్నుకోవడమే మార్గం. కాగా రాష్ట్రాలకు ప్రత్యక్షంగాను, కేంద్రానికి పరోక్షంగాను ఎన్నికలు జరిగినట్లవుతుంది.

వయోజన వోటింగు లేదని, ఇవి సక్రమమైన ఎన్నికలు కానేరవని శ్రీరంగనీతులు వల్లించి లాభం లేదు. ఇది ఆదర్శప్రాయమైన విధానమని అనలేము. కాని ప్రతిష్టంభనా పరిష్కారానికి మరే మార్గమైనా ఆచరణీయమైతే యోచించవచ్చు. అలాంటిదేమున్నది మరి? కాకపోతే ఉన్నదానినే గుడ్డిలో మెల్లగా చెయ్యడానికి, ప్రత్యేక నియోజకవర్గాలను ఎత్తివేసి, సంయుక్త విధానం అవలంబించవచ్చు. ఊహాగానాలు కూడా ఇదే ధోరణిని సూచిస్తున్నవి. నిమ్నజాతులకు మాత్రమే ప్రత్యేకస్థానా లుంచుతూ, సంయుక్త నియోజక పద్ధతిని 1935 సం॥ చట్టం క్రింద రానున్న వేసవిలో ఎన్నికలు జరపడం సముచితం, శ్రేయస్కరం. లేకుంటే కనీసం రెండేళ్లయినా ఎదురుతెన్నులు చూస్తూ కూర్చోవలసిందే. నేటి సర్వావస్థలూ ఆమోదించి దిగమ్రింగవలసిందే.



ఆంధ్రుల అభిమాన విద్య:

# నిద్ర ఎందుకు వస్తోంది?

శిష్టా వేంకటరామశాస్త్రి

ప్రతిరోజూ మనకు ఒక ప్రత్యేకమైన వేళలో నిద్రపట్టుతుంది. సరిగా ఒకే సమయానికి మెలకువ వస్తుంది. ఇది చాలా చిత్రమైన సంగతి కదూ! రోజూ మమూలుగా నిద్రపోయే వేళకు పడుకోకపోతే ఆవలింతలు, తలదిమ్ము మొదలైన వికారాలు బయలుదేరతాయి. నిద్రఅనేది సరిగా ఒకే సమయానికి ఎట్లా కలుగుతోంది అనే విషయంలో శాస్త్రజ్ఞులలో మతభేదాలున్నాయి.

ఆయుర్వేద గ్రంథకారులలో ముఖ్యుడైన సుశ్రుతుడు నిద్రయొక్క కారణాన్ని ఇలా చెప్పాడు.

శ్లో॥ నిద్రాహేతుస్తమః, సత్వం బోధనే
హేతురుచ్యతే।
స్వభావ ఏవ వా హేతుర్గరీయాన్ ప।
రికీర్త్యతే॥

చేతనా స్థానమైన మస్తిష్కమును తమోగుణం ఆవరించి ప్రాణాలకు నిద్రను కలుగచేస్తుందన్నాడు. మెలకువ రావటానికి సత్వ గుణం కారణము.

భగవద్గీతలో కూడా నిద్రకు కారణం తమోగుణమనే చెప్పబడింది. ప్రమాదాలస్య నిద్రాభిః తన్నిబధ్నాతి భారత (భగవద్గీత 14 అధ్యా).

అందు వల్లనే తమోగుణ ప్రధానమైన రాత్రి భాగమందే నిద్రరావటానికి కారణం. నిద్రసరిగా పట్టకుండా ఉంటే దీపం ఆర్పేసి చీకటి గదిలో పడుకుంటే బాగా నిద్ర పట్టటం మన అనుభవం లోని విషయమే. ఇంతా చెప్పి చివరకు స్వభావమే ముఖ్యకారణ మన్నారు. అంటే శరీరం యొక్క స్వభావం తమోగుణం ద్వారా నిద్రని, సత్వగుణం ద్వారా ప్రబోధాన్ని కలిగిస్తోంది. పాశ్చాత్య శారీరక శాస్త్రజ్ఞుల మతం కూడా దీనికి అనుగుణంగానే వుంది.

నిద్రనుగూర్చి పాశ్చాత్య వైజ్ఞానికుల్లో ఏ యిద్దరూ ఒక అభిప్రాయానికి రాలేదు.

చర్మగతమైన రక్తనాళాల్లో రక్తం ఎక్కువగా ప్రసరించి మెదడులో రక్తభారం తక్కువై నందువల్లే నిద్రవస్తోందని హొవెలు అనే అమెరికన్ సైంటిస్టు అంటున్నాడు. ఆయన తన వాదాన్ని యిలా సమర్థిస్తున్నాడు. "భోజనం అయిన వెంటనే జీర్ణకోశం చుట్టూ అధికంగా రక్తం చేరి మెదడులో రక్తం తక్కువైనందువల్లే భోజనానంతరం మగతగా నిద్రవస్తోంది. చలి కాలంలో ఒళ్లంతా బాగా కప్పుకోక పోతే నిద్ర పట్టదు. ఎందుకంటే చర్మగతమైన రక్తనాళాలు ముడుచుకోవడం వల్ల మెదడులో రక్తం ఎక్కువౌతుంది." చర్మగతమైన నిద్రపోయేటప్పుడు రక్తనాళాలు విస్తృత మవటం నిజమే. కాని దానివల్లే నిద్రవస్తోందా లేక నిద్రవల్లనే రక్తనాళాలు విస్తృత మవుతున్నాయా అంటే సమాధానం లేదు. ఆ రక్తనాళాలు విస్తృత మవటమేనా రోజూ రాత్రి ఒకేవేళ ఎందుకు జరగాలి అనే దానికీ సమాధానం తెలియదు.

పగలంతా శరీరంలో కొన్ని విశిష్టమైన ద్రవాలు ఊరుతా యనీ, అవి తమప్రభావంవల్ల రాత్రి నిద్ర తెప్పిస్తాయనీ అంటున్నారు. అట్లాగే నిద్రపోయేటప్పుడు మెలకువ తెప్పించే ద్రవాలు ఊరుతాయనీ కొంతమంది అన్నారు.

మరికొందరి సైంటిస్టుల అభిప్రాయం—

మెదడులో కొన్ని నాడీ కేంద్రాలున్నాయి. జాగ్రదవస్థలో ఒకదానితో మరొకటి కలిసిపోయి వుంటాయి. అవి ముడుచుకొనిపోయి ఒకదానితో మరొకదానికి సంబంధం లేకుండా పోతే నిద్ర వస్తుంది. కాని ఈ అభిప్రాయం కూడా సరిగా లేదు. నాడులు ముడుచుకోవడం వల్లనే నిద్ర వస్తోందా లేక నిద్రవల్లే నాడులు ముడుచుకుంటున్నాయా అనే సంగతిని తేల్చుకోలేకపోయారు.

పావ్‌లోవ్(Pavlov), అనే ప్రసిద్ధ రష్యన్ సైంటిస్టు నిద్ర అనేది సాంకేతికమైన ఒక అలవాటును తీర్చుకోవటం నిమిత్తమే వస్తోందన్నాడు. మన శరీరంలో అనేక ప్రత్యావర్తన క్రియలు(inborn reflexes) సహజంగా కలుగుతూ వుంటాయి. ఉల్లిపాయ పకోడీల వాసన ముక్కుకి తగలటంతోనే నోట్లో నీరూరడం కూడా అలాంటి ప్రత్యావర్తనక్రియే. మనం రోజూ ఓ కుక్కకు గంట కొట్టటం అనే సంకేతంతోబాటు రొట్టె పెట్టుతున్నా మనుకోండి. ఒక రోజున గంటకొట్టి ఆ వేళకు రొట్టె పెట్టక పోయినా సరే సహజంగా దాని నోట్లో నీరూరుతుంది. అలాగే రాత్రి సమయంలో నిద్రానుకూలమైన పరుపు, మంచంలాటి సాంకేతికాల ప్రభావం మెదడు మీదపడి అలవాటు ప్రకారం నిద్ర వస్తుందని పావ్‌లోవ్ అభిప్రాయం.

మొత్తానికి ఇవన్నీ వాటివాటి దృష్టిలో నిజమే కావచ్చు. వీటివల్ల నిద్ర కారణాలు యొక్క పూర్తిజ్ఞానం మనకు కలగటం లేదు. ఏమైనా శరీరారోగ్యానికి అది ముఖ్యావసరం. ఆకలిదప్పికల వలెనే నిద్రకూడా శరీరంయొక్క స్వాభావిక ధర్మం అనటం సమంజసం.

కథానిక

# డేంజర్ సిగ్నల్

కె. జి. ఆచార్య

నీ రెండు జాబులూ చేరాయి. గునుస్తూ గువ గువలాడుతూ వచ్చేసి, వొళ్ళో వాలిపోయిన రెండూ గువ్వల్లాగనే ఉన్నాయ్.

ఏమిటీ? యీ ఒక్క ఆరురోజులకే అంత ఆరాటమూ, ఆగ్రహతాపా? ఆరురోజులూ ఆరు నెలల్లాగ, సంవత్సరాల్లాగ, యుగాల్లాగ వున్నా యంటున్నావా? ఎందుకూ అంత బేలగా ప్రకాశ్? ఆ చల్లని బెంగుళూరు వాతావరణంలో యీ ఆరురోజుల్లోకే యిలాంటి వేడి వేడి గాడ్పులు నీకు తగిలాయా? నీ వాక్యాలు చదువుతూంటే నిజంగా నాకు నవ్వే వస్తోంది.

లాల్ బాగ్ బాగుండలేదు- ఏం? అక్కడి కమ్మని చలిగాలులు చక్కని శాంతి నిస్తాయే. నీ ఆరోగ్యాన్ని చక్క బరుస్తాయే. ఇంకా ఆ హాయినిచ్చే వాతావరణంలో కూడా యింట్లో పప్పు లున్నాయా, ఉప్పు లున్నాయా- అని అనుకుంటున్నావా? నాకు తెలుసు, నువ్వు వొట్టి బేలవి. ఇవన్నీ మరిచిపోయి ఆ చల్లని వాతావరణంలో చక్కగా విశ్రాంతి తీసుకుంటే గాని లాభం లేదు.

నీ వాక్యాలు చదివాను; నీ బాధని అర్థం చేసుకున్నాను. గడిచిన రెండేళ్లలో ఏ ఒక్క రోజూ నేను లేకుండా గడపని దానివి, ఇప్పుడు యిలా యింతదూరంలో గడపడం - నిజంగా బాధాకరమే. అయితే నీ ఆరోగ్యం? డాక్టరు బాబయ్య చెప్పినమాట వినాలా లేదా?

నామాట విని, ఒక్క నెల రోజులపాటు అయినా అక్కడ వుండు. అక్కగారి పాపాయిల్ని వెంటబెట్టుకొని, షికారుగా వెళ్తూ వుండు. నిజంగా, ఆ కశ్యపుడూ, వసంతా పువ్వుల్లాంటి నవ్వుల్ని యిస్తారు. ఆ పసిపాపల లేత హృదయాల్లోని నైర్మల్యం మనకి ఎంతో హాయి నిస్తుంది.

పకాలున నవ్వుకున్నాను నీ వుత్తరం చూసి. ఆ బెంగుళూరు వాతావరణంలో అన్నీ మరిచి పోదామని వుంటుంది గదా, అసలు అన్నీ మరుపుకే వస్తాయి గదా- నువ్వేమిటి, యింత అశాంతిగా అన్నీ ఏకరువు పెట్టున్నావ్?

ఏమీ తోచడంలేదా? అబ్బ, ఎన్నిసార్లు ప్రకాశ్ ఆమాట.

నాకేగనక నీకు చిక్కిన అవకాశం చిక్కి వుంటేనా, కనీసం ఒక్క నెల రోజులపాటు సెలవు దొరికి వుంటేనా, ఆ బెంగుళూరి చల్లదనాన్ని అంతా అలా మింగేసి వుండేవాణ్ణి. కశ్యపణ్ణీ, వసంతనీ వెంటవేసుకొని, ఆ లాల్ బాగ్నూ, ఆ కబ్బన్ పార్కునూ చుట్టి వచ్చే వాణ్ణి. ఆ పాపల్తో ఆడుకుంటూంటే, వాళ్ళ నవ్వుల పువ్వుల్ని పంచుకుంటూంటే, తక్కిన లోకం అంతా ఎందుకు జ్ఞాపకం వొస్తుంది.

నిజంగా చిట్టి చిట్టి పాపాయిలు వున్న చోటనే స్వర్గం వున్న దనుకో. వాళ్ళ అల్లారు ముద్దుపలుకుల్లోనే, ఆటపాటల్లోనే అమృతం వుందనుకో. బెంగుళూరు లాంటి వాతావరణంలో వేరే చెప్పాలా?

కశ్యపుడికీ, వసంతకీ చలి చొక్కాలంటే ఇష్టంగదూ? అవి తొడిగి ముస్తాబుచేసి, చక్కగా షికారు తీసుకు వెళ్తూండు. నువ్వూ అలాగే అన్నీ మరిచి పోయి, వాళ్లతో ఆడుతూ పాడుతూ గడుపు.

ఉబుసు పోయేటందుకు, ఏమైనా కొత్తకొత్త సంగతులు వ్రాయమన్నావు. ఈ అడివి వూళ్లో ఏం కొత్త సంగతు లుంటాయ్!

నీ ఆరోగ్యం జాగ్రత. ఆ టానిక్ పుచ్చు కుంటున్నావా!

* * *

నీ ఉత్తరం నిజంగా యీ సారి నాకు కొంత ఆనందాన్ని యిచ్చింది. అలాగే, కొంత -

బలవంతంగానే - అవకాశం కలుగజేసుకుంటూ వుండాలి, విశ్రాంతి కోసం.

కశ్యపుడు రోజూ లాల్‌బాగ్‌కు తీసుకువెళ్ళమని మారాం పెడ్తున్నాడా? వాణ్ణి బట్టి, వసంతకూడా అడుగుతున్నదా? వాళ్ళిద్దర్నీ బట్టి అయినా, నువ్వు వెళ్తున్నావు. అదీ కొంత నేతే వసంత చీరలు కట్టమని ఏడుస్తోందా? అది పట్టిన పట్టు వొదలదు. కాని అమాయకపు పిల్ల

ఇక్కడున్న కొద్దిరోజులూ ఆ పాప లిద్దరూ నాదగ్గిర బహు చేరిక అయిపోయారు. ఆ వున్నన్నాళ్లూ ఏదో మాయగా వుండేది.

మొన్న పట్నంలో వీధికి వెళ్ళినప్పుడు తేంగాయి మాంగాయి బటానీ సుండాల్ చూశాక, వసంత జ్ఞాపకం వచ్చింది. అల్మారాలో బిస్కట్ల పొట్లాం కనిపించేసరికి, కశ్యపుడి కేరింతాలు జ్ఞాపకం వచ్చాయి. రాత్రి నిద్దరే వచ్చింది కాదు.

నిన్న సాయంత్రం ఐదున్నరకే స్టేషన్‌నుంచి వచ్చేశాను. ఏమీ తోచక గుబులు గుబులుగా వుంటే, అలా ఓవర్‌బ్రిడ్జి దాటి ఆ మిలటరీ క్వార్టర్సు వేపు వెళ్లాను... వాటి పక్కనుంచి పరధ్యానంగా వెళుతూంటే, కశ్యపుడిలాగే వున్నాడు- నాలుగేళ్ళ పిల్లాడొకడు- రోడ్డుకి అడ్డంగా పరుగెత్తుతూ దభాలున పడ్డాడు. బావురుమన్నాడు.

చటుక్కున వెళ్ళి ఎత్తాను. ఒళ్లు దులుపుతూ, దగ్గిరికి తీసుకున్నాను. ఎంత ముద్దొస్తున్నాడనుకున్నావ్? సిక్కుల పిల్లాడు- చిన్న షేర్వాణీ, జుబ్బా; ఎర్రని శరీరానికి తగ్గట్టుగా ఎర్రని రాగిజుట్టు; చురుకుగా వున్న పులికళ్లూ, కళ్ళ చుట్టూ సుర్మా.

అంత బావురుమన్నవాడూ, నేనలా ఎత్తుకొని కాస్త బుజ్జగించేసరికి, పకాలుమన్నాడు. మోచేయి, మోకాలు, కొంచెం గీసుకుపోయాయి. అయినా లెక్కచేయలేదు. నా చేతుల్లోంచి గిరుక్కున తప్పించుకొని, తుర్రున పారిపోయాడు.

మళ్ళీ ఒక్కక్షణంలో దగ్గరగా వచ్చి, "షుక్రియా" అంటూ, నేతాజీ జయ్‌హింద్‌లాగ ఒక్క సెల్యూట్ కొట్టి చక్కాపోయాడు. గుమ్మంలో వాళ్ళ అమ్మ కాబోలు వుంది. చూచి నవ్వుకుంది-అంతే!

నేను మెల్లగా వచ్చేశాను. కాని రాత్రంతా ఆ పిల్లవాని రూపం, ఆ 'షుక్రియా' పలుకు- నాలోనే వుండిపోయాయి. కశ్యపుణ్ణీ, వసంతనీ- మరి కొద్దిరోజులపాటు యిక్కడ వుంచి వేయలేదేమా అని అనుకున్నాను. ఐనా వాళ్ళమ్మా నాన్నా వుంచుతారా?

* * *

నీ లేఖ అందుకున్నాను. అలాగ ఏమైనా కబుర్ల వుత్తరాలు వ్రాస్తూంటే, కాస్త వుబుసు పోతూ వుంటుంది అంటావు. నీకు చాదస్తం గాని, యిక్కడి అడివి వాతావరణంలో విసిగెత్తి కదా, నీ ఆరోగ్యం అలా అయింది! ఆ ప్రశాంత వాతావరణంలో కూర్చొని మళ్ళీ యీ అశాంతి వాతావరణాన్ని గురించి వ్రాయమంటావెందుకూ? పోనీలే అలాగే వ్రాస్తూంటాను. ఆ విధంగానైనా రెండు నెలలపాటు అక్కడ వుండి ఆరోగ్యాన్ని చేకూర్చుకో - కావలసిందదే కదా!

* * *

ఇందాకనే నీకో వుత్తరం పోస్టుచేశాను. అయినా కబుర్ల వుత్తరం కావాలన్నావని కూర్చుని యింకో వుత్తరం వ్రాస్తున్నాను.

ఇవేళ సాయంత్రం ఆరుగంటలకి మళ్ళీ అటు షికారుగా వెళ్లాను. ఆ మిలిటరీ క్వార్టర్సు ముందు రోడ్డుకి ప్రక్కగా ఆడుకుంటున్నాడు ఆ సిక్కుల పిల్లాడు. ఎందుకో చెప్పలేను, దగ్గిరగా వెళుతూ చప్పట్లుకొట్టాను. ఒక్కసారి యిటు తిరిగి "కోన్‌హాయ్" అంటూనే చూసి "ఓ, షుక్రియా!" అన్నాడు.

ఎంత జ్ఞాపకం-ఆ మాటతో నే తాళలేక పోయాను. "షుక్రియాఁ, బేటా! షుక్రియాఁ" అంటూ అలా వెళ్ళి చప్పున ఎత్తుకున్నాను. హృదయానికి హత్తుకున్నాను, ముద్దు పెట్టుకున్నాను.

"అరే, గుల్‌హాఁ!" అంటూ లోపల్నుంచి వాళ్ల అమ్మ కాబోలు పిలిచింది. దింపి వెళ్లమని సైగచేశాను.

"ఊఁవాలాఁ" అన్నాడు. ఆ మాటకి మళ్ళీ చప్పున ఎత్తుకున్నాను.

వాళ్ళ అమ్మ మళ్ళీ పిల్చినా, నా లాఠీని పట్టుకొని వుండిపోయాడు. ఆఖరికి నేనే నవ్వు కుంటూ, ఆ గుమ్మంవరకూ తీసుకువెళ్ళి దించాను.

ఆమె నన్ను చూసి నవ్వింది.

"ఏభిలో వెళ్లే వాళ్ళందర్నీ ఇలా పట్టుకు వేళ్లాడతారా!" అన్నట్టుగా, పంజాబీ భాషలో పిల్లాణ్ణి మందలించింది నవ్వుతోనే.

నేనూ ముసిముసిగా నవ్వుకుంటూ అక్కడి నుంచి వెళ్లిపోయాను.

అలాగే ఆ రోడ్డుమీదుగా చాలాదూరం నడిచి వెళ్లాను. మళ్లీ యిటుతిరిగి అడ్డదారి గుండా-ఆ ఓవరుబ్రిడ్జి మీదకు వచ్చేసరికి ఆ దిగు వంలో-తిరిగి ఆ సిక్కుల పిల్లాడూ, వాళ్ళ అమ్మా కనిపించారు. ఆమె కూర్చునివుంది - పిల్లాడు బెలూన్ వూదుకుంటూ పక్కనే ఆడుకుంటు వున్నాడు.

ఒక్కసారి అటే చూస్తో వుండిపోయాను. ఆమె చూసింది-

"ఏం, మళ్లీ వచ్చారు? మా గుల్‌షాబ్‌ని విడిచి వెళ్ల లేక పోతున్నారా!" అని అడిగింది హిందు స్తానీలో.

ముసిముసి నవ్వులు నవ్వాను.

"షికారుగా తీసుకు వెళ్లమని వేధించుకు తింటున్నాడు. అందుకని యిలా తీసుకువచ్చాను. అబ్బ! పెద్ద అల్లరి పిల్లవాడండి. మీకు యిచ్చేస్తా తీసుకుపొండి!" అంది నవ్వుతూ, హిందుస్తానీలో.

"అచ్ఛా, దీజియేగా! ఇస్ సే బఢ్‌కర్ కౌన్‌సా భాగ్య హై!" అన్నాను చేతులు సాచిస్తూ.

అప్పటికి, నాకు హిందుస్తానీ వచ్చునని తెలుసుకుంది గాబోలు. ఆనందంగా-ఆశ్చర్యంగా-చూస్తో, యింకా ఏమో అడగా లన్నట్టుగా, ఏమో చెప్పాలన్నట్టుగా సవరించుకుంది.

నేను కొంచెం ముందుకు వెళ్లి గుల్‌షాబ్‌ని చేతుల్లోకి తీసుకున్నాను.

"అయితే, గుల్‌షాబ్ కాందిశీకుల పిల్లాడే!" అంది.

చూడ్డానికి ఎంతో అందంగా, అదృష్ట శాలి నిగా కనిపిస్తోన్న ఆమె కాందిశీకురాలా? అను కుని ఆశ్చర్య పోయాను.

"మరి మిలటరీ క్వార్టర్సులో వున్నారేం?" అని వెంటనే అడగకుండా వుండలేక పోయాను.

ఇక చెప్పింది తన కథ. తన దూరపు బంధు వొకాయన యిక్కడ మిలటరీ బేస్‌లో చిన్న ఆఫీసరుగా వున్నాడట. ఆయన ఆశ్రయంలోకి వచ్చేసిందట. ఆ మధ్య జరిగిన ఇండియా - పాకి స్తాన్ విభజన సందర్భంలో మతకలహాల ఫలి తంగా - ఆమె తన భర్తను కోల్పోయింది; సర్వ స్వం ధారబోసుకుంది. ఆఖరికి, యీ పసికందును రక్షించు కుంటూ, తన మానాన్ని కాపాడు కుంటూ యిలా యిక్కడికి చేరింది.

ఆమె వర్ణించిన ఆ ఘట్టాలన్నీ వింటూంటే హృదయం జలదరించి పోయింది. నిజంగా, నువ్వు గనుక ఆమె నోటినుంచే ఆకరుణ గాథ వింటే, తప్పక కన్నీరు పెట్టుకుంటావు.

ఇలాంటి దుస్థితికి వచ్చినందుకు ఆమె దుః ఖించడం లేదట. ఇక మిగిలివున్న ఆ ఒక్కగాని ఒక్క పిల్లాడికి ఏమి వస్తుందో అని దుఃఖిస్తున్న దట. ఆ వాత్సల్యం చూడు.

ఐతే, నే నేమీ సానుభూతి చూపలేక పోయాను. పిల్లాణ్ణి ఎత్తుకొని, ఒక్కసారి ముద్దు పెట్టుకొని "భగవాన్ భలా కరే!" అంటూ వచ్చేశాను. మరంతకన్నా ఏం చేయగలను?

* * *

మళ్లీ నిన్నటిలాగనే రాత్రి వేళ కూర్చొని, యీ వుత్తరం వ్రాస్తున్నాను. నిన్న వుత్తరం ఎలా వున్నది? కొత్త కబురు విన్నావా? దాని తర్వాత- వినిపిస్తున్నాను.

ఇవేళ ప్రొద్దుట తొమ్మిదీ తొమ్మిదిన్నరకే స్టేషనుకు వచ్చేశాను. పని అంతగాలేదు. వూరికే, అలా- ప్లాట్‌ఫారం చివరవరకూ వెళ్లి, ఏమిటో-పరధ్యానంగా యోచిస్తూ వుండిపోయాను.

"సాబ్!" అంటూ గుల్‌షాబ్ చట్టున లాఠీ పట్టుకున్నాడు. కూరగాయులనుంచి పట్టుకొని వాళ్ళ అమ్మ అటువెళ్తూ చూసింది.

నా కెంతో ఆనందం అయింది. గుల్ షాబ్‌ని దగ్గిరకి తీసుకున్నాను.

"ఇక్కడేనా మీ వుద్యోగం ! అయ్యో, రోజూ బజారుకి ఇటే వెళ్తూంటామే!" అంది.

ముద్దుగా గుల్ షాబ్ నిగ్గులు తేలిన బుగ్గలు నిమిరాను. తరవాత యిద్దరూ వెళ్లిపోయారు.

ఆఫీస్‌లో పని చేస్తున్నానన్న మాటేగాని, ఆ గుల్ షాబ్ నా కళ్ళముందరే వున్నాడు.

పనిమూలంగా, చాలా ఆలస్యమే అయింది స్టేషనులో. ఏడు దాటిపోయింది. కొంచెం కొంచెం చీకటిపడుతూన్నది కూడా. వాళ్లు ఆ బ్రిడ్జిదగ్గర వుంటారో వుండరో అని అనుకుంటూనే, అటు నడిచి వెళ్ళాను. ఐతే, బ్రిడ్జికి ఇటు పక్క రాతిగట్టుమీద ఇద్దరూ కనిపించారు. గ్యాస్ బెలూన్ విసుస్తూ, కేరింతాలు కొడుతున్నాడు గుల్ షాబ్. షవేళ-జవ్వాన్ లాల్ చొక్కా, టోపీ తొడుక్కున్నందు మూలాన మరీ ముచ్చటగా వున్నాడు. గబ గబా వెళ్లి ఎత్తుకుని, బిస్కట్ల పొట్లాం యిచ్చాను. పచ్చగా వెలుగుతూన్న సిగ్నల్ లైట్‌ని చూపించాను. అప్పుడే వస్తోన్న బొంబాయి ఎక్స్‌ప్రెస్‌ని బ్రిడ్జి మీదనించి చూపిస్తూ, చేతు లూపించాను; కేరింతాలు కొట్టించాను. నిజంగా, ఆ వచ్చీరాని హిందుస్తానీ పలుకులు, ఆ చేష్టలు నన్నెంతో వెర్రెత్తించాయి.

కాని, వాళ్ళఅమ్మ యిక్కడికి వచ్చాక కూడా- అనుభవిస్తోన్న యమయాతల్ని వినేసరికి, నిజంగా నా కెక్కడలేని బాధా కలిగింది. ఒక విధంగా బంధువులుగదా అని అవతార్ లాల్‌తో తలదాచుకోడానికి వచ్చిన అభాగ్యురాల్ని, యీ మిలటరీ ఆఫీసరూ, ఆయనభార్యా- దాసీదానికన్నా హీనంగా చూస్తున్నారట. అంతా చెప్పుకొని మొత్తుకొంది. వింటూంటే, నా హృదయం పగిలిపోయింది. మనింట్లోకి తీసుకు వచ్చేద్దామా అన్నంత ఆవేశం, జాలీ పుట్టుకు వచ్చాయి. అలాంటి అభాగ్యులికి సాయం చేయకపోతే, యింకెందుకు జీవితం! సరిగా ఆదరించే దిక్కు లేదు. ఇంకా చిన్న వయస్సులోనే వుంది. చిన్నప్పుడు వాళ్ళ నాన్న నేర్పించిన సంగీతం, కుట్టుపని భద్రంగా వున్నాయట. వాటితోనే బ్రతుకు తెరువు చూసుకోగలను అంది. కాని, అంతవరకూ ఎవరైనా పుణ్యాత్ములు వూతనిస్తే చాలంటున్నది. లేకపోతే, ఏదుర్మార్గుని దగాకో గురయ్యి, మానాన్ని ప్రాణాన్ని కూడా పోగొట్టుకుంటుంది. ఇక ఆ గుల్ షాబ్ ఏ కసాయివాడికో అయిపోతాడు. అబ్బ, తలుచుకుంటే వొళ్లు జలదరిస్తోంది.

ఆమె చెప్పినదంతా ఆమె కళ్ళలో మళ్లీ చూస్తూ వుండిపోయాను. బ్రిడ్జికి పక్కగా ఎర్రగా కనిపిస్తోన్న సిగ్నల్‌లోని ఆ ఎర్రదనం ఏమిటో భయాన్ని కలిగించింది.

నా కేమీ తోచలేదు-నువ్వు దగ్గర వుంటే ఏం చెప్పేదానివో.

ఆమెకు ధైర్యంచెప్పి, గుల్ షాబ్‌కు ఏమైనా కొని యివ్వవలసిందని- ఐదు రూపాయలు యిచ్చాను.

"నిజంగా మీరు పుణ్యాత్ముల్లాగ కనిపిస్తున్నారు. ఐతే నాకు కావలసింది డబ్బుగాదు- యింత ఆశ్రయం, హృదయం, జాలి..." అని అర్థించింది ఎంతో దీనంగా.

ఏమీ చెప్పలేక మెల్లగా- బరువుగా ఇంటికి వచ్చేశాను.

* * *

నీ వుత్తరం ఒక్కసారిగా ఆశ్చర్యంలో ముంచివేసింది. ఇవేళ మెయిల్లో బయలుదేరి వచ్చేస్తున్నావా ? నాకేమీ అర్థం గాలేదు. నా వుత్తరంలో డేంజర్ సిగ్నల్ కనిపించిందా? అంటే ?

నీవు వ్రాసింది నిజమే అయితే, యీ వుత్తరం అందకముందే బయలుదేరతావు. అందుకని యిప్పుడే టెలిగ్రాం యిచ్చాను, రావద్దని. పైగా, యీ లెటరు మా ఎక్స్‌ప్రెస్ గార్డు చేతికిచ్చి పంపిస్తున్నాను. ఇంటికే వచ్చి యిస్తాడు. బయలుదేరకుండా వుంటే, అంత తొందరపడి రావద్దు.

నీ వుత్తరమే నా కర్థం గాలేదు- ఏమిటా డేంజర్ సిగ్నల్ ?

# రాష్ట్రభాషా వివాదం- రాజ్యాంగసభ నిశ్చయం

జోశ్యుల సూర్యనారాయణమూర్తి

"మెకాలే" పథకం ప్రకారం చిరకాలం నుంచి మన దేశంలో ఆంగ్లభాష రాజకీయభాషగా ఏర్పడి బహుళ వ్యాప్తిని పొందింది. దీనిద్వారా మన జాతికి పరదాస్యంలో మెలకువలు తెలిసి ఒకమాదిరి బ్రతుకు దెరువు ఏర్పడింది. ఆంగ్లేయులు కృతకృత్యులై సుస్థిరం కాకపోయినా చిరస్థిరమైన సంస్కారాన్నొకదాన్ని మన దేశానికి ప్రసాదించ గలిగారు. మనకీ ఈచరిత్ర అంతా తెలుసు. నాయకోత్తము లీసంగతులు కనిపెట్టి మనలో సుస్థిరాత్మీయ దృక్పథం ఏర్పాటు చెయ్యటానికి, దేశభక్తి భావాలని పెంపొందించటానికి అనువైన భారతీయభాష నాస్థానానికి తేవాలని ప్రచారంచేసి భారతీయు లందరికీ నచ్చజెప్పారు. గాంధీగారి మహత్తరాదేశంవల్ల హిందీ జాతీయ భాష కావాలని అంగీకరించారు. దీని ద్వారానే చాలావరకు మధ్య తరగతి ప్రజా సామాన్యంలో దేశభక్తి బీజాలు నాటుకున్నాయి. ఉత్తరాదిభాష లన్నిటితోటి సన్నిహిత సంబంధం కలిగి ఉండటంచేత వాళ్ళకి అది సులభ సాధ్యమైంది. ఇక దక్షిణ దేశంలోకూడా ఆ భాషాప్రచారం జరిగితే ఒకే త్రాటిమీద దేశం యావత్తూ నడుస్తుందని దక్షిణ భారత హిందీ ప్రచారసభను స్థాపించి సాధించారు.

అసలు జాతీయభాష ముఖ్యోద్దేశం ఏమిటి? భారతదేశంలో చాలా భాషలుగల ప్రాంతా లున్నాయి. ఏ భాష ఆ ప్రాంతంలో పెద్ద సాహిత్యం, అందులో రకరకాల విశేషాలూ ఉన్నాయి. వీటన్నిటికీ సంస్కృతంలోంచి సకల విజ్ఞాన సంపదలూ లభించి అవి స్వయంప్రకాశమానాలైనాయి. మరి ఈ విద్వత్తు ఎక్కడికక్కడే పరిమితంగా ఉంది. సర్వభాషలనీ జాగ్రతగా పరిశీలిస్తే "భావ్ ఏక్ హై, భాషా ఓంకీ పోశాకే, బహుత్ హై" (ఏకభావము భాషలను దుస్తులు ధరించినది) అని వ్యక్తమవుతోంది. కాని ఒక ప్రాంతం వాళ్ళు ఇంకొక ప్రాంతం వాళ్ళతో సంబంధ బాంధవ్యాలు కలిగి ఉండటానికి మాత్రం ఏమీ సౌకర్యాలు లేక పోయాయి. ఒకళ్ళభాష ఒకళ్ళకు తెలియక ఒకళ్ళ కొకళ్ళు అర్థం కాకపోవటమే దీనికి కారణమని సువ్యక్తమే. అయితే ఇంగ్లీషు సర్వ వ్యాప్తమై ఉన్నమాట నిజమే. కాని అది తెలిసినవాళ్ళ తరగతి వేరు. వాళ్ళవల్ల జాతీయతా సాధనం కలగటానికి సావకాశాలు తక్కువ. సామాన్యజాతిని సంపూర్ణంగా సాధించటానికే కాకుండా సామాన్య వ్యవహారం నిర్వర్తించుకోటానికి కూడా ఆభాష సాధ్యం కాకుండా పోతోంది. అసలా భాషాప్రయోజనం కూడా సంకుచితంగాని విశాలం కాదు. స్వార్థ పూరితమై కేవల వ్యక్తిజీవన నిర్వహణానికే పనికి వచ్చేదిగా అది వ్యాప్తి చేయబడుతూ వచ్చింది. కనక జాతీయ విశాల భావాలకి అటంకకారి అయిందని చెప్పక తప్పదు. అందుకు అది కాని జాతీయభాష కావాలి.

ఇంతకీ జాతీయభాష దేశీయభాషే అయి ఉండాలి కాని పరకీయ నాయికలాంటిదైతే సుసాధ్యమూ కాదు. వాంఛనీయమూ కాదు. అందుచేత దేశీయ భాషని వెదకి నిర్ణయించారు. అందులోనూ కూడా అన్నిటికంటె తేలికయినది అయితే సులువుగా సమస్తదేశంలోనూ వ్యాప్తం చేయవచ్చునని, హిందీకి ఆస్థానం ఉంది కనక దాన్ని జాతీయ భాషగా అంగీకరించమని గాంధీగారు అన్ని ప్రాంతాలవాళ్ళకీ విశదం చేశారు. ఒప్పించారు. అవలీభాష చదువు కో[illegible]డేలాగ ఉండాలి. రంగూన్ [illegible] చోట్లకి వెళ్ళి వచ్చిన మన ప్రాంతీయులైన కూలీలు దీనిని వేగం [illegible] అర్థం [illegible] జరుగు-

తోంది. అది దృష్టాంతంగా మారుతున్నా మనకిది చాలా తేలికైనదనీ ప్రజాసామాన్యానికి అన్య ప్రాంతాలతో సంబంధం నిరభ్యంతరంగా వృద్ధి పొందించుకోవటానికి సుసాధ్యమైనదనీ సువ్యక్తం అవుతుంది.

చాలా రోజుల క్రిందటనే ఇది సమంజసంగా తోచి అంగీకృతమైనా ఈ మధ్య విచిత్ర జాతి మతసంఘటనలవల్ల కలిగిన పరివర్తన హిందీ, ఉర్దూ అనే రెండుభాషలు కలిసి వ్యవహరించబడుతూ ఉండటాన్ని ఇందులో మనచేత గుర్తింపచేసింది.

ముస్లిం రాజుల కాలం నుంచీ మన రాజకీయ సాంఘిక వ్యవహారాల్లో ప్రాంతీయ భాషల్లో కూడా ఉర్దూ పదాలు వ్యవహృత మవుతూ వచ్చాయి. అందుచేత ఆ పదాల కలయిక హిందీకి క్రొత్త అనిపించలేదు. అభిన్నత్వ వివేకాన్ని కూడా ఆ భాషాద్వయ పదాలు ప్రజలకి కల్పించాయి. కాని ఏ భాష కాభాషకి ప్రత్యేక వ్యక్తిత్వం, ప్రత్యేక సాహిత్య ప్రాముఖ్యం ఉందనే ఉంది. అనివార్యమైన సాజాత్య సాన్నిహిత్యాలు కాల ప్రభావం వల్ల విర్వద్ధం వల్ల సామాన్య హిందీని హిందీ అనటానికి గాని, సామాన్యమైన ఉర్దూని ఉర్దూ అనటానికి గాని వీలులేక పోయింది. 'వహ్ బోల్ తా హై'' లాంటి వెన్నో రెంటిలోనూ ఒకటే రూపంగా ఉండటం దీనికి కారణం.

ఇంక మతవిభేద కలహాలు కారణంగా వాళ్ళభాష వేరు, మన భాష వేరు అనే భావాలు పెరుగుతూ ఉండే. మత కలహాలను రెకెత్తనివ్వకుండా గాంధీ మహాత్ముడు ఏ భాషకీ ప్రత్యేక ప్రాముఖ్యం లేకండా అనివార్య సంబంధం గ్రహించి సరళ సంయుక్త స్వరూపంగల భాషకి "హిందుస్తానీ'' అని పేరు పెట్టి దాన్నే ఆశ్రయించమని ప్రజలని కోరాడు.

దీన్ని అర్థం చేసుకోడానికే బోలెడన్ని తగవులు పుట్టాయి. ఏం చేస్తే ఏం, కొందరు హిందీ వాదులు, మరికొందరు హిందుస్తానీ వాదులు బయలుదేరారు. తగవులు తేలటం లేదు. అర్థం కాకపోవటమే ముఖ్యకారణ మనిపిస్తుంది. "సేఠ్ గోవిందదాసు'' (హిందీయే) నాగరలిపే ఉండి హిందీ కావా లంటారు. గాంధీగారు రెండు లిపులూ కావా లనటం చాలా బాధాకర మైంది. చాలామంది ఆయన్ని విమర్శించారు, ప్రార్థించారు. ఏదో తెలియచెప్పటానికి ప్రయత్నించారు. కాని ఆయన దృక్పథం కేవలం మతసఖ్యం వైపే ప్రవర్తితమైంది. ఏమైనా పాకిస్తాన్ వేరుపడింది కనక వాళ్ళ సఖ్య దూరప్రవృత్తి దీనికి తోడ్పడింది కాదు. కనుక మనకి నాగరి చాలనీ, హిందీయే రాష్ట్రభాష అనీ ప్రజాభిప్రాయాన్ని కొందరు సేకరించారు. రాజ్యాంగపరిషత్తు కూడా దాన్నే నిర్ణయించింది.

గోవిందదాసు అనేది కూడా 'జో హింద్ కీ భాషాహై వహ్ హిందీ హై'; 'ఔర్ జో హిందుస్తాన్ కీ భాషా హై వహ్ హిందుస్తానీ హై' అనేగాని వేరే ఏమీ కాదు. ఇది అతను ఏలూరు సభలో వ్యక్తీకరించాడు. అందుచేత ఇకముందు కూడా ఆయన అనుచరులు సంస్కృతమయపు హిందీని గాని, ఇతరులు ఉర్దూ మయపు హిందీని గాని జాతీయ భాషగా ఉపయోగించ ప్రయత్నించటం తగదు.

ఇంతవరకు తర్జనభర్జనలు పైన తర్వాతనే హిందీయే రాష్ట్రభాష అనీ, నాగరియే లిపి అనీ 'ఆజాదు' ప్రభృతులు కూడ ఒప్పుకొన్నారు.

ఇంక దీన్ని పదిహేను సంవత్సరాలలో పూర్తిగా జాతీయభాష చెయ్యాలని నిర్ణయించారనటం ఆశ్చర్యకరంగా ఉంది. ఇంతకుముందు పదే సంవత్సరా లన్నారు. అది సాధ్యపడలేదు కాబోలు, కాలక్రమాణాం ప్రవర్ధమానం అయింది. ఆ కాలపరిమితిలో కూడా దాన్ని ఎట్లా జాతీయం చెయ్యాలి! అనే సంగతి నిర్ణయించటానికి సంఘాన్ని నియమించారన్న వార్త సంతోషదాయకమే.

కాని ఇంతవరకు మనవారిలో ఆచరణ మార్గంలో సాధ్యమైనంత వరకైనా దాన్ని వ్యాపింపజేద్దామనే దృఢసంకల్పం వ్యక్తంకాదు. దేశీయభాషలను వృద్ధిచేస్తూనే జాతీయభాషా జ్ఞానం పాఠశాలలలో పిల్లలకు మెల్లమెల్లగ కలిగించాలని అనుకోవటమే కాని ఇట్లా వీటితో పాటు ఇంగ్లీషు వదలటానికి వీలులేదు గనక అదీ ఉంటోంది. మరి పుస్తభారంలో మూడు భాషలు బాలురు నేర్చుకోగలరా! ఇది ఇలా

ఉండగా హిందీ పండితుల లో కూడా భేదాలు కల్పించి ప్రభుత్వం సభ్యతతో సహకరింప జేసు కోవటం లేదు.

పదిహేను సంవత్సరాలలో హిందీని జాతీయ భాష చెయ్యటం అంటే- సాధ్యమైనంతగా అమలు పరుస్తో ఉంటేనే అంత కాలమనియా? లేకపోతే అప్పుడప్పుడు దీని సంగతి జ్ఞాపకం చేస్తూ ఉంటేననా? మొదటిపద్ధతి ప్రకారమైతే హాయ్యర్ ఫారమ్స్‌లో హిందీ తీసివేసి కూడా సాగించుకోవచ్చు అనే "జీవో"లు పుట్టిస్తున్నా రంటున్నారే? ఆ రీతినైతే మొదటి పద్ధతి ఎట్లా? మరి రెండో రీతినైతే ఎన్నాళ్ళకీ దాన్ని జాతీయభాష చెయ్యలేము.

ఇంతకీ మనకి అంతర్జాతీయభాష అని ఆంగ్లం మీద ఎంత అభిమానమున్నా, హిందీతర్వాత అది. దానితర్వాత ఇది కాదు. అంతర్జాతీయత పరిమితం గాని సర్వప్రజావ్యాప్తం కాదు. కనక ప్రత్యేకాభిలాషగల వ్యక్తులకి కళాశాలా విద్యలలో దానికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించి మిగిలిన దానికంతకీ జాతీయభాషలోనే బోధనలు (పరిభాషా పదాలు యథాతథంగా ఉంచుతూ) చేయించే ఏర్పాటులు విశ్వవిద్యాలయాలు చేసి, విద్యార్థులకూ కూడా కల్పిస్తే హృదయపూర్వకంగా జాతీయతకు తోడ్పడినట్టు నిదర్శనం అవుతుంది.

పైగా హైస్కూళ్ళలో హిందీ పండితులకు ఇంగ్లీషు అవసరం అనటం యుక్తం కాదు. అలా అలా అనలేదంటారేమో! ఎస్. ఎస్. ఎల్. సి. అయినవాడికి జీతం ఎక్కువ ఇస్తున్నామంటే అర్థం ఏమిటి? ఇక్కడ "రాష్ట్రభాషా ప్రవీణ్" అనే పరీక్ష పూర్తి చేసి ప్రచారక్ అయినవాడొక తరగతివాడు-అతడు పూర్తిగ అర్హుడు. "విశారద్" ప్యాసయినవాడు సెకండరీ గ్రేడ్ అయినచో అతనికి ప్రచారక్ అక్కరలేదని ఒక నియమము-ప్రచారక్ అనేది ట్రెయినింగ్ కదా అని ప్రభుత్వం సెకండరీ గ్రేడ్ వానికి అది అయింది గనుక అక్కర లేకపోయింది గాని, అసలు ప్రచారసభవారు ప్రచారక్ అనే డిప్లమో ప్రవీణ అయినమీదట ట్రెయినింగైతేనే ఇస్తున్నారు ప్రభుత్వపు నియమాన్నిబట్టి సెకండరీ గ్రేడ్ వానికి ప్రచారక్ అక్కరలేదన్నమాట కర్థంగా ప్రవీణ అక్కర లేకనే అర్హత కల్గునదని తేలుతోంది. ఈ విషయంలో జీ. వో.లకు రకరకాల వ్యాఖ్యలు చేయబడుతున్నాయి.

ఇవి అన్నీ ఆలోచించి ప్రచారసభవారితో ఆలోచించి స్పష్టంగా గుర్తించి ప్రభుత్వం హిందీ పండితులలో కూడా భేదాలు లేకుండా చేసి సహాయపడాలి. ఈ విషయంలో హైస్కూలు ప్రధానోపాధ్యాయుల సహకారం కూడా పూర్తిగాను మనస్ఫూర్తిగాను కావాలికదా!

ఇంగ్లీషుకి ప్రమాదం వస్తోందనుకోవటంకంటె క్రమంగా పెంపొందించటానికిగాను హైయర్ ఫారమ్స్‌లో తీసివేయకుండా ఉండే ఉపాయం ఆలోచించి కాలేజీల పరివర్తనను కూడా అభ్యర్థించటం అవసరం. ప్రభుత్వాన్ని పాఠశాలలు, పాఠశాలలని ప్రభుత్వం బాగా అర్థం చేసుకొని సహకార భావంతో లక్ష్యం సాధించాలి. లోకుల భయంతో, పైకి గౌరవానికిగాను జాతీయతాభివృద్ధి అని మాట్లాడటం కార్యవాదం కాదు. ఈ విషయంలో ప్రజలు (పెద్దలు) ప్రభుత్వాన్ని అభ్యర్థించాలి. హిందీ పండితులు అసలు సంగతులు ఓపికతో దేశానికి బోధించి సమయానికి ఎదురు చూడాలి. పరిషత్తు నియమించిన సంఘం ఉచితమైన సలహాలిచ్చి మార్గదర్శకం అవుతుందని ఆశించవచ్చు



జానపద చిత్రం

వేమవరం వెళ్ళిన పుల్లయ్యగారు తిరిగి వస్తూంటే, దారిలో ఒక యింటి మదురుగోడమీద కుదురుగా కూర్చున్న రామచిలక కనిపించింది. ముచ్చటపడి పట్టుకుందామని దగ్గిరకి వెళ్ళాడు. కోపంతో చిలక గర్జించింది: "ఏం కావాలి?"

పుల్లయ్య హడలిపోయి, "నమస్కారం తల్లీ! అపరాధం! నిన్ను చూసి రామచిలక అనుకున్నాను" అన్నాడు.

# ఈనాటి గేయకవనం

వి. యస్. ఆర్

ఈనాటి గేయ కవనం - పాండవుల లక్క భవనం
లంగర్లు లేని ఓడ - కళ్లేలు లేని ఘోడ
నియమాల కెల్ల స్వస్తి - భావాల లోతు నాస్తి
శబ్దాలతోడ కుస్తీ - అపశబ్ద భయం నాస్తి ॥ ఈనాటి ॥

లోకాలలో ప్రజలో - లేకున్న పరిచయం
ఈ కవననే తెచ్చి - యెక్కించు 'ఎవరెస్టు',
కాపీగా - డీపీగా - సాఫీగా - కాఫీగా,
లాగెయ్యొచ్చు - త్రాగెయ్యొచ్చు ॥ ఈనా ॥

ఆమాట ఈమాట పోగ్జేసి,
అతుకులబొంత తయార్జేసి,
గేయకవిత్వం - భావకవిత్వం,
అదే మహాత్వం - ఇది యొక తత్వం,
కవికోక సత్వం - రాసినవెల్ల కవిత్వం ॥ ఈనా ॥

అయిద్ర పురుగు శోభి,
యువపాలమూలా పనాభి-
షిక్తమై- యమరక్తమై - శాస్త్రోక్తమై- శ్రుతిభోక్తమై,
అనన్యసామాన్య విరవ భూయిష్ఠమై - అభావతరంగ పరిపుష్టమై-
అలరుచునుండెడు గేయం,
అభ్యుదయాలకే ధ్యేయం ॥ ఈనా ॥

వ్యాకరణాలా - ఛందస్సా,
అవి పాండవులకు మాత్రం చెల్లుబడి,
ఈ బడి పిచ్చిబడి - అతినవ్యులకే అందుబడి,
స్వతంత్రమైన నుడి - (వాళ్ళలోఅయినా) అందరికీ లేదు ఈడుడి ॥ ఈనా ॥

పెద్దపెద్ద సమాసాలు, - చినచిన్నవి వాక్యాలు,
తుంచి, దంచి, పెంచి, దించి,
కూర్చిన శబ్దాలు - మరి రసాభాసాలు,
ఈ దృశ్యకవనాల వల్ల - ఏ విధాన లేదు మేలు ॥ ఈనా ॥

షరా:—చదవటంలో అవసరాన్ని బట్టి వరస మార్చాలి.
అర్థభావాలను అదనంగా తరచిచూడాలి.




(గతసంచిక తరువాయి)

## మొదటి దేవరాయలు

(క్రీ. శ. ౧౪౦౬-౧౪౨౨)

సాహైన తరుణమునకు గోదావరీ తటమునకు పోయి చేరినది విజయనగర సైన్యము. అచటి స్థితిగతు లప్పటికే విషమదశకు వచ్చియుండినవి. రాజమహేంద్రవర రాజ్యమును స్వాధీనపఱచుకొనవలయునను నుద్దేశముతో పెదకోమటి వేమారెడ్డి దండువెడలి పోయి గోదావరిని దాటి నదీపూర్వతటమున నిప్పటి రాజోలు తాలూకాలోని రామేశ్వరము కడ విడిసెను. బహమనీ సుల్తాను ఫిరోజుశాహు దన మిత్రులకు తోడు వచ్చుచున్నాడని యెల్లరు వెనుకు చూచుచుండిరి. గోదావరీతీర దేశమును బ్రవేశింపగనె విజయనగర సైన్య మిప్పటి తణుకు తాలూకాలోని యత్తిలి దుర్గమును వశపఱచుకొని దానిని నెలవీడు జేసికొని నది పశ్చిమ తట భూముల నాక్రమించుకొన గడగెను; రాయరాణువ రాకను గాంచి ధైర్యము వహించి కాటయవేమును రణరంగము జొచ్చి రామేశ్వరము చెంత ఘోరసంగ్రామమున పెదకోమటి వేము నోడించి పాఱద్రోలెను. అన్నదేవచోడుని యడ్డపాటువలన పెదకోమటి వేముని దళములు కాటయవేముని ప్రతాపాగ్నియందు పూర్ణాహుతి గాక తప్పించుకొనెను. రెడ్డిరాజు లిరువురును రామేశ్వర రణక్షేత్రమున దార్కొనుచుండిన సమయమునకె బహమనీ సుల్తాను ఫిరోజుశాహు దండుతో గూడ వచ్చి చేరెను. సుల్తాను రాకవలన ప్రవృద్ధబలుడై యన్నదేవుడు విజృంభించి విజయనగర సైన్యములను దాకి నిర్మూలము గావించెను. సుల్తాన్ ఫిరోజుశాహు తెలింగాణమును జయించు నుద్దేశముతో దండు వెడలి రాజమంద్రి వఱకును సైన్యము నడపుకొని పోయెననియు, పెక్కు దుర్గములను సీమలను సాధించి, వాని పాలించుటకు దన యనుచరులను నియమించి మరలి తన రాజధానికి వచ్చి చేరెననియు బుర్హాన్-ఇ-మఆసీరు నందు చెప్పియున్నది. సమకాలిక శాసనము లివి యథార్థమని రుజువు చేయుచున్నవి. క్రీ. శ. ౧౪౧౬ వ సంవత్సరమునందో మరునటి యేటనో ఉల్లేఖింపబడిన యన్నదేవచోడని రాజమంద్రి మ్యూజియం తామ్రపట్టికయందు అన్నదేవుడు దనకు మాఱొడ్డిన దాక్షిణాత్య నృపాలుర నత్తిలి గడిసీమయందు ఓడించి, యా పట్టణమందు తల దాచుకొని యుండిన దశసహస్ర సంఖ్యాక శత్రు బలముల కభయప్రదాన మొనర్చెననియు; తన మరది యగు పిన్నంశి రాజసహాయముచే గౌతమీ తటమందలి కాకరపర్తి రణక్షేత్రమున విజయనగర సైన్యమును నిర్మూల మొనర్చెననియు; రామేశ్వర రణక్షేత్రమున నిర్జితుడై పాఱిపోవుచుండిన మిత్రుని పెదకోమటి వేముని సంరక్షించె ననియు జెప్పియున్నది. ఈ సందర్భమున నెచటనో యజ్ఞాతరణరంగమున గాటయవేమును నిహతుడై నట్లున్నది; అతని కుటుంబము కాకరపర్తి యుద్ధమైన తరువాత అన్నదేవుని చేజిక్కెను. కాని యతని విజయము చిరస్థాయిగ నిలువలేదు, తాత్కాలికమే. శత్రువులు

విజితులైనను వినాశ మందలేదు. కాకరపర్తి రణక్షేత్రమున గర్ణాటక బలము విధ్వంస మాయెనను వార్త వచ్చి చెరగనే, దేవరాయలు గ్రొత్త దండును రెడ్డకు నోడంపెను; దాని గాంచి ధైర్యము దెచ్చుకొని కాటయ వేముని సేనాధ్యక్షుడు దొడ్డయ అల్లాడరెడ్డి చెదరియుండిన రెడ్డిబలముల నెల్ల మరల కూర్చి యన్నదేవుని తారసిల్లెను. తరువాతియుద్ధవర్తమానము తెలియరాక పోయినను, అల్లాడరెడ్డి విజయుం డాయెననుట నిశ్చయము. అన్నదేవుడును నతని కుమారుడగు వీరభద్రుడును యుద్ధమున మడసిరి. వారిసహాయులు గూడ నిర్జితులై వెనుదిరిగిపోయిరి.

రాజమహేంద్రవరరెడ్డిరాజ్యమంతట నిష్కంటకమైనది. కాటయవేముడు నిహతుడైనను అల్లాడరెడ్డి రాజ్యమును స్వాధీన పఱచుకొని రాజమహేంద్రవరసింహాసనముపై నతని సంతును నిలిపి వారి పక్షమున రాజ్యపాలన సేయదొడగెను. రెడ్డిరాజ్య మిట్లు శత్రునిర్ముక్తమైనను యుద్ధ మాగలేదు. రణరంగము మాఱినది, అంతే. గోదావరీ తటమును విడిచి యుభయ పక్షములవారును పశ్చిమమున కృష్ణాతీరమందలి వెలమరాజ్యమును యుద్ధభూమిగ జేసికొనిరి. దీని మూలమున రణోద్యుక్తపక్షద్వయ మందును గొంతమార్పు గలిగినది. ముందు చెఱియొకప్రక్క సహాయులై నిలిచి యుద్ధము సేయుచుండిన విజయనగర బహమనీ రాజు లిప్పుడు ప్రధానులైరి. ముందు బహమనీ సుల్తానుకు బాసటయైయుండిన వెలమవా రిప్పుడు రాయలకు మిత్రులై తమ పూర్వ స్నేహమును దుంచి మహమ్మదీయులతో బ్రతిఘటించిరి. విజయనగర బలముల సహాయము వలన విజయులైనను నల్లాడరెడ్డికాని యతనిపందుగాని వెలమ రాజ్యమున నడచిన యుద్ధమున పాల్గొనలేదు. పోరాటమంతయును నల్లగొండ చేరువనున్న పానుగంటి దుర్గము చుట్టును జరిగినది. అది శత్రుదుర్జయ గిరిదుర్గమని పేరెన్నిక కెక్కినది. క్రీ.శ. ౧౩౬౫ వ సంవత్సరమున ఇమ్మడి బుక్కరాయలు జయించి నప్పటినుండియు పానుగల్లు విజయనగరరాయల స్వాధీన మందె యుండినది. కొండవీడు రాచకొండ రాజ్యముల మధ్యనుండు గడిసీమ సమీపమునం దుండి యందువలన విజయనగరమునుండి కృష్ణాగోదావరుల మధ్య తీరదేశమునకు బోవుదండుదారిని సంరక్షించు నాయస్థానమై యుండెను. ఈ దుర్గము దేవరాయల స్వాధీనమునం దుండకపోయిన రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమునకు సత్వరముగ బలసహాయ మంపుటకు సాధ్యమై యుండెడిది కాదు. ఫిరోజుషాహి దుర్గముయొక్క ప్రాముఖ్యతను గుర్తింపక పోలేదు. పూర్వాంధ్ర విజయమున కది యత్యంత సహాయకారి కాగలదని యతడెఱుగును; కావున రాయలకడనుండి యీ దుర్గమును నాచికొన నిశ్చయించి, క్రీ. శ. ౧౪౧౭ వ సంవత్సరమున దానిని సాధించుటకు దనసైన్యము నంపెను; వారి మార్గము నరికట్ట దేవరాయలు ప్రయత్నము జేసెను; కాని బహమనీ ఘాజీలచే నిర్జితుడై పాఱిపోవలసివచ్చెను. ఫిరోజుషాహు దుర్గమునకు ముట్టడివేసెను. రెండేండ్లకాలము సాగిన దా ముట్టడి; దాని లగ్గలుపట్ట నతడొనర్చిన ప్రయత్నము లన్నియు విఫలములై పోయినవి: ముట్టడించు తురకల కష్టము దుర్భరమాయెను. తినుట కాహారపదార్థములు దుర్లభమాయెను. స్కంధావారమునందు గఱవు తలచూపినది. అంటురోగములు ప్రబలినవి. ఇంతటను దేవరాయలు మరల దండును గూర్చుకొని, రాచకొండ దేవరకొండ వెలమల సహాయమును వడసి కోట నరికట్టియుండిన మహమ్మదీయుల జొట్టుకొనెను; రెండు సంవత్సరముల నుండియు మహాధైర్యముతో కోటను గాపాడుచుండిన దుర్గసంరక్షక బలము రాయలు గొప్ప సైన్యముతో గూడ దమకు ప్రాపు వచ్చుటను గని సంతోషముతో నుప్పొంగి దుర్గద్వారములను దెఱచుకొని వెలువడి యిరుమలపాలై యీతిబాధలు బడుచుండిన తురకలపై బడిరి. ముందు గోయి వెనుక నూయి యన్నట్లయినది వారి స్థితి. రెండు హిందూ వాహినుల మధ్య దగుల్కొని కడికండలుగ నఱుకుడు పడిరి తురకలావాడు. తన వారిని శత్రుల గవయ బురికొల్పుచుండిన సుల్తాను గాయపడి బ్రదుకుజీవుడా యని పాఱి పోయెను.

పానుగలు దుర్గము చెంత ఫిరోజుషాహు తిన్నదెబ్బ సామాన్యమైనది కాదు. అతని సైన్యము సర్వము నాశమైనది. జయోద్రిక్తులై యెత్తి వచ్చుచుండిన శత్రువుల బారి బడనీయక నిజరాజ్యమును గాపాడుకొనగల శక్తి యతనికి

శేదాయె. రాజ్య ప్రారంభదశయందు కార్య ఖడ్గములు రెంటికిని కర్తయై చేదోడు వాదోడై యుండిన తమ్ముడు ఖానెఖాను అహమదుడు రాజ్యాభిలాషియై ద్రోహమును దలపెట్టి సింహాసనము నాక్రమించుకొనుటకు రహస్యముగ నుపాయములు వెదకుచుండెను. ఈ దుస్థితియందు గత్యంతరము నెఱుగక ఫిరోజుశాహు గుజరాతుపాలకు డగు సుల్తాన్ అహమదుయొక్క సహాయము నర్థించెను; కాని యాతడు ఫిరోజుశాహు వేడికోలును జెవిని బెట్టలేదు. దేవరాయలు సుల్తాను దుస్థితి నెఱిగి కృష్ణా తుంగభద్రల మధ్యదేశము నాక్రమించుకొనుటయే కాక భామినీ రాజ్యమును జొచ్చి దేశమును ధ్వంసము జేసెను. *

## దేవరాయలు-గజపతి:

రాజమహేంద్రవర రాజ్య వ్యవహారములలో ప్రవేశము గలిగించుకొనుటవలన దేవరాయలకు కళింగ గజపతులతో వైరము పొడమెను. ఏ కారణము వల్లనో కళింగ గజపతి, నాల్గవ భానుదేవుడు, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యముపై నెత్తివచ్చెను. అతని బాఱదోలి తన మిత్రుని సంరక్షించుటకొఱకు దేవరాయలు మరల గోదావరీ తీరమునకు దండు నంపవలసి వచ్చెను. రాయ గజపతి సైన్యములు రెండును యుద్ధమునకు సంసిద్ధము లైనవి; కాని యల్లాడరెడ్డి యుద్ధము వలన తన దేశము పాడగునని యెంచి యెత్తివచ్చిన గజపతికిని దనను తోడువచ్చిన రాయలకును సంధి గావించి యెవ్వరి రాజ్యమునకు వారి నంపెను. ఇట్లు విజయనగర కళింగ రాజ్యముల కొండొంటితో యుద్ధము దప్పిపోయినను, ఇది విస్మరింపదగిన విషయము గాదు. రాయరాజ్య వైదేశిక వ్యవహారములలో నిటనుండియు నొక నూతన యంగము ప్రారంభ మగుచున్నది. దాదాపొక శతమాన కాలము తీరాంధ్ర భూమిని సంక్షోభ పెట్టిన కర్ణాటోత్కళుల ప్రతిస్పర్థ కిదియ యంకురార్పణము. ఇప్పటి నుండియు దాదాపు క్రీ. శ. ౧౫ వ శతాబ్ద మధ్యకాలము వఱకును వజ్ర సింహాసనము నధిష్ఠించిన రాయల కందఱికి గజపతులతో బోరాట తప్పినది కాదు.

దేవరాయల యంతిమ రాజ్య వర్షములందు రాయ సామ్రాజ్యమున యుద్ధములు లేక శాంతి నెలకొని యుండినవి. రాజకార్యములను దన పుత్రులకును మంత్రులకును నొప్పజెప్పి విద్యా వ్యాసంగమున కాలము గడపినట్లున్నది. సైన్య నిర్మాణమున దేవరాయలు గడునేర్పరి. రాష్ట్ర పరిపాలన మొనర్చిన యేబదియేండ్ల కాలమునను, (క్రీ. శ. ౧౩౭౨–౧౪౨౨) నతడు సైన్యమును బలపఱచుట కెడతెగక కృషి నల్పుచుండెను. విజయనగర చక్రవర్తులలో సైన్యమునం దశ్వదళ ప్రాముఖ్యత నగుర్తించినవా డతడే. ధనవ్యయమును సరకు సేయక అరబీ పార్సీ దేశములనుండి ఉత్తమజాత్యశ్వములను రప్పించి. వానికి దగు వాహకుల నేర్పాటుజేసి యశ్వదళమును బలపఱచెను. మఱియు జాతి మతభేదముల నెంచక ధనుర్విద్యా విశారదులైన తురక విలుకాండ్ర నతిశయ వేతనము లిచ్చి దనకొలువున జేర్చుకొని కాల్బలముల నభివృద్ధి యొనర్చెను. ఇట్లు ప్రోదిచేసి క్రమక్రమముగ నభివృద్ధి చేసిన సైన్యము శత్రుభీకరమై విజయసాధకమైనది; ఫిరోజుశాహుతోడి దీర్ఘయుద్ధమున దేవరాయల కూతకఱ్ఱయై జయము చేకూర్చినది.

మతముచే మొదటి దేవరాయలు శైవుడు; హంపిక్షేత్రాధి దేవత యగు పంపాదేవి యతని కిష్టదైవము. వాస్తునిర్మాణమునం దతని కాసక్తి మెండు. నిరంతరము యుద్ధకార్యనిమగ్నుడై యుండినను, విజయనగరమున పెక్కు దేవాలయముల గట్టించెను; శిథిలావస్థయం దున్నను, కొన్ని

---

* సుల్తాను తమ్ముడగు ఖానెఖానుడు విజయనగర సేనలతో ననేక యుద్ధములలో బోట్లాడి వారిని బాఱదోలెనని ఫెరిష్టా వ్రాసియున్నాడు; కాని ఇది సంశయాస్పదము. ఏలనగా, నితర మహమ్మదీయ చరిత్రకారు లీవిషయమును జెప్పలేరు; మఱియును గేసుదరాజు ఢిల్లీనుండి గుల్బర్గకు వచ్చినప్పటినుండియు నన్నదమ్ములకు వైమనస్యము గలిగి దినదిన ప్రవర్ధమాన మగుచుండినది; సింహాసనము నాక్రమించుకొన ప్రయత్నము సేయుచుండిన ఖానెఖానుడు సుల్తానుకు సహాయపడుట యసంభవము.

యింకను నిలిచి యున్నవి. దేవరాయలు విద్వత్ప్రభువు. శాస్త్రవేత్తలను, తత్వజ్ఞులను, కవులను, గాయక పాఠకాది కళోపాసకులను దన యాస్థానమునకు రప్పించి సత్కరించి పోషించువాడు. ప్రఖ్యాతకవిపండితగాయకాదివిద్వజ్జనులను ముత్యాల శాలయందు బంగారు గద్దియపై గూర్చుండబెట్టి కనకాభిషేకము జేయించువాడు. దేవరాయ లాంధ్రభాషాభిమాని; ఆంధ్ర కవులను సత్కరించి వారిని కావ్యరచనకు బురికొలుపువాడు. శ్రీనాథునికి ముత్యాలశాలయందు కనకాభిషేకము జేసిన దీ దేవరాయమహారాయలే. ఇతని విద్యాభిమానము వలన విద్యానగరము సార్థకనామధేయమై దక్షిణ భారతమందంతటను ముఖ్య విద్యాపీఠమై కీర్తికాములగు విద్వాంసులకు గమ్యస్థానమై విరాజిల్లెను.

## మొదటి దేవరాయల పుత్రులు

మొదటి దేవరాయల కనేకులు పుత్రులుపుట్టిరి. వారియం దీచరిత్రలో జేర్చకొన దగినవారిద్దరే!

రామచంద్ర రాయలు: (క్రీ. శ. ౧౪౨౨)—వీరియందు ప్రథముడు రామచంద్రరాయలు. క్రీ. శ. ౧౩౯౦-౯౧ నుండియు నితడుదయగిరి రాజ్యపాలనయందు తండ్రికి సహాయుడై యుండెను. దేవరాయ లితని యావద్రాజ్యాభిషిక్తుని గావించి యుదయగిరి దుర్గాధీశునిగ నియమించెను; రామచంద్రరాయలు గడిదేలిన యోధుడు; మహమ్మదీయులతోడను వెలమలతోడను బలుమారు పోరి కీర్తి వహించెను. దేవరాయలు గతించిన పిమ్మట రామచంద్రరాయలు వజ్రసింహాసనము నధిష్ఠించి యాఱు మాసముల కాలము విజయనగర సామ్రాజ్యమును పాలించెను; ఇతని గూర్చి యింతకంటె జెప్పదగిన విషయము లెవ్వియు లేవు.

మొదటి విజయరాయలు: క్రీ. శ. (౧౪౨౨-౧౪౩౦) రామచంద్రరాయలు గతించిన తరువాత నతని భ్రాత మొదటి విజయరాయలు, రాజ్యాభిషిక్తుడాయెను, ఇతనికి విజయభూపతి, విజయబుక్క, వీరబుక్క యను నామాంతరము లుండినట్లు శాసనములవల్ల దెలియుచున్నది. ఇతని యేలుబడి యెన్నియేండ్లవఱకు సాగినదో నిష్కర్షించి చెప్పుటకు సాధ్యము గాదు. ఈ విషయమును గూర్చి చరిత్రపరిశోధకులు భిన్నాభిప్రాయములను వెలిపుచ్చియున్నారు. న్యూనిజు గ్రంథస్థము గావించిన ప్రాచీనేతిహాసమునందు విజయరాయ లాఱేండ్లు రాజ్యపరిపాలన మొనర్చెనని చెప్పియున్నది. కాని యాధునిక పరిశోధకు లితని రాజ్యకాల మింతకు హ్రస్వతరమైనదని యభిప్రాయపడుచున్నారు. ఆఱు నెలలని కొందఱు; రెండేండ్లని కొందఱు.* కాని విజయరాయల శాసనములన్నిటి బరికించి చూడగా నతడు క్రీ. శ. ౧౪౨౨ మొదలు

* విజయరాయ లాఱునెలల కాలము పాలించెనని గోపీనాథరావుగారు నిర్ణయించినారు; వీరి యభిప్రాయముతో నేకీభవించినారు వెంకోబరావుగారు; కాదు, అతని యేలుబడి రెండేండ్ల పర్యంతము సాగెనని చెప్పినారు హయవదనరావుగారు. తన యభిప్రాయమే సరియైనదని, విజయరాయలు క్రీ. శ. ౧౪౨౩-౪ వ సంవత్సరమున శివసాయుజ్య మందెననియు, నిరూపించుటకొఱకు ఇమ్మడి దేవరాయల శాసనము నొకదాని (ఎ. పి. కర్ణా. సం. ౮. తీర్థ. ౧౬౩) నుదాహరించినారు. కాని ఈ శాసనమున విజయరాయల శివసాయుజ్య ప్రస్తావము లేదు. శాసనమును నిలిపినాతం డిమ్మడి దేవరాయలుగాడు; అతని యమరనాయకులలో నొక్కండైన విట్టప్పదండనాయకునిక్రింది యధికారి యొక్కడతని తండ్రి శివసాయుజ్యము బొందగా నాతని పుణ్యలోకావాప్తికొఱకు బ్రాహ్మణులకు భూదానము జేసి యా విషయమును బ్రకటించుటకొఱకు శిలాశాసనమును నిల్పినాడు, ఇంతే.

౧౪౩౦ వఱ కెనిమిదేండ్లు కాలము ప్రజాపాలన మొనర్చినట్లు తెలుచున్నది.

విజయరాయలు సత్వహీనుఁడు. అతనికి నిర్వాహకత చాలదు. అతఁడు పృథ్వీ పరిపాలన మొనర్చిన యెనిమిదేండ్ల కాలమునను రాజ్య వ్యవహారములలో నొక్కసారి యేనియు నాయకశక్తి చూపినట్లగపడదు; రాజకార్యములన్నియుం నతనితోఁగూడ ప్రజాపాలనము నడ్పుచుండిన అతని జ్యేష్ఠపుత్రుఁడగు నిమ్మడి దేవరాయల ముఖాంతరముగ నేజరుగుచుండినవి; కావున దేశమునందల అడ్డులేక జాతీయ జీవనము నిరాఘాటముగ సాగుచుండినది. కాని విజయరాయల యేలుబడియందు విశేషచరిత్రాంశము లెవ్వియుఁ సంభవింపలేదని యనుకొనరాదు. బహామనీ సుల్తానుతోడను, కళింగగజపతి తోడను రెండు యుద్ధములు జరిగినవి; కాని వాని ప్రశంస ఇచట పనికాదు; రెండు యుద్ధములును ఇమ్మడి దేవరాయల యాజమాన్యముక్రింద నడచుటచే, వాని విషయ మతని చరిత్రయందు వక్కాణించుట యుక్తము.

(సశేషము)



ప్రణయంలోని జాలిబాధ

# ప్రేమికుడి నిర్వేదము

కొత్తపల్లి లలిత

నాకింత కోపం వుందని తెలియదు. చిరాకుగా వుంది. నువ్వు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా భారంగా వుంటుంది. బాధతో కలిసిన ప్రేమ నీపైని నాది. నువ్వు నాకు కావాలి. కాని నీలో నన్ను వేధించి బాధించే గుణం వుంది. నిన్ను నేను పూర్తిగా అసహ్యించుకో గలిగితే ఆ ప్రేమ నశిస్తుంది. బాధ మిగులుతుంది. బాధను కలిగించే అన్నిటినీ త్యజించడానికి యత్నించేట్లు నిన్ను నేను వదల్చుకొంటాను. అబ్బా, ఇది సాధ్యమా! నేను నిన్ను నిజంగా ప్రేమిస్తున్నానా? లేకపోతే నువ్వంటే ఈ బెంగెందుకూ? నీకు అనారోగ్యంగా వుండటం, మనకి సుఖం లేకపోవటం అన్నీ కూడి నా మనస్సులో వికృత రూపాలుగా మారి ఇట్లు పైకి వస్తున్నాయి. నువ్వు బాధపడితే శారీరకంగా కాదు- మానసికంగా- నాకు కొంత హాయిగా వుంటుందేమో అని తోస్తుంది. దానికి కారణం నీకు నామీద ప్రేమ వుందో లేదో అనే అనుమానమేనా? నా మనస్సులో తోచిన కారణాలు పైకి చెప్తున్నాను. ఇదికాక అచేతనమనస్సులో ఇంకా ఏమి వున్నవో! ఏమిటో మళ్ళీ నువ్వు బాధపడ్తూంటే నాకు జాలివేస్తుంది ఎందుకూ? అది కేవలం ప్రేమవల్ల పుట్టిందా! లేక కేవలం జాలేనా? ప్రేమ అనుకోటం లేదు కదా జాలిని? నువ్వు శారీరకంగా నాకేమీ సుఖం ఇవ్వలేవు, మనస్తాపానికి కారణం అవుతున్నావు అనే నాలో జాలిని- కోపం ఆకారంగా పైకి- పుట్టించటమూ లేదు గదా?

నువ్వు నాకు చిన్న చిన్న బహుమానాలు ఇస్తుంటావు. పనిమంతితో కలిసి అరుబయట పడుకొంటే, తెల్లవారుజామున మంచు కురిసేటప్పుడు- చప్పుడు చెయ్యకుండా మెల్లిగా వచ్చి రగ్గు కప్పుతావు. ఇవన్నీ- అయ్యో నే నాతనికి ఏమీ ఇవ్వలేక పోతున్నానే అనే విచారం చేత చేసే చిన్న చిన్న పనులేనా? ప్రతి ఆడదీ కూడా హృదయంలో 'తల్లి' అన్నమాటే. ఆ మాతృత్వం మొగ్గలా వుంటుంది. సంతానం కలగడంతోటే వింతపరిమళంతో వికసిస్తుంది అది. ప్రియా ప్రియుల చేతలలో చాలా వరకూ లాలన పాలనలు ఇందుకే వుంటాయేమో! అంతకుపూర్వం నా హృదయ కఠిన భూభాగం క్రింద ప్రేమ ప్రవాహం వుందని తెలియదు. నీవు దానిలో మృదువైన భాగాన్ని స్పృశించినావు. అది

చిన్న పిల్లకాలువలా ఎడతెగకుండా ప్రవహిస్తూనేవుంది. ఇది మరింత బాధను కలిగిస్తోంది.

ఇచ్చి పుచ్చుకోడాలు లేకపోతే మానవులు దగ్గరగా రారు. ప్రపంచంలో ఎక్కడా సాధ్యం కానంత సన్నిహితంగా ఇచ్చి పుచ్చుకోవడం వుంటుంది కనుకనే ప్రేయసీ ప్రియులవద్ద ప్రేమ వుంటుంది. ఇది లేక పోతే వుంటుందా? అలా వుంటే ప్లేటోనిక్ లవ్ (Platonic Love) అవుతుందిగా? అక్కడ కూడా వస్తువు అలభ్యమైకాని, అసమంజసమై కాని వుండడం మూలాన్ని అది అభావంలో కల్పించుకునే మానసికావస్థ. వాళ్లు మాత్రం లభిస్తే దాన్ని కోరదం- దాంటే బియాట్రిస్ (Beatrice) లభిస్తే శాశ్వతంగా కోరడా - అప్పు డాతని సబ్లిమేట్ (sublimate) ప్రేమ కవిత్వ మార్గంలో ప్రవహించకుండా పోతుందా! పోదు- ఏమో.

ఇచ్చి పుచ్చుకోడం లేకపోతే ప్రేమ చిర స్థాయిగా వుండదా అంటే - వుంటుంది, ఉత్తమంగా చేయబడిన వాఙ్మయాల్లో! పోతే గివ్ అండ్ టేక్ వుంటే ప్రేమ వుంటుందా? వేశ్యల వద్ద అందరికీ ప్రేమ లభిస్తుందా? కావలసినప్పుడల్లా ఇచ్చిపుచ్చుకోడానికి సామాన్యార్థంలో- వీలున్న- అందరి భార్యా భర్తల మధ్యా-ప్రేమ వుందా?

ప్రేమ అంటే ఏమిటి? అహంతో కూడినదే. కాని అప్పుడే ఈర్ష్య బయలుదేరుతుంది. నిర్లిప్తుని వద్ద ప్రేమ వుండనే వుండదు. అంటే అందరూ ప్లేటోనిక్ ప్రేమికులు. నీకు ఈ ఆక-కావాలి అనేది కొద్దో గొప్పో వుంటుం దన్న మాటేగా. అయితే అది మారురూపం, ఉదాత్త స్థితిలో, ఎత్తడం మూలాని వాళ్లకి కాన్షస్ (conscious)గా వుండక పోవచ్చును. కొందరు తెలిసినా యడ్మిట్ (admit) చెయ్యక పోవచ్చును.

నువ్వు నన్ను ప్రేమిస్తున్నావో లేదో అనే అనుమానం చేతనే, నువ్వు మానసికంగా బాధ పడాలని నే కోరడం - ఆ బాధ నీకు నాపై ప్రేమ వుందని నాకు నొక్కి చెప్తూతుంటే నా కానందం. నువ్వు శారీరకంగా బాధ పడుతూంటే నా కుపయోగించవనే కోపం- నేను ఏమీ చేయ లేక పోవడం మూలాన్ని- జాలిగా మారి పైకి వచ్చింది. నిజమా?



ప్రపంచంలో వివిధ దేశాలలోని పట్టణాలను సందర్శిస్తూ, ఢిల్లీవచ్చిన అమెరికన్ టౌన్ పార్టీలకు రాజాజీ విందిచ్చిన సమయంలో తీసిన ఛాయాచిత్రం.




# ఈ శరీరాల మూలద్రవ్యం ఏమిటి?

రానిపూడి వెంకటాద్రి

మల్లెపువ్వు మనకి వాసన యిస్తున్నది. అంటే అది యేమో కోల్పోతున్నది. అది కోల్పోయిన వాసనని మన ముక్కులు చేరబట్టుతున్నవి. అన్నప్పుడు అది కోల్పోయేది పదార్థమేనా? లేక-పదార్థేతరమైన ఒక వాసనా? అంటే అది పదార్థం కాదంటానికి కేమీ వీల్లేదు. మొదట మనం చూచిన మల్లెనూ, తర్వాత కోసిన మల్లెనూ, ఆ తర్వాత ఆఘ్రాణించిన మల్లెనూ, ఆటుపిదప పారవేసిన మల్లెనూ యెప్పటికప్పుడు తేడా వుంటూనే వుంది. ఎప్పటికప్పుడే కొంత మార్పు వుంది. అలాగే విశ్వంలో సర్వమున్నూ. దేన్నో ఒకదాన్ని చేరబట్టకుండానో, కోల్పోకుండానో వుండే వస్తువేదీ యీ సృష్టిలోనే లేదు. వస్తువు కాని దేదీ అంతకుముందే లేదు. క్షణం క్రిందటి నాకూ యిప్పటినాకూకూడా తేడావుంది. ఒక్క నిమిషంలో సూర్యగోళం 24 కోట్ల టన్నుల పదార్థాన్ని ప్రదేశంలో వెదజల్లుతున్నది. పరిణామ బద్ధంకాని దేమైనా వుంటే అది ప్రపంచాతీతమే కాని ప్రపంచంలో సర్వమూ నిత్యమూ మారేదే.

అంచేత యిప్పుడు మనం చూస్తున్న మానవుడు అనంతకాలంనించీ యిలాగే లేడు. ఎన్నో అవతారాలెత్తి మారి నేడు మనం చూస్తున్న యీ మనిషిగా తయారయాడు. ఆదిమ మానవుడి జీవితాన్ని గురించి పరిశోధనలు చేసిన మానవ శాస్త్రజ్ఞులు (Anthropologists) ఆతన్ని గురించిన రహస్యం ఒకటి బయట పెట్టారు. దేవుడు అనే అభిప్రాయం చాలాకాలం క్రిందటి దాకా మానవుల కుండేది కాదట. ఇటీవల యేదో ఒకదశలో మాత్రమే దేవుడు మనుష్యలోకంలోకి దిగాడట. నిజానికి అతనికి దేవునిమీద మొదటినుంచీ అంటే మనిషిగా తయారైనప్పటి నుంచీ, నమ్మకమే వుంటే జాతీయ జీవనాన్ని యేర్పరచుకొని తద్వారా తన రక్షణకు పాటు పడేవాడు కాడు. సమాజాన్ని సృష్టించుకొనే వాడు కాదు. ఒంటరిగానే వుండేవాడు. అంటే దేవుడు నిన్న మొన్నటివాడే నన్నమాట. మానవుడు ఊబుసుపోకకో, లేక అసమర్థతచేతనో, కష్టపడి ఒక్క శిశువును, వైరిని, అష్టమ గర్భాన్ని పుట్టించుకొన్నాడు.

ఇలాగే మానుష శాస్త్రాన్ని (Anthropology) ఆధారంగా తీసుకొంటే మనం పశుదశలో వున్నట్టు స్పష్టమవుతుంది. చాలాకొద్ది కాలం క్రిందటి దాకా మనుషులకీ పశువులకీ ఆట్టేతేడా ఉండేదికాదు. ఎంతనాగరికులమైనా యీ నాటికీ మనలో కొన్ని పశుత్వ లక్షణాలు లేకపోలేదు. మనమంతా ఒక్కొక్కళ్ళం ఒకొక్క సందర్భంలో వాటిని ప్రకటిస్తూనే వుంటాం. ఇలా 'ఒకప్పుడు యీ మానవులంతా కోతులు' అని అన్నందుకే డార్విన్

మీద విరుచుకు పడ్డదీ లోకం. ఆమాటకు వస్తే మనం కోతులూ- కొండముచ్చుల దాకానే కాదు, అలాగే వెనక్కు నడిస్తే పురుగూ పుట్రల్లోకీ, అతిసూక్ష్మజీవుల్లోకీ, అర్థజీవుల్లోకీ, నిర్జీవుల్లోకీ - అంటే వ్యర్థనిర్జీవపదార్థంలోకీ మారతాం. అందువల్ల 'ధిక్కారమును సైతునా'? అంటే అందులో అర్థంలేదు. లాభం వుండదు. జీవపదార్థ ప్రవృత్తికీ, నిర్జీవ పదార్థ ప్రవృత్తికీ వున్న తేడాను ఒక ప్రక్కకు త్రోసివేస్తే జీవకోటి ప్రవృత్తిలోని యేకతను మనం అనేక రూపాల్లో రుజువు చేసుకోవచ్చు. కాబట్టి జీవద్రవ్యం యీ యేకతను ఎలా ప్రదర్శిస్తున్నదో మనం వివరించుకొందాం.

అన్ని జీవులకు వలెనే మనుష్యులు కూడా వాతావరణంలో వున్న ప్రాణవాయువును పీల్చుకొంటున్నారు. అలాగే దాన్ని బొగ్గు పులుసు వాయువుగా మార్చి వదులుతున్నారు.

మననోటిలో వూరే లాలాద్రవం ఆహారంతో కలిసి, రసాయనికమైన మార్పులు పొంది, ఆహార పదార్థంగా మారుతున్నది. కొన్ని రసాయనిక లక్షణాల్ని కోల్పోయి కొత్తవాటిని పొందుతున్నది.

బాక్టీరియా తియ్యటి పాలలో ప్రవేశించి వాటిని పుల్లటి పెరుగుగా మారుస్తున్నవి.

ఈస్ట్ ద్రాక్షరసంలో ప్రవేశించి దాన్ని సారాయంగా తయారుచేస్తున్నది. మన కల్లులో నడిచే క్రమం కూడా యింతే.

ఇలా చూసుకుంటూపోతే జీవులన్నిటిలోనూ ఒక రసాయనిక వృత్తి ప్రధానంగా ప్రత్యేకతగా కన్పిస్తుంది - అంటే జీవులన్నీ రసాయనికంగా పనిచేస్తుంటాయి సర్వదా. రసాయనిక వృత్తిలేక జీవంలేదు. పైగా ఏ టిష్యూలను తీసుకొన్నా వాటి పరిశోధన విషయంలో జీవసంయోగాన్ని గురించి కాదు మనం మాట్లాడేది. వాటిల్లో వుండేది రసాయనిక సంయోగమే. జీవుల్లోంచి యే వొక్క భాగం బయటికి తీసినా రసాయనిక సంయోగమే బయట పడేది. దానితోపాటు ప్రతి భాగమూ కొంత రసాయనిక వృత్తిని ప్రదర్శిస్తూనే వుంటుంది. జర్మన్ శాస్త్రజ్ఞుడు వోలర్ ప్రయోగశాలలో కృత్రిమంగా రసాయనికంగా మూత్రిక (urea) నిర్మాణం చేసినప్పుడే యీ విషయం విశదమైంది. దీన్నిబట్టి జీవులంతా- మానవులూ, పశువులూ, పక్షులూ సర్వదా యేవో రసాయనిక మార్పుల్ని సూచిస్తుంటాయనీ, అందువల్ల జీవులన్నీ రసాయనిక యంత్రాగారాల లాంటివనీ, జీవపదార్థ ప్రవృత్తిమాత్రమే కాక దాని నిర్మాణం కూడా రసాయనికమేననీ తేలుతుంది. వోలర్ మూత్రికను నిర్మాణం (synthesise) చేయడంవల్ల, శాస్త్రసంపత్తి పెరిగిననాడు తేలికగా జీవుల్ని నిర్మాణం చేసే యంత్రాల్నే సృష్టించవచ్చు ననే ధైర్యం వచ్చింది. ఇటువంటి నూతన అవకాశాలకీ, నూతన దృక్పథానికీ రావడంలో వోలర్ మనకెంతో సహాయం చేశాడనే చెప్పాలి.

మన శరీరాలన్నీ యెలా యంత్రాలుగా పని చేస్తున్నవో, యెలా రసాయనిక చర్యకు పాల్పడుతున్నవో తెలుసుకోటానికి మన దైనికజీవితమే సహాయం చేస్తుంది. రసాయనిక పదార్థాలు గాఢంగా మనమీద పనిచేయడం మనం చూస్తూనే వున్నాం. విషాలు పుచ్చుకొంటే వెంటనే చస్తున్నాం. అలాగే కొన్ని ఔషధాలు తీసుకొన్నప్పుడు వెంటనే మన శరీరం పనిచేసే విధానం మారుతున్నది. ఆస్పిరిన్ తీసుకొంటే వెంటనే జ్వరంవల్ల వచ్చిన వుష్ణాధిక్యత తగ్గుతున్నది. మెగ్నీజియం సల్ఫేట్ లాంటివి మలబద్ధకాన్ని తొలగించి విరేచనాన్ని కల్గిస్తున్నవి. క్లోరోఫారం లాంటివి మనకు స్పర్శజ్ఞానాన్ని తగ్గించి ఆపరేషన్ల సందర్భంలో బాధానివారణకి వుపయోగిస్తున్నవి. ఇలాగే యెన్నో రసాయనిక ద్రవ్యాలను మనం ఔషధాలుగా వాడుతుంటాం. వెంటనే అవి మన శరీరంమీద పనిచేసి కొన్ని మార్పుల్ని కల్గిస్తాయి. అంటే జీవద్రవ్యం పరిణామానికి— మార్పుకి గురి అవుతుంది. రసాయనిక ద్రవ్యం జీవిమీద బాగా పనిచేస్తుంది. కాబట్టి జీవద్రవ్యమంతా రసాయనిక ద్రవ్యంతో నిర్మాణం చేయబడింది.

ఐతే మనం జీవం రసాయనిక ద్రవ్యమంటే వైటలిస్టులు వొప్పుకోరు. కానీ, వారి ఆ వైఖరికి సబబైన కారణంలేదు. భూగోళం మొత్తంమీద కూడా మనకు కన్పిస్తున్న జీవపదార్థాలకీ, నిర్జీవ

పదార్థానికీ స్పష్టంగా వ్యక్తమవుతున్న వ్యత్యాసం ఒక టున్నది. మన మెరిగినంతలో, శాస్త్రజ్ఞుల పరీక్షకు అంది నంతలో, తత్వశాస్త్రజ్ఞుల వూహాకు దొరికినంతలో. జీవపదార్థమంతా ఒకే రూపాన్ని, రూపాద్వైతాన్ని ఆశ్రయించి వుంది. అంచేత జీవపదార్థంలో ప్రత్యేకంగా ఒక వైటల్ ఫోర్స్ (vital force) వున్నదనే విశ్వాసం నిరాధారం.అలాంటి ప్రత్యేకజీవశక్తిని గురించి భావించే అవకాశం యేమీ లేదు.

మన అవయవాల్లో, టిష్యూలలో ఒక్కొక్క దానికీ ఒక్కొక్క రకమైన మూలద్రవ్యాన్ని నిల్వచేసే స్వభావం వుంది. మొదట్లో కొన్నాళ్ల మన యెముకల్ని స్వేదనం(distil)చేసి అందులో వున్న భాస్వరాన్ని (Phosphorus) బయటకు తీసి దానితో అగ్గి పుల్లలు తయారుచేసేవారట. అలాగే మనం ఆహారపదార్థాలుగా వుపయోగించే క్రొవ్వు పదార్థాల్ని కూడా మన శరీరాలు నిల్వచేస్తున్నవి. ఒక్కొక్క మనిషి లావుకావడం, మరొకరు పొడుగు పెరగటం, వేరొకరు యెర్రగా వుండటం, యింకొకరు నవ నవ లాడుతూ వుండడం—ఇవన్నీ మన దేహ యంత్రాగారాల్లో వుత్పత్తిఅవుతున్న రసాయనిక సామగ్రినిబట్టీ, ఆయా యంత్రాగారాల్లోని యింజన్ల శక్తి(H. P.)లను బట్టీ, అందులో వేసే బొగ్గునుబట్టీ, యితర సరంజామానిబట్టీ, వాటి చాకిరీ విశ్రాంతుల్నిబట్టీ వుంటవి. జబ్బులూ అంతే, ఆరోగ్యమూ అంతే. అందువల్ల మనం మానవుల్లో, జీవుల్లో చూస్తున్న యే లక్షణం కానీ, దాన్ని ఫలితంగా యిచ్చే రసాయనికచర్య కారణంగా తప్పితే చెప్పుకోడానికి వీల్లేదు. జోసెఫ్ నీధం అన్నట్లు మానవుడి మనఃప్రవృత్తిని కూడా యాంత్రికంగా వివరించటానికెంతో వీలుంది. అంచేత జీవద్రవ్యమంతా రసాయనికంగా మరొకరకమైన నిర్మాణం కల్గివున్న నిర్జీవ ద్రవ్యమే.

మన రక్తం యెర్రగా వుంటానికి కారణం 'హీమ్' (Haem యినుమువుండే పదార్థం). ఈ హీమ్ రక్తగోళకం (Haemoglobin) లో ఒక భాగం. చెట్ల ఆకుల్లో వుండే పచ్చ రంగుకూడా హీమ్ సంబంధమైన రసాయనిక ద్రవ్యంతోనే వుంటుంది. దాన్నే మనం క్లోరోఫిల్ (Chlorophyll) లేక హరిత పత్రం అంటాం. ఇందులో యినుము బదులుగా మెగ్నీషియం వుంటుంది. ఇలా జీవుల్ని గురించి విశేషంగా పరిశోధన చేసినందువల్ల జీవ ద్రవ్యమంతా అతి సంక్లిష్టంగా సంయోగమై వున్న రసాయనిక ద్రవ్యంగా తేలుతుంది. 'ఈ శరీరాలన్నీ యే పదార్థంతో నిర్మాణం చేయబడి వున్నవి?' అన్న ప్రశ్న వచ్చినప్పుడు మన చుట్టూ మనం చూస్తున్న నిర్జీవజగత్తును నిర్మాణం చేస్తున్న మూలద్రవ్యాలే మనలో అతి సంక్లిష్టంగా సంయోగమై వేరుగా జీవజగత్తును కల్పిస్తున్నవి. ఎప్పుడూ, యెక్కడా వున్న ఆ 92 మూలద్రవ్యాల పరమాణువులే వేర్వేరు నిష్పత్తుల్లో ఒకదానితో మరొకటి కలిసినప్పుడు వేర్వేరు సంయోగద్రవ్యాల్ని యిస్తున్నవి. ఉదజని రెండుభాగాలు అమ్లజని ఒకభాగంతో కలిసినప్పుడు నీరవుతున్నది. ఉదజని ఒకభాగం అమ్లజని ఒకభాగంతో కలిసి హైడ్రోజన్ పెరాక్సైడ్‌ని యిస్తున్నది. బొగ్గు ఒకభాగం, అమ్లజని రెండుభాగాలు కలిసి బొగ్గు పులుసు వాయువు (carbon dioxide) యేర్పడుతున్నది. బొగ్గు, అమ్లజని సమభాగాల్లో కలిసినప్పుడు కర్బనైకామ్లజనిదం (carbon monoxide) అనే విషవాయువు తయారవుతున్నది. బొగ్గు, అమ్లజని, ఉదజని ఒక నిష్పత్తిలో కలిసినప్పుడు పంచదారను యిస్తున్నవి. మరొక నిష్పత్తిలో కలిసినప్పుడు మరొక పదార్థాన్ని యిస్తున్నవి. అందువల్ల సంయోగంలో మూలద్రవ్యాల నిష్పత్తినిబట్టి సంయోగ ద్రవ్యంయొక్క లక్షణాలు కూడా మారతాయి. నిష్పత్తి మారినప్పుడు బొత్తిగా పోలికలేని విభిన్నలక్షణాలుగల పదార్థాలే యేర్పడవచ్చు. ఐనప్పుడు జీవం రసాయనిక ద్రవ్యమంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. సంయోగ నిష్పత్తిలో విషమున్నది కాని వస్తుతః బొగ్గులో కాని, అమ్లజనిలో కాని లేదు. ఉంటే వస్తుగతం (immanent). ఆ మాటకు వస్తే విషం యేవిధంగా వస్తుగత మనుకోవ్వాలో అలాగే జీవాన్ని పదార్థగత మనుకోవడం అబ్రం కాదు. పైగా అది చాలా తెలివైనపని కూడా. అలాంటప్పుడు తమలో తాము నిత్యమూ రసాయనికపు మార్పులకుగురి అవుతూ,ఆ రసాయనిక

ృత్తిని నిరంతరాయంగా కొంతకాలం పాటు నడిపించుకొంటున్న జీవుల్ని రసాయనిక యంత్రాగారాలంటే బాధపడవలసిన పనిలేదు. ఒకప్పుడు దేహాన్ని గురించీ, ఆత్మను గురించీ యేవో ప్రశ్నలు వేసుకొని వాటికి మిస్టికల్ (mystical)గా సమాధానం చెప్పుకొన్న వేదాంతుల సమస్యలను కూడా నేటిశాస్త్రం ప్రాయోగిక ప్రమాణాల రీత్యా చక్కని సమాధానా లిస్తుంది.

రక్తగోళంలో వుండే యినుము పరమాణువు లోహస్థితి (ferrous state) లోనే వుంటుంది. అందువల్లనే అది ఆమ్లజనితో కలిసే లక్షణం కల్గివున్నది. రక్తగోళకం చేసే పనుల్లో అది ఆమ్లజనితో కలవడమే చాలా ముఖ్యమైనది. ఈ దేహయంత్రం ఆడేటప్పుడు శ్రమచేసి, ఆమ్లజని ఆకలితో అల్లాడుతూ, కండరాల్లో మెదడులో వుండే టిస్యూలు మన వూపిరితిత్తుల్లోకి గాలి పోయినప్పుడు అందులోని ఆమ్లజని అణువుల్ని (molecules) తీసుకొంటవి. ఇది రక్తం ద్వారా జరుగుతుంది. రక్తం కూడా నీటిలాగనే వుంటే అది నూటికి 0.7 ml. ఆమ్లజనిని తీసుకొనేది. కాని అందులో రక్తగోళకం వున్న కారణంగా నూటికి 20 ml. ఆమ్లజనిని తీసుకొంటుంది. ఏతే యే పరిస్థితుల్లో కూడా రక్తంలోని హీమ్ లో ఉండే యినుము లోహస్థితిని దాటిపోదు. అలా దాటి లోహి కామ్ల జనిదం (Ferric oxide) గా మారితే యిక అది ఆమ్లజనిని తీసుకోలేని స్థితికి చేరుకొంటుంది. అప్పుడు దాన్ని మితరక్తగోళకం (Methaemoglobin) అంటాము. ఇది యింతకుముందు రక్తగోళకం ప్రదర్శిస్తున్నటువంటి రసాయనిక లక్షణాల్నీ, మార్పునీ ప్రదర్శించదు. శ్వాసప్రవృత్తి పూర్తిగా ఆగిపోతుంది.

రక్తగోళకం ఒక్క ఆమ్లజనితోనే కాక యితర వాయువులతో కూడా కలుస్తుంది. ముఖ్యంగా కర్బనైకామ్ల జనిదంతో చాలా వేగంగా కలుస్తుంది—రెండువందల రెట్లు తీసుకొంటుంది. అందువల్లనే అది తీసుకొన్నప్పుడు వెంటనే దేహమంతా విషపూరిత మవుతుంది. రక్తగోళకం కర్బనైకామ్లజనిదంతో కలిసినప్పుడు తన లక్షణాల్ని ద్వితీయంగా తీసుకవస్తుంది. ప్రధానపాత్ర కర్బనైకామ్లజనిదే.

ఈ విషయాన్నే వార్‌బర్గ్ అనే శాస్త్రజ్ఞుడు సూక్ష్మజీవుల విషయంలో పరిశోధించిచూశాడు. ఈస్ట్ లాంటి సూక్ష్మజీవులు ఆమ్లజనిని తీసుకొనేటప్పుడు ఆ ఆమ్లజని వాతావరణంలో కొంచెంగా కర్బనైకామ్లజనిదం కలిపితే అవి గాలిని పీల్చడమే మానివేశాయి. అందుచేత రసాయనికంగా రక్తగోళంలో జరిగే మార్పుకీ, యీస్టులో జరిగే మార్పుకీ సారూప్యాన్ని గమనించి యీస్ట్ జీవకణాలు (yeast cells) కూడా యినుము, పోర్ఫిరిన్ (porphyrin) సంయోగాలుగా అతను గుర్తించాడు. (హీమ్ ని స్ఫటికీకరణం చేస్తే అందు ఒక యినుము పరమాణువు వుంటుంది. మిగతాది బొగ్గు-నత్రజని కలగాపులగంగా పోర్ఫిరిన్ లక్షణాలతో వుంటుంది. హీమ్‌తో గోళకం కలిసినప్పుడు హీమోగ్లోబిన్ యేర్పడుతుంది.)

వృక్షజాతుల ఆకుల్లోవుండే క్లోరోఫిల్ కూడా విడతీసి పరీక్షించబడింది. ఆపరీక్షలో అదికూడా ప్రొటీన్ అనీ, పోర్ఫిరిన్‌లో వుండే హీమ్ వంటిదేననీ తేలింది. అయితే హీమ్‌లో యినుము వుంటుంది. క్లోరోఫిల్ ప్రొటీనులో మెగ్నీషియం వుంటుంది. చెట్లఆకులు కిరణ జన్య సంయోగక్రియ (Photosynthesis) జరపడం దీనివల్లనే.

ఈ విధంగా యెంతదూరం వెళ్లిచూచినా, విశ్వంలోని జీవపదార్థమంతటికీ పోర్ఫిరిన్‌లు సహజ లక్షణంగా కన్పిస్తవి. రక్తగోళకం మానవుని రక్తంలోనే కాక పురుగు పుట్రల్లో కూడా కన్పిస్తున్నది. చివరకు చెట్ల వేళ్ళమీద (వేరుశనగ వగైరా మొక్కలకుండే) బుడుపుల (nodules) (అవి గాలిలోని నత్రజనిని, అమ్మోనియానూ తీసుకొని, నైట్రేట్లుగా మార్చి మొక్కకు ఆహారాన్ని సరఫరా చేస్తవి.) లో కూడా యిది వుంటుంది. వేర్వేరు జీవరాసుల్లోని (species) రక్త గోళకం వేర్వేరు విధాలుగా వుంటుంది. కాని, వీటన్నిటిలోనూ వున్న గోళకాలలో ఒక లక్షణం సమానంగా వుంది. ఆమ్లజని తీసుకొనే రంగు (రక్తగోళకం) కోసం హీమ్ కలపడం. మిగతా ప్రొటీనులు యీ పనిచెయ్యవు. హీమ్‌తో కలవవు.

హీమ్ యెప్పుడూ కానీ తనంతట తాను పని చెయ్యలేదు. ప్రొటీనుల (Casein, lactalbumin వగైరా) తో కలిసినా, గుడ్డు తెల్లసొన

(ovalbumin) తో కలిసినా, బ్లడ్ ప్లాస్మా (blood plasma) తో కలిసినా, దానిచర్య బయటపడదు. గోళకాలతో కలిసి వున్నప్పుడే అది ఆమ్లజనితో సంయోగం చెంద గల్గుతుంది. రక్తగోళకంలోని లోహసాయనము (Ferrous iron), లోహికాయసము (Ferric iron) గా ఆమ్లజనీకరణ చెందితే అపైని అది ఆమ్లజనిని తీసుకోలేదనీ, అందాకా ఆమ్లజనిని మోసుక వెళ్లుతూవుండే కపిశ-మితరక్తగోళకం (brown methaemoglobin) తర్వాత అపనిని చేయలేదనీ, ఇతర దైహిక ధర్మాల్ని నెరవేర్చలేదనీ యింతకుముందే తెలుసుకొన్నాం.

ప్రోటోప్లాజంలో చాలాభాగం ప్రోటీనులే. వీటిలో కొన్ని రక్తగోళకంలోవలె హీమ్‌తో వుంటవి. మామూలుగా ప్రోటీనులన్నీ భౌతిక వాతావరణ పరిస్థితుల మార్పులకే తలక్రిందులవుతుంటవి. ప్రోటీనులన్నీ రసాయనికంగా భౌతికంగా ఒకే రకంగా వుంటవి. వాటిలో వున్న వేర్వేరు రకాల్ని తెలుసుకోవాలంటే వాటి పరీక్ష పారిమాణికంగా వుండాలి. స్వెడ్‌బర్గ్ యెక్కోన్ని గొర్రెలవిషయంలో పరిశోధించి వాటి రక్తంలో వుండే రక్తగోళకంయొక్క అణుభారం 68,000 (ఉదజని పరమాణువుకు 68.000 రెట్లు) అని తేల్చాడు. ఇలాగే వేర్వేరు జీవరాసుల్లో పరిశోధించి చూచినందువల్ల వాటి అణుభారాలు మారినట్లు తేలింది.

అసలు ప్రోటీను అణువుల్ని ఆమ్లాలతోటీ, యెన్‌జైములతోటీ విడగొట్టినప్పుడు అవి జీవామ్లాలు (animo - acids) యిస్తుంది. జీవామ్లంలో ఒక ఆమ్లమూ ఒక భస్మమూ (base) వుంటాయి. వీటి రెంటి కలయికతో వీటి రెండింటి లక్షణాలతోపాటు మరొక నూతన లక్షణంకూడా వస్తుంది సంయోగానికి. ఇలా వచ్చిన మూడో లక్షణాన్ని మూలకం (radical) అంటాం. పై జీవామ్లాలు ఏదో ఒక ప్రత్యేక పద్ధతి ప్రకారం కలిసినప్పుడు మళ్ళీ కొత్త లక్షణాలు ప్రదర్శించే ప్రోటీను బయట పడుతున్నది.

నేటి దాకా పరీక్ష చేసిన వైరసులూ, సూక్ష్మజీవనాశనులూ న్యూక్లియో ప్రోటీన్లుగా తేలాయి. అంటే న్యూక్లిక్ ఆమ్లంతో కలిసిన ప్రోటీనులన్న మాట). అసలు జీవానికి భౌతికపు పునాది అయిన ప్రోటీనుల్లో వ్యతిరేకతల సంయోగం (union of opposites) వల్లనే నూతనలక్షణం నిష్పన్నమవుతున్నది. అందువల్ల జీవాన్ని వ్యతిరేకతల సంయోగం కంటె వేరుగా అర్థంచేసుకోటానికి వీల్లేదు. జీవి ఒకచోట ప్రారక పడి వుండేది కాదు. అదొక నిత్యప్రవృత్తి. ప్రతి జీవిలోను దాని వృత్తివిధానంలో విశేషం వుంటుంది. ఇలాంటి అనంత విభిన్నతలోనూ ఏకత వుంటుంది. విశ్వంలో వున్న జీవకోటి అంతా అనుపలనం (Anabolism: సంశ్లిష్ట జీవసంయోగద్రవ్యాన్ని నిర్మాణం చేయడం) ప్రతిపలన క్షయం (Kalabolism: సంశ్లిష్ట జీవసంయోగ ద్రవ్యాన్ని విచ్ఛిన్నం చేయడం) ప్రధానలక్షణాలుగా కల్గి వున్నవి. నిత్యజీవోత్పత్తి క్షయాలు యిందుకు నిదర్శనం.

మనం ముఖ్యంగా దృష్టిలో వుంచుకోవలసిన విషయాలు మూడు: స్ఫురీకరణం (Phosphorylation), ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, కిరణజన్య సంయోగక్రియ. ఈ మూటినీ విశదీకరించుకొన్నందువల్ల జీవి యెన్నెన్నో అల్లకల్లోలాల్నీ, అవాంతరాల్నీ దాటుతూ, సమానాధికృత రసాయనిక యంత్రాగారంలాగా యెదురీదుతూ, ఇతోధికంగా తనను తాను పునరుత్పత్తీ, అధికోత్పత్తి చేసుకొంటున్నదని తేలుతుంది. జీవద్రవ్యానికున్న యీ స్వభావానికంతటికీ కారణం స్ఫురీకరణమే. స్ఫురీకరణ మంటే జీవాణువుకి స్ఫురితమూలకాన్ని (Phosphate radical) కలిపే క్రమం.

జీవించివున్న ప్రతి జీవకణంలోనూ అడినాసిన్ త్రిస్ఫురితము (Adenosine triphosphate—దీన్ని యికమీద ఎ. టి. పి. అందాము) వుంటుంది. ఇందులో రసాయనిక శక్తి నిల్వ వుంటుంది. ఈ శక్తి ప్రసారంతో జీవలక్షణాన్ని ప్రదర్శించేటప్పుడు ఒక స్ఫురితం గ్రూపు నష్టపడితే అప్పుడది ద్విస్ఫురితం (Adenosine diphosphate : ఇకమీద ఎ. డి. పి. అందాం) అవుతుంది. మరొక స్ఫురితం గ్రూపును యిస్తే అప్పుడు ఏకస్ఫురితం (Adenosine monophosphate or adenylic acid : యికమీద

ఎ. ఎ. అందాం) అవుతుంది. అంటే యిప్పటికి దానిరసాయనికశక్తి అడుగంటుతుంది. అప్పుడు మళ్ళీ నింపవలసివస్తుంది. ఆమ్లజనీకరణంతో పాటు పునః స్ఫురీకరణాన్ని జతచేస్తే యిది జరుగుతుంది. అంటే నిర్జీవపదార్థంలో వున్న స్ఫురికం ఎ. ఎ. తో, లేక ఎ. డి. పి. తో కలిసి ఎ. టి. పి. గా మారుతుంది.

ఆమ్లజనిని లోపలకు తీసుకొనే ఏ జీవకణంలో కానీ—కండరాల్లో కానీ, వృక్కాల(kidneys) లో కానీ, యెప్పుడూ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎ. టి. పి. పునర్నిర్మాణంతో జతగానే జరుగుతవి. అసలు కండరాల కదలికకి వంటచెరకు లాంటిది ఎ. టి. పి.- కండరంలోని సంకోచక ప్రోటీను ఎ. టి పి. సమక్షంలోనే తన ఆకారాన్ని మార్చుకొంటుంది. అప్పుడు ఎ. టి. పి. ఎ. డి. పి.గా మారుతుంది. ఇలా జీవచిహ్నమైన కదలికని అచ్చంగా రసాయనిక ద్రవ్యాలతోనే పరిశోధన నాళికలో చూపవచ్చు. అన్ని రకాల జీవనిర్మాణంలోనూ ఎ.టి.పి. యిట్లాటికి కావలసిన రసాయనిక శక్తికి మూలము. సూక్ష్మ జీవుల్నించి మనుషులదాకా జీవానికి ఆధారం స్ఫురీకరణ మనడానికి అవరోధాలేమీ కన్పడడం లేదు.

ఈ స్ఫురీకరణ యంత్రాన్ని నడపటానికి కావలసిన శక్తిని ఆమ్లజనీకరణ (oxidation) సప్లయిచేస్తుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో మన జీవకణం చాలా జాగ్రత్తగా వుంటుంది. మెట్లుమెట్లుగా సైటోక్రోమ్‌దాకా ఉదజనిని మారుస్తుంది. అక్కడ అది ఆమ్లజనితో కలసి నీరవుతుంది. ఈ క్రమంలో బారుకి పునఃస్ఫురీకరణం జరుగుతూనే వుంటుంది. ఎక్కువగా ఎ.టి.పి. వుత్పత్తి అవుతుంది. ఐతే నిజానికి యీ క్రమంలో మారుతూవచ్చేది ఉదజని పరమాణువులు కాదు—యెలక్ట్రానులు. అందువల్లనే జీవపదార్థమంతా విద్యుత్తుతోనే నడుస్తుంది. దానిని విద్యుత్కణాల ప్రవాహమే అనాలి.



“[illegible]” చిత్రంలో [illegible]

# చంద్రుడే లేకపోతే-

లత్మి

చంద్రుడు నాకంటే ఇరవై రోజులు చిన్న వయస్సులో. అయితే చిలిపి తనంలో పెద్ద. చంద్రుడెవరైందీ చెప్ప మరిచాను. అతను నా మేనత్తల్లో చిన్న మేనత్త కొడుకుల్లో చిన్న కొడుకు.

చంద్రుడు చిన్న వయస్సులోనే తండ్రిని కోల్పోయాడు. రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగా పని చేశాడట మా మామ. కాని మా నాన్న ప్లీడరుగా విశేషప్రతిష్ఠ పొందినవాడు. నిరంతరాయంగా మునిసిపల్ చేర్మనుగా ఏన్నాళ్లో ఉండేవాడు. మా ఊరిలో జరిగే ప్రతివిషయం అతని జోక్యం లేకుండా జరిగినట్టు లేదు. ఏసంస్థా అతని చేయిలేనిదీ నడిచినట్టు లేదు. దానికీ కొంత కారణం ఉంది. మా పెదతండ్రికూడా గొప్ప ప్లీడరే. ఆయన మూలంగానే మా ఊరొక ఊరైందట. చదువుకు, నాగరికతకు దూరమైన మా ఊరి పురోగమనానికి ఆ రోజుల్లో ఆయనే పునాదిరాయి వేశాడు. అన్నదమ్ములిద్దరూ ఊరికి పేరు చేకూర్చడంలో చేదోడు వాదోడుగా పాటుబడ్డారు. మా పెదతండ్రి శాంతమూర్తి. తండ్రి ఊళ్ళో పార్టీలకు నాయకుడు.

సహజంగానే మా అమ్మకు, మా పెదతండ్రి భార్యకు సరిపడేది కాదు. పెదతండ్రికి సంతానం లేని కారణాన అతను మొదటినుంచీ చంద్రుడి తండ్రినీ, కుటుంబాన్నీ తన ఇంటిలోనే ఉండమన్నాడు. ఎంతైనా చంద్రుని తల్లి తన చిన్ని చెల్లెలుకాదా మరి. తాము పొందిన హోదానూ, చంద్రుని తండ్రి చేసే చిన్న ఉద్యోగానికి తాహతులో తేడా ఉండడంబట్టి నాతండ్రీ, పెదతండ్రీ (అవును: ముఖ్యంగా మా నాన్న) లోకువగా చూసేవారు, తమ బావమరిదిని. మా అమ్మకు మరీ వ్యతిరేకం వాళ్ళంటే— తనతోటి కోడలు వాళ్ళని దగ్గరతీయడ మేమిటని. మా ఇల్లూ, మా పెదతండ్రి ఇల్లూ ఎదురెదురే.

ఈ పరిస్థితుల్లో చంద్రుని తండ్రి అస్తమించాడు - భార్యను, పెద్ద కుటుంబాన్ని వదిలి. చంద్రుని కప్పుడు నాలుగేళ్ళట. మా పెదతండ్రే వాళ్ళకండగా లేకపోతే పాపం వీధిపాలు కావలిసినవారు.

తండ్రి జ్ఞాపకమే లేదంటాడు చంద్రుడు. తన పెద్దమామ చేతుల్లో పెరిగాడు. నేనూ అతనూ ఇంచుమించు ఒకే వయస్సని చెప్పానుగా- (నేనే పెద్దదాన్ని - ఇరవై రోజులు, ఎన్నిసార్లు చెప్పను, ఈసంగతి!) ఒకటిగా ఆడుకునేవాళ్ళము అమ్మ చూడనప్పుడు. సాయంకాలం నేను అమ్మతో కారులో కూర్చొని సినిమాకో లేక షికారుకో వెళ్ళబోతుంటే "శ్యామా, నేనూ రానా?" అని మెల్లిగా సన్నడిగేవాడు. "రా రా, త్వరగా - కారుపోతూంది" అని నే నరవడం, మా అమ్మ "అబ్బే, నీ బట్టలు చిరిగి ఉన్నాయి. మంచివి వేసుకొనిరా!" అని వెనక్కు తరమడం, వాడు నిజమే అనుకొని బట్టలు మార్చుకో డానికి వెళ్ళడం, మే మింతలో కదిలి వెళ్ళడం జరిగేది. అది ఒక సంఘటన, అట్లాటివి వెయ్యి.

ఆ లేత మనస్సులో చంద్రుడికి తుఫాను రేగేది - తనూ కారులో ఎందుకు షికార్లు వెళ్ళకూడదు అని. తన స్థితి అర్థంచేసుకొనే వయస్సూ కాదతడికి.

కాల మిట్లా గడిచింది. చంద్రుడిమనస్సు చిన్నప్పటినుంచీ మా అమ్మ చేసే పనులమీద నిశ్శబ్దమైన ఆగ్రహానికి తావిచ్చింది. మా అమ్మంటే ఎంతకోపం అతడికి. మా అమ్మ ఎదురుగా నన్నుకూడా శత్రుసమితిలోనివానిగానే చూసేవాడు. కానీ ఆదేదో చెప్పలేని కరుణ, ప్రేమ నేనంటే అతడిలో దాగివుండేవి. ఒంటరిగా కలిసినప్పుడు నాతో ఎంతో కలిసి మెలిసి ఉండేవాడు. నేనూ అంతే. మా అమ్మ ఎదురుగానైతే అతణ్ణి తగ్గించి మాట్లాడే దాన్ని.

చదువులో చంద్రుడు త్వరగా పైకివచ్చాడు. చదువంతా స్కాలరుషిప్పులతో పూర్తిచేస్తూ

వచ్చాడు. ఇలా వుండగా మా నాన్న పోయారు. కాని ఇంకా మా అమ్మకు వాళ్ళ కుటుంబం అంటే కంటకమే. నేను మా అమ్మకు చిన్నకూతురినే. మా అన్నలంతా వుద్యోగాలు చేస్తున్నారు. నా కప్పుడు పధ్నాలుగు సంవత్సరా లనుకుంటా. అయిదో ఫారం చదువుతుండే దాన్ని.

చంద్రుడైతే అప్పుడే స్కూలుఫైనలు ముగించి, గవర్నమెంటు స్కాలరుషిప్పుతో, కాలేజీకి వెళ్లాడు. నాన్న పోయాక నాకు చదువులో పట్టుదల తగ్గింది. స్కూలుఫైనలు పరీక్ష ఒక పర్యాయం చూసి మానుకున్నాను. మా అమ్మ ఇంకా గతించిన భర్త హోదాను జ్ఞాపకం తెచ్చుకొని వింత ఆలోచనలు చేసేది. (అవి ఇప్పుడు వింతగా తోస్తాయి.) నా మేనత్తల కొడుకులు చాలామంది వున్నా, వాళ్లంతా తనహోదాకు తక్కువని మా అమ్మ అనుకునేది. నా వివాహం ఏ ఐ. సి. యస్. తోనో జరపా లనుకునేది. నా మేనత్తలుకూడా మా అమ్మ వెంకితనం చిన్నప్పటినుంచీ రుచి చూసినవారే. తమ కొడుకులకు వీలైన సంబంధాలే జరుపుతున్నారు.

ఇక ఐ సి.యస్. పరీక్షలే రద్దు చేస్తారనేటప్పటికి నావయస్సు పద్ధెనిమిది యేళ్ళు. మా అమ్మ ఏ ఇంజనీరునో లేక డాక్టరునో వెదక నారంభించింది. చంద్రుడా వేళకి మామూలుగా మా ఊరిలోనే వున్నాడు. తన ఆనర్సు కోర్సులో చివరి సంవత్సరం బాకీ ఉంది. పట్నం వెళ్ళి నాజూకు అంటే ఏమిటో అర్థం చేసుకున్నాడు చంద్రుడు. కాని తను ఆర్థికంగా యిబ్బందిలో వుండబట్టి అనవసర వేషాలకు తావివ్వ లేదు. అయినా నాజూకు భావాలు, పద్ధెనిమిదేండ్ల వయస్సూ, అతనికొక ఆకర్షణ నిచ్చాయి. మా యింటికి తరచు వచ్చేవాడు కాదు. అసలే మా అమ్మంటే మనస్సులో కోపం. ఆపైన నాతో మాట్లాడాలంటే సిగ్గు (లోపల ఎంత కుతూహల మున్నా). ఎదురింటి వసారాలో వుండి వూరికే మా యింటివైపు చూసేవాడు. పూర్తిగా అర్థరహితమైన చూపనలేను. మా అమ్మ పిలిస్తే వచ్చి మాట్లాడేవాడు. అప్పుడే నాతో కూడా ఏదో మితభాషణం.

మరో నాలుగు సంవత్సరాలు గడిచాయి. చంద్రుడు ఆనర్సు పూర్తిచేశాడు. కాంపిటీటివ్ పరీక్షలో వుత్తీర్ణుడై ఆఫీసరు హోదా పొందాడు. కాని మా యింటి గడపలో అడుగు పెడితే ఒట్టు.

ఇక నా గతి. వయస్సు ఇరవై రెండైంది. ఏ సంబంధమూ మా అమ్మకు నచ్చలేదు. తక్కువలోనే వుంటూ వచ్చిన చంద్రుడే ఆఫీసరైతే నా శ్యామను మామూలు వాళ్ళకు ఎట్లా ఇవ్వను! అంటుంది.

చంద్రుడు సెలవుమీద వూరికి వచ్చినప్పుడు ఒకసారి వాళ్ళింటిలో వింతగా కలిశాం. "ఏమి శ్యామా, చిక్కినట్లున్నావు! ఎప్పటి సంతోషం లేదేం!" అని ఎంతో ఆప్యాయంతో అడిగాడు. అతనలాగ నన్ను ఒంటరిగా కలుసుకొని అడగడంతో, నాకు చిన్నప్పుడు అతనితో ఆడుకున్న ఆటలు, పాటలు ఒక్కసారిగా రివ్వున జ్ఞాపకం వచ్చాయి. అనుకోకుండా కంటినిండా నీరు గలగల నిండింది. నా కష్టం అర్థంచేసుకున్నాడు చంద్రుడు. చిన్నతనంలో లాగానే దగ్గరికి తీసుకొని ఓదార్చ ప్రయత్నించాడు...

చంద్రుడి ఒడినుంచి తిన్నగా ఇంటిదారి తీశాను. కాని మనస్సు పలువిధాల పరుగెత్తింది. "చంద్రుణ్ణి వివాహమాడితే...మరి నా కంటే చిన్నవాడే......అందులో అమ్మకు వాడంటే అసలు గిట్టదు."

నా మనస్సులోని వింత కోర్కె చంద్రుని కెట్లా తెలిసిందో- ఉన్నట్టుండి వచ్చి అమ్మను అడిగాడు:

"శ్యామను నేను పెండ్లి చేసుకుంటాను' అని.

అతడు ఇప్పుడు ఆఫీసరనో (మా అమ్మ ఎదురు చూసిందికూడా అట్లాటి హోదా కోసమేగా)—లేక నా వయస్సు మీరుతోందనో- ఒప్పుకుంది. అతడంటే ఉండే వెనకటి యీసడింపు మరిచింది. తను నా కంటే చిన్న అన్నది కూడా మరిచింది.

ఎదురెదురిండ్లు ఒకటైనాయి. చిన్నప్పటి ఆటల పరిచయంవల్ల కాబోలు, యింకా అతన్ని చంద్రుడనే పిలుస్తాను.

కథానిక

# మించిపోయిన తరుణం

'రాజా'

ఆఫీసునుండి యింటికి వచ్చేసరికి, పంజాబు మెయిల్లాగ పరుగెత్తుకొంటూ చెప్పవచ్చాడు బాచిగాడు. ఆవేళ ఆరోతారీకని, ఆ వేళటివరకూ జీతాలు రాకపోవడం మూలాన వాళ్ల నాన్న చాలా చిరాకుగా ఉన్నాడని ఆ పదేండ్ల కుర్రవాడికి ఏం తెలుసు? బాకీదార్లు చెప్పినా నమ్మరుకదా, కర్మం. 'డబ్బు చేతికొచ్చినపుడుకూడ అలా యిదవుతారే' అని సతాయిస్తారు. తెల్లారి లేవగానే పెరుగావిడతో అయింది ఒక తగవు. 'రేపటి' నుంచి యిక పెరుగే పొయ్యనంది. మాట పట్టింపుకోసం 'నువ్వు రాకపోతే నీతాత యింకొకర్తు' అని అన్నాడే కాని, తీరా చేసి 'రేపు' పెరుగు ముసలమ్మ రాకపోతే చెయ్యబోతున్నదేమిటో తనకే తెలియదు. ఆఫీసుకెళ్తుంటే సాహుకారు కనిపించి "ఈ నెలలో డబ్బుకి కొంచెం ఇబ్బిగా ఉందండీ, ఎలాగైనా పూర్తిగా చూడాలిసుమండీ" అంటూ హూటుగా హెచ్చరించాడు. "జీతాలు రాగానే బాకీలు తీర్చకపోతే రూపాయలు తింటామేమిటయ్యా" అన్నాడు, పెరుగు ముసలమ్మలాగే చిందులు త్రొక్కుతాడేమో అన్న భయంవల్ల చిన్న విసుపు నవ్వు నవ్వుతో—ఇలాగే ఒకరేమిటి, అయ్యరు లగాయితు బీడీల కొట్టుపెట్టిన శివయ్యవరకూ ఎవరికి తోచినట్టు వారు హెచ్చరించి వదిలేశారు. రాబోయే జీతానికి అప్పుడే 'బడ్జట్' తయారుచేసేసి, ఒక పదిరూపాయలు శ్రావణ శుక్రవారంనాటి దేవతార్చనకి కేటాయించేసింది ఇంటావిడ. వ్యయపట్టికని ఎలా సవరించడమా అని తల్లక్రిందుగా తపస్సు చేస్తున్నాడు — దక్కన్ సిగరెట్ పొగ శ్రావణమాస మేఘాల్లాగ గాలిలోకి వదుల్తూ. ఆర్థిక దుస్థితితో తల బ్రద్దలు కొట్టుకొంటున్న సుబ్బారావుకి అటువంటి వార్త ఆక్షణములో చెవిబడిందంటే అతనికి ఎంత బాధకలిగినా కలుగుతుంది.

ఐంతెలాగ గెంతుకొంటూ వచ్చిన బాచిగాణ్ణి రెక్కపట్టుకొని ఆపి, "ఏమిటిరా ఈ హడావుడి!" అన్నాడు సుబ్బారావు ప్రశ్నార్థకంగా.

"కాంగ్రెసులో పని చేసినందుకు ఎకరాలు ఇచ్చారుట-" హడావుడిగా జవాబిచ్చాడు.

అంత ఆలోచన మధ్యలో పానకంలో పుడకలాగ తయారయాడేమిటని నిజానికి చాలా చిరాకేసింది సుబ్బారావుకి బాచిగాడిమీద.

"ఎవరికిరా, ఏం ఎకరాలు?" అన్నాడు వింతగా.

"కిష్టాయ్ నాన్నకే, నాన్నా, ఎకరాలే, యిచ్చారుట-వాళ్ళనాన్నకి ఇప్పుడు బోలెడంత డబ్బు ఉందిట - వాళ్ళ కిష్టాయే చెప్పాడు." అన్నాడు, అమాయకంగా తండ్రి కళ్ళలోకి చూస్తూ—

కిష్టాయ్ నాన్న సీతారామయ్య, సుబ్బారావు యిద్దరూ ఒక ఊళ్ళోనే పుట్టారు; ఒక చోటే పెరిగారు. చిన్నప్పటినుంచీకూడా పెద్ద స్నేహితులు. చదువులో అంతటి మొద్దు ఇక ఈ భూమిమీద పుట్టి పెరగదని రాగి పట్టామీద వ్రాసియిస్తాము అంటుండేవారు మేష్టర్లు అందరూ ఆ సీతారామయ్యగురించి. ప్రతీక్లాసూ మూడేళ్లు తక్కువగాకుండా చదివి మేష్టర్ల దయవల్ల ఏదో గెంటుకొస్తుండేవాడు.

తను ఎలా చదివేవాడు? ఎప్పుడూ స్కూలుకి ఫస్టే కాని మరొకటి ఎప్పుడూ లేదు. స్కూలు స్కూలు యావత్తూ, అంటే 'ఫ్యాన్స్' సమేతం, కూడా తన చదువు విషయంలో తనని ఎంత పొగడేవారూ!

కాని ఈ విషయాన్ని వాడు ఎప్పుడూ ఒప్పుకొనేవాడు కాదు. నువ్వు 'బుక్ వర్మ్' (పుస్తకాన్ని చెదలాగ పట్టేసినవాడు) పురా అంటూనే వేళాకోళం ఆడేవాడు. కాని ఎప్పటి

నైనా బాగా చదివే తనే బాగుపడాల్సిందే కాని ఆ పెద్దబ్బాయి సీతారామయ్య ఎందుకు పనికివస్తాడో చూద్దాము అన్నట్టుగా మొగం పెట్టి ఊరుకొనేవాడు సుబ్బారావు.

తర్వాత తర్వాత చదవలేక మానివేసి, ఊరివెంట తిరుగుతూండేవాడు సీతారామయ్య. ఈలోగా రాజకీయాలు బాగా అత్తుకొన్నాయి.

మీటింగులు, ఉపన్యాసాలు, సత్యాగ్రహాలు అంటుండేవాడు. సీతారామయ్య నాన్నకి మాత్రం వాడి వాలకమేమీ నచ్చలేదు. పిమన్నా ఉద్యోగం చేస్తాడా అంటే చదువు లేదాయె. పోనీ కృష్ణా, రామా అనుకొంటూ ఏ వ్యవసాయం అయినా చేస్తాడా అంటే అదీ చేతకాదాయె. నేర్చుకొందామనే కుతూహలం కూడా లేదు. పైగా ఉన్న రెండెకరాలు మార్చుకు తింటూ దేశం కోసం తగలేస్తాను అంటుంటే వాళ్ళ నాన్నకి లోపల లోపల చాలా బాధగానే ఉండేది. వాడి కర్మం, బికారి అయే యోగం ఉంటే ఎవరు తప్పించగలరు అని ఊరుకొనేవాడు.

మొట్టమొదటినించీ వాళ్ళనాన్న సుబ్బారావు విషయంలో అంత శ్రద్ధతీసికొని ఉండక పోతే, సుబ్బారావుకూడా సీతారామయ్యతో బాటే ఒక సుప్రసిద్ధ దేశభక్తుడు కావలసిందే. ఇదే ఈమధ్య సీతారామయ్యని చూస్తున్న సుబ్బారావు అప్పుడప్పుడు అనుకొంటూంటాడు. కాని అప్పట్లో సుబ్బారావు ఉద్దేశాలే వేరుగా ఉండేవి. తాను పెద్ద ఉద్యోగంచేస్తూ ఠీవిగా గడుపుతుంటే, సీతారామయ్య ఏమీ లేకుండా ఊరికే తిరుగుతూ నలుగురిచేతా వేలెత్తి చూపించుకొంటుంటాడు గదా అనుకొనేవాడు సుబ్బారావు.

కాని సుబ్బారావు యింటర్ ప్యాసయేసరికే వాళ్ళ నాన్న పరలోకయాత్ర చేయడం, తన చదువుకు భరతవాక్యం పలికించడం, తర్వాత తర్వాత అతాలాకాఅఫీసులో అష్టకష్టాలుపడి డెబ్బయిఅయిదు రూపాయల ఉద్యోగం సంపాదించుకోవడం జరిగింది.

కాని పాటుపడని సీతారామయ్యని సత్యాగ్రహం చేసినందుకు 'తెల్లవాళ్ళం' అరెస్టుచేసి రెండేళ్ల శిక్ష విధించింది.

సీతారామయ్యకోసం బెంగపెట్టుకొనే చచ్చిపోయాడు వాళ్ళ నాన్న.

రెండేళ్ల అనంతరం సీతారామయ్యని విడుదల చేశారు. చేతిలో కానీ లేదు.

అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు పట్టుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. మొగంమీద కాకపోయినా చాటునయినా అనుకోవడం ప్రారంభించారు. సీతారామయ్య నిర్వాకాన్ని ఎక్కువగా దూషించడం మొదలుపెట్టిన వారిలో సుబ్బారావుది పైచెయ్యి అయింది.

'తూ, బలాదూర్, నేను సంపాదించే రోజులు వస్తాయి చూడరా' అని నోటికి తాళం వేస్తుండే వాడు సీతారామయ్య.

భారతదేశానికి ఇంత త్వరలో స్వరాజ్యం వస్తుందని ఏమాత్రం ఆశ ఉన్నా సుబ్బారావు చదువుని పట్టుకొని అంత ప్రాకులాడక పోవును.

ఐదేళ్ళలో అంతా తారుమారయి పోయింది.

స్వతంత్ర భారతంలో సీతారామయ్య పెద్ద నాయకుడై పోయాడు.

దేశానికి స్వాతంత్ర్యం రావడమే సుబ్బారావుకు ముప్పయి పోయింది. దాని కంతటికీ కారణం సీతారామయ్య ఆధిక్యమే.

మొన్న పార్కులో కనిపించి అన్నాడు కూడా 'ఇక మా రోజులురా, జాగ్రత్తగా మసులుకోండి' అని—

తన ఉద్యోగంలో ఎదుగూ, బొదుగూ లేక పోవడం అటుంచి చూస్తుండగానే సీతారామయ్య ఇంతవాడయి పోవడం సుబ్బారావుకి బాధగానే ఉంది.

సుబ్బారావు దృష్టిలో సీతారామయ్య ఈనాడు ఒక పెనుభూతం.

గొంతుకలోని కాలకూట విషాన్ని గుటకల ద్వారా లోపలికి దిగమ్రింగుతూ దూలాలు లెక్క కడుతున్నాడు సుబ్బారావు—తను కూడా ఒక నాయకుడు అవడానికి ఎందుకు ప్రయత్నించ లేదా అని.

ఆలాపన

# అభ్యుదయ కవిత్వం

‘ఆరుద్ర’

సమకాలిక సాహిత్యంలోని అధునాతన భావాలనీ, మార్గాలనీ ఏమాత్రం సహించలేనివాళ్ళు అన్ని యుగాలలోనూ ఉంటారు. వాళ్ళ పొట్టి చేతులు అభివృద్ధికి ఎన్నడూ అడ్డంకావు. సాహిత్యం గంగానది. అందులో కుకవులు తమ భావదారిద్ర్యపాతకాలని కడుక్కోడానికి ప్రయత్నిస్తారు. పావన భాగీరథి భ్రష్టయిపోతుందని మనం అంగలార్చక్కర్లేదు. చెత్తాచెదారం ఒక ఒడ్డున పారేసి నది తనలోగల సారవంతమైన ఒండ్రుమట్టిని డెల్టాలకి దానంచేసి అనంతకాల సముద్రంలో కలుస్తుంది. అప్పుడప్పుడు కుకవుల గులకరాళ్ళు సముద్రంలో కనబడవచ్చు. అవి ఎలాగా సముద్ర తీరాన్ని చేరుకోనక తప్పదు. సాహిత్యలోకంలోని చంటిపిల్లలు కట్టుకొనే పిచిక గూళ్ళని సగర్వంగా అవి అలంకరిస్తాయి. వీటిని మనం లెక్క చెయ్యక్కర్లేదు.

ప్రతి శకంలోనూ "పుంసివా కొమ్మెక్కి ఇశ్వ్యపులు కూయగా కోనంగు దేయగా అప్యేక దంతుండు ఆదదోదగాగి" అని వ్రాసే రచయితలు ఉంటారు. అవి కవిత్వం అనిగాని వాళ్ళు కవులు అనిగాని మనం అనుకోలేము. పింగళి నాగేంద్రరావుగారు చెప్పిన కథ ఒకటి ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తున్నాది. ఆయన ఏదో ఊరికి చుట్టపుచూపుగా వెళ్ళేరట. ఒకానొక స్థానిక కవి వచ్చి పరిచయం చేసుకొన్నాడట. ఆవూరివాళ్ళందరూ ఆకవిని ఆకాశానికెత్తి బ్రహ్మరథం పడతారు. కవిగారు నాగేంద్రరావుగారిని జనాంతికంగా ఒక చిన్న సహాయం చేయమని ప్రార్థించేరు. "చూడండీ నేను ఎన్నో పద్యాలు వ్రాసేను. వాటిని మీరు అచ్చువేయించాలి. అచ్చుకిచ్చేముందు 'ఉ॥చ॥క॥ మా'లు మట్టుకూ పూర్తిచెయ్యాండే" అని ఆ విన్నపం సారాంశం.

ఇటువంటి చెత్తాకాసీ రచనలు అప్పుడప్పుడు సంపాదకుల అశ్రద్ధవల్లా, ఇప్పుడిప్పుడు అసహాయతవల్లా కొన్నిపత్రికలలో మినహా సర్వత్రా ఒడ్డు లొరసి పారుతున్నాయి. వాటిని చూసి ఎవరూ గుండెలు బాదుకో అక్కర్లేదు.

వర్ణగించెత్తు ప్రతిభ కూడా లేని రచనలు హామేషా మగ్గంలో కండెలా ఇటూ అటూ తిరుగుతున్నాయి కాబట్టి వాటిని ఈమాత్రం స్మరించి వదిలిపెడదాం. చిత్తశుద్ధి గల రచనలలోని మంచితనాన్ని కూడా ఎంచకపోవడం నేరం అన్న సంగతిని సమకాలిక సాహిత్యంలోని అధునాతన భావాలనీ, మార్గాలనీ ఏ మాత్రం సహించలేని వాళ్ళకి హెచ్చరిక చేద్దాం.

భావకవిత్వం రాజ్యం చేస్తున్న రోజుల్లో అక్కిరాజు ఉమాకాంతం గారు "నేటి కాలపు కవిత్వం" అన్న పుస్తకంతో నాటికాలపు కవిత్వాన్ని చెడామడా కొట్టడానికి ప్రయత్నించారు. 'ఎంకి పాటల' బాల్యంలో రేగిన గాలిదుమారం ఎంత బలంగా వీచిందో ఎవరికి తెలీదు. చివరికి 'ఎంకి నాయుడు బావలు' జీవాత్మ పరమాత్మ అయి సగౌరవమైన స్థానాన్ని నేడు సంపాదించుకున్నారు. ఛాందసులే కాక అజ్ఞానులు కూడా 'కొత్త'ని ఒకంతట ఆదరించలేరు. ఈనాడు మనమంతా సగర్వంగా మన గుండెలలో దాచుకొనే శ్రీ శ్రీ కవిత్వాన్ని ఒకనాడు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి వంటివారు వెనకేసుకొని రావలసి వచ్చింది. ఆధునిక ఛందస్సులని అపార్థం చేసుకొనే వాళ్ళకి మాటలతో కాక పాటలతో జవాబు చెప్పడం ఉత్తమం.

యుద్ధమల్లుడి శాసనం ఏ సోమశేఖర శర్మ గారో వివరిస్తే తప్ప నాకు బోధపడకపోవచ్చు. సహాప్రమాన జీవి అయిన మా నాయనమ్మకి తన మునిమనమల పరిభాష కొరకరాని కొయ్య. అంతమాత్రాన యుద్ధమల్లుడి శాసనాన్ని నేనూ, మునిమనమల పరిభాషని నాయనమ్మ గాలినొదక్కర్లేదు. మన దురదృష్టవశాత్తూ నేడు 'సంఘంలో ఉన్న వర్గాల కారణాన వల్ల అన్ని వర్గాలకీ అనువర్తించని కవిత్వం వస్తే దాన్ని ఆక్షేపించక్కర్లేదు. అభ్యుదయ కవిత్వం అందరికీ సులభగ్రాహ్యం కాకపోవచ్చు, గానీ అందరి మంచికీ పాటుపడుతుందని చెప్పవచ్చు.

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

### ఇండియన్ మెడికల్ కాలేజీ: తెలుగుభాష

ఈనెల 14 వ తేదీ పత్రికల్లో ఒక విపరీత వార్త వచ్చింది. క్రితం పాతిక సంవత్సరాలనుండీ గవర్నమెంటు ఇండియన్ మెడికల్ కాలేజీలో నడుపబడుచున్న ఆయుర్వేద తెలుగు - ఆయుర్వేద తమిళం-అనే రెండు తరగతులను చేర్చి ఒకే ఒక ఆయుర్వేద తరగతిగా విద్య గరపుటకు గవర్నమెంటు ఆర్డరు వచ్చింది.

ఊహించిచూడగా, దీనికి కారణాలు తెలుగు-తమిళం భేదం అని, తమిళ ఔషధమగు "సిద్ధ" ఔషధమును ప్రాముఖ్యంలోకి తీసికొని రావడానికి చేసే ప్రయత్నాలకు యిది ప్రాతిపదిక అని స్పష్టంగా తెలుస్తోంది. ఇంతకాలం అట్లా వేరుగా రెండు తరగతులుగా ఉండడంవలన విధిలేక తెలుగువాళ్ళకు ప్రత్యేకించి కొన్ని సీట్లు యివ్వవలసి వస్తోంది- యిస్తూవచ్చారు. తెలుగు లెక్చరర్లనుకూడా నియమించవలసి వచ్చింది. ఇప్పుడు రెంటినీ కలిపితే 'ఆయుర్వేదం' మొత్తంమీద సీట్లు ఇవ్వవలసి వస్తుంది. అప్పుడు తెలుగువాళ్ళకు ఇన్ని యివ్వాలి అని వుండదు. ఎన్ని యిచ్చినా, అసలు యివ్వకపోయినా అడిగేవారుండరు. అడగటానికి అస్కారంకూడా వుండదు. తెలుగు లెక్చరర్లను నియమించినా, లేకపోయినా ఫరవాలేదు.

అట్లా క్రమేణా యీ కాలేజీలోకూడ తెలుగులకు ఏమాత్రం తావు లేకుండాచేసే ప్రయత్నం అన్నిరంగాల్లోను (తమిళ నర్సులను నియమించడం, వున్న తెలుగు నర్సులను-ఎన్ని సంవత్సరాలు అనుభవమున్నా తీసివేయడం, లెక్చరర్లను 'ప్రమోషను' లేకుండా అణగద్రొక్కడం) సర్వతోముఖంగా జరుగుతోంది. మద్రాసులో ఏలాగయితే తెలుగువాళ్ళకు తావు లేకుండా చేస్తున్నారో, అలాగే, ఇంతవరకు కొంచెం తెలుగు సంఖ్య ఎక్కువగా వున్న యీ సంస్థలో కూడ ఆమాత్రంకూడా లేకుండా రూపుమాపుదామనే ప్రయత్నం-అంతర రాజకీయాలు జరుగుతూనే వున్నాయి.

ఇంతవరకూ మాతృభాషయగు తెలుగులో చెప్తూ వచ్చారు పాఠాలు. ఇకమీదట ఇంగ్లీషులో చెప్తారుట. ఆయుర్వేదాన్ని వాళ్ళ "సిద్ధ" ఔషధాన్ని మాత్రం వాళ్ళ మాతృభాషలో చెప్పుకొని అభివృద్ధి పరచుకుంటారుట. ఎంత న్యాయమో!

కేంద్రప్రభుత్వం సైన్సు పాఠాలు సైతం మాతృభాషలో చెప్పాలని, ఇంగ్లీషు తగ్గించాలని-ప్రాంతీయభాషలో బోధన విశ్వవిద్యాలయాల్లోకూడా అనుసరిస్తున్న యీ రోజుల్లో-ప్రాంతీయభాషల్లో పాతిక సంవత్సరాలనుంచి-యీ కాలేజీ పుట్టినప్పటినుంచి-చెప్తున్న దాన్ని

యొకముందు ఆంగ్లభాషలో-పరభాషలో చెప్పడానికి సంకల్పించడం హాస్యాస్పదం.

కనుక యీ విషయంలో తెలుగుమంత్రులు, ఎం. ఎల్. ఎ. లు, పత్రికలవాళ్లు (ముఖ్యంగా), ఎల్. ఐ. ఎమ్. సంఘం (ఆంధ్రా బ్రాంచివాళ్లు), పూనుకొని యీ కాలేజీలో తెలుగు విద్యార్థులకు, లెక్చరర్లకు జరుగుతున్న యీ అన్యాయాన్ని అరికట్టడానికి ప్రయత్నించవలసి ఉంటుంది. విద్యార్థులు వారికి తగినట్లుగా లోపల నుంచి "మెమొరాండం"మున్నగు వాటిద్వారా ప్రయత్నిస్తారు. పైనుంచి ప్రజల సానుభూతి సహాయములు పూర్తిగా ఉండడం అవసరం.

మద్రాసు "ఆంధ్ర విద్యార్థి"

---

## పిఠాపురం జమీందారీ ఉద్యోగులు

ఇటీవల పిఠాపురం ఎస్టేటులో ఉద్యోగులను తగ్గించుట ప్రారంభించినారు. ఇప్పటికి సుమారు 200 మంది ఉద్యోగస్థులవరకూ తీసివేసినారు. ఈ ఉద్యోగస్థులను తీసివేయుటలో వారు ఏవిధమైన కారణము చెప్పకుండా నాలుగు, మూడు రోజుల నోటీసుతో ఉద్యోగము బర్తాఫ్ చేయుచున్నారు. ఈ విధముగా ఉద్యోగము నుంచి తొలగింపబడిన వారిలో 30, 20 సం||ల సర్వీసు పూర్తి చేసినవారు కూడ గలరు. అట్టి వారు మరొకచోట ఉద్యోగము చేసికొనుట గాని, చేసుకుందామన్నా దొరుకుట గాని దుర్లభము గదా! ఇంతకాలము ఒక సర్వీసులో కాలము గడపినవారికి, వయస్సు మీరిన కాలములో, మరొకచోట నౌకరీ చూసుకొనుట ఎంత కష్టము. అధమము తగినంత వ్యవధి కల్పించి వీరికి నోటీసిచ్చినచో ఎటొ ప్రయత్నము వారు చేసుకొనుటకు కొంత అనుకూలించి ఉండెడిదేమో! ఉద్యోగములో సీనియారిటీని కూడ గణింపక వారికి తోచిన విధానం ప్రకారం ఈ తగ్గింపులకు పూనుకొన్నారు. ఎస్టేటును గవర్నమెంటువారు స్వాధీనపరచుకొనే సందర్భములో ఆఫీసు సిబ్బంది కయే ఖర్చు జమీందారుగారికి ఇచ్చే కాంపెన్సేషనులో తగ్గించెదరనిన్నీ, ఆ తగ్గుబడికి అవకాశము లేకుండగా ముందుగానే జాగ్రత పడుచున్నారని తెలియుచున్నది. ఇంతకాలము నుండి వారి ఆగ్రహానుగ్రహములకు పాత్రులై ఎదుగు బొదుగు లేని జీవితం గడిపినవారి నిట్లు జీవితంలో ఏ విధమైన రక్షణ లేకుండా వదలివేయుట చాల విచారింపదగిన విషయము.

ఇదిగాక గవర్నమెంటువారు ఎస్టేట్లను స్వాధీనపరచుకొనుటతో ఉద్యోగి బృందము వారందరిని గవర్నమెంటు ఉద్యోగులుగా స్వీకరిస్తారని కొండంత ఆశతో కూడ నున్నారు. కాని ఆ విధానములో కూడ ఈ అభాగ్యులకు తావు లేకుండా పోయినది. మంచి అర్హమైన యోగ్యతలు కలిగి ఈ ఎస్టేటు సర్వీసులో క్రుంగి కృశించిన వారెందరో ఈ జమీందారీ బిల్లు వల్ల తమ యోగ్యత, శ్రమ సఫలమగునను కొన్న ఆశలు అడియాసలైనవి. ఇట్టి పరిస్థితిలో వీరికి తగు రక్షణలు కల్పించి, ఈ మధ్యకాలములో ఎస్టేటు వారు తీసుకొనుచున్న తగ్గింపు చర్యల నాపు చేయడం ప్రభుత్వపు కనీస కర్తవ్యం.

పిఠాపురం కె. సూరయ్య

---

## సింహపురిలో వానర సంపద

మీ పత్రిక యీ నెల 19-వ తారీకు సంచికలో కోతులు గురించి ప్రభుత్వానికి యిచ్చిన సలహా చదివి చాలా సంతోషించాను.

నెల్లూరులో సుమారు 10 సంవత్సరాలనుండి కోతులు నివసిస్తున్నాయి. పూర్వం పురపాలక సంఘంవారు కోతులను పట్టించి ఊరికి దూరంగా వదిలించే వారట. కాని పదియేళ్లనుండి అటువంటిదేమీ జరగడం లేదు. అందువల్ల వాటిసంఖ్య వందలకొద్దీ పెరిగిపోయింది. ముఖ్యంగా ఇవి ఊరి చివర ఉండే నవాబుపేట, స్టోన్‌హౌసు పేట, రంగనాయకులపేట, మూలాపేట,—యీ ప్రాంతాల్లో ఉంటాయి. ఇవి చేసే అల్లరి వ్రాయనలవి కాదు. అక్కడివాళ్లు పెరళ్లలో ఏ కూరగాయల పాదులూ పెట్టుకుందికి వీలులేదు. చివరకు పూలమొక్కలు వేసుకుందికికూడా వీలులేదు. ఇక అధిక ఆహారోత్పత్తి గురించి ప్రభుత్వం చేసే ప్రకటనలు ఎంత వ్యర్థం!

ఊరికి పక్కనే కొన్ని తోటలున్నాయి. అక్కడకూడా కోతులు నానా అల్లరి. అంచేత 500 రూపాయలకు కాలుకిచ్చే తోట 100

రూపాయలకుకూడా ఎవరూ తీసుకోరు. దీనివల్ల భూస్వామికి, కౌలుదారునకు ఎంతో నష్టం.

కాంగ్రెస్ ప్రముఖులు నెల్లూరు పురపాలక సంఘాన్ని పరిపాలిస్తున్నారు. వీరు మంచిరోడ్లు వేయించలేక పోయినా, మురికి కాలువలు కట్టించలేకపోయినా, సంవత్సర మనగా పోయిన వీధుల్లోని విద్యుద్దీపాలు తిరిగి తెప్పించలేక పోయినా—కాస్త కోతులబాధ అయినా తొలగించకూడదా?

నెల్లూరు టి. యస్. కె. తులసీరావు

---

## పోస్టల్ దొంగలు

రోజు రోజుకు పోస్టల్ దొంగ లెక్కువ అవుతున్నారు. బుక్ పోస్టులో పంపబడే పత్రికలు, గ్రీటింగ్ కార్డులు, మంచి బొమ్మలుగల పుస్తకాలు, పంపిన ఊరునుండి చేరే ఊరుకి మధ్యనో, చేరినతరువాతనో మాయమవుతూ వున్నాయి. ఇందులో ఎవరుదొంగో, ఎవరుదొరో బోధపడటం లేదు. మొత్తంమీద బుక్‌పోస్టులు మాత్రం మాయమవుతూ వున్నాయి. ఈవిషయంలో పోస్టల్ డిపార్టుమెంటువారు తగుశ్రద్ధ తీసుకొనకపోవుట చాల ఆశ్చర్యంగా వుంది.

విజయవాడ బి. యల్. దేశపాండే

---

## మంత్రాలకి చింతకాయలా?

కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు "పంటలు ఎక్కువగా పండించండి. పొదుపుగా వాడుకోండి" అని ప్రజలకు పదేపదే హెచ్చరికలు చేస్తున్నాయి. దీనికోసం యే పెద్ద చిన్నసభలు జరిగినా ఈ విషయాన్నే పునరుద్ఘాటిస్తున్నారు మన నాయకోపనాయకులు. మన ప్రభుత్వం అధికోత్పత్తిని గురించి ప్రచారం సాగించడంకోసం 16 కోట్ల రూపాయలు వ్యయపరుస్తోంది కూడా—

"అధికంగా పంటలు పండించండి" అని చెప్పడమే కాకుండా, మన నాయకులు "రాజాజీ" మాలం పట్టారు; పండిట్‌జీ పెరట్లో జొన్నవర్రి రాపైరు చేస్తున్నారు.

మన దేశంలో ప్రధానవృత్తి వ్యవసాయమని అందరకు తెలిసిన విషయమే. అటువంటప్పుడు ఎందుకీ దరిద్రస్థితి సంభవించింది? దీనికి కారణం చాలాభూమి జమీందార్ల, ఇనాందార్ల, భూస్వాముల చేతుల్లోవుండ[illegible] వాళ్లు మాలంపట్టి పొలం దున్నుతారా? దున్నిస్తారా?

ఇక మిగిలినభూమి మెట్ట-పల్లం అని వుంటుంది. పల్లంమాట అటుంచండి. మెట్టను తీసికోండి. మెట్ట రైతులు యుద్ధానికి పూర్వం కంది, పెసర, మినప, వులవ, మున్నగు రకరకాల పప్పు దినుసులు పండించేవారు. రానురాను వారి జీవన వ్యయ ప్రమాణం పెరిగిపోయింది. ఆర్థిక బాధలకు తట్టుకోలేకపోయారు. నాటికి పుగాకు ధర చాలా జాస్తీగా వుంది. ఎకరానికి మూడు నాల్గువందల రూపాయలవరకూ ఆదాయం వచ్చే స్థితి కనిపించింది. రెండుమూడు ఎకరా లున్న చిన్నరైతే కాకుండా, పది ఇరవై ఎకరా లున్న పెద్ద రైతుకూడా పుగాకునే పండించడం ప్రారంభించాడు. నానాటికీ పంట తగ్గిపోవుట వల్ల పప్పు పదార్థాల ధర పెరిగింది.

ఆహారం కొరత తీర్చడాని కివివరలో పోలవరం వద్ద ప్రాజెక్టుకి ప్లానులు వేశారు. ఏదో కొంత హడావిడికూడా చేశారు. ప్రాజెక్టు నిర్మాణానికి అయే ఖర్చుకి దానివల్ల నొక సంవత్సరం లోపులోనే ఆదాయం వస్తుందని మన రామమూర్తిగారు చెప్పారుకూడా. ఈ స్థితిలో యేవో సాకులు చెప్పి దీన్ని వెనక్కునెట్టారు.

జమీందార్లకు, ఇనాందార్లకు, భూస్వాములకు అధికోత్పత్తికి పూనుకునేలా యెందుకు ఒత్తిడి చెయ్య[illegible] వారి ఆగ్రహాలకు గురి అవుతామనా?

పప్పు పదార్థాల ధరను కంట్రోలుచేసి పొగాకు పెంపకు నిషేధించరు? పాపం విదేశ పెట్టుబడిదార్లకు కోపం వస్తుందనా?

ప్రాజెక్టు కయేఖర్చు ఒక సంవత్సరం లోపుగానే తీసివేయుందని తెలిసికూడా అప్పు చేసి దాన్ని నిర్మించి ఆహారసమృద్ధి ఎందుకు కలిగించరు? ప్రాజెక్టు ఆంధ్రప్రాంతంలోదనా?

ఈ పరిస్థితిలో పండిట్‌జీ పె[illegible] జొన్న పైరుచేస్తే కరువు తీరుతుందా? గవర్నరు [illegible]రల్ రాజాజీ మాలంపడితే కరువు తీరుతుం[illegible]?

కొవ్వూరు అయ్యగారి కృష్ణమూర్తి






సంపుటి 2. సంచిక 5.
శుక్రవారం, సెప్టెంబరు 2, 1949

పుట

## మార్గ శ్రాంతులు




" కాంగ్రెస్ సంస్థ అలసిపోయింది. " — పండిత నెహ్రూ

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-5

సెప్టెంబరు 2, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## చైనా గీటురాయి

మొదటి ప్రపంచసంగ్రామం చివరి దశలో రష్యాలాగే రెండవ ప్రపంచ సంగ్రామానంతరం చైనా కూడా ప్రపంచరాజకీయాలకు గీటు రాయిగా పరిణమించింది. వివిధదేశాల లోని "శాంతి కాముకులూ," "అభ్యు దయ వాదులూ," "స్వాతంత్ర్య పిపాసు వులూ," "ప్రజాస్వామ్య సిద్ధాంతులూ" కూడా తమ పాత్రలను విస్మరించి చైనా పట్ల అతివిచిత్రమైన భాష మాట్లాడారు.

ఇండియా స్వాతంత్ర్యోద్యమానికి 30 ఏళ్లు నాయకుడుగా ఉండి, "కాలం తోపాటు మారకపోతే మీరు నశించి పోతారు," అని అన్ని వర్గాలవారినీ అనేక వందలసార్లు హెచ్చరించిన మన మన ఉపప్రధాని సర్దారు పటేలు ఒక సారి "చైనా గతి చూడండి," అన్నారు. చాంగ్‌కైషేక్ ప్రభుత్వం అదుపు ఆజ్ఞల్లో ఉండక చైనా "మునిగి" పోయిందని సర్దార్జీ భావం. ఇది ఒక భావం. దీనితో సమన్వయంకాని ఇతర భావాలు ఇతరులు ప్రకటిస్తున్నారు.

చైనాను చాంగ్‌కైషేక్ నాయకత్వాన కోమింటాంగు వర్గం ముంచిం దనీ, కోమింటాంగు అవినీతి, అసమర్థతల కారణంచేతనే చైనా విప్లవం విజయవంత మైందనీ అమెరికాలోని అనేక పత్రికా విలేఖరులే కాక స్టేటు డిపార్టుమెంటు కూడా ఒప్పుకుంది. ఇది నిజమైతే చైనా మునగలేదన్నమాట, తేలిందన్న మాట.

రాయిటరు మొదలైన వార్తాసంస్థల వారుచాంగ్‌కైషేక్ ప్రభుత్వాన్ని ఇంకా జాతీయప్రభుత్వమనే వ్యవహరిస్తున్నారు. కాని ప్రత్యేక విలేఖరులు కమ్యూనిస్టు ఉద్యమాన్ని చైనా జాతీయోద్యమ మంటున్నారు. ఈ రెండూకూడా సరికావటానికి అవకాశం లేదు. ఎందు చేతనంటే పెట్టుబడి దారీ ప్రజాస్వామ్య వాదులు,"ఆసియా దూరప్రాచ్యాలలో కమ్యూనిస్టు విజృంభణను అరికట్టాలంటే ఆ ప్రాంతాలగల జాతీయోద్యమాలను బలపరచాలి," అంటున్నారు. ఈ జాతీ యోద్యమాలు చైనా కమ్యూనిస్టుల జాతీయోద్యమానికి సన్నిహితంగా ఉంటాయో, చాంగ్‌కైషేక్ జాతీ యోద్యమానికి సన్నిహితంగా ఉంటా యో ఊహించటం చాలాకష్టం. కాని మనం నడుస్తున్న చరిత్రనుండి నీతి గ్రహించాలంటే ఈ గచ్చకాయ పగల

గొట్టి అందులో ఏమున్నదీ తెలుసుకోక తప్పదు.

అమెరికా ప్రపంచ జాతీయోద్యమాలన్నిటినీ బలపరచ కంకణంకట్టుకుని కూర్చున్నది. అమెరికా ధర్మాన గ్రీసులోనూ, టర్కీలోనూ, ఫిలిప్పీన్సులోనూ, కొరియాలోనూ, జపానులోనూ, దక్షిణ అమెరికాలోనూ, పశ్చిమజర్మనీలోనూ, ఇంకా అనేక చోట్లాగల జాతీయోద్యమాలు బలపడినాయి. ఇంకా మరికొన్ని దేశాలలో బలపడనున్నాయి. కాని ఈ జాతీయోద్యమాలకు మళ్లీ చైనాయే గీటురాయి.

రెండు బిలియన్ల డాలర్లు ధారపోసి తాము బలపరచిన చైనా జాతీయోద్యమం గురించి 140 పేజీలుగల కరపత్రాన్ని అమెరికా స్టేటు డిపార్టుమెంటు వారు వారు ఇటీవల ప్రచురించారు. దాని సారాంశ మేమంటే.

“చాంగ్ కై షేక్ ప్రభుత్వం ప్రతీప పంథా తొక్కి ప్రజల విశ్వాసాన్ని పూర్తిగా కోల్పోయింది. అది అసమర్థమైనది, అవినీతికరమైనది. మన సహాయం చాలక అది ఓడిపోలేదు. మనం ఇంకే సహాయం చేసిఉన్నా అది ఓడే తీరేది.”

అమెరికా స్టేటు సెక్రెటరీ అయిన డీన్ ఏచిసన్ స్వయంగా ఉల్లేఖించిన ఈ మాటల అంతరార్థం చూస్తే అమెరికా సహాయంతో జాతీయోద్యమాలు నడప నాశించేవారంతా కంగారెత్తిపోవచ్చు.

ఇంత అవినీతికరమైన, అసమర్థమైన, ప్రజాదూరమైన కోమింటాంగు ప్రభుత్వాన్ని గెలిపించటానికి అమెరికా రెండు బిలియన్ల డాలర్లు ఎందుకు ధారపోసింది!

యుద్ధం ముగిసేనాటికి అంతర్జాతీయ అగ్రపంచకంలో చైనా ఒకటి. దానికి నియంతగా ఉంటున్నవాడు చాంగ్ కై షేక్. అతను జాతీయోద్యమ నాయకుడు. చైనా ప్రజలు అతని వెనక నిలబడి ఉన్నారు. ప్రపంచ రాజ్యాలన్నీ అతని ప్రభుత్వాన్నే గుర్తిస్తున్నాయి. అన్ని దేశాలలోనూ అతని రాయబారులే ఉన్నారు. వాణిజ్యమూ, ప్రభుత్వ ధనాగారమూ, ఆయుధాగారమూ అతని చేతిలోనే ఉన్నాయి. చైనా కమ్యూనిస్టులు “బందిపోటులు,” అసలే జపాను చేత దెబ్బతిని ఉన్న చైనాను “కష్టాలలో ముంచటానికి కత్తి కట్టినవాళ్లు”. అటువంటి పరిస్థితులలో చాంగ్ కై షేక్ (జాతీయవాది) కమ్యూనిస్టు (బందిపోటు)ను సులభంగా ఓడించి ఉండవచ్చు. చాంగ్ కై షేక్‌కు అమెరికా సహాయపడవలసి రావటమే చాలా విడ్డూరం. బందిపోటు లక్షణాలూ, చైనా కష్టాలు పెంచాలనే తహతహా చాంగ్ కై షేక్‌కే హెచ్చుగా ఉన్నాయని తెలిసిన తరవాత మూడేళ్లపాటు అమెరికా అతనికి సహాయంచేసి ఉండటం ఇంకా విడ్డూరం. దీన్నిచూసే ప్రపంచంలోగల జాతీయవాదులందరూ గుండె బాదుకోవచ్చు. ఇంతటితో పోనివ్వక, చాంగ్ పతనం పూర్తి కాగానే అమెరికా, “మనంఏసహాయంచేసినా యీ పతితుడు గెలిచి ఉండడు,” అని అనేసరికి జాతీయవాదులతోబాటు అభ్యుదయ నిరోధకులుకూడా అమెరికా సహాయాన్ని చూసి హడలిపోవలసిన స్థితి పట్టుతుంది.

ఇదంతా ఉండగా, అమెరిగా ఏ సిద్ధాంతాలను పురస్కరించుకుని ఎవరికి

సహాయం చేస్తుం దన్న ప్రశ్న కలుగుతుంది. కమ్యూనిజమును నిరోధించే వాళ్లెవరున్నా సరే. వాళ్లు ఎంత అసమర్థులూ, అవినీతిపరులూ ప్రజా విముఖులూ అయినా సరే, వారికి అమెరికా సహాయం చేస్తుందన్న మాట. అమెరికా సహాయంతో వాళ్లు గెలుస్తారా ఓడుతారా అన్నది మళ్లా దైవాధీనమే.

అమెరికాకున్న కమ్యూనిస్టు వ్యతిరేకతలో కూడా సిద్ధాంతాలేమీ లేవు. "మనవద్ద పొందిన సహాయంతో చాంగ్ కై షేక్ రాజకీయ ఆర్థిక సంస్కరణలు సాగించి ప్రజాభిమానం సంపాదించి ఉంటే పరిస్థితి ఇంతదాకా రాకపోను," అని అమెరికా ప్రభుత్వ కరపత్రం ఉద్ఘోషిస్తున్నది. ఈ సంస్కరణలను కమ్యూనిస్టులు తాము ఆక్రమించిన ప్రాంతాలలో సాగిస్తున్నారు. కాని అమెరికాకు ప్రజల మీద అనురాగం ఎంతవరకంటే వారు కమ్యూనిస్టు విముఖులుగా ఉన్నంతవరకే.

చైనా అంతరంగిక సమస్యతో జోక్యం కలిగించుకుని, ఘర్షణపడే రెండు పక్షాలలోనూ ఒక పక్షానికి—అదైనా ఓడిపోయే పక్షానికి—అంతులేని ఆయుధ సరఫరా చేసినందుకు అమెరికా పశ్చాత్తాపపడటం లేదు. అమెరికా చాంగ్ కై షేక్ ఓటమిని మాత్రమే గుర్తించింది గాని, తాను చాంగ్‌కు సహాయపడకపోతే ఎంత జననష్టం తప్పేదో ఎక్కడా చెప్పినట్టు లేదు.

ఈ ధోరణిలో పెట్టుబడిదారీ వర్గ స్వార్థానికీ, వర్గరహిత సామ్యవాదానికీ అంతర్జాతీయంగా నగ్న పోరాటం నీతి నియమ విరహితంగా సాగిపోతుంటే సభ్యప్రపంచం ఇంకా ఒక వంక ధర్మపన్నాలు చెబుతూ మరో వంక అమెరికా రాజకీయాలను ప్రత్యక్షంగానో పరోక్షంగానో బలపరుస్తూనే ఉన్నది. ఉభయ పక్షాలూ చెడ్డవే అనే మేధావులు చాలామంది ఉన్నారుగాని మూడో పక్షం ఏర్పాటుచేసే మేధావులు లేరు.

మనం ఇవాళ చైనానుంచి గుణపాఠం నేర్చుకోకపోతే మరి దేనినుంచీ నేర్చుకోలేం. మనకు చదువే రాదన్నమాట.

## వచ్చే సంచికనుండి ప్రచురణ ప్రారంభం

# "అప్పుగింత" (సీరియల్ నవల)

రచయిత: ఈరంకి వెంకటరావు

(ముఖ్య కథాభాగం ఎమిలీ జోలా రచించిన నవలనుండి తీసుకోబడింది)

మహాకవి జోలా రచించిన నవలనుండి ముఖ్యకథాభాగం తీసుకుని, తెలుగు జాతీయ జీవనాన్ని ప్రతిబింబించే నవల శ్రీ ఈరంకి వెంకట్రావు వ్రాశారు. ఈ రచయిత "తెలుగు స్వతంత్ర" పాఠకులకు సుపరిచితుడు. ఇతివృత్తం ప్రతివ్యక్తి అనుభవానికి చెందినదే. భర్తృప్రేమను కోల్పోయిన రాజేశ్వరి. దిక్కులేని ఒక పుత్రవాణ్ణి పెంచి చదువు చెప్పిస్తుంది. మరణకాలంలో కూతురు సరోజను అతడికి చూపిస్తూ 'ఈ ఆరేళ్ళ పిల్లను నువ్వు దైవంవలె కాపాడాలి' అని ఆఖరి కోరిక వెలిబుచ్చుతుంది. సరోజను రామదాసు ఎలా కాపాడగలిగాడు! అనేకరకాల దుర్వేగాలతో, ప్రలోభాల అన్వేషణతో కూడుకున్న అనంతర గాథే 'యీ అప్పుగింత.'




రచయితా, రాజకీయవాదీ అయిన దొడ్డమిత్రుడొకాయన యీమధ్య హఠాత్తుగా రోడ్డు మీద తారసిల్లి, ఆప్యాయంగా కావిలించుకొని కరస్పర్శ చేశాడు. "చిరకాలానికి. చిరకాలానికి! ఏదీ నవఖాలీ దురంతాల తర్వాత మళ్లీ మనం కలుసుకోనే లేదూ! ఏమిటి సంగతులు!" అన్నాడు. 'ఏదోలే, జీవితం నడుస్తోంది," అన్నాను. "ఎవరికి!" అన్నాడు, అదిరిపడి. నేను సిగ్గు పడ్డాను; (కపోలాలు ఎర్రబడ్డాయేమో కూడా). 'నా గురించేనా నువ్వు అడుగుతున్నావ్?" అని తెగించి అడగగల్గాను.

"నీ జీవితమా? ఛా! నీ స్వంతవిషయాలు అడిగేటంత మూర్ఖుణ్ణి కాదు: నీ గొడవ ఎవరికి కావాలి, బోడిగొడవ! దేశం, దేశం సంగతి ఆలోచించు. ఎటువంటి విపరీత-విపత్కర పరిస్థితుల్లో జీవిస్తున్నాం, ఏమిటి కథా! పౌరస్వత్వాలు ఏమయాయి చూడు. అంకెల సంగతి ఆలోచించావా! నీకు హిందీ అంకెలు కావాలా, అంతర్జాతీయ— అంకెలు కావాలా? రాజ్యాంగ చట్టం ఎప్పుడు తయారవుతుంది? మలయా గమనించావా? మావో-సే-టుంగ్ ఏమన్నాడు? డాలర్ల కొరత ఎలా తీరుతుంది? డానుబ్ మీద ఎవరి పడవలు నడవాలి?—అవీ సంగతులు. వాటిగురించే నే నడుగుతూంట!" అని అనర్గళంగా విరుచుకుపడ్డాడు. ధన్యోస్మి! అనుకున్నాను.

"పొరపాటు. క్షమించు. చాలాకాలానికి కలుసుకున్నాం కదా అని, యోగక్షేమం అడిగా ననుకున్నాను; ఇటీవల నీదృష్టి ఇంత అంతర్జాతీయంగా విస్తృతమైం దనుకోలేదు. అయితే నువ్విప్పుడు కథలు రాయడంలాంటి వ్యాపకాలు కట్టిపెట్టేశావన్న మాట!" అన్నాను.

"రాయకేం, రాస్తూనే ఉన్నాను. అయితే, వెనకటివలె ప్రేమకథలు రాయడంలేదు. నువ్వు గమనించడం లేదూ, వాతావరణం ఎంత వేడెక్కిపోయిందో? వ్యక్తిగతమైన మన కష్టసుఖాల పరిశీలనకిది సమయం కాదు. అబ్బాయి అమ్మాయిని ప్రేమిస్తే ఎవడికి కావాలి? లేకపోతే ఎవడికి కావాలి? ఈ సంధి సమయంలో, ఊపిరి బిగబట్టి సమాజం మహావిప్లవాన్ని నిరీక్షిస్తున్న ఆతురఘడియల్లో, ప్రేమకూ ప్రణయానికీ తావెక్కడిది? ప్రస్తుతం అది అప్రస్తుతం. అటువంటి దౌర్బల్యాలకి లొంగిపోయినవాడల్లా దేశద్రోహి. నేను రాయబోయే రచనలకి యికముందు మహాప్రజ నాయకుడు. దేశ సౌభాగ్యం నాయిక. అభివృద్ధి నిరోధకులంతా విలన్లు." అని చీవాట్లు పెట్టి నిష్క్రమించాడు.

* * *

ఆతడి మనస్తత్వం నా కాశ్చర్యాన్ని కలిగించలేదు. ఇటువంటి అభిప్రాయమే కల బహుళ సంఖ్యాకుల వర్గానికి అతడు ప్రతినిధి. నిత్యపరిణామశీలమైన సమాజాన్ని ఎదుర్కొనే సమస్యలెప్పుడూ ఉండనే ఉంటాయి. సాంఘిక చైతన్యంగల వ్యక్తులు తాము నమ్మిన కర్తవ్యం నిర్వర్తిస్తూనే ఉన్నారు. మాకే యీలోకంలో మానవ హృదయాల్లో అనంతజ్యోతుల్ని వెలిగించే కొన్ని ఉత్కర్షలు, వాటిని బాధాప్రపూరితం చేసేకొన్ని అనుభూతులు, కేవలం వ్యక్తిగతమైనవి, యితరుల కనవసరమే కాక యీమాత్రమూ అవగాహన కందనివి- ఉండనే ఉంటాయి. పుట్టినదాది నా జీవితం సుఖమయమయిందో, దుఃఖపూరితమయిందో నిర్ణయించేది యీ అనుభవాలే కాని, వేరొకటి కావు. ఇటువంటి వ్యక్తీయమైన సుఖదుఃఖాల

పరిక్రమించి, భావోద్రేకాల నణచిపెట్టి, తోటి మానవుల ఉన్నతికోసం కాలం గడుపుతూ ధారపోసే అసాధారణులైనా, సామాన్యులలో పరిమితంగా ఉండే అనుభూతిని విస్తృతం చేసి విశాలరంగంలో వినియోగించేందుకు యత్నించారే గాని, అది నిరుపయోగమని త్రోసి పుచ్చలేరు: ఒకవేళ ఏ ఒకరిద్దరో తోసిపుచ్చినా, అంతటితో వాటి వాస్తవికత నిర్మూలింపబడలేదు.

భావోద్రేకాలను దాచడానికి ప్రయత్నించడం వెర్రితనం: అందువల్ల సాధించబోయే దేమీ లేదు. వాటిని గుర్తించి ఎంతవరకూ అవసరమో, ఎంతవరకూ ఆరోగ్యకరమో అంతవరకూ బహిర్గతం చేయడంలోనే పరిపూర్ణత్వం ఇమిడి ఉంది. తరుణవయస్కులైన ప్రేయసీ ప్రియుల్ని చూస్తే యీ విషయం మనకి బోధపడుతుంది. పనామా కాలువ సమస్య తేలడం అంతర్జాతీయ శాంతికెంత ముఖ్యమో, వారి ప్రేమ సఫలం అవడం కూడా వారి మనశ్శాంతి కంత ముఖ్యం. తత్వవేత్తలు ఆ స్థితిలోని యువతీ యువకుల ఉద్వేగాన్ని తాత్కాలికమనీ, భ్రాంతిపూర్వకమనీ నిర్వచించవచ్చు. కాని, ఆ "భ్రాంతి" లో ఉన్నంతవరకూ వారికది వాస్తవం: కొన్ని వేళల్లో అది వారి జీవితాలలోనే వికసితమైన పరివర్తనం తీసుకువస్తుంది. ఆ "భ్రాంతి" ఎటువంటిదో నిర్వచించడం కష్టంతో కూడుకున్న విషయం: ఏ విజ్ఞానశాస్త్రజ్ఞుడూ ప్రేమ, అనురాగం అనేవి ఎలా అంకురిస్తాయో, ఎందుకు అంకురిస్తాయో లెక్కలువేసి, పటాలు గీసి చూపలేడు. విప్లవాలూ, యుద్ధాలూ, ప్రబల రాజకీయోద్యమాలూ వాటికి అడ్డురావు: పైగా, సమాజం సుస్థిరమైన పునాదులమీద నిలిచి వర్ధిల్లడానికి వీళ్ళే ఎక్కువ సహాయభూతు లవుతారు. స్థావరమన్నది లేని వాళ్ళు, కోల్పోవడానికి అమూల్యమైన ప్రేమాభిమానాలు ఏవీ లేనివాళ్ళు, రాజకీయాలే వృత్తిగాకల సాహసులు— వీరికి విప్లవాలూ, తిరుగుబాట్లూ, కల్లోలాలూ, అశాంతీ - అవే పండుగ సమయాలు. ప్రేయసీ ప్రియులు, సుఖమైన దాంపత్య జీవనం గడిపే భార్యాభర్తలు, మాతా శిశువులు-వీరెవరూ యుద్ధాల్నీ, అశాంతినీ కోరరు. తప్పని సరిగా అది వారిని సుడిగుండాల్లోకి యీడిస్తే, తిరిగి ప్రశాంత సమయం ఎప్పుడొస్తుందా అని నిరీక్షిస్తారు.

నిజమైన ప్రేమవలెనే, స్నేహం కూడా మన హృదయాల్ని ప్రకాశితం చేస్తుంది. అయితే నిర్మలమైన స్నేహాన్ని ప్రదర్శించడానికి గాని, ఇతరులనుండి పొందడానికి గాని మనలో చాలామంది నోచుకోలేదు. అందుకు మన హృదయమెంతో ఉన్నతమైనది కావాలి. ఏ కొద్దిమందికో అటువంటి శోభాయమానమైన జీవితం లభిస్తుంది. స్నేహం జీవితానికి ఎటువంటి వెన్నెల కాంతి నిస్తుందో వా రనుభవంలో తెలుసుకో గల్గుతారు. అటువంటి వ్యక్తుల్ని చూడగానే పోల్చుకోగలం. వయస్సు గడిచి వృద్ధాప్యం పైబడుతున్నకొద్దీ, అలాంటివాళ్ళ ముఖమండలం సంతృప్తితో మెరుస్తుంది. అంటే వాళ్లు కష్టాలే ఎరగరని కాదు; బాధలే పడి వుండలేదని కాదు— అందరికీ కలిగిన కష్టసుఖాలే వాళ్ళకీ ఉంటాయి. కాని బాధలవల్ల వాళ్లు మరింత ద్వేషం పెంచుకోలేదు. బాధల్ని చిరునవ్వుతో ఎదుర్కొనే ఆలంబనం వారి కుంది. అదే ఇంకొక హృదయం తాలూకు ప్రతిస్పందన. (అంటే, మనకి సంభవించే సుఖదుఃఖాలన్నీ కేవలం మన చేతుల్లోనే ఉన్నాయనీ, బాహ్యపరిస్థితులకీ వ్యక్తి జీవితానికీ ఏమాత్రం సంబంధం లేదనే అర్థం వచ్చే సూత్రీకరణ కాదు ఇక్కడ ప్రయత్నిస్తున్నది: మన అంతరాంతర అవగాహనలో చివరకి ఏ అనుభూతులు శాశ్వతంగా నిలుస్తాయన్నది.) జీవితావసాన సమయంలో వెనక్కి తిరిగి మన స్మృతిపథంలో ఏవి చల్లని మణిదీపాలవలె నిలుస్తాయంటే, చిన్ననాటి స్వప్నసీమల్లో చెలిమి, తారుణ్యపు తొలిరోజుల్లోని అనుభవాలు, సన్నిహితుల అనురాగం, ప్రేమించిన వారికోసం అవ్యాజంగా చేసిన త్యాగంలోని మాధుర్యం-ఇలాంటివే. ఈ లోపుగా మేధావుల మేళతాళాలతో ఎన్నో విప్లవాలు వస్తూనే ఉంటాయి. వాటి పని పూర్తిచేసుకు వెళుతూనే ఉంటాయి కాని, తుపానులో గడియారంవలె మానవహృదయం ఒక్కలాగే స్పందిస్తూంటుంది. ఆ స్పందనకి బధిరులైనవారు విప్లవంలో కూడా కోలాహలాన్నే వినగల్గుతారు గాని అందులోని సంగీతాన్ని ఆస్వాదించలేరు.—(గోరా)

# విదేశ రాజకీయాలు

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన నాటినుండి ఇండొనీషియా యుద్ధం ప్రజ్వరిల్లుతూ వచ్చింది. ఒడంబడికకు విరుద్ధంగా డచ్చివారు ఇండొనీషియాపై సైనిక చర్యలు జరుపుతున్న నాటినుండి ఇండొనీషియా సమస్య ఉద్ధృత రూపం తాల్చింది. ఈ సమస్య విషయమై ఇండియా మొదటినుండి అత్యధిక శ్రద్ధతో పనిచేసింది. ఇండియా, ఇండొనీషియాలకు అనేక సంబంధాలున్నాయి. వీటికంటె ముఖ్యమైనవి రాజకీయ సంబంధాలు. ఆగ్నేయ ఆసియాలో జాతీయ వాదం విజయం పొందక తప్పదు. అవిధంగా ఇండొనీషియాలోకూడా జాతీయ వాదం విజయం పొందలేకపోతే ఒక్క ఆగ్నేయ ఆసియాకే కాక ఇండియాకుకూడ తప్పక ఉపద్రవం వాటిల్లుతుంది. పాశ్చాత్యరాజ్యాలవారి సామ్రాజ్య వాదాన్ని, వలసరాజ్య నిర్మాణ ప్రాభవాన్ని మొదలంట తొలగించవలసిన గురుతరమైన బాధ్యత ఆసియా వాసులపై ఉంది. అందుకే ఆసియాలో అనేక పోరాటాలు జరిగాయి, జరుగుతున్నాయి. ఇండొనీషియా పోరాటంకూడ అందులో ఒకభాగమే. సామ్రాజ్య వాదాన్ని ప్రతిఘటించే ఇండియా సామ్రాజ్య వాదులతో జరిగే పోరాటాన్ని తప్పక బలపరుస్తుంది. అందుకే ఇండొనీషియా సమస్యను చర్చించడానికి ఇండియా ఆసియా రాజ్యాల సభలు ఢిల్లీలో ఏర్పాటుచేసింది. ఇండొనీషియా సమస్యను ఐక్యరాజ్య సమితి ముందు తీసుకురావడానికి ముఖ్యంగా ప్రయత్నించిన దేశం ఇండియా. ఐక్యరాజ్య సమితి డచ్చి, ఇండొనీషియన్ల మధ్య సామరస్యం చేకూర్చడానికి ఇండొనీషియా కమీషన్‌ను ఏర్పాటు చేసింది. ఆ కమీషన్ నిరంతరకృషి ఫలితంగా డచ్చివారికి, ఇండొనీషియన్లకి మధ్య ఒడంబడిక కుదర్చగలిగింది. తద్వారా ఇండొనీషియాలోని రెండు ప్రముఖ రాజకీయ కక్షలైన రిపబ్లికన్, ఫెడరలిస్టుల మధ్యకూడ సామరస్యం ఏర్పడింది.

ఈ ఒడంబడిక కుదుర్చుకొనే సందర్భంలో డచ్చివారు, రిపబ్లికనులుకూడ అనేక మెట్లు దిగి క్రిందికి వచ్చారు. ఉభయులు యుద్ధవిరమణకు అంగీకరించారు. ఇండొనీషియా జాతీయనాయకులను విడుదల చెయ్యడానికి డచ్చివారు సమ్మతించారు. జోగ్జకర్తాలో రిపబ్లిక్ ప్రభుత్వం తిరిగి స్థాపించడానికి సైతం డచ్చివారు సమ్మతి తెల్పారు. ఒడంబడిక ప్రకారం ఇండొనీషియా, డచ్చి ప్రభుత్వాల భావి సంబంధాలు నిర్ణయించడానికి హేగ్‌లో సమావేశం జరుపవలసి వచ్చింది. ఈ సమావేశంలో రిపబ్లికనులు, ఫెడరలిస్టులు కూడ పాల్గొనడానికి సమ్మతించారు. ఈ సమావేశం ఆగష్టు 23 న ప్రారంభం అయింది.

డచ్చి, ఇండొనీషియాల చరిత్రలో హేగ్ సమావేశానికి అత్యధిక ప్రాధాన్యం ఉంది. ఈ సమావేశ ఫలితంగా డచ్చివారికి, ఇండొనీషియన్లకు ఉండబోయే సంబంధాలు నిర్దుష్టంగా తేలిపోతాయి. ఆసియాదేశాలలోని జాతీయ వాదులు, పాశ్చాత్య దేశాలలోని- ముఖ్యంగా బ్రిటన్, అమెరికాలలోని రాజకీయ నాయకులు, యూవత్ప్రపంచపు వాణిజ్యవర్గాలవారు ఈ హేగ్ సమావేశపు సత్ఫలితాలకై ఎదురు చూస్తున్నారు. డచ్చివారికి, ఇండొనీషియన్లకు శాశ్వత స్నేహసంబంధాలేర్పడి, స్వతంత్ర ఇండొనీషియా ఏర్పడితే అప్పుడే అట్టి ఇండొనీషియా కమ్యూనిస్టు వ్యాప్తిని అరికట్టగల స్థావరంగా ఉంటుందని ఆయావర్గాలవారు భావిస్తున్నారు.

ఈ హేగ్ సభలో ముఖ్యంగా తేలవలసిన విషయం ఒక్కటే. అది ఇండొనీషియాలో ఏర్పడనున్న సంయుక్త రాష్ట్రప్రభుత్వానికి డచ్చివారు తమ అధికారాన్ని పూర్తిగా బదిలీ చెయ్యాలి అన్న విషయమే. నూతన రాజ్యానికి డచ్చి సింహాసనంతో సంబంధం ఉంటుందన్న విషయం సుస్పష్టం. ఈ సంబంధం ఇండొనీషియా సర్వ స్వతంత్రతకు భిన్నంగా వర్తించే

ట్టుగా రిపబ్లికనులకు తోస్తే వారు అట్టి సంబంధానికి అంగీకరించరు. ఈ హేగ్ సభ కాల పరిమితి ఎక్కువగా ఉంటే అది ఇండొనీషియన్లకు అనుమానాస్పదంగా ఉంటుందనే విషయాన్ని రిపబ్లికన్ ప్రధాని డాక్టరు హట్టా విశదపరిచాడు. స్వతంత్ర ఇండొనీషియా, డచ్చి యూనియన్ నియమావళిని తయారు చేయడమన్నదే రౌండుటేబిల్ సమావేశానికి క్లిష్ట సమస్య. ఈ సమావేశంలో డచ్చి న్యూగినీ భవిష్యత్తుపై పేచీవచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. డచ్చివారు తూర్పు ఇండొనీషియాను నెలకొల్పుతూ న్యూగినీని తమ పరిపాలన ప్రాంతంగా ప్రకటించారు. న్యూగినీ మంచి ప్రకృతి సంపదలు, గనులతో నిండిన ప్రాంతం. ప్రజాభిప్రాయ స్వీకరణ, ప్రకృతి సంపదల పరిశోధన జరిగేవరకు న్యూగినీ తమ పరిపాలిత ప్రాంతంగా ఉంటుందని అప్పట్లో డచ్చివారు ప్రకటించారు. కాని ఈ సమావేశంలో న్యూగినీకూడ ఇండొనీషియా సమాఖ్యలో చేరిపోవలసి ఉంటుందని రిపబ్లికన్లు పట్టుపట్టవచ్చును.

సమావేశంలో పాల్గొంటున్న పార్టీల ఆశయాలలోగూడ భేదాలు గోచరిస్తున్నాయి. ముందు త్వరతగా అధికారప్రదానం జరగాలి, ఆపిమ్మటే స్వల్పవిషయాల పరిష్కారానికై ప్రయత్నాలు జరగాలి అనే పంథాలో రిపబ్లికన్ ప్రధాని డాక్టర్ హట్టా మాట్లాడుతున్నాడు. అధికారప్రదానం నిర్నిబంధంగా జరగాలని రిపబ్లికన్లు కోరుతున్నారు. కాని ఇది అసంభవం- రెన్విల్లీ ఒడంబడిక ప్రాతిపదికమీదనే అధికార ప్రదానం జరగాలి అనే దృక్పథంతో వాన్‌రోయన్ ఉన్నాడు. ఇక రిపబ్లికన్, ఫెడరలిస్టు దృక్పథాలలో గూడ వ్యత్యాసాలున్నాయి. ఈ విభేదాలు మొదటినుంచి ఉన్నవే. డచ్చి వారి పట్ల ఇండొనీషియన్లు వహించవలసివున్న దృక్పథంలోను, ఆర్థిక పునర్నిర్మాణ విషయంలోను ఉభయులు భిన్నాభిప్రాయాలు కల్గివున్నారు. రాజకీయ స్వాతంత్ర్యానికై పోరాటం సల్పిన పార్టీ రిపబ్లికన్ పార్టీ. డచ్చివారితో సహకరిస్తానే ఇండొనీషియా యొక్క ఆర్థిక పునర్నిర్మాణం జరుగ వలసివుందని ఫెడరలిస్టుల వాదం. డచ్చివారి పెట్టుబడుల మూలంగానే ఇండొనీషియాకు ఆర్థికస్తోమత కలుగుతుందని ఫెడరలిస్టులు నమ్ముతారు. డచ్చివారి పెట్టుబడుల వల్ల లాభం ఏమాత్రం ఉండదనీ, పైపెచ్చు నష్టం గూడా సంభవిస్తుందనీ రిపబ్లికనులు అంటారు. ఇండొనీషియా సర్వస్వతంత్ర ప్రతిపత్తి పొందగానే అనేక విదేశీయులు పెట్టుబడులు పెట్టడానికి ఉత్సుకత చూపుతారని రిపబ్లికనుల భావన. ఇక యూనియన్ స్థాపన విషయంలో కూడ ఉభయ పార్టీలకు విభేదా లున్నాయి. కాని హేగ్ సమావేశంలో డాక్టర్ హట్టా చేసిన ప్రసంగం గమనిస్తే ఇండొనీషియాలో డచ్చి పెట్టుబడులకు రిపబ్లికనులు విముఖంగా లేరని స్పష్టమౌతుంది. ఇండొనీషియాకు సర్వస్వాతంత్ర్యం ఇస్తే తమ పెట్టుబడులకు నష్టం కలుగుతుందేమోనని డచ్చివారు భయపడ నక్కరలేదు. అంతా సౌమ్యంగా వ్యవహరిస్తే హేగ్ సమావేశంలో ఈవిభేదాలు అంతగా బయటపడక పోవచ్చును.

సంయుక్త ఇండొనీషియాకు అధికార ప్రదానం చేస్తామనీ, తాము చేసిన నిర్ణయానికి తిరుగు ఉండబోదనీ సమావేశ ప్రారంభంలో డచ్చి ప్రధాని డ్రీస్ వ్యక్తపరచడం సంతోషించ తగ్గ విషయమే. ఇండొనీషియాకు అధికార ప్రదానం చేయడమే తమ ఆశయమైనపుడు అది రిపబ్లికనులు కోరుతున్నట్లు త్వరతగా, సమగ్రంగా, వాస్తవమైనదిగా ఉండేటట్లు చూడడానికి డచ్చివారు ఎందుకు ఉత్సాహం కనపరచడంలేదో కారణం గోచరించదు. అధికారప్రదాన విషయంలో డచ్చివారు ఇంగ్లీషువారినుండి గుణపాఠం నేర్చుకోవలసి వుంది. ఆ విధంగా డచ్చివారు ప్రవర్తిస్తే, ఇండియా బ్రిటనుపట్ల స్నేహభావం చూపుతున్నట్లే ఇండొనీషియన్లుగూడ డచ్చివారిపట్ల సఖ్యత చూపగలరు.

కాబట్టి హాలెండ్-ఇండొనీషియాల క్షేమం, పరస్పర సహకారం- ఈ రెండే డ్రీస్ అన్నట్లు డచ్చివారి ఆశయాలైతే ఆ ఆశయసాధనకు సత్వర సమగ్ర స్వాతంత్ర్యప్రదానం ఒక్కటే మార్గం. దీన్ని హేగ్ సమావేశంలో సాధించ కలిగితే డచ్చివారు వివేకవంతు లనిపించుకుంటారు.

—తాడిమళ్ల జగన్నాథరావు

డబ్బుతో మహేంద్రజాలం

# ఎన్నికల మన్నిక లెవరికి?

సిద్ధాంతి మల్లికార్జునం

ప్రజాస్వామిక సూత్రాలను కొద్దిగానో గొప్పగానో ఆచరణలో పెట్టని రాజ్యాంగ విధానం నేటి ప్రపంచంలో అరుదనే చెప్పాలి. ఈ సూత్రాలను ఆచరణలో పెట్టని రాజ్యాంగ విధానాన్ని ఫాసిస్టు, లేక ఫ్యూడల్ రాజ్యాంగ విధానమని వ్యవహరించడం పరిపాటి. ఈ సూత్రాలను ఆచరణలో పెట్టుతున్నామని, చాటించుకోడం నేడొక నాగరిక లక్షణమైంది. అలా చాటించుకునే వారిలో మనం కూడా చేరాము.

ఈ సూత్రానికి పునాది ఎన్నికలు. ఎన్నికల మూలాన ప్రజాభిప్రాయం బాగా వ్యక్తమౌతుందని భావన. ఎన్నికలు ఒక వ్యక్తి సామర్థ్యాన్ని పరీక్షించగలవనే నమ్మకం కూడా వుంది. సమర్థులైన వ్యక్తులు పరిపాలకులైనప్పుడు మానవులు కోరదగిన దింకేమీ బహుశా ఉండదు.

కాని మిలమిల మెరిసే ఈ ఆదర్శభావాలు ఎంతవరకు ఆచరణలో పెట్టబడుతున్నాయనేదే ప్రశ్న. అందుకై స్వతంత్ర భారతదేశంలో ఎన్నికల తతంగమంతా తెలుసుకోడం ప్రతి వ్యక్తికీ అత్యవసరం. అది తెలుసుకున్ననాడు మన జీవిత సర్వస్వము తెలిసినట్లే అవుతుంది.

ప్రజాప్రభుత్వంలో ఎన్నికల పరీక్షకు ఎదురు నిలిచి గెలుపొందిన సామర్థ్యం గల ప్రతి వ్యక్తీ అత్యున్నత దశకు రాగల అవకాశాలున్నాయన్నది లోకవిదితమే. నిజానికి నేటికి ఎందరు అటువంటి వ్యక్తులు అత్యున్నతదశకు వస్తున్నారు? ఉదాహరణకు, సర్వసాధారణంగా ఇంచుమించు ప్రతిపల్లెలోను, పట్నవాసంలోను జరిగే కోఆపరేటివ్ స్టోర్సు, పంచాయతీ బోర్డు, మునిసిపాలిటీ, జిల్లాబోర్డు, అంతదూరం వస్తే శాసనసభ ఎన్నికలప్పుడు సమర్థులే పరిపాలక వర్గంలోకి వస్తున్నారా? ఈ ప్రశ్నకు - నూటికి తొంభైమంది అసమర్థులే ఎన్నికలలో దిగ్విజయ మందుకున్నారనడంలో ఆశ్చర్యం గాని, అతిశయోక్తి గాని లేదు.

ఎన్నికలముందు, నిలువదలచుకున్న అభ్యర్థులకు ప్రచారం ముఖ్యమైంది. ఈ రోజుల్లో మంచికి చెడ్డకుకూడా ప్రచారం చాలా అవసరం. ప్రచారం అధికవ్యయంతో కూడుకొనివుంటుంది. అధిక వ్యయం చెయ్యగల వ్యక్తులే ఎన్నికలలో పాల్గొనడానికి ముందుకు దూకుతారు. ఇంత ప్రచారం చెయ్యడానికి తాహతున్నప్పుడు, ప్రచారమే విజయసాధనమైనప్పుడు తెలివితేటలతోగాని, సామర్థ్యంతోగాని అవసరమేమిటి? సమర్థత, బుద్ధిబలం వుండికూడా ధనలోపంవల్ల, ప్రచారలోపంవల్ల విజయలోపము పొందుతున్నారు చాలామంది.

ప్రచారసాధనం చేతిలోవున్న ధనికుల ఓట్లకై ఎన్నెన్నో తంటాలు పడుతుంటారు. ఎన్నికలకు ముందు ఓటర్ల ఇండ్లచుట్టూ తిరిగి తిరిగి వారి కాళ్లావేళ్లా పట్టుకొని, త్రోసిచెయ్యలేని మోహమాటాలను వారిపై ప్రయోగించి, ఘరానా మనుషుల దగ్గరినుంచి సిఫారసుల తెచ్చుకొని, వాటితో ఓటర్లను బంధించి, ఏటన్నిటికీ ఎదురు తిరిగిన మొండి ఘటాలకు లంచాలు పోసి తృప్తిపరచి వారి ఓట్లను సంపాదించడానికి భగీరథ ప్రయత్నాలు చేస్తారు. ఒక్కొక్కప్పుడు ఓటరుకు అప్పు ఇచ్చినవారినికూడా పట్టుకొనివచ్చి ఓటరుమీదికి ప్రయోగిస్తారు. ఇంకా, పలుకుబడి చాలా కలిగి ఏకైక నాయకులనిపించుకొనే కొందరు వ్యక్తులు అతిదారుణమైన కొన్ని అక్రమాలకు పాల్పడుతుంటారు. పోలింగు పూర్తయిన తర్వాత, ఓట్ల పెట్టెల సీళ్లు పగులగొట్టి స్వలాభదాయకమైన పనితనాలెన్నో చేస్తుంటారు. అయినా ఇవి ఈనాడు చాలా సహజమై పోయాయని కొందరు మిత్రులంటూవుంటారు. అవును. పదవీ వ్యామోహము, పలుకుబడి 'సామర్థ్యము' కలవారెంతకైనా సమర్థులే. అటువంటివారు స్వార్థపోషణకొరకు పార్టీలకు

శలవిస్తారు. పార్టీని బలపరచుకోడానికి, ఈ రోజుల్లో పత్రిక అవసరం. తమ అక్రమ చర్యలకు పైపూత పూస్తూ, సమర్థిస్తూ 'ప్రజాసేవ' చెయ్యటానికి పత్రిక ఎంతో ఉపయోగ పడతాయి.

ఎన్నికలలో విజయం పొందటానికి కొందరు వ్యక్తులు, ఐకమత్యంతో వున్న సంఘాన్ని చీల దియ్యడానికి పూనుకుంటారు. (ఈనాడు అధిక సంఖ్యాకులైన హరిజనుల ఓట్లు సంపాదించడానికి కాంగ్రెసువారు బ్రాహ్మణులపై ఎంతటి, ఎటువంటి విషప్రచారం జరుపుతున్నారో వర్ణనాతీతం.) ఓట్ల సంపాదనకు కొన్నికొన్ని కులాల పెద్దలను స్థానిక సంస్థలందు ఏదో ఒక స్థానంలో అభ్యర్థిగా నిలబెడ్తారు. దీనితో ఆయా కులాల వారంతా ఆనందభరితులై ఆ వ్యక్తులను నాయకులుగా పూజించ నారంభిస్తారు. అంతేగాని అందులోని అంతర్నాటకం గ్రహించరు. అలాంటి అవసరం వారికి లేనేలేదు. ఈవిధంగా నిలబెట్టబడిన అభ్యర్థులకు తామెందుకక్కడికి వెళ్ళుతున్నారో, తమ విధ్యుక్తధర్మం లేవో ఎంతమాత్రం తెలియవు. ఏదో ఒక పదవి దొరికిందని ఆ పదవికి కారకులైనవారు ముక్కుకు తాడుగట్టి ఎటులాగితే అటు వెళ్ళటం, ఏం చెయ్యమంటే అది చెయ్యడం, తమనాయకత్తులా వారికి సహాయం చెయ్యడం మాత్రం తెలుసు. ఇటువంటి సంస్కారశూన్యులు పదవీవ్యామోహపరులైనప్పుడు దేశానికి అరిష్టాలు కాక మరేవీ రావు. పైపనులన్నీ తమ పలుకుబడిని వృద్ధి చేసుకోడానికి కొందరు వ్యక్తులు చాకచక్యంతో చేస్తూంటారు. తమ పన్నాగాలను అధికారానికి లోబడని ప్రబలవైరిని ఏదో ఒక లాభదాయకమైన పదవితో తమవైపు ఆకర్షించుకోవటం కూడా ప్రజారాజ్యంలో సంభవిస్తూంటుంది. ఈ దుర్మార్గాలన్నీ "ఎన్నికలు" అనే గొప్ప మాటక్రింద పెంపొందుతూంటాయి.

ఇక ప్రజాస్వామికంలో అధికారం పూర్తిగా ధనికుల చేతుల్లో పడుతుంది. ఈ అధికారాన్ని వారు స్వార్థానికి ఎంతో చక్కగా ఉపయోగించుకుంటారు. బిర్లా, డాల్మియాలలాంటి కోటీశ్వరులే ప్రజారాజ్యంలో నిజమైన పరిపాలన చేస్తూంటారు. పేదల కష్టాలను చూచి మొసలి కన్నీరు విడుస్తూంటారు. ఆదాయపు పన్నులు ఎగవేసే ఇలాంటి దేశభక్తులు ప్రజాస్వామిక సూత్రాన్ని జీర్ణంచేసుకున్నట్లుంటారు. వీరు తమ పలుకుబడి జారిపోకుండా ఎన్నికలప్పుడు అవసరమైతే లెక్కని రూపాయలు ధర్మం చేస్తారు. ఇది ప్రజారాజ్యం, అన్నిదేశాలలో ఈ విధంగానే పరిస్థితులుంటాయని మన తప్పును సమర్థించుకోనుట ఆత్మవంచన తప్ప మరేమీ కాదు.

అసలు ప్రజారాజ్యంలో పరిపాలన చెయ్యడానికి అర్హత కలవారు సామాన్యులే. అనగా మధ్యతరగతి వారుగానీ, మూడవ తరగతి వారుగానీ. వీరిలో మధ్యతరగతి వారే అన్నిటా సమర్థులు. సహజంగా వీరికి తెలివితేటలెక్కువ. వీరిలోనే విద్యావంతులెక్కువ. జీవితంలోని కష్టసుఖాల్లో గాడులలో నుయ్యల్లాగ బాగా నలిగి మంచి అనుభవము, ప్రపంచజ్ఞానము ఎక్కువగా ఆర్జించివుంటారు. అభ్యుదయభావాలు వీరిలోనే మొలకలెత్తుతాయి. ఇటువంటి మధ్యతరగతి ప్రజలే ప్రఖ్యాతిగన్న ఫ్రెంచి విప్లవాన్ని లేవగొట్టి కార్యసిద్ధి పొందగలిగారు. సామాన్యులు, అనగా మూడవతరగతి ప్రజలందరూ వీరి అనుకు జాడల్లోనే నడిచారు. తమ కష్టసుఖాలను గుర్తించి పరిపాలించగలరనే విశ్వాసంతో రైతు కూలీలందరూ మధ్యతరగతి వారివైపు చేరి విప్లవాన్ని విజయవంతంగా సాగించారు. నాటి విప్లవము, అభ్యుదయభావాలు నేటి ప్రపంచానికిప్పటికీ మార్గదర్శకంగా వున్నాయి. దీన్నిబట్టి మధ్యతరగతివారి శక్తిసామర్థ్యాలు అర్థం చేసుకోగలము. కాని ఈనాడు జరిగే ఎన్నికలలో వీరు విజయం సాధించలేక పోతున్నారు. డబ్బుతో మహేంద్రజాలం చేసే కోటీశ్వరుల పోటీకి వీరు ఆగలేకపోవడమే వీరి పరాజయానికి కారణం. వీరి పరాజయానికి మరొక కారణం కూడా వుంది. మధ్యతరగతివారెంతసేపటికీ కోటీశ్వరుల్లాగ ధనమార్జించి వారి అంతస్తును చేరడానికి కృషి సల్పుతూంటారే గాని, తమకన్న అధమస్థితిలో బాధపడే సామాన్యులవైపు చూడనే చూడరు. కోటీశ్వరులతో కలసి మెలసి తిరగాలని కోరికే గాని సామాన్యులతో స్నేహపు మాట్లాడడానికైనా వీరికి ఓపిక వుండదు. ఇది

పెద్ద లోపము. ఈ లోపం సవరించుకోవాలి. విశాల ఈ మధ్యతరగతివారు కోటీశ్వరులు, లక్షాధికారులు కావాలనే ఆశను త్యజించి సామాన్యులతో కలసి మెలసి తిరుగ నారంభిస్తారో అప్పుడే సామాన్యుల మనస్సుల నాకర్షించుకొని విజయం సాధించ గలుగుతారు. ఆ నాడే నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడుతుంది.

ఈ విధంగా మధ్య మూడవ తరగతులవారు కలసి మెలసి కృషిచెయ్యడానికి మన దేశంలో గొప్పగొప్ప అవకాశాలు రాబోతున్నాయి. అందులో ముఖ్యమైనది వయోజన ఓటింగ్ హక్కు. ఇది చాలా వాంఛనీయమైన సంస్కరణ. అయినప్పటికినీ ఈ సంస్కరణ వల్ల నష్టమే ఎక్కువగా లభ్యమౌతుంది. అసలు ఓటు చేసే ప్రతివ్యక్తీ తన ఓటును ఎందుకు ఏ విధంగా ఉపయోగించుకోవాలో బాగా ఎరిగుండాలి. అందుకు విద్య అవసరం. విద్యాగంధం లేనివాడు మూర్ఖుడవడమే గాక తంత్రజ్ఞులచే మలభింగా మోసగించ బడుతూంటాడు. ఇంగ్లండు అమెరికా దేశాల్లో ఈ ఓటింగు హక్కు ఉందంటే అక్కడి ప్రజలకు విద్యావంతు లవడం చేత తమ ఓటును సక్రమంగా వినియోగించడం తెలుసు. మనదేశంలో పరిస్థితులు భిన్నంగా ఉన్నాయి. దరిద్రులకు, నట్టి అమాయకులకు ఓటింగ్ హక్కు కలుగజేసినప్పుడు వారు ఎంత దూరాలోచనతో సక్రమంగా తమ హక్కును వినియోగించుకుంటారో ఊహాతీతమైన విషయం. పాశ్చాత్య దేశాల్లో వయోజన ఓటింగుహక్కు నివ్వటానికి ఎంతోకాలం పట్టింది. పరిస్థితులను జాగ్రత్తగా పరిశీలించి అత్యంతావశ్యకమని తోచినప్పుడే ఈ సంస్కరణ చేశారు. కాని మనదేశంలో సంస్కరణోద్రేక పూరితులు, తొందరపడి, ఏదో ఒక రకంగా ముగించి పారెయ్యాలనే పద్ధతిలో ఈ సంస్కరణ చేశారనే చెప్పాలి.

ఇటువంటి సంస్కరణ చెయ్యటంలో కాంగ్రెసుకు ముఖ్యంగా రెండు ఉద్దేశాలున్నాయని తోస్తుంది. మొదటిది- ఇదివరలో చేసిన ప్రమాణాలలో కాంగ్రెసు సామాన్యుల హక్కులను కాపాడటానికి ఒక సంస్కరణనైనా చేసిందనిపించుకొనుట. రెండవది- రాబోవు ఎన్నికలలో తాము ప్రజలకు చేసినది పురస్కరించుకొని పూర్తిగా విజయం సాధించుట. ఇది సహజమే. కాని కాంగ్రెసు తలంచినట్లే ఇతర పార్టీలవారుకూడా ఎన్నికలలో విజయం పొందవలెననే కృషిచేస్తున్నారు. కాంగ్రెసు కెంత పదవీ వ్యామోహమున్నదో ఇతర పార్టీలకుకూడా అంతే వుంది. కాంగ్రెసు ఇది గమనించాలి. మరి కాంగ్రెస్ కిది గిట్టముగా. కాంగ్రెసు నేర్పిన "ఎలెక్షన్ స్టంట్సు" (election stunts)మిగతా పార్టీల వారుగూడా నేర్చారు. రెండాకు లెక్కువగా చదివారుకూడా. ఆర్థిక దుస్థితిని ఊతగా తీసుకొని సామాన్య ప్రజానీకాన్నంతటినీ ఒక్క పెట్టున తమవైపు త్రిప్పుకోడానికి సోషలిస్టులు, కమ్యూనిస్టులు భగీరథ ప్రయత్నాలు చేస్తున్నారు. మతాన్ని ఊతగా తీసుకొని ఆర్. ఎస్. ఎస్., హిందూమహా సభలవారు ప్రజాభిప్రాయాన్ని వశపరచుకోడానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నారు. కాంగ్రెస్ వారి అభిప్రాయంలో తాము దేవతలని, మిగిలిన వారు రాక్షసులని. ఈ దేవాసురులు అధికారామృతంకొరకు భారతీయ ప్రజా సముద్రాన్ని మథిస్తున్నారు. మరి అమృతం ఎవరికి లభిస్తుందో! పాపం కాంగ్రెస్ పార్టీ మాత్రం ప్రాజెక్టులు కొత్తవి నిర్మిస్తామని, జమీందారీలను రద్దు చేస్తామని, కమ్యూనల్ జి. ఓ. ప్రకారం (మద్రాసులో) అన్ని కులాలవారికీ ఉద్యోగాలిస్తామని, అసలు స్వర్గాన్నే భారత దేశంలో దింపుతామని ప్రజలకు నొక్కినొక్కి చెబుతున్నారు.

ఇంతకూ తమ కష్టసుఖాలను కనిపెట్టి పరిపాలించే పార్టీ ఏదో ప్రజల కర్థంకావటం లేదు. ముఖ్యంగా రాబోయే ఎన్నికలలో డబ్బుతో చాలా పనుంటుందన్న విషయం లోకవిదితమే. ఎవరు రూపాయలు చూపిస్తే ఈ బీద ప్రజలు వాళ్ళవైపుకే మొగ్గుతారు. ఏదియేమైనా కాంగ్రెస్ వెనకటి రోజుల్లోలాగ సంపూర్ణ విజయం సాధిస్తుం దనటానికి లేదు. ఇతర పార్టీలు నామరూపాలు లేకుండా పోగల వనడానికి వీల్లేదు.

# పౌరస్వత్వాలు : కాంగ్రెస్ నిర్వచనం

భట్టిప్రోలు హనుమంతరావు

ఒక ప్రభుత్వం ప్రజాస్వామ్యమో, నియంతృత్వమో తెలుసుకోడానికి అందు వ్యక్తి అనుభవించే స్వేచ్ఛాపరిమాణమే గీటురాయి. 'స్వేచ్ఛ' వ్యక్తిపరంగాను- 'స్వాతంత్ర్యం' జాతిపరంగానూ వాడితే, ఒకదేశం స్వతంత్రమై వుండవచ్చుగాని అందరి ప్రజలకు స్వేచ్ఛ లేకపోవచ్చు హిట్లర్ కాలంలో జర్మనీ స్వతంత్ర దేశమే; కాని ప్రజల కేమాత్రం స్వేచ్ఛలేదనే హిట్లర్ పరిపాలనను మనం నిందించేది. స్వేచ్ఛ అంటే అరాజకలక్షణమైన విశృంఖలత మాత్రం కాదు; ప్రజలకుండే హక్కుల మొత్తమే స్వేచ్ఛ. ఇది చేయరాదు, అది చేయరాదు అని నిషేధాలద్వారా వ్యక్తుల చర్యలను అరికట్టేవి కాదు హక్కులు. వ్యక్తిచర్యకు విశాలపరిధిని చేకూర్చేవే హక్కులు. హక్కులే పౌరస్వత్వాలు అను మరొక పేరుతోకూడా వ్యవహరించబడుతున్నాయి.

యథార్థమగు మానవహోదా నిచ్చి, భౌతిక నైతిక రంగాలలో జీవితాన్ని ఉన్నతస్థాయికి కొనిపోవాలంటే వ్యక్తికి హక్కులు తప్పని సరి. భౌతికంగా అంటే కూడు గుడ్డల సంపాదనా, వాటికి సంబంధించిన సమస్యల పరిష్కారానికి— నిరుద్యోగనిముక్తికి, సక్రమవేతనానికి, సమ్మెకు— హక్కు లుండాలి. నైతికరంగంలో కావలసింది మానసిక స్వాతంత్ర్యం - ఆలోచనాపథంలో స్వేచ్ఛ. ఆలోచనకు రూపం వాక్కు. వాక్కు రచనలోనే శాశ్వతత్వం పొందుతుంది. కాబట్టి ఆలోచన, భాషణ, ముద్రణ హక్కులు లేనిచో నైతికరంగంలో వ్యక్తి హక్కులు సంపూర్ణత్వాన్ని పొందలేవు. వ్యక్తి భౌతికజీవితాభివృద్ధి మానసికమైన భావాల పురోగమనంపై ఆధారపడివున్నది. అందుచేత ఈ హక్కులు లేనిచో మానసికంగా వ్యక్తి స్తంభించి భౌతిక పురోగమనం ఆగిపోతుంది. జాతీయాభివృద్ధి నిలిచిపోతుంది.

పౌరస్వత్వాలతో ఏర్పడిన వ్యక్తి స్వేచ్ఛను గుర్తించి రక్షించటమే ప్రజాప్రభుత్వ బాధ్యత. ఆంగ్లప్రభుత్వం, న్యాయవిరుద్ధమైన అనాగరిక శాసనముల ద్వారా, భారతీయుల సర్వతోముఖ పురోభివృద్ధికి అవసరమైన స్వేచ్ఛా వాతావరణానికి భంగం కలిగిస్తున్నదనే కదా, స్వపరిపాలనోద్యమం సాగించి మన దేశంలో ? నేడు విదేశపాలన తొలగిపోయింది. ప్రభుత్వం స్వదేశీయుల హస్తగతమైంది. నేడు అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీ, స్వాతంత్ర్యోద్యమంలో పౌరస్వత్వాలను మన్నించే ప్రజాస్వామ్యాన్ని ప్రజలకు వాగ్దానం చేసింది. కాని నేడు ఆచార్య నీలకంఠ శాస్త్రిగారు చెప్పినట్లు మన దేశ రాజకీయరంగంలో ప్రాథమిక స్వత్వాల ఛాయలు కూడా కన్పించటం లేదు. విదేశ పరిపాలనా సాధనాలు యథాతథంగానే ఉన్నై; రంగు మాత్రం మారింది. అధికారం అవినీతి పాలుచేస్తుందని పెద్దలు చెప్పినమాట కాంగ్రెస్ విషయంలో మాత్రం ఎందుకు వర్తించదు? అంతేగాక ఏకపక్ష ప్రభుత్వాల అనుభవం ప్రపంచానికి చాలా ఉంది. ఇట్టి పార్టీప్రభుత్వాలు పౌరస్వత్వాలను మన్నించగలవనడానికి చారిత్రికంగా ఋజువు లభించడం లేదు. రష్యా బోల్షివిక్ పార్టీ, ఇటలీ ఫాసిస్టుపార్టీ, జర్మనీ నాజీపార్టీల ఉదాహరణ చాలదా ? తానే దేశానికంతా ప్రతినిధి నని కాంగ్రెస్ చెప్పుకుంటూనే ఉన్నది గదా!

పార్టీవిధానాన్ని పరిశీలించితే — అధికారంలో ఉన్న పార్టీ తనకు బలం చేకూర్చే వర్గం యొక్క శ్రేయస్సును రక్షించటానికే సాధ్యమైనంత వరకు ప్రయత్నిస్తుంది. ఆ కార్యక్రమంలో పౌరస్వత్వాలను నేలమట్టం చేయవలసి వస్తుంది. దురదృష్టవశాత్తు కాంగ్రెస్‌లో ధనిక వర్గాల పలుకుబడి అధికం కానొచ్చింది. పార్టీలన్నిటిలోకీ కాంగ్రెస్ పెద్దపార్టీయే ననప్పటికీ దేశం మొత్తంమీద అల్పసంఖ్యాక వర్గమే

అవుతుంది కదా! "శాసనాధికారం చేతుల్లో ఉండటంవల్ల ప్రధానమంత్రులకు దేశప్రభుత్వం, పార్టీ అధికార యంత్రమౌతుంది. ప్రభుత్వంలో ఉన్న పార్టీ, ఆ అవకాశంవల్ల తన ఇష్టాన్ని శాసనంగా చేయవచ్చు" అని హెరాల్డు లాస్కీ అన్నట్టు కాంగ్రెస్ నిరంకుశంగా ప్రవర్తించసాగింది. చివరకు స్నేహపూర్వకమైన నిర్మాణాత్మక వ్యాఖ్యలు, విమర్శలంటే కాంగ్రెస్‌కు అవమానం నానాటికీ మితిమీరిపోతోంది. కాంగ్రెస్ అధికార దౌర్జన్యానికి తొలిగా బలైయింది రాష్ట్రీయ స్వయంసేవక సంఘం. సంఘ సభ్యులను అరెస్టుగావించింది; ప్రభుత్వంలో ప్రజలకు విశ్వాసం లేదనే సత్యం బయలుపడుతుందనే భయంతో. 85 కోట్ల రూపాయలు పాకిస్థాన్‌కు జమ కట్టటంవల్ల ప్రభుత్వంపై అసంతృప్తి కలిగింది. ఇందుకు ప్రజలను నిందించి ప్రయోజనం లేదు. మొదటినుండీ కాంగ్రెస్ ప్రచారంచేసిన జాతీయ, కులతత్వ రాజకీయాలవల్ల, పాకిస్థాన్ విషయంలో కాంగ్రెస్ లీడర్ల మధ్య చాలాకాలంజరిగిన వివాదంవల్ల ముస్లిముల పట్ల ద్వేషం ప్రబలి హిందువులలో చాలామంది ఆర్. ఎస్. ఎస్. సానుభూతిపరులైనారు.

ఆర్. ఎస్. ఎస్. తర్వాత కాంగ్రెస్ బారి పడింది కమ్యూనిస్టులు. ఇందుకు కమ్యూనిస్టుల విధ్వంసాత్మకమైన కార్యక్రమమే కారణం. అధికార సంపాదన కమ్యూనిస్టులు శ్రామిక వర్గాన్ని వాడుకుంటారు. అకారణంగా సమ్మెలు చేయించడం, అశాంతి పరిస్థితులలో కుట్రలు పన్ని తిరుగుబాటు లేవదీయడం వీరి ఆయుధాలు. ఇట్టి వీరి కార్యక్రమం, ప్రశాంతికి, ప్రజల క్షేమానికి అపాయకరం కావడమేకాక భవిష్యత్తునుగూర్చి ఆలోచించడానికికూడా అవకాశమీయదు. అందుచే ప్రభుత్వం వీరిని సాకుగా వాడుకొని ప్రజల హక్కులను తుదముట్టిస్తున్నది. ప్రభుత్వం బలపడి, పౌరస్వత్వాలు నశించటానికి తమ విధ్వంసక చర్యలే కారణం ఔతున్నవనే జ్ఞానం కమ్యూనిస్టులకు కలగకపోవటం చాలా శోచనీయం. కమ్యూనిస్టులపై ప్రభుత్వం ప్రయోగించిన అస్త్రం ఇతర ట్రేడ్ యూనియన్లనూ, ప్రజల హక్కులనూ కూడా మింగివేస్తోంది.

పారిశ్రామిక రంగంలోనూ, పన్నుల విషయంలోనూ, విదేశ వాణిజ్యమందూ ప్రభుత్వం అవలంబించే విధానాలు ప్రజల జీవనవ్యయమును చాలారెట్లు పెంచాయి. కాని వారి ఆదాయాలు యథాప్రకారమే. అందువల్ల ప్రజలలో ఆలజడులు ప్రారంభంకాకమానవు. ఈ ఆలజడులన్నీ కమ్యూనిస్టులు ప్రోత్సహించినవే అని ప్రచారం చాటి అణచివేస్తోంది ప్రభుత్వం. ట్రేడ్ యూనియనుల సభ్యులు వేలకువేలు విచారణ లేకుండా జైళ్ళలో క్రుంగుతున్నారు. శ్రామికులకు (ముఖ్యంగా రైలు, తపాలాపనివారికి) గల సమ్మె హక్కును కూడా చట్టవిరుద్ధంగా ప్రకటించడానికి ప్రభుత్వం వెనుదీయటం లేదు. సాధారణ పౌరుడికున్న సమావేశ స్వాతంత్ర్యం నశిస్తున్నది. సమావేశాలు, ఊరేగింపులూ, ఆయుధ ప్రయోగంతోనూ, బాష్పవాయు ప్రయోగంతోనూ మాపుచేయబడుతున్నాయి. అన్ని ముఖ్య నగరాలలోనూ 144 వ సెక్షన్ అమలులో ఉన్నది. ఈ సంఘటనలన్నిటినీ పరిశీలించినచో- ప్రజలలో ప్రభుత్వమునందు భయాన్ని కలిగించటమే ప్రభుత్వాశయంగా కనబడుతుంది. లేకపోతే కమ్యూనిస్టుల పేరుతో దేశంలో పోలీసులు జరిపే అవినీతి కృత్యాలను ప్రభుత్వం అరికట్ట ప్రయత్నించకుండటంలో అర్థంలేదు.

కార్యవర్గంపై శాసనసభలకు గల ప్రాబల్యాన్నిబట్టి ప్రభుత్వం ఎంతవరకు ప్రజాస్వామ్యమో గ్రహించగలం. కార్యవర్గం, శాసనసభల నిర్ణయాలను ఆచరణలో పెట్టటానికై ఉన్న సాధనం. అందుచే ప్రజాప్రభుత్వంలో కార్యవర్గం నిలకడ శాసనసభల సానుభూతిపై ఆధారపడి ఉంటుంది. ఇంతవరకూ స్వతంత్ర భారత రాజ్యాంగచట్టం కార్యవర్గానికి ఇచ్చిన హక్కులు ప్రజాప్రభుత్వాన్ని సూచించటం లేదు. పత్రికా స్వాతంత్ర్యాన్ని, ప్రజల ప్రాథమిక స్వత్వాలనూ రద్దుచేయడం కేవలం అనుమానంపైనే. విచారణలేకుండా వ్యక్తులను జైలులో ఉంచడం మొదలైన హక్కులన్నీ కార్యవర్గానికి ఉన్నాయి. అంతేగాక తాత్కాలిక శాసనాల అమలు జరపటానికి, అత్యవసర పరిస్థితులలో శాసనాధికారం స్వీకరించటానికి కార్యవర్గానికి హక్కు యివ్వబడింది. అనగా శాసన

పరిధిలో ఆమోదం లేకుండా శాసనాలు చేయవచ్చు ననే మాట. అత్యవసరపరిస్థితిని నిర్ణయించేది కూడా కార్యవర్గమే కావటంచేత ఎట్టి పరిస్థితి యైనా అత్యవసరమే కావచ్చు. కార్యవర్గం దృష్టిలో. ఈ అధికారాలవల్ల కార్యవర్గంపై శాసనసభల పెత్తనం చాలాస్వల్పమని తేలుతుంది.

స్వతంత్ర భారత రాజ్యాంగంలో పౌర స్వత్వాలు నామమాత్రాలని రాజ్యాంగ చట్టంలో ప్రజల ప్రాథమిక హక్కులను గూర్చిన 19 వ ఆర్టికలు పరిశీలించితే బోధపడుతుంది. అన్ని హక్కులూ పేర్కొనబడ్డాయి. కాని ఈ హక్కులు నిష్ప్రయోజనం అవడానికి వీలైన నిబంధనలు కూడా ప్రక్కనే పొందుపరుపబడ్డాయి. హక్కులను మించిపోయాయి ఈ నిబంధనలు. ప్రజల హక్కులు ఏవీ కూడా ప్రస్తుతం అమలునందున్న శాసనాలకు అతీతములు కావు. ఆంగ్లేయులు తమ పరిపాలనను సుస్థిరం చేసుకోడానికి చేసిన బెంగాలు,మదరాసు, బొంబే రెగ్యులేషన్ చట్టములు ఇప్పటికి కూడా అమలునందున్నవే! మన ప్రభుత్వం అమలు జరిపిన ప్రెస్ శాసనాలు, ఎమర్జెన్సీ శాసనాలు అన్నిటికీ ప్రజల హక్కులు లోబడి ఉండవలసినదే. దరిమిలా కార్యవర్గం చేసే శాసనాలకు కూడా పౌరస్వత్వాలు లొంగవలసినదే! వి అధికారి ఇచ్చిన ఆజ్ఞయైనా కార్యవర్గ శాసనమే గదా! హక్కులన్నిటికీ సంబంధించిన ఈ నిబంధనలు గాక ఒక్కొక్క హక్కుకూ ప్రత్యేకమైన నిబంధనల జాబితా ఉంది. ఉదాహరణకు వాక్స్వతంత్ర్యాన్ని తీసుకొందాం. ప్రజాస్వామ్యానికి ప్రాణంలాంటిది. ఇతర హక్కులకు చైతన్యమిచ్చేది వాక్స్వతంత్ర్యమే. రాజ్యాంగచట్టం ప్రకారం వ్యక్తి తనకు గల వాక్స్వతంత్ర్యాన్ని అవినీతికరం గానూ, ప్రభుత్వపునాదులకు భంగం కలిగించేలాగునా ఉపయోగించకూడదు. అధికారంలో ఉన్న వారిని విమర్శించడం, ప్రభుత్వ చర్యలను వ్యాఖ్యానించడమూ కూడా ప్రభుత్వపు పునాదులకు భంగం కలిగించడమే అవుతుంది! ఇక ప్రభుత్వం చేసే శాసనాలను విమర్శించడం అవినీతియే అవుతుంది; ఈ మాత్రం అధికారంలేని హక్కువల్ల ప్రయోజన మేమీ బోధపడదు. అసలు ప్రజాస్వామ్యంలో ప్రజలకున్న హక్కు ప్రభుత్వాన్ని నిర్భయంగా విమర్శించడమే. అది లేనినాడు ఆ ప్రభుత్వం ప్రజాస్వామ్యమే కాదు. ఈ విధంగానే మిగిలిన హక్కులుకూడా, ప్రభుత్వ సభ్యుల అధికారానికి భంగం కలిగించనంతవరకూ సమ్మతింపబడ్డాయి. తేలిన సారాంశం - పౌరస్వత్వాలు ప్రభుత్వ దయాధర్మాలపై ఆధారపడివున్నాయి. వ్యక్తి హక్కులను సంకుచితపరచే నిబంధనలన్నీ కార్యవర్గానికి బలం కూరుస్తాయి. ఈ ఆర్టికలును చూసి "టైమ్సు ఆఫ్ ఇండియా" వార్తా సంపాదకుడు శ్రీ యస్. వి. కొజకర్ గారన్నట్లు రాజకీయాధికారం భారతీయుల ఆత్మలను మొద్దుబారునట్లు చేసింది. ప్రాథమిక స్వత్వాలకై వారు చేసిన పోరాటపు స్మృతినికూడా తుడిచిపెట్టింది. వారి ప్రజాస్వామ్యభావాలను మంట కలిపింది. అన్నివైపులా అరికట్టబడిన ఈహక్కులు ప్రభుత్వ అధికారమున కతీతములైన ప్రాథమిక స్వత్వాలేనని రాజ్యాంగపరిషత్తు ప్రజలకు నచ్చజెప్పలేదు. రాజ్యాంగపరిషత్తు పౌరస్వత్వాలను ప్రసాదించిన ఈ పద్ధతి ప్రతి ప్రజాస్వామ్య ఘోషనకూ తీరనిమచ్చ. స్వతంత్ర భారతదేశానికి వ్యక్తి స్వభావసిద్ధ స్వేచ్ఛను దూరం చేసింది, యీ ఆర్టికల్.

పౌరస్వత్వాలను ప్రభుత్వ దౌర్జన్యంనుండి కాపాడేవి న్యాయస్థానాలు. తమ హక్కుల పరిమితిని ప్రజలు గుర్తించునట్లు చేసేవి న్యాయస్థానమే. అందుచే ప్రజాస్వామ్యానికి న్యాయస్థానాల స్వాతంత్ర్యం, ప్రాణంలాంటివి. పౌరస్వత్వాలను రాజ్యాంగంలో సూచించడం ప్రభుత్వం వానితో జోక్యం కలిగించుకోకుండా ఉండటానికి మాత్రమే. పౌరస్వత్వాల హద్దులను నిర్ణయించేది, ఆ హద్దులను దాటినవారిని శిక్షించేది న్యాయస్థానం. కాని మన ప్రభుత్వం రాజ్యాంగంద్వారా వ్యక్తిహక్కుల పరిమితిని నిర్ణయించడంవల్ల న్యాయస్థానానికి సహజమైన హక్కు, స్వాతంత్ర్యం నశించింది. ప్రభుత్వమే హక్కుల రక్షణబాధ్యత వహించిందన్నమాట. అది హక్కుల క్షేమానికే భంగకరం. ఈ సందర్భంలో బెంగాలులో జరిగిన ఒక సంఘటనను పరిశీలిద్దాం. కరమ్ములు హెబియస్ కార్పస్

కోరారు. న్యాయస్థానం ఇవ్వటానికి నిర్ణయిం చింది. కానివెంటనే రాష్ట్ర ప్రభుత్వం న్యాయ స్థానానికి అపాయ్యం రద్దుచేస్తూ శాసనాన్ని మార్పుచేసింది. ఈ సంఘటన, దేశంలో వ్యక్తు లను ప్రభుత్వ నిరంకుశత్వంనుండి కాపాడగల ప్రధాన సంస్థ అధికారరహితం చేయబడుతోన్న దశేవిషయానికి సాక్ష్యం. అధికారులు న్యాయా నికి అతీతులవుతున్నారు. సామాన్య ప్రజలకు న్యాయం దూరమౌతోంది. ఈ స్థితే పత్రికా స్వామ్యానికి భయంకరమైన శత్రువు. "నిష్కా రణంగా శిక్షింపబడిన వ్యక్తులు విముక్తికోరకై ప్రభుత్వాన్ని వేడుకొంటే, వారి కష్టాలను తొల గించటానికి బదులు దేశ ద్రోహ నేరం వారికంట గట్టి, శాసనమే అయుధంగా ప్రభుత్వం వారిని అణచివేస్తోంది" అని పంజాబ్ హైకోర్టు న్యాయ మూర్తులు ప్రభుత్వాన్ని గురించి చేసిన విమర్శ.

స్వతంత్ర న్యాయస్థానం తర్వాత పౌర స్వత్వాలను రక్షించగలది స్వతంత్ర పత్రిక. ఆం గ్లేయుల పాలనలోకంటె స్వపరిపాలనలోనే పత్రికా స్వాతంత్ర్యం క్షీణించి పోయిందని ప్రభుత్వ సభ్యులుకూడా అంగీకరించిన సత్యమే. యుద్ధకాలంలో ఆంగ్లదేశంలో ఉన్నంత స్వాతంత్ర్యంకూడా నేడు మనపత్రికలకు లేదు. స్వపరిపాలనలో పత్రికలు ప్రభుత్వానికి అంగా లుగా ఉండాలని విజ్ఞులైన దేశభక్తుల ఆ దేశం! అంటే ప్రభుత్వంచేసే ప్రతిపనీ సమర్థించే ప్రచారక సాధనాలుగా ఉండా లన్నమాట పత్రికలు. ఎంతవైపరీత్యం! ప్రాథమిక స్వత్వాల జాబితాలో పత్రికా స్వాతంత్ర్యం సూచింప బడలేదు. నామమాత్రమే ఇంప్పటికీ మిగి లిన వాక్కులను సూచించినట్లే పత్రికా స్వాతం త్ర్యాన్ని కూడా చేర్చడం లిఖిత రాజ్యాంగం ధర్మం. కాని వ్యక్తిగల వాక్స్వాతంత్ర్యమే పత్రికలకు కూడా చెల్లుతుందని, ప్రత్యేక స్వత్వాలు అక్కరలేదని ప్రభుత్వ సమాధానం. ఇది అర్థంలేనిమాట. పత్రికలకు ప్రత్యేక ధర్మా లున్నై. ఆ ధర్మాలు నిర్వర్తించటానికి ప్రత్యేక స్వత్వాలు కావాలి. నిర్భయంగా, నిష్పక్ష పాతంగా న్యాయస్థానం తీర్పుచెప్పినట్లే పత్రిక ప్రజాహితాన్ని ప్రబోధించాలి. నిర్భయంగా ఉండటానికి తగిన స్వాతంత్ర్యబలం లేకుండా పోయింది మనదేశంలో పత్రికలకు. ప్రభుత్వం చాలా పత్రికలను ధరావతులు చెల్లించమన్నది. కొన్నిపత్రికలు ధరావతులు కోలుపోతున్నాయి (డెయిలీ ప్రతాప్, పంజాబ్). ప్రభుత్వంచే బహి ష్కరింపబడిన పత్రికలుకూడా చాలాఉన్నాయి. కొన్ని న్యూస్ ఏజెన్సీల నుండి వచ్చే వార్తలు ప్రభుత్వ ఉద్యోగులద్వారా వస్తున్నట్లు తెలు స్తోంది. ప్రజాభిప్రాయాలను వెల్లడించే ప.. కల నీ విధంగా గౌరవించే ప్రభుత్వానికి ప్రజా ప్రభుత్వంలో ఎంతవరకు విశ్వాసమున్నదో బైట పడుతోంది.

ఈ విధంగా అన్నివైపుల నుండి పౌర స్వత్వాలు ప్రభుత్వంచే ఎదుర్కొన బడుతు న్నాయి. వాక్స్వాతంత్ర్యం సమావేశ స్వాతం త్ర్యం, పార్టీస్వాతంత్ర్యం క్రమంగా నశించి పోతున్నాయి. పౌరస్వత్వాలను రక్షించ గల న్యాయస్థానం, పత్రికలూ నిర్జీవములు చేయ బడుతున్నాయి. కార్యవర్గమే శాసనాధికా రాన్ని, న్యాయాధికారాన్ని స్వీకరించుతోంది. స్వతంత్ర భారతదేశంలో ప్రజలు వ్యక్తిస్వాతం త్ర్యాన్ని కలిగి ఉండే అవకాశాలన్నీ మాసి పోతున్నాయి, క్రమంగా.



# పొగబండిలో స్వాతంత్ర్యం

జోశ్యుల సూర్యనారాయణమూర్తి

ప్రయాణాలు చెయ్యటంఅంటే మళ్లీ ఇంటికి ఎన్నాళ్లకు వస్తామో, ఎల్లావస్తామో అని భయపడే పూర్వకాలంకంటె చాలారకాల సౌకర్యాలు మనకీ నాగరిక ప్రపంచంలో లభించాయి. ఒంటెద్దు బళ్లు ప్రతి గ్రామంలోను రోడ్డు ప్రక్కనున్న ఊరయితే తప్పక ఉండేవి. ఇప్పుడు బస్సు పుట్టిందిగనక బళ్లవాళ్ల కడుపుకు దెబ్బగిలిందని వళ్లు పాటలు పాడుతున్నారు. చివరకి దానిఫలితంగా బళ్లుతగ్గాయి. బస్సులే మరికొన్ని ప్రతీ మార్గంలోను ఏర్పాటుచేయబడ్డాయి. ప్రజలు క్రమక్రమంగా కాలపు విలువను గుర్తిస్తున్నారు. ప్రయాణంలో ఎక్కువకాలం వ్యర్థం చెయ్యటం ఇష్టంలేక సాధ్యమైనంత త్వరగా పోయే ప్రయాణ సాధన వాహనాలనే ఉపయోగించుకొంటున్నారు. బండికంటె బస్సు వేగంగా పోవటంమాత్రమేకాక సుఖప్రదంగా కూడా ఉంటోందని దాని నాశ్రయిస్తున్నారు. అందులో కొన్ని కష్టాలు కనిపిస్తూ ఉండటం చూచి రైళ్లంతకంటె, వేగం మాట ఎల్లాఉన్నా, సుఖంగాఉంటాయని, స్వేచ్ఛఉందని, ధనవ్యయం కూడ కారుకంటె తక్కువ అవుతూఉండటం కనిపెట్టి రైళ్లమీద ప్రయాణాలు ఎక్కువగా సాగిస్తున్నారు.

ఈసంగతులు ఇంటిలో కూర్చుని మాట్లాడుకొంటే చాలా బాగానే ఉంటాయి. గవర్నమెంటుచేసే సౌకర్యకారికార్యాలు ప్రశంసనీయాలే. కాని ఇందులో ఉండే కష్టసుఖాలు ప్రయాణాలుచేసే వాళ్లకి విశదం అవుతూ ఉన్నప్పుడు బాగుండటంలేదు.

ఆ బాగులేక పోవటానికి కారణం ఎవరు? ఈ ప్రశ్ననే మనం పరిశీలించాలి. ఏసంగతి పరిశీలిస్తూన్నా అన్నిటికంటె ముందు ఒక్కసంగతి గుర్తుంచుకోవాలి. అది-మనదేశం సర్వధా వాణిజ్య నీతిపరాభూత మైందన్నమాటే. దానివల్ల నల్లమూలిన అవినీతి, దౌర్జన్యప్రవృత్తీ పెరిగాయి. ఈ సంగతి అన్నిరంగాలలోనూ ప్రత్యక్షమవటం మాత్రమేకాక, సర్వత్రా పాతుకుపోయి సర్వధ్వంసకమై అపకీర్తిప్రదమవుతోంది.

ఆ సంగతి కాస్త పరిశీలిద్దాం. చిన్నప్పుడు ప్రాథమిక పాఠశాలకు కూడ సరిగా పోక, తల్లిదండ్రుల మాట వినక అల్లరిగ తిరిగినవాళ్లు, 18 ఏండ్లు వచ్చి నిరక్షరాస్యులవటమే కాక, భోజనానికి తప్ప ఇంకెందుకు పనికిరాకుండా ఉన్న వాళ్లు మన భారతకుమారులెందరో ప్రతిచోటా ఉన్నారు. వీళ్లు సిగరెట్లకీ కాఫీహోటళ్ళకూ మాత్రం అలవాటుపడి ఉండటం వాళ్ళ తప్పు కాదు. ఇంక వాతావరణంలో కొట్టుకుపోతున్నారు గదా!

అలాంటివాళ్లు సంస్కారహీనులు గనక నీలాటిరేవులలోను రోడ్డుమొగలలోను చేరి అసహ్యంగా సంచరిస్తూ ఉంటారు. బాల్యం మళ్లటం, యౌవనం రాబోవటం జరిగే సమయం. బుద్ధి యొంతమాత్రం లేదు. కారణం చదువు లేకపోవటం మాత్రమే కాదు. ఒక నియమబద్ధ జీవనం వాళ్ళకి ఏర్పడలేదు. చిన్నతనం నుంచీ ఏదో ఒక టైంటేబిలు, ఆమాదిరి ప్రవర్తనా లేక చెడిపోయినవాళ్ళు చాలామంది ఉన్నారు. ఈ కాలివాళ్ళంతా వర్తకం ప్రారంభించారు. అందులోను ఏ మూలో ఏ బజారులోనో కిళ్ళీ కొట్టువంటిదేదో ఏర్పాటు చేసుకొని అమ్ముకొనే వాళ్లు ప్రయోజకులే. కాని అందరికీ ఆమాదిరి పనే అయితే ప్రయోజనం మాత్రం ఉంటుందా! అందుచేత ఈ పనిలేనివాళ్లకి పొట్ట గడవాలంటే పనిలేకుండా కూర్చున్నవాళ్ళ దగ్గరకే చేరాలి. వీళ్ళంతా ప్రయాణాలలో రైళ్ళలో కాలక్షేపం కాక కూర్చుని ఉండిపోయిన ప్రయాణికులని గుర్తుపట్టారు. మనం అక్కడికి పోయి వాళ్ళకి కాలక్షేపం కలగచెయ్యాలని బటానీల బుట్ట చంకని తగిలించారు. రైలుపెట్టెలలో గిరగిర తిరగటం ప్రారంభించారు.

ఇది వాళ్ళకి జీవనోపాయమే, మనకి దుర్భర జీవన కారణమైంది.

నిజానికి "తెల్లోడి మాయ" అని మన ముసలి వాళ్లు ఈ రైలుబళ్ళని ప్రశంసించేవారు. ఆ తెల్ల వాడి మాయ ఏమిటో గాని వాళ్లున్నప్పుడు రైలు బండ్లేకాక కొంత ప్రతిదీ నియమబద్ధంగా ఉండేది. ఇప్పుడు స్వతంత్రుల మైనా మంటే సర్వస్వతంత్రుల మన్నట్టుంది. అంతవరకు ఒప్పుకొందాం. కాని నీవున్నూ నేను తీసుకొనే స్వాతంత్ర్యమే కాంక్షించటమా? నిజంగా ఆ స్వాతంత్ర్యమే అయితే మనకి లేకపోతేనే చాలా మంచిది. అంతకంటె పరాధీనత చాలా నయంకూడాను. ఆ పాపపుణ్యాలకి ఆతడే బాధ్యుడవుతాడు(పరాయి వాడు). ఇప్పుడు మన మేం.ఈమాదిరి స్వాతంత్ర్యం రాక్షస స్వాతంత్ర్యం అనిపించుకొంటుంది.

ఈ రాక్షస స్వాతంత్ర్యం రైలు బళ్ళలో కాలక్షేపం బటానీలు, స్ప్రింగు బిళ్ళలు, పన్ను కుట్టుపుల్లలు, గుంగుకెడ్లు, అజీర్ణంమాత్రలు, (ఎన్నని చెప్పం) అమ్మేవాళ్లు సంపాదించారు.అది మనకి దుర్భరమే అని ఎన్నాళ్ళనుంచో ఎరుగుదుము, మరి నివారణోపాయం ఉందా, లేదా? ఎవరు చెయ్యాలి, ఎలా చెయ్యాలి?

ఈ ప్రశ్నలకి సమాధానాలు పొందగల మేమో చూద్దాం.

వాళ్లు అమ్ముకుంటే నిషేధం జేశారు అనే మిత్రులుకూడా లేక పోలేదు. వాళ్ళ సంగతే పరిశీలించి పరిహరించజెయ్యాలి. రైల్లో అమ్మకం రూల్సుకి విరుద్ధం. ఒకడు అమ్మకానికి వచ్చాడంటే మరివాడికి టిక్కెట్టు కావాలా! ఎక్కడి కని తీసుకుంటాడు? నిజమే టిక్కెట్టు తీసుకోవాలి, అంతపనే. అందుకని అతడు అసలు లేకుండానే అమ్ముకుంటాడు. ఒకడు అట్లా చేసి నప్పుడింకొకడు తీసిపోయాడా! పైగా ఒకడి కొక నియమం, ఇంకొకడి కింకొకటీనా! కాదు- ఈ రీతిగా వీళ్లు లోపలికి చేరారు. అసలే రైలు హోరు.మధ్య మధ్య ముష్టివాళ్ళ పాటలు.వాటిల్లో నే ఈ వస్తువుల కేకలు. ఇంక యాత్రికులేమన్నా ప్రతకాలా! ఎందుచేతనంటే అంతటి ధ్వనుల అస్తవ్యస్తం వినటం మనిషికి చాలా బాధ. ఇలా వ్రాస్తే పీడర్నకుడు, రోగిష్టి కాబోలు అను కుంటున్నారేమో! ప్రతివాడూ బాధపడతాడు. నాలాంటివాడు పైకి పడతాడు. అంతే భేదం, అంతకంటె వేరేమీ లేదు. ఇంతకంటె వేరుగా ఏమి కావాలి ప్రయాణికులకి అసౌకర్యం!

ఇలా శిక్షించటానికేనా ఈరైళ్ళ ఏర్పాటు చేసింది? ఇంతకీ ఈమధ్య నెవరో కాస్త కోపంగా జనవాక్యంగా అడగటం, దానికి రైల్వే అధికారు గారు జవాబు చెప్పటం జరిగింది. ఆయన జవాబు బాగానే ఉంది- "మీరంతా కొనటం మానేస్తే శని ఒదిలి పోతుంది త్వరగా"నని. ఇంతకంటె ఉత్తమ నివారణోపాయం లేదు. దాని తర్వాతి ఉపాయాలే ఆలోచిద్దాం. ఇది అంత సులభ సాధ్యం కాదు గదా! మొత్తమ్మీద రైలులో కూర్చుని అంత అవసరమైతేగాని తినను (కొన్ని పరిస్థితులలో స్టేషనులలో కాని ఉంచుకొన్నది తింటాం) అని ఎవరిమట్టుకు వారు ప్రతిజ్ఞ చేసుకోండి అనే చేతూ కోరుతున్నాను.

అంతవరకు రైల్వేకంపెనీ మనకి సహాయ పడవచ్చు. మనం కంపెనీకి సహాయపడవచ్చు. ఈ మధ్యనే నొక రైల్లో ప్రయాణం చేస్తో ఉండగా అంతవరకు ఆ పెట్టెలో అరుస్తూన్న బటానీల వాళ్ళు ఇంతలో మాయమయ్యారు. ఏమిటా అని చూస్తే,ఒకపక్క టికెట్ కలెక్టర్ ఉన్నాడు. ఆయన దగ్గరకు వచ్చాక బాధ ఆగక ఇలా అడిగాను. 'ఏమండీ ఈ వెండర్స్ బాధ ఎలాగ? మీరు వదిలేస్తా రనుకొంటాను. మీకేమైనా మామూలుంటుందా?' అని. దానితో ఆయన చాలా బాధపడ్డాడు. కాని మంచివాడు. తన కష్టాలు చెప్పాడు. మా సంభాషణ చాలాసేపు సాగింది. దాని సారాంశం చర్చిస్తాను.

ఆయన్ని నే నడిగిన సంగతి "ఓపెన్ సీక్రెట్" కాని ఏమీ వింత కాదు. అయినా ఆయన బాధ పడి నన్ను సహాయం చెయ్యమంటాడు. నేను పట్టించుకుంటే తాను తప్పక ఎక్సెస్ చేస్తానట. కాని అది అసంభవం, ఎప్పటికీ కాదు.

"నే నొక్కడినే కదా! ఇన్ని పెట్టెలలో ఇంతమందిని ఎలా పట్టుకోను!" అని ఆయన ప్రశ్న. అందుకే రైల్వేకంపెనీకి నీవే వ్రాయమని అర్థమైనా మనమాట కంపెనీ వినాలి. ప్రయత్నిద్దాం. వలంటరీ మనుషులకు చెకింగు అధికారం ఉండేలా చెయ్యాలి. శిక్షించాలి, లేదా చిన్న

స్టేషను వచ్చినప్పుడు అయిదునిమిషాలాపి అతనొక్కడైనా సాధించగలము. ఆ టైము వ్యర్థమవుతుందా?

"వాడు నన్ను చూసి పరుగెత్తుకొని పోవటంలో పడ్డాడంటే నా పీక పట్టుకుంటుంది (వాడు చస్తే)" అని ఒకమాట ఆయన అన్నాడు. ఎందుకు వాడు ఎక్కాలి? ఎందుకు దూకి చావాలి? నిజంగా ఇలాంటి ఎన్నో ప్రమాదాలు రైలుక్రింద ముఖ్యంగా, విచారణ విహీనంగా ఉన్నాయి. ఇలాటి వాటి విషయంలో కంపెనీకి అసలు బాధ్యత లేదు. కొంతకాలం అన్ని రైళ్ళలోను టికెట్ చెకింగ్ ఆఫీసర్ని పెంచి ఖర్చుచేస్తే కంపెనీ మనకు సౌకర్యం కల్పించిన దౌతుంది.

ఇతర ఉద్యోగాల కంటె రైల్వేలో ఐతే పైగా చాలా సంపాదించవచ్చునని మొదట్లోనే అనుకొని దిగటం మనవాళ్ళదీ తప్పే. అట్లాంటి మొహమాటం పద్ధతులు నియమవిరుద్ధమైనవి. రైల్వేఉద్యోగులాశ్రయించకపోతేనే సహాయం చేసినట్టు. ఇలాటి సహాయం అందరికీ అయితే నియమవిరుద్ధ పద్ధతి కొంతమందికే. అది కూడా అక్రమం. దానిద్వారా అవినీతి పెంచటం.

రైల్వేవారు పెట్టెలలో సౌకర్యాలంటే విదేశాలనుంచి దిగుమతి చేయవలసిన వాటిమీద ఆధారపడిన పనులు కనుక త్వరలో చెయ్యలేరు. అందుకు మనం సహిద్దాం కొంతకాలం. కాని ఈ భిక్షుకులు, వర్తకులు పెట్టే బాధ భరించలేము. కావలసివస్తే ఏ పెద్ద స్టేషనులలోనో, అదైనా ఒకచోట పెట్టుకొని, అమ్మితే కావలసినవాళ్లు అక్కడికే వస్తారు. అది వర్తకులకు గౌరవం. ఇక భిక్షుకులసంగతి చెప్పలేం. ఏదైనా అంటే "గుండెలులేని మొండి" అంటారేమో! కాని వాళ్లలోనూ ఎన్నోరకాల వాళ్లున్నారు. ఇది వృత్తిగా మారింది. ఇది దేశ దౌర్భాగ్యం. జాతి శక్తి క్షీణత.

ఇంక మనసంగతి - తిండి అనేదానికి కాస్త అంతు, ఒకతెన్ను ఉండాలి. ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడుపడితే అప్పుడు తినటం అసభ్యత. మనకి వచ్చినన్ని కాఫీహోటళ్లూ దుకాణాలూ సర్వత్రా ఉన్నాయి. ఉన్నా మన మెక్కడికి ఎందుకు చేరినాగాని మన వెనుకపడి ఈవెండర్సు తిరుగుతుంటే వాళ్లకోసమా మనం తినటం? మనకు అట్లాంటితిండి ఆరోగ్యం పాడుచేస్తుంది. ఇప్పుడు కాలక్షేపం అనుకొన్నా, తర్వాత కాలం పాడుచేసి మూలపడవేస్తుంది. నియమరహిత భోజనం. వివిధవస్తు భక్షణం ఏకకాలంలో చెయ్యటం వల్ల జీర్ణకోశం పాడయి శక్తిహీనత వస్తుంది.

ఈ మాదిరిగా దుర్బలజాతి తయారు. ఈ సంగతి ఆలోచించి తెలిసిన వాళ్ళయినా, ప్రయాణాల్లో నియమానుసారంగా సమయానుకూలమైన భోజనసామగ్రి ఉపయోగిస్తూ, ఈ వర్తకులను బహిష్కరిస్తే రైల్వేకి తోడ్పాటు, మనకి సౌకర్యం- రెండూ సాధించ గలగటం తథ్యం.

మరి వాళ్ళ బ్రతుకెలాగని విచారించనక్కర లేదు. వాళ్లు ఊళ్ళో అమ్మినా ఇంతకంటె సంపాదిస్తారు.

కాని తల్లి దండ్రులు తమ పిల్లలని నిరుద్యోగులుగా తయారుచెయ్యకూడదు. చదువే చెప్పించాలని లేదు. ఏదో ఒక వృత్తి, ఏదో వ్యాపారం ప్రజాసామాన్యానికి సహాయపడేదే గాని బాధ కలిగించేది మాత్రం కాకుండా ఉండేది, నేర్పే ఏర్పాటు చెయ్యాలి. చదివిస్తే సంతోషమే. నిరుద్యోగ సమస్య గవర్నమెంటు తీర్చలేదు. మనమే తీర్చుకోగలం. అది ఇళ్ళదగ్గర వృత్తి విద్యలు ఎవరికి తగినట్లు వాళ్లు పెంచుకోటమే. ప్రజ లావృత్తివిద్యలకు ఆదరం ఇవ్వాలి. లేకపోతే నిరాశ. ఫలితం మనకే ఏదోరీతిగా ప్రతిబంధకం తప్పదు.

ఈ మాదిరి ఆచరణలవల్ల మనం రైళ్ళలో చక్కటి ప్రయాణం చెయ్యగలం. కంపెనీ కూడా తన పని నిర్వర్తించాలి. వాళ్ళని పట్టుకోకపోయినా తమకు నష్టం లేదని, పట్టుకోటానికి యత్నించటం మాత్రం ధనవ్యయకారి కార్యమనీ రైల్వేకంపెనీ లోపల ఆలోచిస్తూ, పైకి మన కోసం ప్రయత్నిస్తూ ఉన్నట్టే మాట్లాడటం మాత్రం మానకపోతే మన మేం చెయ్యగలం?

ప్రజలని సహాయపడమని కోరటమే సరిపోతుంది - గవర్నమెంటుకీ, రైల్వే కంపెనీ మొదలైన వాటికీని.

ప్రజలకు సహాయపడదామనే బుద్ధికూడా పుట్టితే చాలా సంతోషించవచ్చును.

స్కెచ్

# ఏటి కెదురీత

"హిం త శ్రీ"

కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే స్థితిపరుడైన సుబ్బారావు తన మాగాణీ భూములన్నీ అమ్మేశాడు. దీనికి కారణం తలో విధంగా ఊహించారు. లోగుట్టు పెరుమాళ్ళకెరుక అన్నట్టు సుబ్బారావుకి ఆస్తికి మించిన అప్పులుండి కాబోలునని కొంతమందీ, ఏదో పెద్దయెత్తున వ్యాపారం సాగిస్తాడని కొంతమందీ, యుద్ధం వెళ్ళిపోయిందికనుక ధరలు పడిపోతాయని ముందుగానే జాగ్రత్తపడ్డాడని మరికొంతమందీ తమ బుద్ధిబలం ఉపయోగించి ఊహించి కారణం గ్రహించామనుకున్నారు. కాని వీళ్ళంతా వాస్తవానికి యోజనాల దూరంలో ఉన్నారు. సుబ్బారావు ఆలోచనాపరుడు. ముందుచూపుకలవాడు. "ఈరోజు హాయిగా ఉంటే ఇంకా రాని రేపటి చింతెందు" కనే ఉమర్ ఖయ్యాం వాదానికి సుబ్బారావు పరమ విరోధి.

"ఏమోయ్, సుబ్బారావ్. భూములన్నీ అమ్మావు ఎందుకు?" అని అడిగాను ఓరోజు సాయంత్రం పార్కులో కనిపిస్తే.

"కాంగ్రెస్ ప్రభుత్వం హయాంగదా ఇది" అన్నాడు.

"అయితే?"

"చూస్తూ ఉండు తెలుస్తుంది. నువ్వు నేను చేసినపనిని మెచ్చుకొనేరోజు ఎంతో దూరంలో లేదు."

"ఏమిటీ నీ అభిప్రాయం?"

"దున్నేవాడిదే భూమి అనే నినాదం వినలేదా?"

"విన్నాను. కాని—"

"ఇవాళ కాకపోతే రేపైనా అది అమల్లోకి రాకతప్పదు. రాబోయే మార్పులు గ్రహించి ముందే జాగ్రత్తపడటం బుద్ధిమంతుల లక్షణం. తర్వాత, ఒకవేళ నష్టపరిహారం ఇచ్చినా ఇప్పటి ధరలు గిట్టవు. ఏమంటావ్?" చిరునవ్వుతో చూశాడు నావైపు. తెలివిగల పనే అనిపించింది నాకు. తలూపాను.

పొలం అమ్మిన డబ్బంతా బ్యాంకుల్లో వేశాడు సుబ్బారావు. "ఏదో ఒక్క బ్యాంకులోనే ఉన్న డబ్బంతా వేస్తే తర్వాత ఏమనుకున్నా ఏంలాభం?" అన్నాడు. "ఒక మనిషికి ఒకే బ్యాంకు అనే నియమం ఉంటేకాని బ్యాంకులు బాగా అభివృద్ధి పొందవని పుస్తకాల్లో రాశారు గదా, మరి చదువుకున్నవాడివి, నువ్వే ఇలా చేస్తే ఎలా" అని అడిగితే, "అదంతా థియరీ" అని నవ్వాడు.

ఒకటిన్నర సంవత్సరం గడిచింది. ఓ శుభోదయాన సుబ్బారావు నా దగ్గరికి వచ్చాడు. "ఏమిటి సంగతి?" అన్నాను. క్రాసు చేసిన చెక్కొకటి నా చేతికిస్తూ, "ఇది కాస్త మార్చి పెట్టాలోయ్" అన్నాడు. నా కాశ్చర్యం వేసింది.

"అన్ని బ్యాంకుల్లో అకౌంట్లూ, డిపాజిట్లూ ఉన్నవాడివి - నీకు నేను చెక్కు మార్చిపెట్టటమేమిటి?"

"అన్నీ తీసేశాను. ఇప్పుడేమీ లేవు."

"ఆఁ—"

"అలా నోరు తెరుస్తావేమిటి? ఇందులో ఆశ్చర్యపడేందుకేముంది?"

"ఎందుకు తీసేసినట్టు?"

"ఇన్‌ఫ్లేషన్—"

"అయితే—?"

"నువ్వు పేపరు చదవ్వా ఏమిటి?"

"ఏమిటి నీ భావం?"

"ఇన్‌ఫ్లేషన్ ఎంత తీవ్రంగా ఉందో తెలుసా? మామూలు పరిస్థితికి రావటానికి ప్రభుత్వం తప్పక తీవ్రమైన చర్యలు తీసుకుంటుంది. బ్యాంకు డిపాజిట్లు స్తంభింప చేయరనటానికి ఆధారా లేమిటి?"

"అది అసామాన్య విషయం"

"అసంభవం కాదుగా? దృష్టాంతాలు కావాలా!"

సుబ్బారావు ఆర్థిక శాస్త్రంలో ఎం. ఏ. ప్యాసయ్యాడు. ఇహ అతనితో ఏం వాదించేది?

"అయితే అకౌంట్లన్నీ తీసేశావన్న మాట."

"అహఁ."

"మరి డబ్బంతా ఏం చేశావు?"

"బంగారంలోకి మార్చాను."

"ఇంత ఖరీదులో బంగారం కొన్నావా?"

"అవును. కరెన్సీ కాగితాలు ఎప్పటికైనా ప్రమాదకరమే. బంగారమయితే పడి ఉంటుంది."

"వడ్డీ నష్టం కాదా?"

"వడ్డీకి పోనుకుంటే అసలుకే ఎసరు వస్తుంది."

సుబ్బారావుని చూస్తే నాకు నిజంగా జాలి వేసింది. ఈ మనిషి కింత తాపత్రయం ఎందుకో!

"బంగారం ప్రాముఖ్యం ఏమిటి?"

"మారకానికి అందరూ ఒప్పుకున్న లోహం కదా."

"మనం ఒప్పుకుంటేనే కదా దాని కా ప్రాముఖ్యం."

"ఏమిటి నీ ఉద్దేశం?"

"ముందుముందు బంగారానికి బదులు మరో లోహం దాని స్థానే ఉపయోగించబడదని ఎవరు చెప్పగలరు?"

"నీకు మతిపోయిందా? అలా ఎప్పటికీ జరగదు."

"ఎందుకు జరగకూడదని నా ప్రశ్న. బంగారం కంటె విలువగల లోహాలు కనిపెట్ట బడుతున్నాయట తెలుసా?"

"ఏమైనా - అలా ఎందుకు జరుగుతుందీ?" గొణిగాడు సుబ్బారావు.

"నువ్వు ముందుకు తొంగిచూస్తున్నావు. నేను మరి కొంచెం ముందుకు చూస్తున్నాను. అంతే భేదం."

సుబ్బారావు నావంక అనుమానంగా చూసి అన్నాడు: "నేను ముందు ఎప్పుడో జరిగేది ఇప్పుడే ఆలోచిస్తానని గేలిచేస్తున్నావు - అర్థమయింది. కాని ఓరోజు నువ్వే నన్ను మెచ్చుకోక తప్పదు, చూస్తూఉండు."

"ముందు చూపు వుండటం మంచిదే. కాని నువ్వు కాలాన్ని మోసగించాలని ప్రయత్నిస్తున్నావు. మోసగింపబడుతున్నావేమోనని భయంగా ఉంది."

"ఈ జబ్బు నీకూ కూడా ఉందీ?" నా వంక తేరిపారచూసి అన్నాడు. సుబ్బారావు ఉద్దేశమేమిటో నా కర్థం కాలేదు. బహుశా కాలం మీద పద్యాలు రాసేవాళ్ళలో ఒకణ్ణిగా భావించాడేమో.

* * *

నే నుండే ఇల్లు ఖాళీచేయవలసి వచ్చింది. ఎక్కడో ఖాళీభాగం ఉందంటే చూట్టానికి వెళ్ళాను. లోపలికి వెళుతుంటే గుమ్మంలో సుబ్బారావు కనిపించాడు.

"ఇక్కడ తారసిల్లావేమిటి కథ?" అన్నాను.

"అద్దె వసూలు చేసికోటానికి."

అద్దె! నాకు తెలిసినంతవరకూ సుబ్బారావుకి ఒకటే ఇల్లు. ఇది కాదు.

"అలా చూస్తావేమిటి? ఈ ఇల్లు కొన్నాను."

"అలాగా! ఇక్కడేదో ఖాళీ ఉందంటే వచ్చాను. ఇప్పు డుంటున్న ఇల్లు ఖాళీ చేయాలి." అని ఆశగా చూశాను.

"అరె! ఇప్పుడే ఎవరో వచ్చిచేరారు. ఒక్క రోజు ముందు తెలిస్తే బావుండేదే." అని నొచ్చుకున్నాడు.

"అసలీ ఇల్లెప్పుడు కొన్నావు?"

"ఈ మధ్యే. ఈ రోజుల్లో ఇంట్లో ఉంచుకోటం అంత శ్రేయం కాదు. చరాస్తి అన్నప్పుడల్లా మంచి కాదు. పరిస్థితులంత బాగా లేవు. ఈ కమ్యూనిస్టు ఉపద్రవాలూ అవీ చూస్తుంటే అరాచకం ప్రబలుతుందేమోనని అనుమానంగా ఉంది. అంచేత బంగారమంతా విరోకాడి కమ్మేసి ఇళ్లు కొనేశాను. అద్దెలు ఎక్కువగా ఉన్నాయి ఆదాయంకూడా పెరుగుతుంది. ఏమంటావ్?" అన్నాడు గుక్క తిప్పుకోకుండా.

"భేషుగ్గా ఉంది" అన్నాను. అంతకంటె ఏమీ అనదలుచుకోలేదు.

ఈ సంఘటన జరిగిన కొన్నాళ్ళ తర్వాత ఓ రోజు పత్రికలో చూశాను. ఇళ్లు అమ్మకానికి ఉన్నాయని సుబ్బారావు ప్రకటన చేశాడు. అడిగితే అన్నాడు:

"ఊర్లోకల్లా ఇల్లు లేకపోవటం ఎంత ఇబ్బందో అద్దె ఇళ్ళ స్వంతదార్లు కావటం అంతకంటె ఎన్నోరెట్లు బాధాకరం-కారణాలు వేరే చెప్పటం అనవసరం. అందుచేత ఎలాగో ఈ ఇళ్ళని వదిలించుకోవాలని చూస్తున్నాను. అదికాక ఇళ్ళ ధరలు తగ్గిపోతున్నాయి. ఈ ధరలుకూడా నిలుస్తాయని నమ్మకంలేదు. సాధ్యమైనంతవరకు నష్టాన్ని తగ్గించుకోవడం ఉత్తమం. హౌసింగ్ బిల్డింగ్ సొసైటీలు పెద్దపెద్ద ప్లానులు వేస్తున్నాయి. ఆ ఇళ్లు తయారయాయంటే వీటిమొహం ఎవరు చూస్తారు? ఏమంటావ్?"

చేసేదంతా చేస్తూ ఏమంటావని నన్నడగటమెందుకు, వద్దంటే మానేస్తావు గనకనా?" అన్నాడు చిరాకుగా.

"అది కాదు. నేను చేసేది సబబుగా లేదంటావా?"

"ఏమో. అయినా నీకంటె నాకెక్కువేం తెలుసు. అర్థశాస్త్రంలో పట్టా పొందినవాడివి నువ్వు."

"ఈ ఇళ్ళ నమ్మిన డబ్బుతో ఏదైనా చిన్న ఫ్యాక్టరీ స్థాపిద్దామని ఉంది."

"అవశ్యం—కాని దీంట్లో ఓచిక్కున్నట్టుంది. పరిశ్రమలన్నీ ప్రభుత్వం జాతీయం చేస్తుందేమో. నష్టపరిహారం ఇచ్చినా నామమాత్రంగానే ఉంటుందేమో" అన్నాను బలవంతాన నవ్వాపుకుంటూ. ఆలోచిస్తున్న కళ్ళతో సుబ్బారావు నావైపు చూశాడు.

*    *    *

తనడబ్బు క్షేమంగా ఉండే పద్ధతులింకా ఏవోగాన్ని ఆలోచించి ఆచరణలో పెట్టాడు సుబ్బారావు. కాని ఏవిధానా తృప్తికలగలేదు. రానురాను అతడిధనం తగ్గిపోయింది. ప్రతి విధానంలోనూ అతడికి ధనక్షయం అనుభవించింది. ప్రాణం విసిగి చివరికి మిగిలిన డబ్బుతో సుబ్బారావు పదెకరాల పొలం కొని స్వయం వ్యవసాయం ప్రారంభించాడు. ఆపొలం ఇదివరకతడమ్మిందే. తక్కువ ధరకమ్ముతున్న పొలాన్నే మళ్ళీ ఎక్కువ ధర యిచ్చి కొన్న సుబ్బారావుని చూస్తే జాలివేసింది.

"కాలాలు మంచివి కావు. నేనేది చేసినా చెడిపోతోంది." అన్నాడు సుబ్బారావు.

"ఓసారి చెప్పాను. జ్ఞాపకం ఉందా? కాలాన్ని మోసగించాలని ప్రయత్నించావు. మోసగించబడ్డావు." సుబ్బారావు మాట్లాడలేదు.

"కాలంతో పరిగెత్తలేక పోయావు. మార్పును ఆహ్వానించలేకపోగా ఆపుచేసుకోవాలని చూశావు. అందుచేత కాలం నీమీదే ముందుగా తన ప్రభావం చూపించింది. నీ ఎకరాలు ఎల్లకాలమూ నీకే ఉండాలంటే ఎలా?"

"నిజమే. కాలాన్ని ఓడిద్దామని ప్రయత్నించాను. గెలుస్తున్నాననుకున్నాను. ఓడిపోయేదాకా తెలిసికోలేక పోయాను."

"మార్పు ననుసరించి నువ్వు మారలేక పోయినా మార్పును ఎదిరించటానికి ప్రయత్నించకపోతే అప్పుడే ఈస్థితికి వొచ్చేవాడివి కాదేమో. కనీసం మనశ్శాంతి అయినా ఉండేది."

బరువుగా నిశ్వసించాడు సుబ్బారావు. అంతకంటె ఏం చేయగలడు!

# 'జిజ్ఞాసువు' స్పష్టంచెయ్యాలి

వి. యస్. అవధాని

'ఏది జ్ఞానం' అనేక శీర్షికతో శ్రీ "జిజ్ఞాసువు" గారు యిటీవల 'తెలుగు స్వతంత్ర'లో ఒక వ్యాసం వ్రాశారు. వ్యాసం చాలా బాగున్నది కాని వారు చెప్పదలచుకున్నదేమో స్ఫుటంగా మాత్రం చెప్పేరు కాదు. ఒక పత్రికలో రచయితగా చలామణి కావడమే వారి ఆశయం అయితే ఇంకా ఇతర విషయాలమీద వారు వ్రాయడం బాగుంటుంది.

"పదార్థం అనేది ఎట్లా ఉంటుందో మనకు తెలియదు. తెలుసుకునే అవకాశం లేదు. మనం తెలుసుకునేవన్నీ దాని లక్షణాలే" అని వారు తమ వ్యాసం రెండో పేరాలో అన్నారు. పదార్థ వాదానికి ప్రతిగా ఆధ్యాత్మిక వాదాన్ని మనం తీసుకుంటే, అక్కడనయినా మనకు అన్వేషణ దేవుని లక్షణాలతోనే సాగుతుంది. ఏ మత గ్రంథమయినా సరే భగవంతు డిలాంటివాడు, ఆయన చేష్టలు ఇలాంటివి అని చెపుతుందేగాని భగవంతుణ్ణి చూపుతుందా? కాబట్టి లక్షణాలను తెలుసుకుంటాంగాని పదార్థాన్ని గాదు- అనే వాదనతో పదార్థ వాదనను త్రోసివేయవలసి ఉంటే అదే వాదనతో ఆధ్యాత్మిక వాదననూ త్రోసివేయాలి.

ఆ వాక్యం తరువాత వారి ఉద్దేశ్యం (ఈ వ్యాసానికి సంబంధించినంతవరకూ) ఏమిటో స్పష్టం గావడం లేదు. "తన లక్షణాలు మార్పులోలేని వస్తువంటూ వుంటే..." అని అన్నారు. అసలు అలాంటి వస్తువు ఒకటి ఉన్నదా? ఉంటే వారు పదార్థ వాదులకు చూపాలి. మార్పు అంటే ఏమిటి? అంతర్గత చలనం-అలలు అలలుగా-పదార్థానికి ప్రాథమిక లక్షణం. పదార్థంగానిది అసలు ఏదీ లేదు. ఏ అణువును తీసుకున్నా పరికరాల సాయంతో దానిలోని అంతర్గత చలనాన్ని చూడగలం. చలనం అనేది ఒక వ్యాపారం (becoming). ఈ అణువులు ఎలా ఉంటాయో - ఎలాంటి పదార్థంలో ఎలాంటి చలనాన్ని - కలిగి ఉన్నవో - ఆ చలనం వస్తువుయొక్క ఉనికికి (being) ఎలా ఉపకరిస్తోందో శాస్త్రజ్ఞులు జిజ్ఞాసా పథంలో ఏనాడో ఋజువుచేశారు. జ్ఞానావధికి సైన్సు చేసిన - చేస్తున్న మంచిని శ్రీ జిజ్ఞాసువు గారుకూడా ఒప్పుకుంటారు. కాని వారి బాధ ఏమిటో మాత్రం ఆ వ్యాసంలో తెలియడంలేదని- అంతకన్న వారు సూటిగా కొన్ని ప్రశ్నలను వేస్తే బాగుండేదనీ మళ్ళీ ఒకసారి మనవి చేసుకుంటున్నాను. లేదా నేటి 'ఫిజిక్స్'లో వారికి అనుభవంమీద పరస్పర విరుద్ధంగా తోచిన సూత్రాలేవో, అవి మానవ సమాజానికి ఎంత - ఎందుకు అపకారం చేస్తున్నవో తెలియచేసినా చాలోటి వారికి కొంతగా జ్ఞానం అంటే ఏమో తెలుస్తుంది.

ఇక వారు ఆరవ పేరాలో బుద్ధి అంటూ ఆరంభించారు. అది అంతా వా రంగీకరిస్తే అదే పేరా చివర వారు చిత్రించిన పరిస్థితి ఏర్పడడానికి వారు ఏడవ పేరాలోనన్న సాంఘిక అజ్ఞానమేనా? ఇంకా ఏమన్నా ఉన్నదా?

సాంఘిక అజ్ఞానం వ్యక్తి అజ్ఞానంతో ఆరంభమవుతుంది. మానవుల కలయికయే సంఘం. ఒక సంఘంలోని వ్యక్తి కున్న జ్ఞానం అతని నడవడిలో, అంటే సంఘంలో ప్రతిబింబితమై తిరిగి అతని 'పెర్సెప్షన్'కి ఉపకరించాలి. అంతే సంఘం ఇచ్చిన అనుభవాన్ని వ్యక్తి తనలో 'యనలైజ్' చేసుకుని తిరిగి సంఘంలో అదే సంఘటన జరిగినపుడు పూర్వపు టనుభవ సిద్ధాంతాన్ని పరివర్తన మొందిస్తాడు. అట్లా ప్రతి వ్యక్తి ప్రవర్తించ గలిగితే సాంఘిక అజ్ఞానం పోతుంది. అలా చెయ్యడానికి వ్యక్తికి కనిపించే సమస్యల యథార్థ స్వరూపం- వాని కారణాల యథార్థ స్వరూపం తెలియాలి. అలా తెలియచేసేదే జ్ఞానం. వ్యక్తులందరూ పరస్పర అంగీకార సహకార సమన్వయ పద్ధతులలో తమ మంచిని కోరే ప్రవర్తింపగలిగితే సాంఘిక అజ్ఞానానికి

ఆస్కారం లేదు. ఈ సాంఘిక అజ్ఞానం పోవాలంటే పదార్థవాది నేటి సమస్యలను సమూలంగా విమర్శించమంటాడు. విమర్శించి వానిలోని చెడును వదలడానికి కావలసిన జ్ఞానాన్ని వ్యక్తి అలవరచుకోవాలంటాడు. అది తత్త్వమయితే రాజకీయం కాదా? తెలిసిన దాన్ని నీతివంతంగా నమ్మి- నమ్మినదానిని ఆచరించడం తత్త్వమయితే రాజకీయం కాకపోయిందా? తాపత్రయాన్నీ ఆవేదననూ వెలిబుచ్చడం, ఆకాశం ఎగిరేటట్లు నినాదాలు చేస్తూ తమనుతాము మరచిపోయి గంతులు వేయడమే రాజకీయం అవుతుందా? రాజకీయాలకు నీతి, తాత్త్వికతా, విలువలూ అవసరం లేదా? కనిపిస్తున్న ప్రశ్నలకు తగిన మందు పదార్థవాదం ఇస్తుందని ఈనాటివరకూ జరిపిన, జరుపుతున్న పరిశోధనలు చెప్పుతున్నవి

భౌతికశాస్త్ర పరిశోధకులు థేల్స్ నుండి ఈన్ స్టైన్ వరకూ ఈ కనిపిస్తున్న సృష్టికి ఒక క్రమమగు అన్వయాన్ని కలిగించాలని యత్నించారు. సృష్టిని గురించిన సక్రమమగు అర్థం ఉంటేనేగాని జీవితాన్ని గురించిన సక్రమమగు అర్థం అలవడదు. జీవితాన్ని సరిగ్గా అర్థం చేసుకుంటేనేగాని జీవితానికి సంబంధించిన ప్రశ్నలను పురుషప్రయత్నంతో పరిష్కరించుకోగల సాహసం వ్యక్తికి అలవడదు. ఆ సాహసం అలవడితేనేగాని వ్యక్తిచైతన్యం ఆరంభమయి అతనిలోని అనంతశక్తులు అనర్గళంగా వికసించి తనకు తానే ఈ సాంఘిక అజ్ఞానాన్ని పోగొట్టగలదనే సాంఘిక ప్రవర్తన అలవడదు. పదార్థవాదికి ప్రకృతి సూత్రాలే జ్ఞానం. ప్రకృతి నియమవంతమయినదే అయినా చతుర్ముఖ (four dimensional) ప్రవాహంగా అనంతమయినది. కాబట్టి దాని నియమాల సముదాయమగు జ్ఞానం కూడా అనంతమయినదని సిద్ధిస్తుంది.

ఈ జ్ఞానాన్ని అలవరచుకుని తనలోని లోపాలను, తాను నిర్మించిన,నిర్మిస్తున్న వ్యవస్థలలోని లోపాలను తొలగించుకోవడం స్వేచ్ఛావాది యగు పదార్థవాదికి స్వేచ్ఛ. ఇదివరకటి పరిస్థితికన్న ఈ పరిస్థితి మంచిదయినా ఇంతకన్న ఉత్తమస్థితికి పోగలమనే ధీమా పదార్థవాదికి ఉంటుంది. అప్పుడే జిజ్ఞాసువు గారన్నట్లు వ్యక్తి తన తగిన విశ్వాసాలను ప్రస్తుత అనుభవ పరిస్థితుల దృష్ట్యా మార్చుకుని కొత్తవాటికి తావియ్యగలుగుతాడు. ఇదంతా వ్యక్తియొక్క సంకల్ప శక్తిమీద ఆధారపడివున్న సంగతి.

రచయితగారు ఎనిమిదవ పేరా మొదట్లో "సాంఘిక అజ్ఞానం వ్యక్తిగతమైనజ్ఞానానికి అంతరాయమని..." అని అన్నారు. అంటే ఈ సాంఘిక జ్ఞానం ఎక్కడినుంచి వచ్చినది? వస్తుంది? వ్యక్తుల సమూహాయం సంఘం అయితే ఏనాటికానాడు ఎవరో కొందరు వ్యక్తులు ఆనాటి సాంఘిక పరిస్థితులలో కష్టను ముందుగా గ్రహించి, దాన్ని తమతోటివారికి నిరూపించి, వారిచేత ఒప్పించి క్రమంగా దాన్ని సాంఘిక జ్ఞానంగా మారుస్తారు. సంఘం వ్యక్తుల కలయిక అని లిబరల్సుకూడా అంగీకరించారు. కాని వారికి 'ఆర్గానిక్ మాటర్' కి 'ఇనార్గానిక్ మాటర్' కి ఉన్న తేడా తెలియలేదు. అంచేత సంఘం కొన్ని నియమాల ననుసరించిపోతుందనీ, వాటికనుగుణంగా వ్యక్తి నడ్చుకోవాలనీ లిబరల్సు అంటారు. ఇక్కడ భావం ఒకసారి ఏర్పడినాక దాని నియమాల ననుసరించి అది ప్రవర్తిస్తున్న సంగతి వారికి స్ఫురణకు రాలేదు. అనంతమగు స్వేచ్ఛనొసగి అతనిలోని అనవసరపు భయానికి స్వస్తిచెప్పడాని కేర్పడిన లిబరల్ విధానం అంతిమ దశదాకా తన పనిని నెరవేర్చలేకపోయింది. పదార్థవాదికి వ్యక్తుల మొత్తపు టజ్ఞానమే సాంఘిక అజ్ఞానం. దాన్ని తొలగించి వ్యక్తిని సాహసవంతుణ్ణి విజ్ఞానవంతుణ్ణి చేయడం-దానిద్వారా వ్యక్తి తనకు తానే సర్వానికి మూలం అని తెలుసుకోగల స్థయిర్యాన్ని విద్యనూ గఱపడం-దానికి సంబంధించిన కృషిని చేయడం-ఇవే పదార్థవాదికి కార్యక్రమాలు ఈ కార్యక్రమాలు ఎంతవరకూ తాత్త్వికమైనవి? ఎంతవరకూ రాజకీయమైనవి? రాజకీయ కార్యక్రమాల నాచరించ గలిగినది ఒక్క పార్టీలే గాబోలు. ఆ పార్టీలకు నాయకులుండి-లేవు పాలకులై-చివరికిధర్మకర్త లయితేనే గాని "ప్రజాస్వామ్యం" సిద్ధించదు గాబోలు.

లేదు తత్త్వం అంటే అన్ని శాస్త్ర

[illegible] సమన్వయం చేసి ఒక నిశ్చితమగు దృక్పథాన్ని ఇవ్వగల శాస్త్రమని అర్థం. అసలు పదార్థ తత్త్వం లేక భౌతికవాదం చేస్తోంది. అది అయ్యేదం లేదని జిజ్ఞాసువు గారు ఋజువు చేస్తే బాగుంటుంది.

నేటి శాస్త్ర పరిశోధనలు (మానవ) శరీరాన్ని సమగ్రంగా విశ్లేషించి (analyse)- మానవునిలో పరస్పర విరుద్ధాలగు గుణాలేవీ వస్తుతః లేవనీ, హేతువు సాధారంగా చేసుకుని ప్రయత్నం చేస్తే వ్యక్తికీ వ్యక్తికీ మధ్య ఎటువంటి అనవసర కలహాలూ ఉండ నవసరం లేదనీ తెలియ చేస్తున్నాయి. ఈ కార్యక్రమానికి ముందుగా వ్యక్తిలో పరస్పరభిన్నమగు 'ఇన్‌స్టింక్ట్స్' అన్న వసే దురభిప్రాయాన్ని తొలగించాలి. అందుకు అతని స్వార్థాన్ని ఆధారం చేసుకుని దాన్ని అతనిలో ప్రాయికంగా అణిగివున్న హేతువాద శక్తి సాయంతో వికాసవంతం చేయాలి. నాలోని కోరిక, నాలోని సంస్కారమూ ఒక తెన్నున పోగలిగిననాడే ప్రజాస్వామ్యం ప్రకాశ గలుగుతుంది. ప్రజాస్వామ్యం నిజమయింది కావాలంటే దాని కొక తాత్త్వికత కావాలి. ఆ తాత్త్వికత పదార్థవాదం మాత్రమే అవుతుంది. పదార్థవాదం మాత్రమే పురుషప్రయత్నానికి ప్రాధాన్యం ఇచ్చి వ్యక్తిని నీతివంతుణ్ణి చేయగలదు. నీతివంతుడు మాత్రమే నీతివంతమగు కార్యక్రమాన్ని నడుపగలడు-నీతివంతమగు వ్యవస్థలను నడుపగలడు.

ఏ విశ్వాసం మూఢమయిందో- ఏ విశ్వాసం సత్యమయిందో పదార్థవాదం మాత్రమే పరిష్కరిస్తుంది. విశ్వాసాన్ని వ్యక్తి ప్రశ్నిస్తాడు. తనకు తృప్తికరమగు జవాబు రాకపోతే అనుభవ దృష్టితో పరిశీలిస్తాడు. ఎంతకాలం వేచివున్నా తన అనుమానం తీరక పోతే ఇతరులతో చర్చిస్తాడు. ఆ చర్చ కార్యకారణ సరణిగా ఉంటుంది గాని చర్చకోసం చర్చగా ఉండదు. మనిషి చేసే ప్రతిపని కొంతవరకు చెప్పకపోయినా వ్యక్తి సుఖం కోసమే అయి ఉంటుంది. అయితే ఆ సుఖం తనవంటి ఇతరుల సుఖానికి అడ్డు రాకుండా ఉండాలి. తనకు వీలయినంత ఎక్కువ కాలం - ఎక్కువ సుఖాన్ని ఇవ్వగలగాలి.

ఒకవైపు సాంఘిక అజ్ఞానం తొలగాలని వాదిస్తూ మరొకవైపు ఆ కార్యక్రమం సాగించమని చెప్తున్నవారిని రాజకీయాల నుండి దూరమగుతున్నారని నిందించడం జిజ్ఞాసువుల లక్షణం కాదు. సభ్యులకి ఏది అవసరం అని విచారించ దలుచుకుంటే ఉపోద్ఘాతాలు వదలి, ఉద్రేకాలు కాకలు తగ్గించుకుని- అంతర్జాతీయ పరిస్థితులను పరిశీలించి- శాస్త్రీయ పరిశోధన లిచ్చేటి జ్ఞానాన్ని అలవరచుకొని వ్యక్తిని సంఘంతో సమన్వయపరచ గల ధీమా కావాలి. దేనినుంచి చెముల నయినా ప్రయోజనాన్ని బట్టి నిర్ణయించాలి కాని తోచినట్లు విమర్శించి కాదు. విమర్శ కూడా ఒక ఉద్దేశ్యం కలిగి ఉండాలి.

సంఘాన్ని నీతివంతమగు రాజకీయముల నల వరచుకొనుమని చెప్పుట మూఢ విశ్వాసమా? జిజ్ఞాసువు గారు ఊహించే సాంఘిక వ్యవస్థ ఎట్టిది? ఆ వ్యవస్థలో వ్యక్తికి రాజ్యాంగ యంత్రానికి సంబంధం ఏమిటి? ప్రజాస్వామ్యం అనే నినాదంమీద ప్రపంచంలో చాలా ఘోరాలు జరిగిన వన్నసంగతి ఇరవయ్యో శతాబ్దంలోని జిజ్ఞాసువు గారికి వేరుగా చెప్ప నవసరం లేదను కుంటాను.

లౌకికరాజ్యాంగం అని వారు చివర పేరాలో ఒకమాట వాడారు. ఈనాడు వీరుచెప్పిన నాయకులు హిమాలయాల మీదకుపోయి ఆశ్రమాలు స్థాపించుకుని జపం చేసుకోవడం లేదని వారు తెలుసుకోవడం ఆరోగ్యకరం. తత్త్వం, రాజకీయాలు, ప్రజాస్వామ్యం ఇటువంటి మాటలు అర్థం తెలియకుండా వాడడం అంత ఆరోగ్యకరమైన సంగతి కాదు.

తీరిక ఉంటే, ఓపిక ఉంటే సమానమే లక్ష్యంగా గల జిజ్ఞాసువు గారు ఆ నాయకుని [illegible] చదివి— [illegible] అని ఉభయులనూ, తద్వారా [illegible] గారి రాగలరు.

(ఇంగ్లీషు) ప్రపంచ సాహిత్యం జాన్ గ్లోగ్

# మృతశిల

మంగళవారం ఉదయం 11-45 గంటలకు పాతమేడద్వారానికి ఎదురుగా చిన్న ఆరామంలో ఖరీదైన వస్త్రాలు ధరించిన మానవుడి శరీరం పడివుండడం కనిపెట్టేడు బీటు పోలీసు జాన్. ఆ శరీరం ఆకలికి తాళలేక మరణించిన మానవుడిదిగా గోచరించింది. బయట పచ్చికనేలపై వికృతంగా పడివుంది.

పోలీసు నిర్ఘాంతపోయాడు. మధు దేవత గారడీ యేమో అనుకొని కళ్లు నులుపుకున్నాడు. ఆ శరీరం ఒక నిమిషం క్రిందట అక్కడ లేదు. అకస్మాత్తుగా పొగమంచులో తడిసిన పచ్చిక మీద, తుషారవర్షిత దినాన ఆకాశంనుంచి వూడి పడ్డాడేమో అన్నట్టు నిద్రావస్థలో అగుపించాడని తన రిపోర్టులో వ్రాశాడు. ఆవరణదాటి పచ్చికమీదనుంచి వెళ్లి ఆతడిని భుజంపట్టి కుదిపాడు. 'ఆస్పత్రిలోకి వెళ్లే వుద్దేశం లేకుంటే, లేచి నడచి వెళ్లు చేస్తాం' అన్నాడు.

అప్పుడు గ్రహించాడు తను మాట్లాడుతున్నది ఒక నిర్జీవితోనని. శవాన్ని పరీక్షించి, పాలిపోయిన పలుచబారిన ముఖాన్నిబట్టి ఆ నిర్భాగ్యుడు నడివయస్కుడని గ్రహించాడు. అతడు ధరించిన వస్త్రాలు విలువైనవి, చక్కగా తయారుచేయబడినవి. దివసమంతా వర్షిస్తూన్నా, అవిమాత్రం తడవలేదు. ఇవి పోలీసు గమనించిన విశేషాలు. అన్నిటికన్నా ప్రథమంగా అతడిని ఆకర్షించి ఆశ్చర్యం కలిగించిన విశేషం ఆ శరీరం ముఖంలో ద్యోతకమౌతూన్న అవ్యక్త వేదనానుభూతి చిహ్నాలు. వాటిలో దుఃఖంత బాధ, భయం, నిరాశ సమ్మిళితమై ధైర్యవంతుడైన పోలీసువాని గుండెల్నికూడా బేజారెత్తించాయి.

పాల్ దొర మృతి పోలీసు శాఖవారి మెదడులో చెయ్యిపెట్టి కలచింది. పరిస్థితులు అనుమానాస్పదాలు. ప్రత్యక్షవిషయాలు భయంకరాలు. ఆ నిర్భాగ్యజీవి ఆకలికి మాడి చనిపోయాడన్న వైద్యాభిప్రాయం కాదనరానిది. కాని మంగళవారం మే 16 వ తేదీ ఉదయం కోడిగ్రుడ్లు, రొట్టెలు, పళ్లూవగైరా తొమ్మిది గంటలకు కడుపునిండా తిన్నాడని అతనివంటవాడు చెప్పాడు. తొమ్మిదింటికి కడుపునిండా తిని 11-45కు ఆకలిచేత ప్రాణాలు కోల్పోవడం మానవ మాత్రుడికి మించినపని. అందుచేత పోలీసువాళ్లు మతిచెడి మూడురోజులు తిరిగారు. చివరకు మరొకవింత విశేషాన్ని పరిశోధించవలసి వచ్చేవరకూ పాల్ మృతి చిదంబర రహస్యంగానే వున్నది.

పాల్ యింటికి సమీపాలలో వుండే మనశ్శాస్త్రవేత్త డాక్టర్ గ్లాసింగ్ ఎఫ్. ఆర్. ఎస్. తాను నివసించే మేడమీదనుండి హఠాత్తుగా అదృశ్యమైపోయాడు. చనిపోయిన పాల్, కనిపించని గ్లాసింగ్ మంచి స్నేహితులు. పైరెండు అద్భుత విశేషాలనూ సమర్థిస్తూ ఒక అధికార పత్రం గ్లాసింగ్ పరిశోధనాగారంలో లభించింది. దానిలో యిలా వుంది.

"ఇది యెవరైనా చదువుతారో చదవరో నాకు తెలియదు. ఈ పరిసరాల్లో జరుగోజాలై

పరిభ్రమిస్తూన్నాను. కాని నా చుట్టుపక్కల చలనమే లేదు. నాలో శక్తి నశించిపోతూంది. ఇటువంటి పిచ్చి ప్రయత్నం యికముందు ఎవ్వరూ చెయ్యబోవద్దని హెచ్చరిస్తూ కొన్ని వాక్యాలు వ్రాయాలని వుంది. అదృష్టవశాత్తూ నా జేబులో యీ చిన్న పుస్తకం దొరికింది.

ఈ ప్రయోగం డా. హ్గాసింగు పరిశోధనాగారంలో మంగళవారం మే 16, 1939 ఉదయం పదకొండు గంటలకు ప్రారంభం అయింది. నా లెక్క ప్రకారం యిప్పుడు మే 23, సోమవారం, సాయంత్రం 4-30 కావాలి. కాని నా పరిసర ప్రపంచాని కంతటికీ మే 16, 11-45 గంటలు మాత్రమే.

ప్రయోగం ప్రారంభించిన 45 నిమిషాల వెనుక నేను నా స్వంత కాలమానంలో పడిపోయాను. బహుశా డా. హ్గాసింగు వేరొక కాలమానంలో పడివుండవచ్చు. ఏమంటే మా ప్రయోగ విధానం పూర్తి అయి, మేమిద్దరం వివిధ కాల పరిమితులలోకి ప్రవేశించగానే, డా. హ్గాసింగు అదృశ్యుడై పోయాడు. కాని ప్రయోగంలో ప్రపంచ స్థల పరిమితులను సంబంధించిన ఒకానొక దోషం వల్ల నేను మాత్రం అదృశ్యం కాకుండా మిగిలిపోయాను.

ఈ విషయం వైజ్ఞానిక పరిభాష ప్రయోగం లేకుండా స్పష్టీకరించడం కష్టం. విజ్ఞాన సాగరంలో అడుగీత యీదే నా వంటి వాడి కన్న, డా. హ్గాసింగు యీ విషయం బాగా చెప్పివుండేవాడు.

చాలాకాలంనుండి అతడు వివిధకాల గమనాలలో పరిశోధన జరుపుతూ వచ్చాడు. అయస్కాంతం లోహాలను ఆకర్షించి తన శక్తి రంగంలో ఆడించేటట్టు, కొన్ని విద్యుత్తరంగాల సహాయంవల్ల జీవరాసుల్ని ఆకర్షించి, కాల పరిమాణాల అంచులమీద ఆడించవచ్చునని అతడు నమ్మాడు. జీవుల్ని వర్తమానంనుండి భూతకాలంలోకి తీసుకుపోవచ్చునని, భవిష్యత్తును పరుగెత్తించవచ్చునని, కాలగమనాన్నే కట్టి పడవేయవచ్చునని నమ్మడమే కాకుండా, అలాంటి వెన్నో జరిగాయని వాదించేవాడు.

ఒకప్పుడు యిద్దరు ఇంగ్లీషు దొరసానులు, ఫ్రాన్సులో విహరిస్తూండగా హఠాత్తుగా వర్తమానావస్థలను తిరోగమించి, శతాబ్దుల భూతకాలంలోకి గమించి వర్సైలీసులో తత్కాలోచిత వస్త్రాలంకృతులైన జనులలో నాటి వుద్యానవనాల్లో పరిభ్రమించారని ఉదహరిస్తూ, వారి ఆశ్చర్యజనకమైన అనుభూతి పొందినచోటు ఆ సమయంలో విపరీత విద్యుదావేశితమైందని లిఖితపూర్వక సాక్ష్యాలు చూపాడు.

మానవులను వారి సాధారణ జీవిత నిమిష పరంపర క్రమంనుండి మార్చే విధానంలో అతడు కష్టపడి పనిచేశాడు. దానికి కావలసిన పరికరాలుగాని, తదంతరాంతర క్లిష్ట విశేషాలుగాని నాకు తెలిసినట్టు నటించలేను. ఆ తరంగాలకు పారిభాషిక పదంకూడా నాకు తెలియదు. కాని కాలతురంగం ఎక్కి స్వారీ చెయ్యడం అంటే నాకు మిక్కిలి కుతూహలానందాలు కలిగాయి. ముఖ్యంగా భవిష్యత్తులోకి చొరబడి 1939 వ సంవత్సరపు గర్భంలోని భీభత్సాలు, అనిర్ధారితాలు తెలిసికొందామని ఉబలాటపడ్డాను. కాని నా స్నేహితుడు యిదమిత్థమని తేల్చలేడు. పైగా కాబోయే కాలంలో ప్రవేశించడం మరణశిక్ష వంటిదని, ప్రకృత కాలంతో సంబంధం తెగగొట్టుకోవడమని, తిరిగి రావడం కల్ల అని చెప్పాడు. అజ్ఞానంవల్ల కష్టాలలో చిక్కుకునే కన్న మానవజాతికి అభ్యుదయం కలిగించే సాహసకృత్యాలు నెరవేర్చడానికి వెనుదీయ్యవని చెప్పాడు. 'మన ప్రయత్నం సఫలీకృతం కాకపోవడమే కాకుండా నిష్కారణంగా మన శరీరాలని విద్యుత్తరంగాలకు బలి పెట్టవలసి వస్తుందేమో, అంచేత ముందే మరణానికి సిద్ధపడి'మని హెచ్చరించాడు. ఇది చిరవిస్మృత విషయం కావడంచేత నేను తక్షణం ఒప్పుకున్నాను. నేను నిజంగా ప్రాణాలు కోల్పోతే నా మృతికి డా. హ్గాసింగ్ ఎంతమాత్రం బాధ్యుడు కాడు.

కాని నేను నీరసించిపోతూన్నాను. వ్రాత త్వరగా ముగించాలి. డా. హ్గాసింగ్ స్వగృహంలోని పరిశోధనాగారంలో ఉదయం 11 గంటలకు ప్రయోగం ప్రారంభం అయింది. నేను విద్యుత్తంత్రులను పట్టుకోగానే హ్గాసింగ్ స్విచ్చి నొక్కి విద్యుత్ప్రసారం ప్రారంభం గావించాడు. నాలో శక్తి ప్రవేశిస్తూన్నట్టు నాకు తోచి

యంత్రంలో ముల్లు వెనక్కి రావడం గమనించాను. నేను ఒక పర్వతాగ్రం నుంచి ఆకాశంలోకి ఉరకడానికి నిశ్చయించిన మానవుడనేమో, అంతరాళంలో అనతిక్షణీయంగా ఆహ్లాదిస్తూ, కఠినశిలావృతమైన మేదినీతలంమీదపడి సహస్ర ఖండాలయిపోతున్నానన్న భయం ఆవరించింది. నాకు స్పృహ తప్పిపోయింది. గదిలో చీకటి ప్రవేశించింది.

కళ్ళు విప్పి చూసేసరికి విద్యుత్తంత్రుల నుంచి నా చేతులు విడివడ్డాయి. బల్లమీద గడియారంలో 1-15 అయింది. నా మిత్రుడు అదృశ్యుడైపోయాడు. కుర్చీ నుండి జాగ్రత్తగా లేచినప్పుడు నేను నీరసంగా వున్నానని, కళ్ళు తిరుగుతున్నాయని గ్రహించి బల్ల పట్టుకున్నాను. దృష్టి సారించడం మొదట కష్టమైంది. కాని క్రమేపీ చూడగలిగాను. కాళ్ళలో శక్తి వచ్చింది. కిటికీ దగ్గరగా నడిచి వెళ్ళి బయటికి చూశాను.

దృశ్యం పరిచితమైనదే. నవ్యత ఏమీ గోచరించకపోయినా, కొంతసేపటికి అంతా చలనరహితంగా వుందని గ్రహించాను.

అప్పుడు నా హృదయం భయకంపితం అయింది. ఉద్యానవనంలో ఒక చెట్టుపైన మూడు పక్షులు రెక్కలల్లార్చి చలనమే లేకుండా మేఘావృతాకాశంలో చిత్రకారుడు చిత్రించినట్టు వ్రేలాడుతున్నాయి.

నలభై అయిదు నిమిషాల క్రిందట నేను నివసించిన ప్రపంచ కాలగమనానికి విరుద్ధమైన ధృతి గల అన్యకాలగమనంలో ప్రవేశించానని గ్రహించాను. బల్లపై గడియారం ఆగిపోయింది. నాతో బాటు నా శరీరంమీద వున్న దుస్తులు, చేతి గడియారం మాతృకాలానుసారాలు కావడం చేత నా గడియారం నడుస్తూంది. దానిలో 12-5 కావడం చేత నేను నూతనకాలంలో యిరవై నిమిషాలు గడిపి వుంటాను. తలుపులు తెరిచి వున్నాయి. నెమ్మదిగా మెట్లు దిగి క్రిందికి వెళ్లాను. నేను తేలికగా నడుస్తూన్నాను. నా కష్టాలలో మొదటిది వెంటనే ఎదుర్కొన్నది.

క్రింది తలుపు గడియ కదపలేక పోయాను. అదృష్టవశాత్తూ కిటికీ తలుపులు తెరిచివుండడం చేత వాటిద్వారా వీధిలో ప్రవేశించాను. వీధిలో కార్లు, సైకిళ్లు, కుక్కలు, మనుష్యులు అంతా గడ్డకట్టిపోయారు- చలనమే లేదు! పక్షి రెక్క రెపరెపలాడదు- కనురెప్పలు వ్రాలిలేవు. వర్షం పడడం చేత కదలిక లేక గాజుబారి గుండ్రటి గుళ్ళవలె కరకుదేరి అంతరాళంలో నిల్చిపోయిన వర్షజలబిందువులు నా త్రోవ ఎదుర్కొన్నాయి.

ఇక యెక్కువ వ్రాయలేని నీరసావస్థలో వున్నాను. ఇది వ్రాయడానికే, ఈ భయంకర చలనహీనస్వరూపాల కాయలవంటి కళ్లు మూయలేక, పరిశోధనాగారానికి తిరిగివచ్చాను. ఆ కదలని, కదలలేని దృశ్యాన్ని చూడలేను - మూయలేను.

నేనొంటరి మానవుడను!

ఆరు రోజులైంది నాకు తిండిలేదు. నేనేదీ తినలేను. దుకాణాలలో తినుబండ పదార్థాలను నేను నోచుకోలేను. ధ్రువప్రాంతపు హిమగ్రావాలవలె పట్టా కాయలు కఠినవస్తువులు. నేను వాటిని కదపలేను. నాకు కనిపించే జగత్తంతా ఉక్కుతో తయారైనది. ఇది ఎవరైనా చదువుతారో చదవరోగాని - ఇంతకంటె ఎక్కువ వ్రాయలేను.

మరణం శరణం గచ్ఛామి——

(అనువాదం : అంగర వెంకటకృష్ణారావు)






(గతసంచిక తరువాయి)

## ఇమ్మడి దేవరాయలు

(క్రీ. శ. ౧౪౨౨-౧౪౪౬)

ఇమ్మడి దేవరాయలు తన తండ్రి విజయరాయలతో గూడ సామ్రాజ్యాధిపత్యము వహించి క్రీ. శ. ౧౪౨౨వ సంవత్సరమునుండి పృథ్వీ పరిపాలన సేయదొడగెను. కాని, యొకానొక దక్షిణ కన్నడమండల శిలాశాసనమున శకాబ్దము ౧౩౪౩ నగు నిర్దిష్టమైన శార్వరివర్ష గ్రీష్మ మాసమున [క్రీ. శ. ౧౪౨౧ మార్చి] నిమ్మడి దేవరాయల యేలుబడి ప్రారంభమాయెనని చెప్పి యున్నది. కాని, యందు చెప్పినది ఇమ్మడి దేవరాయల రాజ్యారంభకాలము గాదు. ఏలనగా నీ శాసనము వ్రాయించినప్పుడింకను ఇమ్మడి దేవరాయల తాత మొదటి దేవరాయలు సజీవుడై రాజ్యపాలనము సేయుచుండెను; అతని పెదతండ్రి రామచంద్ర రాయలకుగాని తండ్రి విజయరాయలకుగాని పట్టాభిషేకము గాలేదు. అతడు శాసనములందు తనతండ్రి సింహాసనమును దా నధిష్ఠించినట్లు చెప్పుకొని యుండుటవలన, విజయరాయల యనంతరమె యతడు రాజ్యాభిషిక్తు డాయెనని యెంచుట సముంజసము. ప్రాయశః పైశాసనమున జెప్పినది ఇమ్మడి దేవరాయలు తుళురాజ్య మండలాధిపత్యము సేయ నారంభించిన కాలమై యుండవచ్చును. అతని పట్టాభిషేకము విజయరాయలు దివంగతుడైన పిమ్మటనె జరిగియుండవలయును.

తన పూర్వీకు లందరివలెను ఇమ్మడి దేవరాయలు బహమనీ సుల్తానులతో పలుమారు యుద్ధము సేయవలసి వచ్చెను. విజయరాయలు సింహాసనము నధిష్ఠించిన వెంటనె మొదటి యుద్ధము ప్రారంభమైనది. అహమదు ఖాన్ ఖానెఖానుడు దనయన్నయు, రాజునగు ఫిరోజు శాహును వధించి, క్రీ. శ. ౧౪౨౨ సెప్టెంబరు ౨౫వ తేదినాడు గుల్బర్గ రాజ్యపీఠముపై గూర్చుండి రాజ్యాభిషేకము గావించుకొనెను; తరువాత ఫిరోజుశాహు రాజ్యకాలమున మొదటి దేవరాయలు బహమనీ రాజ్యముపై దెత్తివచ్చి దేశమున గలిగించిన సంక్షోభమునకు ప్రతీకారము సేయ నిశ్చయించి తన రాజ్యాభిషేకమునకు పిమ్మట వచ్చిన మొదటి నౌరోజు (క్రీ.శ ౧౪౨౨ డిసెంబరు ౧౫వ తేదీ) నాడు విజయనగరముపై దండు వెడలెను. కాని యీదండయాత్ర యందేమిసంభవించెనో, తుదకది యెట్లు ముగిసెనో నిశ్చయించి చెప్పుటకు సాధ్యము గాదు. దీనికి ముఖ్యకారణము మహమ్మదీయ చరిత్రలయందు గానవచ్చు విపర్యాసము. మహమ్మదీయ చరిత్రకారు లొకరు చెప్పిన దానిని మఱియొకరు చెప్పరు. నిజామ్-ఉద్-దీన్ అహమదు, సయ్యదు అలీ లిరువురును యుద్ధవృత్తాంతము నత్యంత సంగ్రహముగ రెండు మాటలలో ముగించి యున్నారు. అహమదుశాహు విజయనగరముపై దెత్తిపోయి దేశమును చూఱగొని పాడు చేసెనని వారిద్దఱు నైకకంఠ్యముగ బలుకుచున్నారు. తరువాత, దేవరాయ లహమదు శాహుకు లొంగి యతనితో సంధి గావించుకొనెనని నిజామ్-ఉద్-దీన్ వ్రాసియున్నను, సయ్యదు అలీ సంధి మాట యెత్తడు. వీరిద్దఱు

చెప్పు వృత్తాంతమునకంటె ఫెరిష్టా కథనము భిన్నమైనది; విపులమైనది; అపూర్వ సంఘటనలతో నలరారుచున్నది. చదువుట కెంత హృదయంగమముగ నున్నను చారిత్రకదృష్టితో బరిశీలించిన నది నిర్దుష్టమైనదని యొప్పుకొనుటకు వలనుపడదు. సంగ్రహముగ ఫెరిష్టా చెప్పు వర్తమాన మిది: దేవరాయలకు బలసంపన్నులగు మిత్రు లనేకు లుండిరి. గుజరాతు దేశపు సుల్తాను అహమదుషా హొకడు; మాలవదేశపు సుల్తాను మఱియొక్కడు; తెలింగాణము నేలు వెలమరాజొకడు. కావున మాళవ గుజరాతు దేశముల నుండి శత్రువుల దన రాష్ట్రమును జొరనీక యడ్డ పెట్టుట కహమదుషా హొక గొప్పసైన్యము నుత్తర సరిహద్దు కడ నిలిపి, మఱియొక సేనతో గదలి విజయనగరముపై గూచి చేసెను. ఆ సమాచారము దెలియవచ్చి నంతటనె ఇమ్మడి దేవరాయలు తెలింగాణ ప్రభువునకు దనకు బాసటకై యుద్ధమునకు రమ్మని సందేశమంపి నిజ బలముల గూర్చుకొని బహమనీ సుల్తాను నెదుర్చుటకొఱకు తుంగభద్రవైపు నడచెను. ఉభయ బలములకు నచటనచట చిల్లరకయ్యములు సంభవించినవి. ఒకానొక రణక్షేత్రమునం దిరు తెగలవారును నరిపోరుచుండగా, నున్నటులుండి తెలింగాణప్రభువు నట్టేట బుట్టి ముంచి రాయలను దిగవిడిచి నిజరాజ్యమునకు బోయెను. రాయల కపజయము గలిగినది; అతడంతట విజయనగరమునకు బోయి కోటయందు తల దాచుకొనెను. అహమదుషా హతని వెన్నంటిపోయి విజయనగరమును ముట్టడించెను; నిలుపోపక దేవరాయలు కొన్ని యేండ్లనుండి గూడ నిలువ యుండిన కప్పము చెల్లించి సంధి చేసికొనెను. ఇంతవట్టు ఫెరిష్టా వివరించిన యుద్ధకథన సారాంశము. అతడు చెప్పిన దంతయు సత్యమని యొప్పుకొనుటకు వలనుపడదు. ఫెరిష్టా దేవరాయల మహమ్మదీయ మిత్రవర్గమును పేర్కొన్నను, వారీ సంగ్రామమున బాల్గొన్నట్లు చెప్పలేదు. యుద్ధమంతయు దేవరాయలొక్కనితోడనే జరిగినట్లు వ్రాసియున్నాడు. మాళవ గుజరాతు సుల్తానుల ప్రసక్తి లేదు; కాని వాస్తవ మిదికాదు. ఇంతవఱకు లభించిన సాక్ష్యము పరిశీలించి చూడగా నప్పుడు పెక్కండ్రు శత్రువు లేకమై యహమదుషాహతో బ్రతిఘటించినట్లు తెలియుచున్నది. ఫెరిష్టా పేర్కొన్న గుజరాతు మాళవ తెలింగాణ ప్రభువులే కాక గొండ్వనరాజు కూడ దేవరాయలకు బ్రాపుగ నహమదుషాహతో యుద్ధమునకు గడగెను. మిత్రులెవ్వరును లేక యహమదుషా హొంటరియై విడివడెను. స్థితిగతు లిట్లు ప్రతికూలమై యుండగా ఫెరిష్టా చెప్పిన ట్లహమదుషాహ దేవరాయలపై సంపూర్ణ విజయమును బొంద వలనుపడియుండదు. మఱియు, నీ యుద్ధవర్ణనయందు ప్రత్యేకత గానరాదు. పాతపాటనే పాడినాడు ఫెరిష్టా. బహమనీ విజయనగర సంగ్రామము లన్నిటివలె నిదియు విజయనగర రాష్ట్రముపై దురకల దాడితో బ్రారంభమగుచున్నది: రాయల ప్రతిఘటనము; అటువెనుక రాయల యోటమి; పిమ్మట తురకలచే విజయనగరపు ముట్టడి; తరువాత పరిసరప్రదేశ విధ్వంసము; రాయల యశక్తత; సంధిసంప్రార్థన; కడపట సుల్తానుతో బ్రతిష్ఠాభంజకమగు సంధి యొడంబడిక, ఇవి ఫెరిష్టాచరిత్రయందు వర్ణింపబడి యుండు ప్రతి సంగ్రామ వృత్తాంతమునను మామూలుగ గానవచ్చు యుద్ధాంశములు. చర్వితచర్వణముగ గానవచ్చు నీ యంశములందు నేవి వాస్తవములో నిశ్చయింప సాధ్యము గాదు; కొన్ని సంభవించి యుండవచ్చును; కాని వీని యాథార్థ్యమును నిరూపించగలుగు సాధనాంతరములు లభించువరకును, వీని నంగీకరించుట యుక్తము గాదు. ఫెరిష్టా కథయందలి సత్యాసత్యములను గూర్చి పరిశోధకు లెట్టభిప్రాయపడినను, సంగ్రామ ప్రారంభదశయందు విజయనగర సైన్యము బహమనీ రాజ్యమును జొచ్చి గుల్బర్గ మండలములోని యెతగిరి దుర్గము వఱకును గూచి చేసి పోయెననుటను శంకింప బనిలేదు. వెలుగోటి వారి వంశావళి యందీ తరపు వెలమరాజులు తోరగల్లు బానాలి పట్టణములను బట్టుకొని రనియు నేతగిరి దుర్గమును జయించిరనియు జెప్పియున్నది; తెలింగాణ ప్రభువు ఇమ్మడి దేవరాయలకు సహాయముగ వచ్చి పోరినట్లు ఫెరిష్టా చెప్పియుండుటచేత పై పేర్కొనిన వెలమవారి విజయము లన్నియు నీసంగ్రామమునకే సంప్రాప్తమై యుండవలయును. కాని యటు

కిమ్మట విజయనగర సైన్య పరాజయము పొందినది; దీనికి గారణము ఫెరిష్టా చెప్పినట్లు యుద్ధమున దెలింగాణప్రభువు రాయలను దిగనాడి వెడలిపోవుటయె కావచ్చును. మఱియు గళింగాధి పతి నాల్గవభానుదేవుడు తీరాంధ్రదేశముపై దండు వెడలి కొండవీటి రెడ్డిరాజ్యమును స్వాధీనపఱచు కొనెను. సందర్భ మిట్లనుకూలపడగా నహమదు శాహ తందుచూచుకొని ఫెరిష్టా వచించిన రీతిని రాయసామ్రాజ్యముపై దండయాత్ర సాగించి యుండవచ్చును; కాని విజయనగరమును ముట్టడించి ఇమ్మడి దేవరాయలను సంధికి నొడబడ జేసె ననుటయె సంశయాస్పదము. విషయ మింకను పరిశోధనీయము.

చరిత్రకారు లెల్లరును గమనింపక విడిచి పెట్టిన ముఖ్యాంశము నొకదాని నీపట్టున పేర్కొనవలసి యున్నది. అహమదుశాహ విజయనగరముతో నింకను యుద్ధము సేయుచుండునప్పుడె తనరాజధానిని గుల్బర్గనుండి బీదరుకు మార్చుకొనెను.* విజయనగరమునకు సమీపమున నుండు గుల్బర్గ నుండి దూరమున నుండు బీదరుకు బహమనీ సుల్తాను దన రాజధానిని మార్చుకొనుటకు గారణము లేకపోలేదు. ప్రాయశః అహమదుశాహ విజయనగర దండయాత్ర, మహమ్మదీయ చరిత్రకారులు చెప్పినట్లు, జయప్రదముగ ముగిసినట్లు కన్పట్టదు. పిత గిరివఱకును దేవరాయల దండయాత్ర సాగెనని వెలుగోటివారి వంశావళివలన విదితమగుచున్నది. చరిత్రయం దుక్తము గాకపోయినను ఈధాటి గుల్బర్గను దాకియుండవచ్చును; సుల్తాను దన రాజధాని విజయనగర గడిదేశమున కంతసమీపమున నుండుట మేలుగాదని యెంచి దూరమున నుండు బీదరును మార్చుకొని యుండవచ్చును. బహమనీ రాజధాని మార్పునకు వాస్తవమైన కారణ మెద్దియైనను, అహమదుశాహునకీ దండయాత్రయందు సంపూర్ణవిజయము చేకుఱలేదనుటకు గొంత శాసనాధారము గలదు. క్రీ. శ. ౧౪౨౯-౩౦వ వత్సరమున వ్రాయించిన యొక దక్షిణకన్నడమండల శాసనమున నిమ్మడి దేవరాయలు తురకయశ్వదళములను నిర్జించెనని చెప్పియున్నది. ఇందు పేర్కొన్న తురక బహమనీ సుల్తానె కాని యన్యుడు గాదు. క్రీ. శ. ౧౪౨౨ ౧౪౩౦ వ సంవత్సరముల నడుమ విజయనగర బహమనీ రాజ్యముల కొక్కపర్యా

---

* అహమదుశాహ తన రాజధానిని 'తన రాజ్య ద్వితీయవర్షము రజాబు మాసమున (క్రీ. శ. ౧౪౨౩, జూన్) గుల్బర్గ నుండి బీదరుకు మార్చెనని బుర్హాన్-ఇ-మ అసీరునందు చెప్పియున్నది. (ఇండి. ఆంటి. సం. ౨౮. పుట ౨౧౦) రఫి-ఉద్-దీన్ షిరాజీ తన తజ్‌కిరత్-ఉల్-ములూకను చరిత్రయందు అహమదుశాహు హి ౮౨౦ వ సంవత్సరమున రాజ్యాభిషిక్తుడాయెననియు, నాయేటనె తననూతనరాజధాని యగు మహమ్మదాబాదుబీదరుకు అస్తిభారమువేసెననియు వ్రాసియున్నాడు (ఇండి. ఆంటి. సం. ౨౮. పుట ౨౧౨). కాని అహమదుశాహ రాజ్యాభిషిక్తుడైనది హి. ౮౨౫ (క్రీ. శ. ౧౪౨౨-౨౩) వ కాని హి. ౮౩౦ వ సంవత్సరమున కాదు; కావున అహమదుశాహు రాజ్యమునేలను నారంభించిన సంవత్సరముననె మహమ్మదాబాదు బీదరుకు పునాది వేసినది వాస్తవమైనచో నది జరిగినది హి. ౮౨౫ (క్రీ. శ. ౧౪౨౨-౨౩) వ సంవత్సరమునందై యుండవలయును. కాని, ఫెరిష్టా హి. ౮౩౦ వ సంవత్సరమునం దహమదుశాహు కెహర్లా నుండి మరలి వచ్చునప్పుడు బీదరుకు పునాది వేసెననియు, హి. ౮౩౬ వ సంవత్సరమున దాని నిర్మాణము సంపూర్ణమాయెననియు వ్రాసియున్నాడు. (బ్రిగ్స్. ఫెరిష్టా. సం. ౨, పుటలు. ౪౧౧, ౪౧౩). నిజామ్-ఉద్-దీన్ అహమదు ఫెరిష్టా వలె నహమదుశాహు కెహర్లా నుండి మరలి వచ్చునప్పుడు అస్తిభారము వేసినట్లు చెప్పినను, నది హి. ౮౩౨ (క్రీ. శ. ౧౪౨౮-౨౯) లో జరిగె ననుచున్నాడు (తబ. అక్బ. ఆంగ్ల అను. సం. ౩. పు. ౫౧-౫౩). ఇట్లు బీదరు నిర్మాణమును గురించి లభించిన సాక్ష్యము పొందికలేక యున్నది. కాని బుర్హాన్-ఇ-మ అసీరు కాలానుక్రమణిక ఫెరిష్టా కంటె విశ్వాసపాత్ర మగుటవలన, క్రీ. శ. ౧౪౨౩ వ సంవత్సరమే వాస్తవముగ బీదరుకు శంకుస్థాపన చేసిన కాలమని తోచుచున్నది.

యావే యుద్ధము జరిగియున్నందున శాసనోక్త విజయము సహమదుశాహు దండయాత్ర యందే ఇమ్మడి దేవరాయలు పొందియుండ వలయును.

రాజ్య ప్రారంభ దశలో నిమ్మడిదేవరాయల నెదిర్చిపోరిన శత్రువు సహమదుశాహు బహమనీ యొక్కడే కాడు. గజపతియు వెలమవారును మాఱొడ్డి నిలిచిరి. పై నుదహరింపబడిన దక్షిణ కన్నడమండల శాసనమున 'మతంగరాజ సింధుర వరకోటి మర్దన మృగేశ్వర వంగ్ర నరేంద్ర సైన్యపాళి గరుడోద్భవం విజయరాయ తనూభవ దేవ భూవరః' అని యిమ్మడి దేవరాయలు ప్రశంసింపబడియున్నాడు. ఇందు పేర్కొనబడిన మతంగరాజు కళింగదేశాధీశ్వరుడు గజపతి నాల్మడి భానుదేవుడు; ఆంధ్ర నరేంద్రుడు రాచకొండ వెలమరాజు ముమ్మడి సింగ భూపాలుడు. రాయలకు వీరితో వైరముగలుగుటకు ముఖ్యకారణము రాజులకెల్ల సహజమైన భూకాంక్షయే. ఉత్పన్నమై పోయిన కొండవీటిరాజ్యము కొఱకు వీరి కొండొరులతో పోరాటము గల్గినది.

కొండవీటి కడపటి రెడ్డిరాజు రాచవేమన క్రీ. శ. ౧౪౨౪ వ సంవత్సరమున హంతకుని ఖడ్గమున కెరయయ్యెను; అంతట కొండవీటి రెడ్డిరాజ్య మంతరించినది. చిరకాలమునుండియు రెడ్డిరాజ్యముపై గనువేసియుండిన రాయలు వెంటనె కొండవీటి దేశము నాక్రమించుకొని రాయ సామ్రాజ్యమున గలుపుకొనెను. ఇది వెలమవారికిని గజపతికిని కనుకుట్టినట్లాయెను. మఱియు రెడ్లకును గజపతులకును గళింగాధిపత్యముకొఱకు గలిగిన స్పర్ధ తీక్ష్ణతరమై దుస్సహమాయెను. ప్రోలయ వేమారెడ్డి కాలమునుండియు రెడ్డి రాజులు కళింగమును గబళింప బ్రయత్నము సల్పుచుండిరి. రానురాను వారి యాటోపము హెచ్చుచు వచ్చినది. కుమారగిరిరెడ్డి పక్షమున కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవరమునకు పాలకుడై వచ్చినప్పటినుండియు వారి యుద్ధతి యతిశయమై భరింప శక్యముగాకపోయెను. క్రమ క్రమముగ వారి తూర్పు సరిహద్దు సింహాద్రిని దాటినది; దక్షిణమధ్యకళింగములను మీఱినది; చిలకసముద్రమును దాకినది. కాటయ వేమారెడ్డి నిహతుడైనను నతని సేనాధిపతి దొడ్డయ యల్లాడ నిర్వాహకుడై రాయల ప్రాపువడసి శత్రు నిర్మూలము గావించి రెడ్డ యధికారమును నిలబెట్టెను; మొదట గజపతి భానుదేవునితో సంధిచేసికొనవలసి వచ్చినను, తరువాత కాటయ వేముని మార్గమనుసరించి కళింగమును మరల సాధించెను. కాని యతడు చిరకాలము ప్రజా పాలన చేయలేదు. క్రీ. శ ౧౪౨౩ వ సంవత్సరమున నతడు దివంగతుడాయెను; అతని యనంతర మతని పుత్రులు వేమవీరభద్రులు రాజ్యాధిపతులైరి. వారింకను రాజ్యమున గుదురుకొనక మునుపే, రాయలు వారికి సహాయమొసగ శక్యము గాని సమయమందే, వారి యధికారమును గూల ద్రోసి రాజమహేంద్ర రాజ్యమును స్వైవసము జేసికొనుట మేలు. కాని రెడ్లు సామాన్య శత్రులు గారు; బలసంపన్నులు. అల్లాడ మృతినందిన నేమి? అతని పుత్రు లారితేఱిన యోధులు. అందును అల్లయవేముని పరాక్రమము లోకవిఖ్యాతము. కావున రెడ్డిరాజ్యముపై దండువెట్టుటకు ముందు స్వపక్షమును బలపఱచుకొని జయోపలబ్ధిని సునిశ్చయము జేసికొనుట తగవు. కావున గజపతి భానుదేవుడు దాను తలపెట్టిన కార్యమున దనకు దోడ్పడగల మిత్రుని సంపాదింపగోరి రాచకొండ వెలమరాజు ముమ్మడి సింగభూపాలుని సాయ మపేక్షించెను.

సింగభూపాలు డప్పుడు రాయలతో మైత్రి నెఱపుచుండెను. వెలమ సైన్యము దేవరాయల పక్షమున సహమదు శాహుతో గుల్బర్గ ప్రాంతమున యుద్ధము చేయుచుండెను. కాని రాయలతోడి మైత్రి తాత్కాలికమైనది; స్థిరమైనది కాదు. సర్వాంధ్రదేశమును గబళింప దలకొనియుండు రాయలతో నతనికి పొందు కుదురదు. గజపతితో వెలమవారికి జుట్టరికముగలదు. రాజకీయ వ్యవహారములలో బాంధవ్యము గణ్యము గాక పోయినను, రెడ్లకును వెలమవారికిని తరతరములుగ పెరిగి వచ్చుచుండు వైరము గజపతితో సఖ్యముచేయ నతని బురికొల్పుచుండెను; మఱియు నూతన రాజ్య సంపాదనేచ్ఛయు నా పై పే యుద్వేగపఱచినది. కావున సింగభూపాలుడు గజపతితో సఖ్యమున జేయగోరి యుద్ధ సన్నద్ధుడాయెను. ఈ రెండింటి పడికట్టు ప్రథమ ఫలము మిత్రద్రోహము. రాయ

లకు ప్రాపుగ బోయి బహమనీ సుల్తానుతో యుద్ధము సేయుచుండిన వెలమదొరకును సింగభూపాలుకు మరలిరా సాహాయించెను. యుద్ధమధ్యమున దన్నువిడనాడి వెలమవారేగుటవలన రాయలకు బరాజయము గలిగినది.

తన పక్షమునకు బలమెక్కనది: దీనితోపాటు శత్రుపక్షమునకు బలక్షయము గలిగిన దనకు జయము గలుగుట ధ్రువము. కావున భానుదేవుడు వేమవీరభద్రుల దాయాదులకు గొందఱికి రాజమహేంద్రరాజ్యము నిచ్చెదనని యాసచూపి వారిని రాజద్రోహమునకు బురికొల్పెను. వారు వేమవీరభద్రులను ధిక్కరించి రాజ్యము నాక్రమించుకొనగడగిరి.

తీరాంధ్రదేశముపై భానుదేవుని దండయాత్రయందు రెండు ఘట్టములు గానవచ్చుచున్నవి. ప్రప్రథమమున నతనికి తీరాంధ్ర మంతటిని జయించు నుద్దేశమున్నట్లగపడదు. రాజమహేంద్రవర రెడ్డి సంరంభము నణగించుటయే యాతని ప్రధానాభిప్రాయము. తూర్పునుండి గజపతి సేనయు బశ్చిమమునుండి వెలమదండును రాజమహేంద్రవరరాజ్యమును బ్రవేశించినవి. ఉభయపార్శ్వములనుండియు శత్రువు లాక్రమించి పైకొనుటవలన వేమవీరభద్రులకు వారినోర్వశక్యము గాకపోయెను. దేవరకొండ వెలమదొర మాదయ లింగమనాయ డల్లయవేముని నతని తమ్ముని వీరభద్రుని జయించి రాజమహేంద్ర దుర్గములను గొనెననియు, వారతనికి పాదాక్రాంతులై రాజ్యము నిల్పుకొనిరనియు, వెలుగోటివారివంశావళియందు చెప్పియున్నది. ఈ విజయమంతయు నొక్క లింగమనాయని పరాక్రమము వల్లనే చేకూఱెనని యందున్నను, గజపతి దళముల తోడు లేక వెలమ వారికి రాజమహేంద్రదుర్గములను జయించుటకు సాధ్యమై యుండదు. అల్లయ వేముడును వీరభద్రుడును పాదాక్రాంతులైనది లింగమనాయనికి గాదు, గజపతి భానుదేవునికి. అతని ప్రసాదమువలననే వారు తమరాజ్యమును నిల్పుకొన్నది.

రాజమహేంద్రవరరాజ్యము వైవశమైనపిమ్మట తీరాంధ్రమంతటిని జయింప వలయునని భానుదేవుని కాశపుట్టినది. కొండవీటి రాజ్య ముత్సన్నమైన వెనుక కృష్ణానదికి దక్షిణమందలి యాంధ్రదేశమంతయు రాయలకు వశమై యుండినది. కాని, యతని యధికార మప్పటికింకను నచట సుస్థిరముగ నెలకొనలేదు.

బహమనీ సైన్యములను నిగ్రహించుటకొఱకిమ్మడి దేవరాయలు దన యావచ్ఛక్తిని వినియోగింపవలసి వచ్చినందున కొండవీటి రాజ్యమున దన యధికారమును బలపఱచుకొనుట కవకాశము గలుగలేదు. రాయరాజ్యమంతయు దురకలతోడి పోరాటమున దవులుకొని యుండుటవలన దేశసంరక్షణకు వలసిన దళముల నచట నిలుపుటకు వలనుపడకపోయెను. ఈ స్థితిగతులను దెలిసికొని భానుదేవుడు వెలమదండుతోగూడ కృష్ణను దాటెను; విజయనగర సైన్యమొకటి వారి మార్గము నరికట్ట బ్రయత్నమొనర్చెను; గాని యందువలన లాభము గలుగదాయెను; కృష్ణకడ జరిగిన యుద్ధమున లింగమనాయని పరాక్రమముచే నోటువడి యథాయథలై పాఱిపోయెను. అంతట భానుదేవుడు కొండవీటిరాజ్యమును వశపఱచుకొని తన యధికారుల నచట దేశపరిపాలనకు నియమించెను. కొండవీటిసీమగ్రామ కైఫీయతులలో గజపతి దండయాత్ర ప్రస్తావము గలదు. ప్రౌఢదేవరాయలు దేశము నాక్రమించుకొనుటకు ముందు 'లాంగూల గజపతి జమాయతు చేసుకొని కటకము మొదలుకొని ఉదయగిరి పర్యంతము ఉన్న గిరిదుర్గ స్థలదుర్గములు ఆక్రమించి శా. ౧౩౪౨ శకము లగాయతు శా. ౧౩౫౩ శకమువఱకు ౧౨ సంవత్సరములు ప్రభుత్వము'చేసెనని యొక దానియందును 'శా. ౧౩౪౦ శకం లగాయతు శా. ౧౩౬౪ శకం వఱకు ౨౫ సంవత్సరములు రాజ్యము చేసె'నని మఱియొకదానియందును గలదు. లాంగూల గజపతి యెవ్వరో తెలియదు; శా. ౧౩౪౦ ప్రాంతమున గజపతి సింహాసనము నధిష్ఠించి యుండిన రాజు నాల్గవ భానుదేవుడగుటచే 'లాంగూల గజపతి' యతనికి నామాంతరమై యుండవచ్చును.* మఱియు భానుదేవుడు

* 'లాంగుల్య' గజపతియని యుండవలయును. 'లాంగూల' యనునది భ్రష్టరూపము. కళింగదేశమున లాంగుల్య యను నది యొకటి గలదు. ఆ నదీతటమున బుట్టినవాడగుట చేతనో, గజపతి పదమునకు రాకమును నచట రాజ్యము చేయుచుండినందువల్లనో భానుదేవుని కాపేరు వచ్చి యుండవచ్చును.

పై కీఫరులందు చెప్పినట్లు ౧౨, లేక ౨౫ సంవత్సరముల కాలము కొండవీటిసీమ నేలలేదు. ఆతని యేలుబడిక్రింద నుండిన దంతయు పైదేండ్ల కాలమే.

బహామనీ దండయాత్ర వెనుదిరిగి పోయిన వెంటనే ఇమ్మడి దేవరాయలు తీరాంధ్రదేశము నుండి గజపతిని వెలమవారిని పాఱద్రోలుటకు ప్రయత్నమొనర్చెను. రాయ రాజువ యుదయగిరి నుండి బయలువెడలి తీర దేశమునుండ కూచిచేసి సింహాద్రిపర్యంతము నడచెను. ఈ యుద్ధయాత్ర విషయమై మన కేమియు దెలియదు. ఇమ్మడి దేవరాయల సామంతులలో నొకడగు సాంపరాయని తెలుంగ రాయలు క్రీ. శ. ౧౪౩౮ వ సంవత్సరమున సింహాద్రి నరసింహస్వామి గుడియందు నిలిపిన శాసనమొకటి కలదు. ఇందువలన చరిత్రాంశము లెవ్వియు దెలియరాకపోయినను, తెలుంగ రాయ లుదయగిరి రాజ్యమునకు జెందిన పొదిలె సీమను పాలకుడగుటచేత, విజయనగర సైన్య మొకటి క్రీ. శ. ౧౪౩౮ వ సంవత్సరమునకో తత్పూర్వమో ఉదయగిరి నుండి బయలువెడలి సింహాచలముదాక నుండు తీరాంధ్రదేశమును జయించెనని చరిత్రకారు లూహించిరి. ఈ యూహ సరియైనదని పైనుదహరింపబడిన దక్షిణ కన్నడ మండలశాసనము రుజువు చేయుచున్నది. ఈ పట్టున స్మరింపదగిన ముఖ్యాంశ మింకొక్కటి కలదు. అల్లయవేమ వీరభద్రులు క్రీ. శ. ౧౪౨౩ న రాజమహేంద్రవర రాజ్యమును పాలించు చుండినట్లు శాసనసాక్ష్యము వలన దెలియుచున్నది. ౧౪౨౪-౧౪౩౮ సంవత్సరముల మధ్యకాలమున వారి శాసన మొక్కటి యైనను గానరాదు. మఱల క్రీ. శ. ౧౪౩౮ మొదలు ౧౪౪౪ వఱకు వారి శాసనములు వరుసగ గానవచ్చుచున్నవి. కావున క్రీ. శ. ౧౪౨౪-౧౪౩౮ ల మధ్య రాజమహేంద్రవరమున రెడ్ల యధికారము తొలగిపోయినదనియు, క్రీ. శ. ౧౪౩౮ వ సంవత్సరమున విజయనగర సైన్యములు వచ్చి రాజమహేంద్రవర రాజ్యమున వారి యధికారమును మరల ప్రతిష్ఠించెననియు నిశ్చయమగుచున్నది.

(సశేషము)



“నాట్యరాణి” చిత్రంలో అభినేత్రి బి. యస్. సరోజ



# పడమాపులు

బి.యస్.ఆర్. కృష్ణరావు

"ఆత్మ సౌందర్యంగల ఆడది బాహ్య సౌందర్యాన్ని ఆరాధించే భర్తను ఆకర్షించుకోటంలో ఆలస్యం చేస్తుందేమో" అన్న తండ్రి మాటలు ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి వెంకట్రావుకి. ప్రతి మానవుడికీ మేధాశక్తి, అభిరుచి, ఆలోచనలు భిన్నంగా వుండడంచేత, దృష్టికి ఏవస్తువైనా మానవులందరకూ ఒకే రీతిగా కనబడినప్పటికీ, దానిని తమ మనస్సులో చిత్రించుకోటంలో తమతమ బుద్ధులనుబట్టీ, అభిమానాలనుబట్టీ వారివారి అభిప్రాయాలు ఏర్పరచుకుంటారు. ఒకరికంటికి నవరుగా కనబడ్డ వస్తువు మరొకరిదృష్టికీ అట్లాగే కనిపించి నప్పటికీ, మనస్సుకిమాత్రం ఆ వస్తువులో ఏదో లోటు మున్నట్లుగా తట్టటంచేత, అది కంటికి కూడా ఇంపుగా కనిపించదు.

వెంకట్రావు వాల్తేరు స్టేషనులో దిగాడు. ఇదివరకెప్పుడూ వాల్తేరు విశాఖపట్టణాలు చూడలేదతను. ఇల్లు బయల్దేరి వచ్చేసినతరువాత స్టేషనులో అప్పుడు ఏబండివుంటే ఆబండి ఎక్కి అది ఎంతవరకుపోతే అంతవరకు పోదామనుకున్నాడు. ఆ రైలు వాల్తేరువరకు పోతుందన్నారు. అక్కడివరకూ ఒక టిక్కెట్టు కొనుక్కొని రైలెక్కాడు. వెడుతున్నా దన్నమాటేగాని సరిగ్గా ఎక్కడికి వెళ్ళాలో, ఏం చెయ్యాలో అతనికి తోచలేదు. ఇంట్లోనుంచి బయల్దేరే ముందు ఎంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాకపోయేసరికి స్టేషనుకు వెళ్ళాంతరువాత ఆలోచించవచ్చులే అనుకున్నాడు. రైలెక్కి వాల్తేరులో దిగాడు. రైలంతా ఖాళీ అయింది. ఆడవాళ్లూ మగవాళ్లూ ఉత్సాహంగా కొందరూ, నిరుత్సాహంగా కొందరూ దిగారు. ఇంతమంది ఎక్కడ్నుంచి వచ్చారు, ఎక్కడికి పోతున్నారు? అంతా నిజంగా ఈ వూళ్లో పనుండే వచ్చారా, పనుంటే ఏంపనుండి వచ్చారు? ఆడవాళ్ళుకూడా ఒంటరిగా రైలుదిగి వస్తున్నారే, వీళ్ళ కేంపని ఇక్కడ? అని ఆలోచిస్తూ నిల్చున్నాడు ప్లాట్ఫారంమీద. జనమంతా వెళ్లిపోయారు. మళ్ళీ ఈ తిరుగుబండిలో వెళ్లేవాళ్లు ఆత్రంగా చోటు దొరుకుతుందో దొరకదో అనే కంగారుతో పడుతూలేస్తూ, ఒకరినొకరు కొట్టుకుంటూ రైలెక్కి అమ్మయ్యా అని నిట్టూర్పు విడుస్తూ కూర్చుంటున్నారు. వీళ్ళంతా ఈవూళ్ళో తాము వచ్చిన పనులు పూర్తయి వెళ్ళిపోతున్నారు కాబోలు. మళ్ళీ వీళ్ళంతా ఏఏవూళ్ళు వెళతారో, వెళ్ళి అక్కడ ఏం చేస్తారో? ఇంతమంది వెళ్ళి వచ్చేవాళ్ళలో తన మాదిరిగా వచ్చినవాళ్లు ఒకళ్లూ కనిపించరు. ఈ అనంత ప్రజానీకంలో అనవసరంగా నిర్దిష్టకార్యక్రమం లేకుండా వచ్చినవాళ్ళు ఒక్కళ్లూ కనబడరు. ఈ వచ్చి వెళ్లేవాళ్లెవరిలోనూ నిజంగా తనమాదిరిగా వచ్చినవాళ్ళెవరయినా వుంటే, ఏం చెయ్యాలో తోచక తనమాదిరి ప్లాట్ఫారంమీద నిలబడి దిక్కులు చూసేవాళ్లే కదా. కాబట్టి ఇట్లా ఎవరూ వచ్చినవాళ్లు లేరేమో అనుకున్నాడు వెంకట్రావు. బండి బైలైంది. నిండుచూలాలు పుట్టింటికి వెళుతున్న మాదిరిగా మెల్లిగా బయల్దేరి పోతున్నది రైలు. క్రమేపీ ప్లాట్ఫారం దాటిపోయింది. ఇంక ప్లాట్ఫారం మీద రైల్వేకూలీలు, రైల్వేపనివారూ తప్ప ఎవరూ లేరు. ఎంతసేపైవుంటుందో నని గడియారంవైపు చూశాడు. తను నిల్చుని దాదాపు గంటసేపయినట్లుగా తెలుసుకున్నాడు. రైలు వచ్చింది,

వెళ్ళిపోయింది. వాస్తవంగా జీవంలేనిది కాబట్టి మానవుడు కల్పించిన కాన్వాలకు జీవశక్తి, కదలిక కలది కాబట్టి వస్తుతః ప్రాణాధారం లేకపోయినా రైలు తనపని తాను నిర్వర్తించుతుంది. కాని ప్రాణం వున్న తనుమాత్రం నిర్జీవ ప్రతిమలా, పరిపరివిధాలుగా పోతున్న మనస్సు అరికట్టే శక్తి లేకపోవటంచేత, ఏం చెయ్యటానికీ తోచక అట్లాగే నిల్చున్నాడు.

"బాబూ, బజార్ పోదామా" అన్నాడు రిక్షావాడు.

"బజారు దేనికి? ఏమన్నా చూడవలసిన వింత లున్నాయా" అన్నాడు- అవి చూస్తూ వున్నా కానీసు మానసికవ్యథ తగ్గుతుందేమోనని.

"ఇంతలు కాదు బాబయ్యా, మీకేటయినా కష్టున్నదేమోనని" అన్నాడు రిక్షావాడు. "సరే, పోనియ్య" అని బయటికొచ్చి రిక్షా ఎక్కాడు. రిక్షావాడు పోతున్నాడు.

"అబ్బ, ఇంతమంది రైళ్లో ఈవూ రొచ్చారు కదా. వీళ్ళంతా నిజంగా పనుండే వస్తారంటావా?" అన్నాడు.

"బాగా అడిగారు బాబయ్యా. పస్తు లేక పోతే ఈ కరువుకాలంలో రైల్ చార్జి పెట్టుకుని ఊరికనే వస్తారా బాబయ్యాం, అల్లకి ఏదేటో పనుంటేనుంచే వస్తుంటారు. మీ కేంపనం జొచ్చారు బాబయ్యా!" అన్నాడు.

ఈమాటకు ఏం చెప్పటానికీ తోచలేదు వెంకట్రావుకి. వాడు అడిగిందానికి సమాధానం చెప్పకపోతే ఏమనుకుంటాడో అని—

"అయితే ఆ మొగని దిగి నుంచోండి, బాబయ్యా. కాలేజీకోయే బస్సు అక్కడే నిండుతుంది" అని రిక్షా దించాడు. వాస్తవంగా కాలేజీ కాకపోయినా ఒక నిర్దిష్టమైన పనిలేదు కనక, అక్కడే దిగి రిక్షావాడికి డబ్బిచ్చి పంపేసి నిల్చున్నాడు. మరో పదినిమిషాల్లో బస్సు వచ్చింది. బస్సెక్కి కూర్చున్నాడు.

అనేకమంది విద్యార్థులూ, విద్యార్థినులూ రకరకాలుగా అలంకరించుకుని ఆ బస్సులోనే కాలేజీకి పోతున్నారు. వీళ్ళంతా ఎంత చక్కగా వున్నారు- ప్రతినిత్యమూ క్రమంకొద్దీ ఈ బస్సులో కాలేజీకి వెళ్ళి చదువుకుంటున్నారు కదా. ఇంతమంది జనంలోనూ భగవంతుడు వీళ్ల నందర్నీ ఎట్లా పుట్టించాడో కాని ఒకళ్ళ పోలిక ఒకళ్ళకి వుండదు- ఎక్కడో తప్ప. పొడుగు ముక్కువాళ్లూ పొట్టిముక్కువాళ్లూ, కోలముఖం వాళ్లూ గుండ్రముఖం వాళ్లూ, పొట్టివాళ్లూ పొడుగువాళ్లూ, ఎర్రటివాళ్లూ నల్లటివాళ్లూ— రకరకాలయిన వేషాలు ధరించుకొని పోతుంటే చూట్టానికి ఎంతో ముచ్చటగా వుంది. మానవ జీవితాధ్యాయంలో అత్యంతానందమయ జీవిత ఘట్టం కాలేజీ జీవితమే. చీకూ చింతా లేకుండా వేళకల్లా భోంచేసి, పుస్తకాలు తీసుకుని ఎంచక్కా కాలేజీకి పోతున్నారు. ఈనున్నటి తారు రోడ్డుమీద, ఎగుడుదిగుడుగా వున్నా, బస్సులో కుదుపు లేకుండా పక్కనున్న కొండలనూ, బంగళాలనూ, చెట్లనూ, ఫలవృక్షాలనూ చూస్తుంటూ, సముద్రపుగాలిని పీల్చుకుంటూ స్వర్గధామంలో తేలిపోతున్నట్లుగా కాలేజీకి పోయి చదువుకుంటున్నారు. ఎంత అదృష్టవంతులు! కొత్తకోడలి సిగ్గు దొంతర్లలాగ, మామిడిచెట్టు పూత ఎంత అందంగా వుంది. క్రమంగా సిగ్గు దొంతర్లూ ముసిముసి నవ్వులూ బిడియమూ పోయి, సంసారంలో గల సుఖదుఃఖాలూ, అత్తగారిపట్ల వాదిస్తూ, ఆడుబిడ్డల ఈసడింపు మాటలూ చవిచూస్తూ బిడ్డల్ని కని పెంచుతున్న రీతిగా, చిగురాకు తొలగడంలో లేతాకు మృదుత్వంలో ముచ్చటగా గుత్తులు గుత్తులుగా పూతపూసి ఎంతో అందంగా వుండి క్రమంగా పిందెలై కాయలై పక్షుల కాపర్లు రాళ్లువేసి కొడుతున్నా, పిల్లలు చెట్టెక్కి కోస్తున్నా, తోటమాలి వలవేసి లాగుతున్నా ఓర్చుకుంటూ చైతన్యాన్నంతా కోల్పోయి తనలో శక్తి వున్నంత వరకూ కాయలు కాసి చివరకు ఆకు రాలి నిర్జీవంగా మోడులా అయిపోతుంది మామిడిచెట్టు. చెట్టుపూత దగ్గర్నుంచీ ఆకురాలును కాలం వరకూ గల పరిణామదశల నన్నిటినీ పరికిస్తూ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వంకరటింకరగా పెద్ద త్రాచుపాములా వున్న ఆ నల్లతారురోడ్డుమీద వీటినన్నింటినీ చూస్తుంటూ ఆనందిస్తూ కాలేజీకి పోవటం ఎంత అదృష్టం అనుకున్నాడు వెంకట్రావు.

కాలేజీ వచ్చింది. జడివానలో అంతా ఒక్కసారిగా దిగి అధ్యాపకులని అక్షరాల

కూర్పుబల్ల గదుల్లోకి ఏ అక్షరానికా అక్షరం వెళ్ళినట్టుగా ఎవరి స్థానంలోకి వాళ్ళు వెళ్ళిపోయారు. మళ్ళీ తనొక్కడే మిగిలాడు. అప్పటికి దాదాపు రెండున్నర అయింది. మళ్ళీ మనస్సు తన యథార్థ పరిస్థితిలోకి వచ్చేసరికి తనింకా భోజనం చెయ్యలేదనే విషయం గుర్తొచ్చింది. ఈ వేళప్పుడు భోజన మెక్కడా వుండదు. ఒకవేళ వున్నా అసహ్యంగా వుంటుంది. అయినాగాని ఇంకా స్నానం చెయ్యలేదు. పోనీ ఇంత టిఫినయినా తిని కాఫీ తాగి పొట్ట నింపుకుందామనుకున్నాడు. పక్కనున్న హోటల్లో కూర్చుని సముద్రపు హోరులో, చల్లగాలిలో, అలలను తిలకిస్తూ సుష్టుగా టిఫిను తిని, కాఫీ త్రాగాడు. రూపాయిన్నర బిల్లు సర్వరు బల్లమీదే పెట్టాడు. బిల్లు చెల్లించి మళ్ళీ ఎక్కడికి వెళ్ళాలనే సందిగ్ధావస్థలో పడి తోచక కాసేపు సముద్రాన్ని చూస్తూ కూర్చుందా మనుకుని సముద్రపుఒడ్డున ఒక బండరాతిమీద కూర్చున్నాడు చూస్తూ. ఆ సముద్రపుగాలి అతని శరీరానికి తాకి మధ్య మధ్య వుక్కిరిబిక్కి రవుతూవుండేవాడు. బ్రహ్మాండమైన అలలు నురుగులు కక్కుకుంటూ ఒడ్డు చివర వరకూ వచ్చి చెల్లాచెదరై పోతున్నాయి. అతని మనస్సులో కూడా ఆలోచనా పరంపరలు వెల్లువవలె వచ్చి ఒకనిశ్చయానికి రాలేక యథాతథమై పోయేవి. కొన్నిచోట్ల సముద్రతరంగాలు నురగలు కక్కుతూ వచ్చి పక్కనున్న బండరాళ్లను ఎదుర్కొని బ్రహ్మాండమైన శబ్దాన్ని చేస్తూ వికావికలై మళ్ళీ సముద్రంలో కలసిపోయేవి. తమకున్న శక్తినంతా వినియోగించి అలలు ఒక్కసారిగా బండరాళ్ళను ఢీకొంటున్నా, వాటిని రాపాడినా లేశమైనా కదిలించలేక పోతున్నాయి. అంతరాత్మ ప్రబోధించే సదభిప్రాయపు తలపోతలను, కఠినాతికఠినమైన అతని మనోగతాభిప్రాయాన్ని మార్చలేక పోతున్నాయి. సముద్రపుహోరు అతని అంతరాంతర కల్లోలానికి తగినట్టుగా లయవేస్తున్నది. అట్లా ఎంతసేపు కూర్చున్నాడో అతనికే తెలియదు. ఒక తడవ అటువైపు చూశాడు. కాలేజీ వదిలి నట్టున్నారు. మళ్ళీ విద్యార్థులూ విద్యార్థినులూ అంతా బస్సెక్కి, నడిచి, సైకిళ్ళ మీదా వెళ్ళిపోతున్నారు ఎవరిళ్ళకు వాళ్ళు. హాస్టల్లో వుండే వాళ్ళు మాత్రం కాలేజీ చుట్టుపట్లనే చల్లగాలికి



తిరుగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు కూడా పోగా. ప్రతీ ముఖంలోనూ ఆనందమూ, ఉత్సాహమూ వెల్లివిరిసి పోతున్నాయి. అక్కడున్న ప్రతి వ్యక్తీ ఏదో పనిమీద వుంటున్నట్లుగా భావించసాగారు కాని, కాలం వ్యర్థపుచ్చుతున్నామని ఏ ఒకరూ అనుకోవటం లేదు. విద్యార్థుల అలజడి అణిగిపోయింది. దూరాన్నుంచి ఒక యువకుడూ, యువతీ వస్తున్నట్లుగా కనుపించారు. వాళ్ళపైపు అతని దృష్టిపడింది. తనను చూడనట్లుగానే పక్కనుంచి వెళ్ళిపోయారు కొంతసాటుకు. వాళ్ళ కబుర్లూ, వాళ్ళ ఉత్సాహమూ చూస్తే ప్రపంచంతో తమకేమీ సంబంధం లేనట్లుగానే భావించుకోసాగారు. ఆనందడోలికల్లో, ఆస్మితామృత తరంగాలలో తేలిపోతున్నట్లుగా భావిస్తున్నారు. కాలేజీ జీవితాల్లో ప్రణయాలకూ, కలయికలకూ తావున్న దన్నమాట. లేకపోతే ఇంత చోటుండేగా, ఇన్ని భవనాలుండగా ఆ కొండచాటుకు ఎందుకు పోతారు? పనిపాటలూ, నిర్ణీత కార్యక్రమమూ లేని తనమాదిరిగా వారిద్దరూకూడా సంచరించే స్థితి ఎందుకు కలుగుతుంది. చదువుసంధ్యల పేరుతో ఇటువంటి సంఘటనలుకూడా జరుగుతున్నా యన్నమాట. ఆ అమ్మాయి ఏమంత అందంగా వున్నదని వెంట బెట్టుకుని వచ్చాడు. అకళ్ళజోడూ, మొహాన బొట్టు లేకుండా, చేతులకూ కాళ్ళకూ మెళ్ళోకీ ఏమీ లేకుండా, ఎత్తుమడమల బూట్లు వేసుకుని గువ్వలా వుండి, కొంగలా మెడబెట్టి - ఏమిటి ఎగరేసుకుంటూ? ఎంత అసహ్యంగా వుంది. అటువంటి గేడిగొంగ అతనికి అపరూపసౌందర్యవతిలా కనిపించిందన్నమాట ఇంతమంది కాలేజీ విద్యార్థుల్లో. ఆపిల్లను తీసుకుని ఈ ఎగుడు దిగుడు కొండలూ గుట్టలూ ఎక్కుతూ దిగుతూ, ఏం ఖర్మం పట్టింది అతనికి? తనకేం ఖర్మం, ఇంటి దగ్గరవాళ్ళందర్నీ వదిలిపెట్టి వేళకు రుచిగా రుచిగా వేసి సుష్ఠుగా భోజనం పెట్టే అమ్మను వదిలిపెట్టి, అడిగినప్పుడల్లా కాస్తో కూస్తో డబ్బిచ్చే నాన్నని వదిలిపెట్టి చిలుకపలుకుల్లా వచ్చీరాని మాటలతో తను ఇంటికి రాగానే ఎదురొచ్చే చిట్టి చెల్లెల్ని వదిలిపెట్టి, రాత్రంతా నిద్రలేకుండా ఈ విశాఖపట్టణం వచ్చి అన్నపానాదులూ స్నానసంధ్యలూ లేకుండా ఈ హోటల్లో రూపాయిన్నరా చెల్లించి యాతనలు పడ్డం!

కొద్దిసేపయాక వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. అతని దగ్గరనుంచే వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. మానాభిమానాలు లేవు. ఈ కొండరాళ్ళను ఆశ్రయించవలసిన గతి పట్టింది.

ఇంకా బాగా సూర్యాస్తమానం కాలేదు. అప్పటికి సుమారు అయిదున్నరమాత్రమే అయింది కాలేజీ టవర్ క్లాక్‌లో. వెంకట్రావు మళ్ళీ తనపరిస్థితులను గురించి ఆలోచించుకుంటున్నాడు. వెనకనుంచి పకపకమని 'నవ్వు వినపడింది. ఎవరో ఇద్దరు యువతీయువకులు కాలేజీ బాటనే వస్తున్నారు. ఆ అమ్మాయి నాజూకుగా ఎంత బాగుంది! పచ్చి పసుపుకొమ్ములా వుంది. సన్నగా, నాజూకుగా, కపటాకులా వుంది. అకళ్ళు, ఒకవిధమైన అందం ఉట్టిపడుతూ, చిలిపితనంగా కొంటెగా మిలమిల లాడుతున్నాయి. ఒకవేళ దేవకన్యేమో అనుకున్నాడు వెంకట్రావు. వాళ్ళిద్దరూ అతని పక్కగానే సుమారు ఓపంద గజాల దూరం వెళ్ళి అక్కడే సముద్రపొడ్డున ఇసకలో కూర్చున్నారు చెట్టాపట్టాలు వేసుకుని. ఆ అమ్మాయి నవ్వుతూ ఏదో మాట్లాడుతున్నది. వెంకట్రావు చెవులునిక్కబొడుచుకుని విన్నాడు.

"ఇంత భయమయితే ఎట్లా రామరి. కష్టాన్నీ, సంఘాన్నీ ఎదిరించి మనిద్దరం ఎక్కడికయినా లేచిపోవాలి. ఇది తప్పదు - ఏమంటావ్ ?"

"నాకు ధైర్యం చాలటంలేదు లలితా. పెద్దల మాట ఎన్నడూ జవదాటి ఎరగను. కాలప్రభావంచేత మనిద్దరికీ పొత్తు కుదిరింది. ఇట్లా రహస్యంగానే కలుసుకుందాం గాని ధైర్యం చెయ్యలేను."

"ఇదేనా నీ ధైర్యమూ? నన్ను నమ్మించి అప్పుడు ఆవేశంగా కల్లబొల్లి కబుర్లు చెప్పావే. నీ మాటలు విని ఆరంగారావుని వదిలిపెట్టి నీచెంత చేరాను. సరే, ఆఖరుతడవ అడుగుతున్నా."

"క్షమించు, లలితా. అంతపని చెయ్యలేను."

"సరే, అయితే నాదారి నేను చూసుకోక తప్పదు. నే వెళుతున్నా, గుడ్ బై" అని ముందు

కుంటూ వెళ్ళిపోయింది. అతనూ మరోదార్ని కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయాడు.

అంత అందగత్తెను ఎవరుపడితేవాళ్ళు చక్కగా పెళ్ళిచేసుకుంటారు. తనకేకనక తటస్థపడితే పువ్వుల్లో పెట్టి పూజించేవాడు. కాని ఏం లాభం- బుద్ధి మంచిది కాదు. ఇదివరకు రంగారావుని ప్రేమించిందట. ఇప్పు డితన్ని, రేపు యింకొకరిని. ఎంత అందగత్తెయితే ఏం, గుణం మంచిది కానప్పుడు. భగవంతుడు అంత అందగత్తెకు గుణాలుకూడా మంచివి ఆపాదిస్తే ఎంతో రాణించేది ఆ పిల్లకు శరీరసౌందర్యం వున్నది, కాని ఆత్మ సౌందర్యం లేదు. ఎంత స్థైర్యంగా చెప్పింది ఆమాటలన్నీ. ఆ అనాకారిని వెంటవేసుకుని మాటాపలుకూ లేకుండా తిరిగాడు. ఆ మొనటివాడు. ఈ అందగత్తెతో వేగలేక విసిగి వేసారిపోతూవాడు ఆ రెండవవాడు. ఎంత తారతమ్యం! సముద్రంలో ఎక్కడో ఒక పెద్ద కెరటం బయల్దేరింది. నురుగులు కక్కుతుంటూ పొంగుతూ బ్రహ్మాండశబ్దంతో హోరుమంటూ రెండు నిలువుల ఎత్తున వచ్చి బండరాయిని ఢీకొన్నది. బండరాయిలో చలనం కలిగింది. ఇందాకటి అలేవీ ఎంతమెత్తయినా కదిలించలేక పోయాయి. ఈఅల కొద్దిపాటిమాత్రమయినాకదిలించకలిగింది.

వెంకట్రావు లేచాడు. కాలేజీ దగ్గిరకి వచ్చాడు. టవర్ క్లాక్ లో ఆరుగంట లయింది. అక్కడున్న రిక్షావాడిని పిల్చి, స్టేషనుకు పదమన్నాడు. వచ్చేటప్పుడురోడ్డు ఎత్తుగావుంది. పోయేటప్పుడు చాలా పల్లం రిక్షావాడు గబగబా లాగేశాడు. స్టేషనులో అడుగుపెట్టి 'అమ్మయ్యా' అన్నాడు. ఇంకా టికెట్లు ఇచ్చేందుకు అరగంట టైముంది. అరగంటసేపూ బల్లమీద కూర్చున్నట్టే వుంది అతనికి. టైమైంది. జనంలో తోసుకుంటూనే టిక్కెట్టు తీసుకుని బయట పడ్డాడు. మరో పావుగంటలో రైల్లో పడ్డాడు. అప్పటికి కొంచెం కుదుటపడింది మనస్సు. రైలు పోతున్నది. స్టేషన్లు ఒకటొకటే దాటిపోతున్నాయి. ఎన్ని దాటినా తన స్టేషను రావటం లేదు. మళ్ళీ ఏదో స్టేషనులో బండి ఆగింది. ప్రయాణీకులతో పాటు ఒక బిచ్చగాడు ఎక్కాడు. మళ్లీ రైలు బయల్దేరింది. బిచ్చగాడు గొంతెత్తి పాడ సాగాడు.

గుణములే సొగసనీ, ఎంత చెప్పిన గాని,
మది కెక్కలేదా వో చిన్న నా పికమా!
కుంకుమా తిలకమ్ము, మోము నిడినంతనై
అరుణకాంతీ వోలె అంద మిచ్చునుండె
తీగచేరమ్ములో, తియ్యనైన మాటలో
తరియొత్తి చూడగనె, తత్తరముపడినాను
తళుకుబెళుకులు జూచి, తత్త్వము మరచుచు నే
కలు పోరగా వేసి తరియొత్తి చూశాను
మెరపు మరపించేటి, చిరునగవు సొగసులా
చిన్నారిమగువకే అందమనుకున్నా!
గుణములే సొగసనీ ఎంతచెప్పిన గాని
మది కెక్కలేదా వో చిన్న నా పికమా!

బిచ్చగాడు అడుక్కుంటూ వచ్చాడు. పాట వింటున్నంతసేపూ తన్మయత్వం చెందాడు వెంకట్రావు. బిచ్చగానికి చేతులోకి పావలా పెట్టాడు. రైలుమధ్య దార్లో వున్నా మనస్సు ఇంటివద్దకు పరుగెత్తింది.

తనవూరి స్టేషను వచ్చింది. గబగబ రైలుదిగి జట్కా కట్టించుకుని ఇంటికి వెళ్ళాడు. అత్తాకోడళ్ళిద్దరూ విచారంగా కూర్చున్నారు వరండాలో. అతన్ని చూడగానే ముఖాలు విప్పారాయి ఇద్దరికీ. తల్లి కౌగిలించుకుని "ఈరెండు రోజులూ ఎక్కడికి వెళ్ళావురా నాయనా! కన్న కడుపు నాకన్నకూడా కమల ఎంత విచారించిందో, ఆ భగవంతుడికే తెలియాలి" అన్నది. ఈ మాటలు విని తండ్రికూడా బయటికొచ్చాడు. ఆయనకూడా సంతోషపడ్డాడు కొడుకు వచ్చినందుకు.

"నిజంగా నాకోసంవిచారించావా కమలా!" అన్నాడు ఆమెకేల నిమురుతూ.

'చెబితే మట్టుకు నమ్ముతారా ఏమిటి' అన్నది చిన్నగా నవ్వుతూ.

"అబ్బ! నిజంగా మూర్ఖుడనే కమలా. యథార్థ దృశ్యాలు కొన్ని చూస్తేకాని, నిజానిజాలు తెలియవు" అన్నాడు ఆవేశంగా.

"నే నిదివరకే చెప్పానుగా-ఆత్మసౌందర్యం గల ఆడది బాహ్యసౌందర్యాన్ని ఆరాధించే భర్తను ఆకర్షించుకోటంలో ఆలస్యం చేస్తుందేమోనని" అన్నాడు తండ్రి, అర్థనిమీలిత నేత్రాలతో కొడుకూకోడళ్ళవైపు చూస్తూ.

ఆలాపన

# ప్రజాసాహిత్యం

'ఆరుద్ర'

అభ్యుదయ సాహిత్యానికీ ప్రజాసాహిత్యానికీ గల తేడాని చాలామంది గుర్తించినట్టు లేదు. ఇటీవల రెండూ ఒక్కటేనన్న పొరపాటు అభిప్రాయాన్ని చాలామంది చాలాచోట్ల వ్యక్తపరుస్తున్నారు.

జానపద సాహిత్యం ప్రజా సాహిత్యానికి మరోపేరు. నేటికీ మన జానపద సాహిత్యం బుర్రకథలలోనూ వీధి నాటకాలలోనూ పాటలలోనూ తప్ప మరే ఇతర కళారూపాలలో లేదు. నిరక్షరాస్యత పూర్తిగా నిర్మూలం అయిననాడు గాని జానపద సాహిత్యం విరివిగా అన్ని కళారూపాలలోకీ రావడానికి అవకాశాలు లేవు.

నిన్నటిదాకా మన జానపద సాహిత్యంలో అభ్యుదయ సాహిత్యపు పాళ్లు చాలాతక్కువ. బాలనాగమ్మ కథ ఆపనీండి కుశలాయకం కానీండి వింటున్న వాళ్ళలో మంచి సాహిత్యం కలిగించవలసిన పరివర్తన కలిగించవు. ప్రజా సాహిత్యం అయినంతమాత్రాన ఇవి అభ్యుదయ సాహిత్యం కాలేవు.

ధూర్జటికవి శ్రీకాళహస్తీశ్వర శతకంలో సుమారుగా అభ్యుదయకరమైన భావాలు కొల్లలుగా ఉన్నాయి. అందరికీ బోధపడని భాషలో ఉండటంమూలాన వీటిని ఓన్నచూపు చూడటానికికూడా వీలులేదు.

అభ్యుదయ సాహిత్యం కేవలం క్వాలిటీకి సంబంధించిన మాట అని అభ్యుదయ రచయితలు గుర్తించుకోవాలి.

నేడు అచ్చులోవచ్చే సాహిత్యం జనసామాన్యం అందరికీ అందుబాటులో లేదు. ఈ సాహిత్యాన్ని విమర్శిస్తున్నప్పుడు మన రచయితలు "ప్రజలకి అవగాహన కాని భాషలో ఉంది" అనడం అన్యాయం. నేటి పాఠకులు మధ్య తరగతి ప్రజలు. వాళ్ళకి నేటి సజీవభాషలో రాసిన ప్రతిరచనా అర్థం అవుతుంది. నేటి విమర్శకులు తమకు అర్థమయిన రచనలని ఎవరికోసమయితే ఉద్దేశించబడలేదో వాళ్ళకి బోధపడవని నిరసించడం నేటి అచ్చులోని సాహిత్యం విధి ఎంతవరకూ పరిమితమయినదో తెలుసుకోలేక పోవడం వల్ల సంభవిస్తున్నాది.

నేడు చాలామంది రచయితలు మధ్యతరగతి నుంచే వస్తున్నారు. వీళ్లు తమ విజ్ఞానంతో ఒక ప్రత్యేకమయిన సంస్కారాన్ని సృష్టించుకొంటున్నారు. విదేశీ సంస్కృతి మన విద్యా విధానాలవల్ల కొంతవరకూ మనకు దిగుమతి అయింది. అది మధ్య తరగతి రచయితల సంస్కారంలో మేలుగా కలిసిపోయింది. ఈ సంస్కారంతో పొందిన అనుభూతులను రచనలలోకి అనువాదం చెయ్యడమే ప్రస్తుత రచనలలో విరివిగా జరుగుతున్నాది. వీటిని తీసుకెళ్ళి గ్రామీణులకు వినిపిస్తే ఇవి వాళ్ళకు బోధపడక పోతే తప్పు రచయితదీ కాదు; గ్రామీణుడిదీ అంతకన్నా కాదు.

మన రచయితలు అభ్యుదయ సాహిత్యాన్నే కాక ప్రజాసాహిత్యాన్నికూడా సృష్టించడం ప్రారంభిస్తే మంచిదే; గానీ ఆతరగతియొక్క సంస్కారం తెలియని వాళ్ళని ఆ తరగతి సాహిత్యాన్నిగానీ, ఆతరగతిమీద సాహిత్యాన్నిగానీ సృష్టించ మనడం భావ్యం కాదు. నిజానికి ప్రయత్నించినా ఏరచయితకీ సాధ్యంకాదు. బాధ్యత గుర్తెరిగిన రచయిత అసలు ప్రయత్నించడు.

అవసరాలనుబట్టి ప్రజలు తమకు కావలసిన పాటలూ కథలూ ఎలాగా సృష్టించుకొంటారు. వాళ్ళలో అభ్యుదయకర భావాలను ప్రవేశపెట్టడం రాజకీయ వర్గాల పని. ప్రజా సామాన్యం నూతన చైతన్యంతో అప్పుడప్పుడు మధ్య తరగతి రచయితల సహాయం అవసరమైతే తీసుకొని నిజమైన అభ్యుదయ ప్రజాసాహిత్యాన్ని సృష్టించుకొంటుంది. అంతదాకా మధ్య తరగతి రచయితలు తమ రచనలకి అచ్చులోనే ప్రచారం ఇవ్వదలచుకొంటే తమ సందేశాన్ని చదువుకొన్న వాళ్ళకే ఉద్దేశించితే సజీవమైన సాహిత్యం ప్రవర్ధమాన మవవచ్చు.

కథానిక

# విమోచనం

జగన్మోహన్ రావు

పంజరం ముందు నిర్ఘాంతపోయి చూస్తూ నిలుచున్నాడు శాస్త్రి. ప్రతిరోజూ సాయంత్రం ఆఫీసునుంచి వచ్చిన వెంటనే పంజరం దగ్గరకు వెళ్లేవాడు. "లక్ష్మీ" అని పిలుస్తే, "మంచినీళ్లు కావాలా!" అని అడిగేది. పంజరం లోపలంతా ఉత్సాహంతో తిరిగేది. అతను తలుపు తీయగానే చేతిమీద నిలుచునేది. భుజాలమీద కెక్కేది. దాని రెక్కలను నిమిరేవాడు. జేబులోనుంచి ఆపిల్ పండు తీసి యిచ్చేవాడు. "లక్ష్మి" పండుతింటున్నంతసేపూ ఆనందపడేవాడు. అటువంటిది ఆనాడు సాయంత్రం శాస్త్రిని చూసినా కదలిక లేకుండా పంజరంలో ఉండిపోయింది. అతను పలకరించినా మాట్లాడలేదు. ఆపిల్ పండు చూసినా బయటకు రాలేదు. ఉదయాన ఆఫీసుకు వెళ్తుంటే అతనితో కులాసాగా కబుర్లు చెప్పింది. ఇంతలోకే యిలా మారేసరికి శాస్త్రికి ఆశ్చర్యం వేసింది. చాలాసేపు ఆలోచించి కారణం తెలుసుకోలేక నిద్రపోయాడు ఆరాత్రి.

మూడు నెలలకు పూర్వం ఒక కోయవాడి దగ్గర కొన్నాడు ఆ చిలుకని. శాస్త్రి యిచ్చిన డబ్బుకోసం ఆశపడ్డాడుకాని లేకపోతే ఆ చిలుకని ఆనాడే తనఆహారం చేసుకొనేవాడు కోయవాడు. శాస్త్రి ఇంట్లో పిల్లలతో పాటు తానుకూడా దానికి మాటలు నేర్పేవాడు. అతనికి చిలుక రావటం శుభసూచకంగానే తోచింది. అప్పటినుంచి "లక్ష్మీ" అని పిలుస్తుండేవాడు. అదికూడా శాస్త్రిదగ్గర చనువుగా ఉండేది. అతనన్న మాటల్లా తడుముకోకుండా తిరిగి అనేది. దానికి పెట్టకుండా ఇంట్లో ఎవ్వరూకూడా ఏమీ తినేవారు కాదు. మొదట్లో పంజరం విరగగొట్టాలనే దృఢనిశ్చయంతో ఉండేది. ఒక్కసారి తన ప్రపంచం అంతా చిన్నదైపోయి తన రెక్కలనైనా విప్పనీయక ఊపిరి ఆడకుండా చేసినట్టనిపించి. కొన్నాళ్లు దాని అవస్థ పసరికి చాలా ఆరాటపడింది. కొంతకాలం ఎవ్వరేం పెట్టినా తినేది కాదు. క్రమేపీ తన ప్రయత్నాలన్నీ మానుకుంది. తనని బంధించిన ఊచలతోనే ఆడుకోటం మొదలెట్టింది.

ఆరోజు మధ్యాహ్నం లక్ష్మికి మూడునెలల జీవితంలో మర్చిపోయిన అనుభవం కలిగింది. తన జాతి వాటినుండి విడదీయబడి సహజత్వాన్ని కోల్పోయి ఒక నూతన వాతావరణంలో కొత్త ఆటలు, మాటలు నేర్చుకొన్న లక్ష్మికి పునర్జన్మ కలిగినట్లయింది. ఎక్కడో తన పూర్వపు మాతల ధ్వని వినిపించింది. మరో చిలుకకూడా తనలాగే ఇంకో యింట్లో పంజరంలో ఆడుకుంటున్నదేమో అనుకొని దానిమ్మ గింజల్నించి దృష్టి మరల్చలేదు. ఆ ధ్వని అంతకంతకు దగ్గరకు వస్తోన్నట్లుంది. ఆ ధ్వనిలో తానెరుగనటువంటి క్రోధ, క్రౌర్యత ఉన్నాయి. తల పైకెత్తి చూసింది. ఇంకో చిలుక కనిపించింది. తనవంక జాలిగాను, తీక్ష్ణంగాను చూస్తోంది. దానికేసి కొంతసేపు చూసేసరికి తన అవస్థను మరిచిపోయింది లక్ష్మి. తన రెక్కలను యజమాని దువ్వుతూంటే ఎంతో గర్వపడేది. ఇప్పుడా రెండో చిలుకను చూడగానే దాని రెక్కలు చాలా అందంగా కనిపించాయి. దానిలో ఉన్న యౌవనం తనలో లేదనిపించింది. విచ్చల విడిగా గంతులేస్తూ, ముక్తకంఠంతో అది కూస్తోంటే తన దుస్థితి అర్థమయింది. దాని భాష కొత్తగా వుంది. కాని అపారమైన ఆనందం కలిగింది ఆ క్షణంలోనే. ఆ చిలుకను దగ్గరగా రమ్మని పిలవటానికి నోరు తెరిచింది. కాని అది అంతకు మించి దగ్గరకు రావటానికి భయపడుతున్నట్లు జాలిగా చూసింది. ఇనప ఊచల్లో కట్టబడిన పంజరం కోయవాడి ప్రాణంకంటె కఠినంగా కనపడింది దానికి. అయినా లక్ష్మి తిరిగి ప్రాధేయ-

అదే సరికి జాలికలిగి చుట్టూ పరకాయించి చూస్తూ ముందుకు వాలింది.

"నే నిక్కడున్నట్టు ఎలా తెలిసింది?" అంది లక్ష్మి.

"నీకోసం అడవులన్నీ తిరిగాం; మనవాళ్ళింకా తిరుగుతూనే ఉన్నారు. వరొక్క ధనవంతుడి సేవకుడు పట్టుకోటాని కని తరుముకొస్తుంటే తప్పించుకొంటూ యీ వైపు వచ్చా."

"పోనీ నువ్వుకూడా నా దగ్గరకు వచ్చెయ్యరాదూ?" అంది లక్ష్మి.

"ఇందుకోసమేనా యిన్నాళ్ళూ నీకోసం అడవుల్ని, తోటల్ని గాలించింది? నువ్వే తప్పించుకు రా" అని ఆవేశంతోను, ఆతురతతోను జవాబు చెప్పింది.

"ఎందుకూ? ఇక్కడ బాగానే వుంది. శ్రమ లేకుండా అన్నీ తింటూ, భయం లేకుండా నిద్రపోతున్నాను. అబ్బ...ఆ పిల్లలు రాళ్ళు రువ్వటం, ఆ బాణాలు తక్కనించే మానుకొని పోవటం తల్చుకుంటేంటే...! సరే గాని మన వాళ్ళంతా కులాసాగా ఉన్నారా?"

"ఆఁ. నీ చెల్లెలికి పెళ్ళి కూడా అయింది. మొగుడితో చిట్టడవిలోకి పోయింది. ఆ చెట్ల గుంపులో మనుష్యుడి భయం లేకుండా కొన్నాళ్ళ సుఖపడతారు."

లక్ష్మికి పట్టరాని సంతోషం కలిగింది. తన చెల్లెలు పెళ్ళి చేసుకుంది. ఆకుల్లో ఆకై, పువ్వుల్లో పువ్వై అడవికి రాణిగా ఉండవచ్చు మాట. తనో? తన ప్రపంచం? మనస్సులో భారం అధికమైంది. ఒక్కసారి తన పూర్వపు పంచరంగుల ప్రపంచంలోకి పోవాలని ఎగరబోయింది. రెక్కలు టపటప కొట్టుకొని పంజరంలో క్రింద పడింది.

తీరని వ్యథతో "నువ్వే నాదగ్గిర ఉండరాదూ?" అని అడిగింది తిరిగి.

"దాస్యం అలవాటైపోయి, ఎంగిలి కూడు రుచిస్తోంది నీకు. చూడు, నీకు జ్ఞాపకం లేదూ? ఒకరోజు మనం యిద్దరం ఆ తోటలో దానిమ్మ పండ్లు తింటూంటే, తోటకాపరి కొట్టబోయాడు. అప్పుడు మనం ఎగిరిపోయి కొంతసేపటికి తిరిగి వచ్చి అతను నిద్రపోతుంటే ఎక్కడ లేస్తాడో అనే భయంతోనే ఆ పండులోని గింజల్ని తినేశాం. తర్వాత ఎప్పుడో దానిమ్మకాయల్ని కోసి డొల్లగా ఉండటం చూసి యజమాని ఏమంటాడోనని భయపడిపోయేదానవు. అంత భయపడుతున్నా మన గూళ్ళలోకి పోయిన తర్వాత ఎంత హాయిగా ఉండేది! రా, పోదాం. నీ యజమాని నిన్ను చేతిమీద ఎక్కించుకొన్నప్పుడు ఒక్కసారిగా ఎగిరి రా."

"చూడు, నా యజమాని నన్నెంతో ఆదరంతో చూస్తున్నాడు. నేను మోసం చెయ్యొచ్చా అతన్ని!"

ఆ మగచిలుకకి కోపం వచ్చింది.

"మనుష్యుల్తో స్నేహం చేసి కూడా వాళ్ళకు లేని నీతిని అలవరచుకొన్నావు. నీ యజమాని నీకు అన్యాయం చేయలేదూ? స్వేచ్ఛగా తిరిగే నిన్ను ఎంత కఠినుడు కాకపోతే యీ యినప ఊచల్లో బంధిస్తాడు? తన ఆనందంకోసం నిన్ను బొమ్మలా చేయలేదూ? అయినా మనుష్యుడి మీద యింత ప్రేమ ఎలా కలిగిందో నీకు! నీ తోటివారి నుండి విడదీశాడు నిన్ను. నీకు ఆకలి తప్ప మనోవాంఛ లేదనుకొన్న నీ యజమాని మూర్ఖుడనుకోనా, లేక మానవత్వం కోల్పోయాడనుకోనా? ... అలా చూడు. ప్రకృతంతా నిన్నెలా ఆహ్వానిస్తోందో!"

లక్ష్మికి ఆవేశం కలిగింది. ఇన్నాళ్ళ నుంచీ బానిసత్వంలో పొందిన ఆనందం ఒక్కసారి నీచంగా కనిపించింది.

"ఇంక నేను వెళ్ళాలి. ఇంట్లో వాళ్ళెవరైనా చూస్తే నా ప్రాణాలు పోయేవరకూ వెంటాడుతారు. రేపు తిరిగివస్తాను. తప్పించుకొనిరా. లేకపోతే యింతటితో మన బాంధవ్యం తేలిపోయినట్టే."

హృదయభారంతో క్రుంగిపోయినా ఆమగచిలుక బలమైన రెక్కలు విప్పి సునాయాసంగా ఎగిరిపోయింది. చెట్ల ఆకుల్లో కలిసిపోయి కనిపించకపోయినా చక్కటి పాటమాత్రం లక్ష్మికి వినిపిస్తోంది. ఆ పాటంటే లక్ష్మికి చాలా యిష్టంగా ఉండేది యింతవరకు. ఇప్పుడు ఆ పాటే మర్చిపోయింది. అకస్మాత్తుగా వినేటప్పటికి ఎన్నో తీయని తలపులు జ్ఞాపకం వచ్చాయి. ఆ పాట వింటూనే కళ్ళు మూసుకుంది.

రాత్రి వచ్చిన తర్వాతకూడా కళ్ళు తెరవలేదు. ఆ ఒక్కరోజు మాత్రం తనచుట్టూ

ఉన్న కృత్రిమ ప్రపంచాన్ని చూడలేదు. ఇదివరలో తిరిగిన అనేక అడవుల్లో తిరిగి ఎగరటం మొదలెట్టింది. ఒకరోజు దెబ్బలు తగిలి ఏ చెట్టు కొమ్మనో గట్టిగా పట్టుకొని గంటలకొద్దీ స్మృతి తప్పిపోయివుంది. తన చెల్లెలున్న అడవిలోపం వెతకటం ప్రారంభించింది. ఎంతో శ్రమపడి చివరకు కనుక్కొంది. దూరంగా ఓ చిటారు కొమ్మపైన మనుష్యుడి చూపు కందకుండా తన ప్రియుడితో ఉంది. తను కూడా అంత ఎత్తు ఎగిరి వాళ్ళను కలుసుకోవా లనుకుంది. ఎంతసేపు ఎగిరినా రెక్కలు నొప్పిపెట్టటం తప్ప తన చెల్లెలూ, ఆమె ప్రియుడూ ఎంతో దూరంలో ఉన్నట్టున్నారు. పైకి వెళ్తున్న కొద్దీ కళ్ళు తిరుగుతున్నాయి; ఆయాసం ఎక్కువైంది. వృథాప్రయాస అనుకుంది. వాళ్ళిద్దరూ తనని చూడకపోయినా, తానైనా వాళ్ళని చూశానన్న తృప్తితో సంతోషించింది. కొంతసేపటికి తెలియకుండానే రెక్కలు కొట్టుకోటం మానేశాయి. ఎంతో వేగంతో పడిపోతోంది. కింద చూస్తే పర్వతాలు, నదులు, అగాధం! అయినా ప్రాణం గుచ్చుకొని గిలగిల కొట్టుకొంటూ చనిపోవటం కన్నా, తిరిగి పంజరంలో ఊపిరి ఆడకుండా బాధింపబడేకన్నా, ఇంకెక్కడ పడిపోయినా మేలే అనుకుంది. స్వేచ్ఛగా ఎగురుతూ ప్రాణాలు వదిలెయ్యటం కంటె స్వర్గం లేదనుకుంటూ పడిపోయింది.

శాస్త్రి మర్నాడు ఉదయం లేచేసరికల్లా సేవకుడు వచ్చి లక్ష్మి చనిపోయిందని చెప్పాడు. లక్ష్మికి సంబంధించినవి కత్తిరించిన రెక్కలు మాత్రం మిగిలాయి. వాటికికూడా లక్ష్మితోనే స్వస్తి చెప్పాడు.



సోవియట్ రష్యాలో ఇండియాప్రభుత్వపు రాయబారిగా నియమితులైన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారికి ఢిల్లీ ఆంధ్రసభవారు యిటీవల ఏర్పాటు చేసిన వీడ్కోలు సమావేశంలో పండిత నెహ్రూ ప్రసంగిస్తున్న దృశ్యం.

# సంగీత చికిత్స

అవసరాల రామకృష్ణారావు

మా యింట్లో పెద్ద వాటాలో నలభై రూపాయలకు అద్దెకు వున్న స్కూలు మేష్టరు గారికి మరో వూర్లో పనై వాటా ఖాళీ చేసి వెళ్ళి పోయారు. పదిరోజులపాటు మాయిల్లు ఊరికే వుంది. అసలు మా లక్ష్మితో ఎవరూ పడ లేరు. మేష్టారి పెళ్ళాం మహాయిల్లాలు కాబట్టి మా అండతో ఎలాగో వెళ్ళబుచ్చింది. ఎవరు దిగుతారో, ఏం గొడవ జరుగుతుందో అని భయ పడుతూనే వున్నాను. మహా గడుసుదనీ దాని లాగ లక్ష్మి నా దగ్గిర కొచ్చి 'ఏమండీ, యింత యిల్లూ నలభైకి యివ్వడం నాకేం నచ్చలేదు, వాటాలుచేసి చెరో పాతిక చొప్పునా యిద్దాం' అంది. నే నేమైనా అంటే నామీద ఎగురుతుం దని "అలాగే" అన్నాను. ఆ తరువాత నాలుగు రోజులకే మా వాటాకి చెరో పక్కనీ సంగీతం మేష్టరూ, వకీలుగారూ దిగేరు.

మా లక్ష్మికి పాట బాగా వచ్చునని ఓ అహంభావం. నా పెళ్ళి చూపులకి వెళ్ళిననాడు 'అమ్మాయి మా బాగా పాడుతుంది' అంటే నిజమే అనుకున్నాను. పెళ్ళిలో పాడమంటే సిగ్గన్నారు. ఆఖరికి ఓనాడు మురిపించుకు, మురి పించుకుని గొంతుక సవరించుకొని 'అహా, ఏమీ నా భాగ్యము స్వామి కరుణించెన్' అని మొద లెట్టింది. ఆ ముక్క అయిందో లేదో అక్క డున్న ఆడాళ్ళూ మొగాళ్ళూ అందరూ ఘొల్లున నవ్వేరు. వాళ్ళమ్మ చిన్న బుచ్చుకొని "అదేమి టే! సినిమాపాట పాడూ!" అంది. లక్ష్మి అభయ మిచ్చే వరుసలో "భరింపజాలమూ బ్లాకు మార్కెట్టూ, భారతీయులారా, ఓ భారతీయు లారా!" అని అందుకుంది. నవ్వు ఆపుకోలేక పిల్లలు పకపక నవ్వేశారు. లక్ష్మి ఈనవ్వులేమీ లెక్క చెయ్యకుండా పాట సాగించింది. నవ్వు మాట దేవు డెరుగుకుగాని నాకక్కడ కూర్చో దం కష్టమనిపించింది. ఆ తరవాత ఎవరూ పాడ మనకుండానే "బాబా. బహు పేదలము..." గంటసేపు పాడింది. మా అక్కయ్య యింక భరించలేక "మంగళహారతి పాడెయ్యి, పారదలా!" అంది. ఇంతకీ చెప్పొచ్చే దేమిటంటే మా లక్ష్మి పాడితే కాకి అరిచినట్టూ, పిల్లి దేవిరిచినట్టూ వుంటుంది. తనపాట బాగులేదని గాని, యింకోళ్ళపాట బాగుందనిగాని మా లక్ష్మి దగ్గిర అనడానికి వీలులేదు.

ఆవతల సంగీతం మేష్టారూ, యివతల వకీలు గారి భార్య పంకజం చాలా బాగా పాడ తారు. లక్ష్మి నాదగ్గిర కొచ్చి "యీ వెధవగోల భరించలేకుండా వున్నా. ఎవరికిపోయి అద్దె కిచ్చాం. దూపొద్దులా గింయ్‌మని ఏమిటీ గోలా?" అంటే "పోనిద్దూ మనకెందుకు! పైగా యిదేం ఛండాలం పాట గనకనా? చక్కగా పాడుతున్నారు. మనకుమాత్రం యిలాంటి అదృ ష్టం వుండొద్దూ?"-ఇదీ నే నన్నమాట. దాంతో నర్సమ్మ (అదే లక్ష్మీనర్సమ్మ) నామీద విరుచుకు పడింది: "అవును, మీకు పైవాళ్ళపాటలు బాగుం దవూ? నా పాటంటే మీ కసహ్యంగాని. మీ కిష్ట మైతే వాళ్ళూమీరూ కలిసి"-అంతటితో నేనుఅపు చేయించాను. "లక్ష్మి, అసలే నీ నోటికి వేరే లౌడ్‌స్పీకరు అక్కర్లేదు. నా ప్లైవరేసా వింటే బాగుండదు" అన్నాను.

"అవును, ఎందుకు బాగుంటుంది? వాళ్ళం దరూ మీ కాప్తబంధువులు- ఆ సంగీతంమేష్టరు మీకు నారదుడు. పంకజం మీకు సాక్షాత్ సరస్వతి. నేనేగా మాలకాకిని!" నిజంగా అప్పుడు లక్ష్మి చెప్పినమాట అక్షరాలా నిజం! పైకంటే ఏడుస్తుంది.

"లక్ష్మి, నువ్వు మాత్రం బాగా పాడవా? నిజంగా కోయిలవే!" అన్నాను. లక్ష్మి మరింత పెద్ద కంఠంతో-

"కోయిల నెందుకౌతానూ! ... ఎందుకండీ యీ ముఖస్తుతులు... ఇంతకీ అందరూ బాగుం దన్న నా పాట మీకు బాగుండకపోతం నా

పూర్వజన్మ పూజాఫలం." సరిగ్గా అదే సమయానికి "తొలి నే చేసిన పూజాఫలము" అని మా పక్కవాటా అతను పాడుతున్నాడు. ఆ మాటలు లక్ష్మి భరించలేక పోయింది. సరాసరి వెళ్ళి పచ్చడి చేస్తున్న మేష్టారి చెల్లెలు వెంకమ్మమీద వెళ్ళి పడింది.

"మగాళ్ళకి బుద్ధి లేకపోతే ఆడాళ్ళు చెప్పొద్దూ? అతనికి మాత్రం అక్క చెల్లెళ్ళు లేరూ? నన్ను వెక్కిరిస్తాడా?..." వెంకమ్మ మాత్రం తక్కువదా? చీర నడుంలోకి దోపి-

"ఇల్లిచ్చానని నోటి కొచ్చినట్టు పేలకు అమ్మడూ ... వాడిమటుకు వాడు పాడుకుంటూంటే నీ కెందుకూ?" అంది.

వాళ్ళిద్దరి దెబ్బలాటా చూసి తీరాల్సిందే గాని చెప్పడానికి వీలులేదు. అవతల్నుంచి సంగీతం మేష్టరూ, యివతల్నుంచి నేనూ యిద్దరం వెళ్ళి వాళ్ళను విడదీశాం.

అంతే, ఆవాళనుంచీ ఆ విడనూ మా లక్ష్మికీ మాటలు లేవు. మర్నాడు మా లక్ష్మి పంకజంతో కూడా గట్టిగా దెబ్బలాడేసింది. అసూయ వుంటే ఎన్నాళ్లు దాగుతుందీ?

"ఆ మొగాడు మహా పెద్దమనిషి కాబట్టి ఆ గయ్యాళితో కాపురం చేస్తున్నాడు గాని యింకోడైతేనా!..." అనేవారందరూ. పోనీ, యీ దెబ్బలాటలు లేకుండా యింట్లో వాళ్ళను పొమ్మందామా అంటే, అసలే ఈ అద్దె డబ్బులతోనేగాని మా జీవితం వెళ్ళడం లేదు. అయినా యీ రోజుల్లో వెళ్ళమంటే మాత్రం అద్దెవాళ్లు కదులుతారు గనుకనా?

అవతల ఆ సంగీతం మేష్టారూ, యివతల యీ ప్లీడరుగారూ ఏం కూడబలుక్కున్నారో మాకు తెలీదు. ప్రతీ ముక్కలోనూ మమ్మల్ని పెట్టి ఏడిపించడం మొదలెట్టేరు. మా లక్ష్మి ఓ నాడు మల్లిపూలు తెమ్మంది. నేను మరిచి పోయాను. రాగానే "తెస్తారని ఎంతో సరదా పడ్డాను. ఛీ- యీ మొగాళ్ళని నమ్మకూడదు" అంది. ఎక్కడ వింటో యీ మాట, పంకజం గట్టిగా "మగవారి నిలా నమ్మరాదే చెలీ" అని మొదలెట్టింది. లక్ష్మి ఏంచెయ్యలేక ఏడ్చుతుంది.

మర్నాడు నేను నైట్‌డ్యూటీకి వెళుతూంటే మా లక్ష్మి అడ్డుపడి "ఏమండీ, అమావాస్య రాత్రులు, నాకు భయంగా వుంటుంది. నన్ను విడిచి కదలకండి" అంది. వెంటనే పక్కవాటాలోంచి-

"సఖ్యా విడచి, కదులకురా" అని పాట!

మర్నాడు నేను "లక్ష్మీ, నువ్వు చాలా చక్కగా వుంటావు సుమా" అన్నాను. వెంటనే పక్కని పంకజం అందుకుంది.

"మోము చక్కని చిన్నది, నా పక్క గదిలో వున్నది..."

ఇలాగే మేము పాలు తాగుతే "ఆరగింపవే, పాలారగింపవే!" అనీ, నేను లక్ష్మిని ఎందుకేనా బతిమాలితే 'కోపమేల లక్ష్మీ, దయ చూడవేల నాపై' అనీ యిలా ఏ పనిచేస్తే ఆపనిమీద పాట పాడేవారు.

మేము ఎంత మెల్లిగా మాట్లాడుకున్నా వినపడక మానదు, ఏపని చేస్తున్నా కనపడకా మానదు; తరువాత వాళ్ళు పాడకా మానరు. ఎలాగ?

ఇలా కాదని నేను మా మేనేజరుదగ్గిర నూరు రూపాయలు అప్పుతెచ్చి ప్లీడరుగారి చేతిలో ఒక ఏభై, సంగీతం మేష్టారు చేతిలో ఒక ఏభై పెట్టి యిల్లు మార్చుకుంటామని ప్రార్థించుకున్నాను. ఆ మర్నాడే వాళ్లు యిల్లు మారుతామన్నారు. ఆనాడు నేనూ మా లక్ష్మీ పొందిన ఆనందం యింతా అంతా కాదు.

అద్దె వాటాలు పోతే పోయాయిగాని యీ వెధవ గొడవ యిక పడలేను. వాళ్లు రాత్రే యిల్లు మార్చుకుంటా మన్నారు. తెల్లారింది. సిగరెట్ కాల్చుకోడానికి అగ్గిపెట్టె కనబడలేదు. నాకు విసుగెత్తి "అగ్గిపెట్టె ఎక్కడ పెట్టావు, నేను ఎక్కడని వెతకను?" అన్నాను. వెంటనే పక్కవాటాలోంచి "ఎందూ వెతకుదురా, శ్రీహరి నిన్ ఎందూ..." అని మేష్టారు మొదలెట్టేడు. అయితే వీళ్లు వెళ్లలేదూ? నాకు ఒళ్లు మండింది. తిన్నగా వెళ్లి "ఏమండీ, నిన్న యిల్లు మారుతామన్నారే, మారలేదేం?" అన్నాను గట్టిగా. "అయ్యో మారకేం! ప్లీడరుగారింట్లోకి నేనూ, మా యింట్లోకి ప్లీడరుగారూ మారేం కదండీ." అన్నాడు. నేను తెల్లమొహం వేశాను.

మరునాడు మా వాటా కూడా అద్దెకిచ్చి నేనూ లక్ష్మి మరోయింట్లోకి మారేం.



# పుస్తక సమీక్ష



సమీక్షానిమిత్తం పుస్తకాలు పంపేవారు ఒక్కొక్క పుస్తకం రెండేసి ప్రతులు పంపాలి.

---

**పశువుల దివాణం:** (ఊహాకల్పితమైన పెద్ద కథ) **మూలం:** జార్జి ఆర్వెల్. అనువాదం: జనమంచి రామకృష్ణ. వెల: ఒక రూపాయి. ప్రతులకు: జనమంచి రామకృష్ణ, శ్రీలలితాపురం వీధి, రాయపేట, మద్రాసు-14.

'పశువుల దివాణం' చదవడం పూర్తి చేసిన తరవాత ఒక ప్రగాఢమైన జిజ్ఞాస పాఠకుడిలో రేకెత్తుతుంది: ఈ శతాబ్దపు రాజకీయ సిద్ధాంతాలు మానవజీవితాన్ని ఎక్కడికి తీసుకువెళుతున్నాయి? పశుత్వం కన్న అధమాధమమైన స్థితికా? లేక భూలోక స్వర్గానికా? సమాధానం పాఠకుడి సంస్కృతిని, వ్యక్తి స్వతస్సిద్ధమైన స్వేచ్ఛాపిపాసను అనుసరించి ఉంటుంది. అయితే మానవసమాజాన్ని నేడావరించినంత దట్టమైన కింకర్తవ్యతా మూఢత్వం యిదివరకెన్నడూ లేదు. ప్రపంచం పొలిమేరల దాకా ప్రాకే ప్రచారసాధనాల ధర్మమా అని బలవంతమైన వర్గాలవారు ప్రజాబాహుళ్యాన్ని సులభంగా మోసపుచ్చగలరు. తాము చేసే ప్రతీదీ ప్రజల క్షేమంకోసమే నని నమ్మించి ఆ ప్రజల గొంతుకలే కొయ్యగలరు. వర్గరహిత సమాజాన్ని స్థాపిస్తామని వేదికలెక్కి అరిచి, తీరా అధికారం హస్తగతం అయాక, ఆ ప్రజల్ని బానిసల వలె, గానుగెద్దుల వలె, పశువుల కంటె హీనంగా తయారుచేసి వదలగలరు. శ్రామికవర్గ నియంతృత్వం పేరిట, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని సమూలంగా నాశనం చేసి, తిరుగులేని నిరంకుశ పరిపాలన సాగించగలరు.

ఏదైనా ఒక దేశంలో, "శ్రామికవర్గ నియంతృత్వం", "వర్గరహిత సమాజం", యిటువంటి గంభీర నినాదాలతో ఎవరో కొందరు నిరంకుశులు బయలుదేరి విప్లవం సాగించి, ప్రభుత్వం నెలకొల్పితే, ఆ ప్రభుత్వపు హయాంలో సామాన్యుడి జీవితం ఎలా ఉంటుంది? ఆ ప్రశ్నకు సమాధానమే యీ "పశువుల దివాణం" అనే వ్యంగ్యరచన. రహితాపురం జమీందారుగారి దివాణంలోని పశువులన్నీ తిరుగుబాటు చేసి, 'పశుస్వామికం' స్థాపిస్తాయి. మానవులంతా శత్రువులుగా భావించడం అతిముఖ్యమైన ఆదర్శం (మానవుడు పశువుల్ని దోపిడీ చేస్తున్నాడు!). జంతువులంతా సమానం. క్రమంగా పశువర్గ నియంతృత్వంలో యీ సిద్ధాంతాలన్నీ ఆచరణలో మంట కలుస్తాయి. నాయకత్వం కోసం పోరాటం ప్రారంభం అవుతుంది. ప్రతికక్షుల్ని అందర్నీ నేర్పుగా హతమార్చి నాయకుడైన పంది తిరుగులేని దొరతనం సాగిస్తుంది. తన నమ్మిన బంట్లతో కలిసి భోగలాలస జీవితం గడుపుతుంది. మామూలు పశువులు మాత్రం వెనక జమీందారు హయాంలోకంటె నికృష్టమైన బ్రతుకులు గడుపుతాయి.

నేడు సోవియట్ రష్యాలో అమలులో ఉన్నదని నిష్పాక్షికులైన విజ్ఞులనేకులచే హెచ్చరిక చేయబడుతున్న నిరంకుశత్వ స్వరూపానికి యీకథ ఒక వ్యంగ్యరూప చిత్రణ: వ్యక్తి స్వాతంత్ర్యవాదీ, కళావేత్తా అయిన

ఆర్వెల్ సందేశం. మూలంలోని కళా వైదగ్ధ్యాన్ని అనువాదకుడు చేర్పుగా తెలుగులోకి తీసుకు రాగలిగాడు. అనువాదం సునాయాసంగా, సరళంగా సాగింది. ఆర్వెల్ వ్రాసిన యిటీవలి పుస్తకం—"1984"—యిదే రీతిని తెలుగులోకి యీయన తీసుకురాగల్గితే తెలుగులో రాజకీయమైన వ్యంగ్య రచనలకు దోహదం లభిస్తుంది. కాని, పాఠకులకి ఈ అనువాదకుడు ఒక్క సంజాయిషీ చెప్పవలసి ఉంది: యీ "పశువుల దివాణం" అట్టమీదికి అంత అందవికారమైన బొమ్మ ఎలా సంపాదించ గలిగాడు!

---

వజ్రాయుధం : (గేయకావ్య సంపుటి).
రచయిత : సోమసుందర్, ప్రచురణ : కళాకేళీ, సామర్లకోట. డిమై సైజు 90 పేజీలు. వెల ఒక రూపాయి.

ఈ పుస్తకానికి 'ప్రవేశిక' వ్రాస్తూ, శ్రీ 'శ్రీరంగ' యిలా విపులీకరించారు : "(ఈ) భావకవుల 'ముభావ' సంస్కారాన్ని, 'అభావ' కవిత్వాన్ని తిరస్కరించి, గతంలోని ఉత్తమ కవితా సంప్రదాయాలను స్వీకరించిన అభ్యుదయ రచయితలు వాస్తవ జగత్తును గుర్తించి తమ కాలాన్నీ, ప్రజానీకాన్నీ, ప్రజల పురోగమనాన్నీ చిత్రిస్తున్నారు. చీకటినీ మృత్యువునూ ప్రతిఘటించి, కాంతినీ జీవితాన్నీ ఉపలక్షిస్తున్నారు..."

ఏతత్ప్రయత్నమే "వజ్రాయుధం". రచయితను గురించిన ప్రవేశ వాక్యాలలో ప్రకాశకులు యిలా అన్నారు: "1933 నుంచి 1945 వరకూ పిఠాపురం రాజా హైస్కూలు, కాకినాడ కాలేజీ కొంత చదువు చెప్పుతామని ఒప్పుకున్నాయి. కాని ఈయన కొంత తెలివిమీరి వాటికే పాఠాలు చెప్పడానికి పూనుకోటం వల్లా, ఆంధ్ర విశ్వవిద్యాలయం చదువు మరణ శాసనాల్ని వినిపిస్తూండటం వల్లా, 1945 లో బైట పడ్డాడు...ప్రజా జీవితం నగ్నంగా కళ్ళముందు తోచేసరికి తానే ఒక ఉద్యమమని గ్రహించాడు;... వ్యక్తపోగా కవి. సరదాగా కథకుడు."

స్థాలీపులాకంగా—
'పశుధర్మం' అనే గేయంలో :

"ధరణీ చక్రం గిరగిర
పరిభ్రమిస్తోం దదిగో !
నిమ్నోన్నతముల జగతికి
ఉద్వాసన చదువుతోంది."

'మాన ఘోష' లో :

"అకలి వేస్తోందమ్మా !
అన్నం పెట్టమ్మా !!

స్వర్ణారుణ
సస్యశ్యామల మగు
ఈ జగతిని, దారిద్రమున
ఆకలితో చావలేను !"

'ఫ్యాక్టరీ'లో:

"అదిగో అది ఫ్యాక్టరీ
ధనమదాంధ అధికారుల
కనికార రహిత గర్వం,

ఆకృతియై
నిలచిన ఫ్యాక్టరీ!"

ఇంకా "బానిసల దండయాత్ర"లో "ఖబడ్డార్ ఖబడ్డార్ నైజాం పాదుషాహో", "ఎగరెయ్, ఎగరెయ్. ఎర్రెర్రజండా! మన ఎర్రజెండా!", 'మలయా ప్రభంజనం'లో—"పుడమి తల్లి పొత్తికడుపు వాచినదేం కారణమో! ఆకలితో ఆడవాళ్ళు సెకన్లు లెక్కించే దెందుకొరకు!"—యిలాంటి భావాలు యీ సంపుటి నిండా సమృద్ధిగా గోచరిస్తాయి.

తెలుగు సాహిత్యంలో 'ప్రేయసి'కి లభించిన అత్యున్నత స్థానంలో నేడు పీడిత మానవుడు సుప్రతిష్ఠితుడగుచున్నాడు. రాజకీయవేత్తలు, కవులు, తదితర కళావేత్తలు పీడిత మానవుని శ్రేయస్సుకై నడుం కట్టారు. ఈ వజ్రాయుధం కూడా అందుకే. శ్రామికవర్గపు సకలవిధ బాధలకు, వ్యథలకు ఆయుధం యీ 'వజ్రాయుధం.'

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## విజయవాడ రేడియో: వినిపించని గాయకులు

విజయవాడకు రేడియో కేంద్రం వచ్చి సుమారు సంవత్సరం అయింది. ఈ సంవత్సరం లోనూ అక్కడ ఎంతమంది తెలుగు విద్వాంసులు పాడినది, ఎవరెవరికి ప్రోగ్రాములు లభించినది సమీక్ష చెయ్యవలసి ఉంది. ప్రోగ్రాములు లభించని విద్వాంసుల పేర్లు ముందు ఉదహరిస్తాం. ఇంతవరకూ (1) సుసర్ల గంగాధర శాస్త్రి, (2) వారణాసి బ్రహ్మయ్యశాస్త్రి, (3) వారణాసి బలరామయ్య, (4) సుసర్ల కృష్ణబ్రహ్మశాస్త్రి, (5) వోగిరాల వీరరాఘవశర్మ, (6) మహావాది వెంకటప్పయ్యశాస్త్రి, (7) టి. రామానుజయ్యంగారు, (8) మంత్రాల గోపాలకృష్ణమూర్తి, (9) పర్వతనేని వీరయ్య చౌదరి- మున్నగు సంగీత విద్వాంసులకున్నూ, ఇంకా వారణాసి ఘంటయ్యశాస్త్రి, ఈ. యజ్ఞనారాయణ, టి. గోపాలం, అట్లూరి వెంకటేశ్వరరావు చౌదరి. కూచిభొట్ల వెంకటేశ్వర్లు మొదలైన మృదంగం వాయించే విద్వాంసులకున్నూ ప్రోగ్రాములు లభించలేదు.

వీరందరిని ఆహ్వానించి, వారివారి యోగ్యతల ప్రకారం ప్రోగ్రాములు ఇవ్వవలసివుంది. కాని రేడియోవారు ఇవ్వుటలేదు. అసలే తెలుగు దేశములో సంగీతము శాస్త్ర సాంప్రదాయికముగా పాడేవారు తక్కువ. ఇలా యోగ్యత గలవారిని వదలివేస్తే, తెలుగు దేశములో ఏ విధముగా శాస్త్రీయమైన సంగీతము అభివృద్ధి కాగలదో తెలియుట లేదు.

మంత్రాల గోపాలకృష్ణమూర్తి
(సంగీత విద్వాన్)

---

## సమానదృష్టి కావాలి

ఆగష్టు 29 వ తేదీ 'తెలుగు స్వతంత్ర'లో 'స్వాతంత్ర్య పురాణం' అనే వ్యాసములో శ్రీ జ. వి. ల. గారు 'మంగలాడు, చాకలాడు, తెలుకులాడు' అని వ్రాసి తక్కువ కులాలవారిపై తమకుగల హేళన భావాన్ని వ్యక్తపరుస్తూ తమ పెద్దతనాన్ని దేశానికి చాటుకొన్నారు.

అన్ని కులాలవారిని గౌరవించి, అందరినీ సమాన దృష్టితో చూడవలెనని దేశనాయకులు, ప్రభుత్వము, ప్రజలు నినాదాలు చేస్తూ పట్టుదలతో తక్కువ కులాలవారిని పైకి తీసుకొనివచ్చి సమాన దృష్టితో చూస్తున్న యీ రోజుల్లో "వాను, వాడు" అని వ్రాస్తూ, దేశపరిస్థితుల నర్థం చేసికొనలేక వెనుకబడివున్న శ్రీ జ. వి. ల. గారిచే వ్రాయబడిన వ్యాసం చదువుకొంటే విచారం కలుగుతుంది.

కోయంబత్తూరు — షి. కృష్ణ

# తెలుగు స్వతంత్ర



## విషయసూచిక

సంపుటి 2. సంచిక 7.

శుక్రవారం, సెప్టెంబరు 16, 1949

పుట

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-7

సెప్టెంబరు 16, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## అంకెలూ, ఆవేశాలూ

**ఇం**డియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం రాలేదన్న సందేహం యింకా ఎవరి హృదయాంతరాళాలలోనైనా బాధిస్తూంటే, మన పార్లమెంటులో జాతీయ భాషను గురించి, అంకెల గురించి చెలరేగిన దుమారం పరికిస్తే చాలు: సందేహం పటాపంచ లవుతుంది. శ్రీ గోపాలస్వామి అయ్యంగారు తయారు చేసిన తీర్మానానికి సుమారు మూడువందల సవరణలు ప్రతిపాదింపబడ్డాయి. గంభీరోపన్యాసాలు, ప్రాచీన భారతదేశపు ఔన్నత్య సంస్తుతి, హిందీభాష "జాతీయత" కెత్తిన శతసహస్ర నీరాజనాలు, వీటన్నిటిలో ఔత్తరాహుల దేశభక్తి ప్రకటన, స్వాతంత్ర్యం వచ్చిందనే చైతన్యం భీష్మరూపంలో సభ్యుల ముందు సాక్షాత్కరించాయి. మచ్చుకి శ్రీ ఆర్. వి. ధూలేకర్ కావించిన నినాదం ఉదహరిస్తే చాలును: "ఏ విధమైన అవరోధమూ, ప్రతివిమర్శా లేకండా దేవనాగరలిపితో కూడిన హిందీ జాతీయ భాషగా అంగీకరింప బడాలి. హిందీ అంకెలతో సహా. ఈ విషయంలో నిమషమాత్రం ఆలస్యాన్ని కూడా సహించను," అన్నా రాయన. ఔత్తరాహుల సుగ్రీవాజ్ఞకు తిరుగు ఉండకూడదని ఆయన తాత్పర్యం.

సరిహద్దులు లేని జాతీయాహంకారం ఎటువంటి వికృతరూపాలు దాల్చగలదో యీ చర్చ రుజువు చేస్తున్నది. స్వాతంత్ర్యం వచ్చింది కనక, బ్రిటిష్ యుగానికి పూర్వపు స్థితికి దేశాన్ని తీసుకువెళ్లాలి: ఎంత వెనక్కి వెళితే అంత మంచిది. వీలయితే మహమ్మదీయ యుగం దాటి, గుప్తవంశ రాజుల స్వర్ణయుగానికి, మౌర్యయుగానికి—యింకా వీలయితే వేదయుగానికి. ఈ మనస్తత్వాన్ని జాతీయ ఔన్నత్యాన్ని పునః ప్రతిష్ఠించడం అనడం అవివేకం. వెలిగి ఆరినది తిరిగి రగిలించపూనడం కాలానికి ఎదురీదడానికి చేసే వ్యర్థప్రయత్నం. ఏది మనకి జాతీయభాష, ఏ అంకెల్ని మనం వాడాలి అన్న సమస్యల చర్చలో నిజంగా జరిగిన సంఘర్షణ గతానికీ భవిష్యత్తుకీ మధ్య; సంకుచిత తత్వానికీ విశాల దృక్పథానికీ మధ్య. చలనానికీ జడత్వానికీ మధ్య. అరబ్బీ అంకెలు, ఇండియా అంకెలు, అంతర్జాతీయస్వరూపంలో ఉన్న ఇండియా అంకెలు—ఏ విధంగా వాటిని వర్ణించినా హిందీ వాదులకు నచ్చలేదు. కేవలం ఇంగిత జ్ఞానంతో ఆలోచిస్తే, అంతర్జాతీయంగా చలామణిలో ఉన్న అంకెల్నే మనమూ ఉపయోగించడం వివేకవంతం. ఒకనా

డవి భారతీయులే కనిపెట్టారంటే మరీ మంచిది: యింక అభ్యంతరం దేనికి? కాని హిందీవాదులు అభ్యంతరం చెప్పారు. తక్కిన సాధక బాధకాలతో వారికి నిమిత్తం లేదు. వారి పట్టుదల నెగ్గాలి. దేశం అంతా వారి ఆజ్ఞ శిరసావహించిహిందీమార్కు అంకెలే వాడాలి.

హిందీవాదుల "జాతీయత" సంకుచితమైన వాళ్ల హృదయంలో జనించి అంతకన్నా సంకుచితమైన మేధస్సులో యింకిపోతున్నది. హిందీఅంకెలు కావాలన్న వారి వాదన ఇది: గుజరాతీ, గురుముఖి భాషల్లోని అంకెలూ, హిందీ అంకెలూ యించుమించు ఒకే ఆకారంలో ఉంటాయి. కాబట్టి అశేష జనానికి అందుబాటులో ఉంటాయి. అయితే ఇంచుమించు యిండియాలోని అన్ని భాషలవారికీ అంతర్జాతీయ సంఖ్యలు వాడుకలో తెలుసనే విషయం విస్మరింపబడింది: అన్ని రకాల అంకెలకీ "సున్నా" సంజ్ఞ ఒకటే; పోగా మొదటి మూడు అంకెలూ రెండు రకాలకీ ఒకటే. ఇక పోగా తక్కిన ఆరు అంకెల్లోనూ తేడా వస్తుంది. అంచేత, ఇండియా హిందీ అంకెల్నే స్వీకరిస్తే, విదేశీయులుగాని, హిందీ అంకెలు రాని తక్కిన స్వదేశీయులు గాని, నేర్చుకోవలసింది ఆరు అంకెలే నని, హిందీవాదులంటారు. విదేశాలతో మన ఉత్తరప్రత్యుత్తరాలలో, తక్కిన వ్యవహారాలలో ఇండియా ప్రభుత్వం హిందీ అంకెలు వాడితే, విదేశాలవారు ఆ అంకెల్ని కష్టపడి నేర్చుకోవాలని సేఠ్ గోవిందదాసుగారి వాంఛ. వర్తక వాణిజ్యాలలో యీ అంకెలు ఎటువంటి ప్రతిష్ఠంభన తీసుకురాగలవో శ్రీ దాసుగారు ఊహించ దలుచుకోలేదు. మనకి కావలసిన భారీయంత్రాలు, ఎలక్ట్రికల్ సామానులు, శాస్త్రీయపరికరాలు- వీటన్నిటిపైనా గోవిందదాసుగారి సంతృప్తి కోసం విదేశీ ఉత్పత్తిదారులు హిందీ అంకెలు వాడరు. విదేశీ ఆయుధ కర్మాగారాలవాళ్లు మనం యిచ్చే హిందీ అంకెల కొలతల ప్రకారం సరుకు తయారుచేసి అందిస్తారనుకోవడం పసితనం. అంతేకాదు, యింకా ఎన్నో సంవత్సరాలదాకా మన "దేవనాగర" ఆర్థికవ్యవస్థ స్వయం సమృద్ధం కాదు. రాజ్యాంగపరిషత్తు సభ్యులీవిషయంలో ఉద్రేకాలకు లోనుకాక, ప్రముఖ విద్యావేత్తలు, వైజ్ఞానికులు మొదలైవారిని ఆహ్వానించి, వారి సలహాలప్రకారం నడుచుకోవలసి ఉంటుంది అంతేకాని, బలవంతంగా యీ అంకెలు ప్రజలమీద రుద్దడానికి ప్రయత్నిస్తే, అభ్యుదయకాముకులంతా ప్రతిఘటించి తీరుతారు. హిందీ భాషా ప్రాంతాలతో తక్కిన ప్రాంతాలు సహకరించడం అవసరమైనప్పుడు, తక్కిన ప్రపంచంతో ఇండియా సహకరించడంకూడాఅవసరం. ఇండియా కోసం ప్రపంచం తన పద్ధతులు మార్చుకోదు.

మనం దేశాన్ని ప్రాచీనసంస్కృతి పొలిమేరలకి తరలించడానికి ప్రయత్నించడమా లేక తక్కినప్రపంచంతో పాటు ముందడుగు వెయ్యడమా? ఇండియా భవిష్యత్తు నిర్మించడానికి నడుం కట్టిన నేటి రాజ్యాంగపరిషత్తు సభ్యుల వైఖరి గమనిస్తే వీరేనా మన నవయుగ నిర్మాతలని నిస్పృహ చెందక మానలేము.

# జరుగుతున్న జమీందారీ రద్దు

రావెళ్ల హనుమంతరావు

మన రాజధానిలో గల జమీందారీ ఎస్టేట్లలో 33 ఎస్టేట్లను సెప్టెంబరు 7 వ తారీఖున రాష్ట్రప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది.

ప్రభుత్వం ఎస్టేట్లను స్వాధీనం చేసుకునేందు కవలంబించిన మార్గంలో - తయారు చేసిన చట్టంలో అనేక లోపాలున్నాయి. అయినప్పటికీ శతాబ్దాలుగా ప్రజాసామాన్యాన్ని పీల్చిపిప్పి చేస్తూండే జమీందారీ వర్గానికి స్వస్తి చెప్పటానికి నాందిగా పని ప్రారంభమైంది.

## ఎస్టేట్ల స్వాధీనం

జమీందారీ రద్దు చట్టంలోనున్న (3-బి) సెక్షను ప్రకారం ప్రభుత్వంచే స్వాధీనం చేసుకోబడిన యీ 33 ఎస్టేట్లలోనూ ఉన్న పోరంబోకులు, సామాజిక భూములు, బంజరుభూములు, పచ్చికభూములు, లంకభూములు, అడవులు, గనులు, ఖనిజములు, క్వారీలు, నదులు, నీటి సొనలు, చెరువులు, వ్యవసాయం చేయడానికి తగిన తదితర నీటి వసతులు, చేపల పరిశ్రమలు, పడవల రేవులు, మొదలైనవన్నీ ఏవిధమయిన లావాదేవీలతో నిమిత్తంలేకుండా ప్రభుత్వానికే సంక్రమించుతాయి.

ఈవిధంగా బిల్లును తయారుచేయటం, చేసిన బిల్లును (కొంత ఆలస్యంగానైనా) తదితర రాష్ట్రాలన్నిటికంటె ముందుగానే ఆచరణలోకి తీసుకరావటం, ఎవరెన్ని విధాలుగా ఆటంకాలు కల్పించడానికి ప్రయత్నించినప్పటికీ చలించక పోవడం - యిందుకు మద్రాసురాష్ట్ర మంత్రి వర్గాన్ని, ముఖ్యంగా రెవెన్యూమంత్రిగారిని అభినందించవలసి ఉంది.

## పట్టా విడుదలలు

జమీందారీ ఎస్టేటు గ్రామాలలో "జాయింటు" పట్టా లుండటంవలన రైతులకు ఎంత అనర్థకరమో అందరికీ తెలిసిన విషయమే. రైత్వారీ ప్రాంతాలయం దున్నట్లు జమీందారీ గ్రామాలలో ఏరైతు కారైతుకు, ఏభూమి కాభూమికి విడదీసి పట్టాలుండవు. పట్టాలు చీల దీసి లేకపోవటంవలన జమీందారీ ఉద్యోగులు రైతుల్ని విపరీతంగా బాధించుతారు. సముద్దారులు, తాణేదార్లు మొదలైన జమీందారు ఉద్యోగులు యీలోపాన్ని ఆధారంచేసుకొని రైతుల్ని విపరీతంగా దోచుకుంటారు. శిస్తు వసూలు చేసే టప్పుడు రశీదులు ఇవ్వరు, ఇచ్చినా సరిగా అందులో లెక్క వ్రాయరు.

వారి ఉద్యోగులు వసూలు చేసిన శిస్తు సొమ్మంతా జమీందారీ బొక్కసంలోకి వెళ్లదు. రశీదులు యివ్వకుండగా వసూలు చేసిన ధనమంతా ఉద్యోగుల జేబుల్లో పడుతుంది. జమీందార్ల ఆఫీసుకు వెళ్తే కాగితంలో మాత్రం ఫలానా పట్టా తాలూకు భూమిమీద యిన్ని వందల రూపాయల శిస్తు వసూలు కావలసి వుందని వ్రాసి వుంచుతారు. అజాపజా వుండని ఎస్టేటు కాగితాల్లో ఇవి యే మూడు-అయిదు సంవత్సరాలో, పడివుంటాయి. తరవాత బయట కొస్తాయి. వెంటనే ప్రారంభ మవుతుంది. పాత బకాయీలన్నీ పూర్తిగా వసూలు చేయమనే ఆర్డర్లు జారీ అవుతాయి. ఈ సమయంలో జమీందారీ ఉద్యోగులు చేసే అన్యాయాలు వర్ణించలేము. ఒక పట్టా భూమిమీద వంద రూపాయల బాకీ తేలివుం దనుకుందాం. ఆ పట్టాక్రింద ఉన్న భూమి పదిమంది రైతుల క్రింద వుంటుంది. ఇక సముద్దార్లు, తాణేదార్లు, కరణం వగైరా ఉద్యోగులు బయలుదేరుతారు. రైతువద్ద కెళ్ళి- ఏమంటావు? ఇదిగో యీ పట్టామీద యింత బాకీ వుంది. ఈ పట్టా క్రింద నీ భూమి ఇంతవుంది. కనుక నీవంతు యింత బాకీ పడుతుంది. నువ్వు పాలికో, యేకరాకో

చెల్లించుకోవలసి వుంటుంది. ఎప్పు డిస్తావు? బాకీ ఎప్పుడు చెల్లుగట్టుతావు!—అంటారు.

ఏభై రూపాయలు బాకీ చెల్లించాలనే సరికి రైతు హడలిపోతాడు. శిస్తు ఇదివరకే చెల్లించానంటాడు. అయితే రశీదులు చూపమని కేకలు. ఇల్లంతా వెదకినా రశీదులు కనపించవు. ఆ రోజున మీరు రశీదు యివ్వలేదు బాబూ అంటే నమ్మరు. చివరకి ఏ మూలనో రెండు రశీదులు దొరికితే వాటిలో పూర్తిగా శిస్తు చెల్లించినట్లు వుండదు. అందులో కొరతనే వ్రాసివుంటుంది. ఇక రైతుకు గత్యంతరం వుండదు. జమీందారీ ఉద్యోగుల చేతుల్లో పదో యిరవయ్యో పెట్టి సాగనంపవలసి వుంటుంది. అందులో సగం జమీందారుకి వెళుతుంది, సగం ఉద్యోగులకు వెళుతుంది. మొత్తంమీద పట్టాదార్ల దగ్గర జమీందారు ఖజానాలోకి వెళ్లవలసిన బాకీకి రెండు మూడు రెట్లు వసూలు చేస్తారు. అందులో జమీందారు వంతు పోగా మిగిలినదాన్ని ఉద్యోగులు అనుభవిస్తారు. ఈ విధంగా జాయింటు పట్టా లుండటంవలన, పాతబకాయిల పేరుతో రైతులు విపరీతంగా దోచుకోబడుతున్నారు.

గవర్నమెంటు గ్రామాల్లో యిలాగ ఉండదు. ఏ రైతు కా రైతుకు, ఏ భూమి కా భూమికి వేరు వేరుగా పట్టా లుంటాయి. దీనివలన ఒకరు చెల్లించవలసిన శిస్తు బాకీ మరొకరిదగ్గర వసూలు చేయటానికి వీలుపడదు. పాతబకాయి లుండవు. ఎంత శిస్తు కట్టవలసింది, రైతు ఎంత చెల్లించింది, ఎప్పటి కప్పుడు లెక్కలు తయారు చేయబడతాయి. గవర్నమెంటు శిస్తు వసూలు చేసే జనవరి - ఫిబ్రవరి మాసాల్లో రైతు చెల్లించగా మిగిలిపోయిన యావత్తు శిస్తునూ గవర్నమెంటు అధికారులు మార్చి మాసంలో వసూలు చేసి కిస్తీలు పూర్తిగా కట్టించుకుంటారు.

ఇప్పుడు ప్రభుత్వం ఎస్టేట్లను స్వాధీనం చేసుకోవటంవలనకూడా ఇదే జరుగుతుంది. క్రమ కాలంలోనే రైతులకు స్వంతంగా పట్టా లివ్వబడతాయి. దీనివలన రైతు కెంతో మేలు చేకూరుతుంది.

## అధిక శిస్తులు

జమీందారీ వర్గం యేర్పాటుచేయబడిన తరువాత శిస్తులు ఎక్కువ చేయటం విషయంలో కూడా రైతులకు చాలా అన్యాయాలు జరిగాయి. బ్రిటిషువాళ్లు, అంతకు ముందున్న మహమ్మదీయులు వారి ప్రభుత్వం సక్రమంగా సాగేందుకు ప్రజలనుండి శిస్తు రూపంలో ధనం వసూలు చేసి ప్రభుత్వానికి ఇచ్చేందుకు ఈ దళారీ వర్గాన్ని యేర్పాటు చేసుకున్నారు.

మొట్టమొదట్లో దళారీవర్గం అమలులోకి వచ్చినప్పుడు వీరు రైతులనుండి వసూలుచేసే శిస్తులు ఒకభాగం తమక్రింద వుంచుకొని మిగిలిన మూడు భాగాలు ప్రభుత్వానికి కట్టాలని నిర్ణయించుకున్నారు. మొదట్లో ఆవిధంగానే జరిగింది. కాని రానురాను ఈపద్ధతిని జమీందార్లు తారుమారు చేశారు. తాము ప్రభుత్వానికి చెల్లించవలసిన "పేష్కుషు" లో ఏమీ పెంపుదల లేదు. రైతులదగ్గర వసూలుచేసే శిస్తు మాత్రం రెట్టుకురెట్టు పెంచివేశారు.

ఈవిధంగా శిస్తును పెంపుదల కావించడం వలన ప్రభుత్వానికి వచ్చిన లాభం రాగిదమ్మిడీ కూడా లేదు. ప్రజలకు - ముఖ్యంగా రైతులకు మాత్రం విపరీతంగా నష్టం వచ్చింది. జమీందార్లు శిస్తును పెంచినప్పుడల్లా రైతు లెంతో ఆందోళన చేసేవారు. ప్రభుత్వానికి విన్నపాలు - విజ్ఞప్తులు - మహజర్లు పంపుకునేవారు. అయినప్పటికీ రైతులకు లాభం వుండేది కాదు. ప్రభుత్వం రైతుల మొరను పెడచెవినిపెట్టి జమీందార్ల తరఫునే పని చేసేది. తన ఉద్యోగులను, పోలీసు సిబ్బందిని పంపి జమీందార్ల కండగా నిలబడేది. ప్రభుత్వం ఇస్తూన్న చేయూత నాధారం చేసుకొని జమీందారులు రైతులవద్దనుండి వసూలుచేసే శిస్తు నధికం చేసేవారు. ఈవిధంగా యీనాటివరకు పెంపుదల చేయబడిన శిస్తు వసూలు గావించబడుతూనేవుంది. ఈబిల్లు ఆచరణలోకి రావటంవలన అధికశిస్తు పోతుంది. గవర్నమెంటు శిస్తుతో బాటుగానే ఈశిస్తుకూడా తగ్గించబడుతుంది.

ఈబిల్లు మొత్తంమీద అన్నిటికంటె ముఖ్యంగా గమనించవలసిన విషయం ఇదే. ఇంతవరకూ ప్రభుత్వానికీ, రైతులకూ మధ్య ఈ దళారు లుండటంవలన రైతుల కెన్నో కష్టనష్టాలు సంభవించాయి. దేశాన్ని పరిపాలించే ప్రభుత్వానికీ, ఎస్టేటు గ్రామాల్లో ఉండే రైతు

లకూ మధ్య సంబంధ బాంధవ్యాలు తక్కువై పోయాయి. ఎస్టేటు గ్రామాల్లో ఉండే ప్రజల కనుకూలంగా ఏదైనా పని చేయవలసి వచ్చి నప్పుడు ప్రభుత్వం ఆ బాధ్యత తనదికాదని తప్పించుకునేది. ప్రజలకు వ్యతిరేకంగానూ జమీందార్ల కనుకూలంగానూ పని చేయవలసి వచ్చినప్పుడు మాత్రం ప్రభుత్వంవారి సిబ్బందీ అంతా జమీందార్ల తరఫున పనిచేసేది.

ఈ విధంగా రైతు యింతవరకూ పడరాని బాధలు పడ్డాడు. ఈనాటితో మధ్యవాగికి స్వస్తి జెప్పడం జరిగింది. ఇక ప్రభుత్వం వుంది, రైతులున్నారు. మధ్య మరొకరు లేరు. ప్రభుత్వం చేసేదేమిటో రైతులకు ప్రత్యక్షంగా కనిపిస్తుంది. దానివలన లాభమో, నష్టమో వారికి తేలిగ్గా బోధపడుతుంది. ప్రభుత్వం చేసే పనులబట్టి, వాని వలన తమకు సంభవించే లాభ నష్టాలనుబట్టి రైతులు తమ కార్యక్రమాన్ని, కర్తవ్యాన్ని నిర్ణయించుకుంటారు.

## స్వంత కమతాలు

ఈ బిల్లు ఆచరణలో పెట్టటం వలన రైతుకు వచ్చే నష్ట-కష్టాలేమిటో పరిశీలించుదాం. ఇందులో స్వంత కమతాలకు సంబంధించినది ముఖ్యవిషయం. 12 వ సెక్షను బి 1-2-3 క్లాజుల క్రింద జమీందార్లకు కూడా కొన్ని భూములకు రైత్వారీ పట్టా లివ్వవచ్చునని వుంది. ఈ మూడు క్లాజులూ యేర్పాటు చేయటంవలన 1908 నాటి "ఎస్టేట్సు లాండు యాక్టు"లో అంగీకరింపబడిన భూముల కంటే అధికంగా జమీందారుల స్వంత కమతాలకు పట్టాలివ్వటం జరుగుతుంది.

1908 లో ఎస్టేటు లాండు యాక్టు తయారు చేయునపుడు అంతకుముందు పన్నెండు సంవత్సరాల నుండి జమీందారు పాలేళ్లతోనూ, వ్యవసాయ పరికరాలతోనూ స్వంతంగా వ్యవసాయం చేయించుకుంటూంటే, ఆ విధంగా ప్రభుత్వం రికార్డులలో నమోదు చేయించుకొని ఉంటే ఆ భూములను జమీందార్ల స్వంత భూములుగానే నిర్ణయించి పట్టా లివ్వబడతా యని ప్రకటించటం వలన, జమీందార్లు ముందే మేల్కొనడం వలన ఆనాడే వారికి వేలకొలది యెకరాలు సునాయాసంగా సంప్రాప్త మయాయి. తిరిగి ఈనాడు 12 సెక్షను బి 1-2-3 క్లాజుల వలన కూడా అంతకంటే అధికంగా స్వంత భూములు యేర్పడుతున్నాయి. 12-బి-1 క్లాజు ప్రకారం జమీందారు వారసత్వం వలన గాని, విల్లు రూపకంగా గాని సంక్రమించిన భూమిని అలా సంక్రమించిన తేదీ నుండో లేక 1939 జూలై 1 నుండో సొంత మనుష్యుల ద్వారా వ్యవసాయం చేయించుకుంటూ ఉండిన యెడల ఆ భూమి విషయంలో జమీందారుకు రైత్వారీ పట్టా యివ్వడం జరుగుతుంది. 12-బి-2: జమీందారు కొనుక్కొని గాని, పట్టా పుచ్చుకొని గాని, దఖలు పొందిగాని ఉన్న పొలాల విషయంలో 1945 జూలై నుండి ఆయన సొంతంగా సాగు చేసుకుంటూన్న యెడల ఆ భూములకు కూడా జమీందారుకే పట్టా యివ్వబడుతుంది. అయితే రెంటు బాకీ క్రింద కొనుక్కొన్న భూములకు మాత్రం ఇది వర్తించదు.

12-బి-3: రైతులు విడుదల పెట్టిన పొలాలనూ, ఎన్నడూ రైతుల స్వాధీనంలో లేని పొలాలనూ 1939 జూలై నుండి జమీందారు సేద్యం చేయించుకుంటూన్న యెడల ఆ భూములకు కూడా జమీందారుకే పట్టా ఇవ్వబడుతుంది.

ఈ మూడు క్లాజులు రైతులకు ఎంతో అఘాతాన్ని కల్గించాయి. అసలీ మూడు క్లాజులు మొట్టమొదటగా బిల్లు ప్రకటించినపుడు, అసెంబ్లీలో చర్చించినపుడు లేనే లేవు. బిల్లును "సెలెక్టు కమిటీ" వద్దకు పంపిన తరువాతనే ఇవి చేర్చబడ్డాయి. ఇలా చేర్చటం వలన రైతుకెంతో నష్టం కల్గింది. జమీందారీ వర్గం యేర్పాటు చేయబడిన తరవాత వారు రైతులను ఎన్నో విధాలుగా బాధించారు. అమాయకులైన రైతుల నుండి ఎన్నో వేల యెకరాల భూములను స్వాధీనం చేసుకున్నారు. భూమి బంజరుగానూ బర్రిగానూ ఉన్నప్పుడు దాన్ని ఏదో విధంగా

రైతు కివ్వటం, రైతు కష్టపడి దాన్ని బాగు చేసి పంట పండగల స్థితిలోకి తీసుకవచ్చే సరికి జమీందారు పన్ను కట్టి దాన్ని కాజేయటం- ఇలాంటి ఎన్నో జరిగాయి.

ఇన్ని విధాలుగా రైతుల్ని బాధించి తీసుకున్న భూములన్నిటినీ ఈ క్లాజులవల్ల జమీందార్ల స్వంత భూములుగానే నిర్ణయించి పట్టా లివ్వటం జరుగుతుంది. రెంటుబాకీక్రింద స్వాధీనం చేసుకొన్న భూములకు ఇది వర్తించదని బిల్లులో వున్నప్పటికీ తెలివిగల జమీందార్లు రెంటుక్రింద స్వాధీనం చేసుకున్నట్లుగా ఏ భూమినీ చూపించరు. రైతు ఏదోవిధంగా బాకీపడి, ఆ బాకీ తీర్చలేకపోవటంవల్లనే అన్నీ స్వాధీనం చేసినట్లుగా లెక్కలలో వుంటుంది. అంతే కాదు. జమీందారులు అనేకమంది రైతులను భూములనుండి తరిమివేసినప్పుడు వారిచేత భూములను తమ ఇష్టప్రకారమే వదలివేస్తూన్నామన్నట్లుకూడా వ్రాయించుకుంటారు. ఈ ఉపశమనం మాటలవలన రైతులకు ఏవిధంగానూ మేలు జరగదు. ఈమూడు క్లాజులు రైతులకుఎంతోనష్టాన్ని, ఆఘాతాన్ని కల్గించుతున్నాయి.

లంక భూములు

ఈ బిల్లులోని 11-వ సెక్షనులో - 1939 జూలై నుండి ఎడతెగకుండగా ప్రభుత్వం ఎప్పటికైనను స్వాధీనం చేసుకునేవరకు తమ ఆక్రమణలోగాని తమ పూర్వీకుల ఆక్రమణలోగాని ఉన్న భూములను సాగు చేస్తూన్నయెడల అలాంటి లంకభూములన్నిటికీ ఆయా రైతులకు రైత్వారీ పట్టా లివ్వబడునని వున్నది.

ఇదికూడా చాలా అన్యాయమైన క్లాజు. లంకభూములనేవి శాశ్వతంగా వుండేవి కావు. నదులకు వరద ప్రవాహం సంభవించినపుడు అవి ఆ ప్రవాహానికి గురై కొట్టుకపోతూంటవి. తిరిగి ఎప్పుడో, ఎక్కడనో బయటపడతాయి. అందుచేత, అవి శాశ్వతం కానప్పుడు ఈపది సంవత్సరాలనుండీ వాటిని వరుసగా సాగుచేసినయెడలనే రైతులకు పట్టా లిస్తా మనడంకూడా సబబు కాదు. ఇక్కడ మరొక విషయాన్ని కూడా పరిశీలించవలసివుంది. 1946 లో కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారంలోకి వచ్చిన తరవాత ఇలాంటి బిల్లులు తయారు చేయబడతాయని అనేకమంది పెద్దలు ప్రకటించడం జరిగింది. ఈ ప్రకటనలు చూసిన జమీందారులు ముందే ప్రారంభించారు. ఇలాంటి లంక భూముల్లో ఉన్న రైతుల నందరినీ ఆ భూములనుండి తరిమి వేయడానికి తీవ్రంగా ప్రయత్నించారు. తమ మనోభీష్టాన్ని నెరవేర్చుకున్నారు. ఇందుకు వ్యతిరేకించి రైతులా భూములనుండి తొలగిపోమని పట్టుబట్టితే జమీందార్లు తమ కనుకూలంగా ప్రభుత్వబలాన్ని తెచ్చుకొని రైతుల్ని లంకభూములనుంచి తరిమివేశారు. రెండు మూడు సంవత్సరాల క్రితం జరిగిన ఈ సంఘటనలు ఇంకనూ అందరికీ జ్ఞప్తిపథంలోనే ఉన్నాయి. ఇప్పుడీ బిల్లు ప్రకారం ఆ లంకభూములకు రయితులకు పట్టా లివ్వడం జరగదు. ఈ విధంగా రైతులను బలవంతంగానూ, నిర్బంధంగానూ, నిరంకుశంగానూ బయటకు పంపించివేసిన భూములన్నిటికీ తిరిగి ఆయా రైతులకే పట్టా లివ్వడం న్యాయం. అంతేకాదు. జమీందార్లకు వేలాది యెకరాల స్వంతభూములను కలుగజేసి వారికి పట్టా లిచ్చే దానికంటే, అలాంటి భూములన్నిటినీ ప్రభుత్వమే స్వాధీనం చేసుకొని వాటిని పేదరైతులకు- వ్యవసాయ కూలీలకు సాగు కిచ్చినట్లయితే బిల్లు ఇంకెంతగానో సౌష్ఠవంగానూ, బలంగానూ, ప్రజానుకూలంగానూ ఉండేది.



కాబోయే ఇంగ్లండు ప్రధాని

# కాదు అట్లీ, కాదు చర్చిల్-మరెవరు?

బ్రిటిష్ లేబరుపార్టీ ఎన్నికల్లో అఖండమైన విజయం పొంది, అట్లీ నాయకత్వం క్రింద స్థాపించిన ప్రభుత్వానికి వచ్చే సంవత్సరం జూలై నాటికి అయిదు సంవత్సరాలు పూర్తి అవుతాయి. 1911 లో పార్లమెంటు ఆమోదించిన చట్టం ప్రకారం, కనీసం అయిదు సంవత్సరాల కొకసారి ఇంగ్లండులో జనరల్ ఎన్నికలు జరగాలి: అంటే, వచ్చే ఎన్నికలు 1950 జూలై మాసంలో జరగాలి. ప్రస్తుత పరిస్థితులనుబట్టి చూస్తే, అంత వరకూ ఆగకుండా, యీలోపునే ఎన్నికలు రావచ్చు. రానున్న వసంతరుతువునాటికి ఎన్నికలలో పాల్గొనడానికి సిద్ధంగా వుండమని, యీ మధ్యనే చర్చిల్ తన కన్సర్వేటివు పార్టీ సభ్యులకొక హెచ్చరిక చేశాడు.

ముఖ్యంగా నేడు ఇంగ్లండు ఎదుర్కొంటున్న డాలరు కరువు సమస్య, లేబరు ప్రభుత్వం సమష్టిక్షేమం దృష్టిలో ఉంచుకుని ప్రవేశపెడుతున్న సంస్కరణలపై కన్సర్వేటివు వర్గాలవారు సాగిస్తున్న వ్యతిరేక ప్రచారం, వీటికారణంగా జనరల్ ఎలక్షన్లు అక్కడ త్వరలోనే రావచ్చు. ఏది యేమైవున్నా, అట్లీ తరువాత లేబరు బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రధానమంత్రి ఎవరవుతారు? ఆ ప్రశ్నకు సమాధానం, నేడు బ్రిటిష్ దేశాన్ని ఎదుర్కొన్న ఆర్థికసమస్య ముమ్ముందు ఏరూపాల్ని దాలుస్తుందో, దానిపై ఆధారపడివుంటుంది. అప్పుడే అక్కడ ఎన్నికలకు ముందుండే సంరంభం అంతా ప్రారంభమైంది. ఎన్నికల ప్రచారంలోను, ఆ తరువాత, తమ పార్టీకి నాయకత్వం వహించి సామర్థ్యంతో నడపగల నాయకుడెవరో త్వరగా తెలుసుకోవాలని లేబరు, కన్సర్వేటివ్ పార్టీ సభ్యులు అప్పుడే అంచనాలు వేస్తున్నారు. నాయకత్వంలో తీవ్రమైన మార్పులు రావలసిన అవసరం వుంటే, ఆమార్పులు తీసుకురావడానికి చెయ్యవలసిన ఏర్పాట్లకి యింకెంతో గడువు లేదని వారి భావన.

ఈ పరిస్థితిలో అందరి దృష్టీ ప్రస్తుత నాయకులవైపు తిరుగుతుంది. నేడక్కడ ప్రభుత్వ పక్ష నాయకుడు అట్లీ; ప్రతికూలపక్ష నాయకుడు చర్చిల్. మరీ అంతలోతుకి వెళ్లకుండా, మామూలుగా ఆలోచిస్తే, వీళ్లే తమతమ పార్టీలకి నాయకత్వం వహిస్తారని సహజంగా ఎవరికైనా తోస్తుంది. ప్రధానమంత్రి అట్లీ ఎంతో ఉత్సాహంతో కార్యభారం నిర్వహిస్తున్నాడు. అతని వయస్సుకూడా 66 సంవత్సరాలు— అంటే, రాజకీయాల్లో అది నడిమివయస్సు అనిపించుకుంటుంది. ఇంక ప్రజాదరణా? అతని హయాంలో ప్రజల క్షేమానికి తోడ్పడే అనేక సంస్కరణలు జరిగాయి. పోగా చర్చిల్ విషయం. ఇతని పార్టీ యీమధ్య సాధించిన ఘనకార్యం ఏదీ లేదు, నిజమే. కాని, బ్రిటిష్ ప్రజలకు ఇతనంటే విపరీతమైన గౌరవాభిమానాలున్నాయి. అయినప్పటికీ, యీ యిద్దరే వాళ్ల పార్టీలకు ముమ్ముందుకూడా నాయకులుగా ఉంటారని నిస్సందేహంగా చెప్పడానికి వీలులేదు.

అట్లీ నాయకత్వానికి వచ్చిన లోటేమిటి? ఏమీ లేదు. కాని, రానున్న ఎలక్షన్లలో పోటీ అతి తీవ్రంగా వుంటుందని "అభిజ్ఞవర్గాల" వారంతా అంగీకరించారు. వాళ్లవాళ్ల బలాబలాలు ఘోరమైన పరీక్షకి గురికావలసివుంటుంది. అట్లీ సమర్థుడైన ప్రధానమంత్రి అవొచ్చు; కాని, బ్రిటిష్ ప్రజానీకాన్ని అందర్నీ మూటకట్టుకుని, వాళ్ళందరి చేతా సామ్యవాదానికి ఓటు వేయించేటంటి శక్తి కలవాడా అంటే సందేహమే. మొదటి విషయం అతను వక్త కాడు. వేలకొద్దీ ప్రజల్ని ఉపన్యాసాల ద్వారా సమ్మోహితం చేసే శక్తి అతడిలో లేదు. తీవ్రమైన ఝంఝామారుతం వలె ప్రచారం సాగించడానికి సైతం అతడే ఉపయోగకారి కాడు. సామ్యవాద ప్రచారానికి వచ్చేఎన్నికల్లో దిట్టమైన చేతులు కావాలి. ఇవన్నీ ఆలోచించి, అట్లీ తను తప్పుకుని, లేబరు

పార్టీ నాయకత్వం యింకెవరికైనా అందచేస్తాడని అంచనాలు వేస్తున్నారు.

కన్సర్వేటివ్ పార్టీలో ఏ విధంగా చూసినా చర్చిల్ని మించిన నాయకుడు యింకెవరూ లేరు. అయితే, ఎంతటివాడైనా, చర్చిలుకి వృద్ధాప్యం వచ్చేసింది. ఆరోగ్యం కూడా అంత బాగా లేదు. నూటికి నూరుపాళ్లూ సామ్రాజ్యవాది. ప్రజ లతన్ని గౌరవించి అభిమానిస్తారు గాని, అతని రాజకీయవిధానాన్ని ఆమోదిస్తారనడానికి అవకాశం లేదు. కన్సర్వేటివ్ పార్టీలోనే, చర్చిల్ అభివృద్ధినిరోధక భావాలకి తట్టుకోలేని వాళ్లు ఎందరో ఉన్నారు.

అయితే- అట్లీ కాక, చర్చిల్ కాక, యింకెవరు? లేబర్ పార్టీలో ముగ్గురు మహారథు లున్నారు—వాళ్లే హెర్బర్ట్ మారిసన్, సర్ స్టాఫర్డ్ క్రిప్స్, అనూరిన్ బెవన్. ముగ్గురూ తమ తమ మార్గాల్లో మహానేతలు; రాజకీయ రంగంలో విశేషమైన ప్రఖ్యాతి కలవాళ్లు; పార్లమెంటు లేబరుపార్టీలో వీళ్ళని సమర్థించే బలీయమైన వర్గా లున్నాయి. కన్సర్వేటివ్ పార్టీలో ఏంథొనీ యీడెన్, రిచర్డ్ ఆస్టెన్ బట్లర్— ఈ యిద్దరూ ముఖ్యులు. ఈ అయిదుగురి గురించీ కొంత తెలుసుకోవడం అవసరం.

## హెర్బర్ట్ స్టాన్లీ మారిసన్

జననం 1888 లో. బీద కుటుంబం. తల్లి కలవారి యిళ్లల్లో పనిచేసే పరిచారిక; తండ్రి పోలీస్‌మన్. ఈ దంపతుల ఏడుగురు సంతానంలో మారిసన్ ఒకడు. చిన్నతనంలోనే ఒక కన్ను పోయింది. ఆఫీసు కుర్రాడు, షాపులో గుమస్తా, టెలిఫోన్ ఆపరేటర్- ఈ రకమైన ఉద్యోగాలెన్నో చేశాడు. లండన్ నగరపు బస్తీల్లో శ్రామికవర్గంలో లేబర్ పార్టీ ప్రచారం చెయ్యడంతో అతని రాజకీయ జీవితం ప్రారంభం అయింది. లండన్ లేబర్ పార్టీ సెక్రటరీగా, జాతీయ లేబర్ పార్టీ అధ్యక్షుడుగా, పార్లమెంటు ప్రతినిధిగా అనేక పదవులు చాకచక్యంతో నిర్వహించాడు. గడచిన యుద్ధం రోజుల్లో హోం సెక్రటరీగా ఉండేవాడు. నేడు లేబరు ప్రభుత్వంలో 'లార్డ్ ప్రెసిడెంట్ అఫ్ ది కౌన్సిల్'. తీక్ష్ణప్రజ్ఞను సూచించే ముఖం, ఒక్కటే అయినా నిశితమైన దృష్టి గల కన్ను, సర్వదా కొంచెం రేగి ఉండే జుట్టు— చూడగానే ఎదుటి వారిలో విశ్వాసం అంకురింప చేస్తాడు. స్నేహంగా ఉంటే తప్పకుండా తోడ్పడతాడు;



కాని పెట్లాట తెచ్చుకుంటే చీరేస్తాడు కాబోలు— అనిపిస్తుంది చూడగానే. పట్టుదలలో చర్చిల్‌కి ఏమాత్రమూ తీసిపోడు. కాని, ఏ విషయమైనా సూటిగా, స్పష్టంగా చెప్తాడు. అతడి భాషలో చర్చిల్ భాషలో వలె డొంకతిరుగుళ్లు గాని, పాండిత్య ప్రకర్ష గాని ఉండవు. అతడిలో దాంభికం మచ్చుకైనా కనబడదు. సర్వదా ఉత్సాహంతో, భవిష్యత్తుపట్ల అచంచలమైన విశ్వాసంతో ప్రవర్తిస్తాడు. అందరూ కలిసి సంఘీభావంతో సమష్టి శ్రేయస్సుకోసం కృషి చేస్తే, మానవులు సాధించలేని దేమున్నది! అని ప్రశ్నిస్తాడు. ప్రజానీకం మధ్యనుండి కృషిచేసిన వాడు: అతడూ వాళ్లలో ఒక భాగమే. బాహ్య జీవితంలో కటువుగా ఉన్నట్టు తోచుతాడు. అప్పుడప్పుడు మంకుపట్టు పడుతున్నాడా అనిపిస్తుంది, అతడు సాగించే పోరాటాలు చూస్తే. కాని, అనేక సంవత్సరాల రాజకీయానుభవం వల్ల నేర్చుకున్న గుణపాఠం అది. ప్రజా ఉద్యమాల్లో పాల్గొని, ప్రజాహితానికి వినియం

కార్యాలంటే, అన్నివేళలా మెత్తదనం పనికి రాదని తెలుసుకున్నాడు.

లేబర్ పార్టీలోని మరీ అతివాదులకు హెర్బర్ట్ మారిసన్ కళ్ళెం లాంటివాడు. చర్చిల్ని అన్నివేళలా ప్రతిఘటించడం అతని ఉత్తమ ఆదర్శాలలో ఒకటి. అన్నిటినీ మించి అతడు నిష్కల్మషమైన ప్రజాస్వామిక సామ్యవాది. నేడు బ్రిటన్ లోని రాజకీయ పరిస్థితుల్ని సూక్ష్మంగా పరిశీలించేవారు వచ్చే ఎన్నికల్లో కూడా లేబర్ పార్టీకి విజయం తప్పదనే నిర్ణయిస్తున్నారు. ఈ జోస్యమే ఫలిస్తే, ఏవిధంగా చూసినా హెర్బర్ట్ మారిసన్ ప్రధాని అవడానికి ఎక్కువ అవకాశాలున్నాయి.

## సర్ రిచర్డ్ స్టాఫర్డ్ క్రిప్స్

జననం 1889 లో. లార్డ్ పార్మూర్‌కి ఆఖరికొడుకు. వించెస్టర్‌లో, లండన్ యూనివర్సిటీలో విద్యాభ్యాసం. 1913 లో బారిస్టర్ పట్టా పొంది న్యాయవాదవృత్తి స్వీకరించాడు. 1931 నుండి పార్లమెంటు మెంబరు. 1930-31 లేబరు మంత్రివర్గంలో సొలిసిటర్-జనరల్‌గా ఉండేవాడు. మొన్నటి యుద్ధకాలపు చర్చిల్ మంత్రివర్గంలో అనేక ఉద్యోగాలు నిర్వహించాడు. ప్రస్తుతం ఆర్థికమంత్రి.

లేబరుపార్టీ అనుసరించే ఆర్థిక సూత్రాలకి ఒక స్వరూపం యిచ్చి, ప్రతిపక్షుల తీవ్రమైన విమర్శనల్ని సక్రమంగా ఎదుర్కో గలిగిన వాడు సర్ స్టాఫర్డ్ క్రిప్సు. అంతేకాదు, లేబర్ పార్టీ ఆర్థిక విధానానికి నైతికంగా ఔన్నత్యం యివ్వగలిగాడు. ఆ నైతిక విలువలే లోపించినవాడు, యీనాడు బ్రిటిష్ పౌరులను త్యాగం చెయ్యమనే అతడి విజ్ఞప్తులకు అర్థం ఉండకపోవును. "బ్రిటన్‌ను ఎదుర్కొంటున్న నేటి విపత్తులలో, అందరి శ్రేయస్సూ మనస్సులో ఉంచుకుని ప్రతివ్యక్తీ కొంత త్యాగం చెయ్యడం అవసరం." అదీ అతని హెచ్చరిక. అంతే కాదు; ఆచరణలో ఆ ప్రబోధించే త్యాగాన్ని తను చేసి చూపిస్తున్నాడు. అటువంటి ప్రవర్తన ప్రజాహృదయాల్ని కదిలించక తప్పదు. అతని సందేశం మహత్తరమైనది. దాని నైతిక ప్రాబల్యంనుండి ఎవడూ తప్పించుకోలేడు. ఈనాడు బ్రిటిష్ మంత్రివర్గంలో అందరికన్నా సమర్థుడు ఎవరంటే క్రిప్సు అని సమాధానం అప్రయత్నంగా అందరినోటా వస్తుంది. కార్మిక వర్గాలలో యితడి పలుకుబడి అపారం.

కొంతకాలం క్రిందట క్రిప్సుకు పార్లమెంటరీ



ప్రవర్తన తెలియదనే ప్రచారం ఒకటి ఉండేది. యుద్ధకాలంలో చర్చిల్ యితన్ని "లీడర్ ఆఫ్ ది హౌస్" గా నియమించినపుడు, అప్రయత్నంగా యితడు అన్నివర్గాల కోపానికీ గురయేవాడు. పార్లమెంటులో అనుసరించవలసిన చిన్న చిన్న మర్యాదలు, సంప్రదాయాలూ తెలియక పోవడమే అందుకు కారణం. కాని నేడు ఆ పరిస్థితులన్నీ మారాయి. ఇటువంటి విషయాలకి అతీతమైన పలుకుబడి నిర్మించుకో గలిగాడు. పార్లమెంటులో ఏదైనా చెప్పడానికి అతడు నిల్చుంటే, ప్రతికూల వర్గంవారు సైతం శ్రద్ధాభక్తులతో వింటారు. నలుమూలలనుండీ రాజకీయకల్లోలాలు తలెత్తి ముంచెత్తడానికి సిద్ధంగా ఉన్న ఘడియల్లో కూడా క్రిప్సు ప్రశాంతంగా, చిత్తశుద్ధితో నిలబడి క్రైస్తవ ప్రవక్త వలె తన సందేశం అందచేస్తాడు. ఆ ఆత్మౌన్నత్యం ముందు ప్రతికక్షులు నిస్తేజులై జారుకుంటారు.

అనూచానంగా శతాబ్దాల నుండి బ్రిటిష్‌జాతి క్రమశిక్షణకూ, నియమబద్ధ జీవితానికీ పేరు పడినది. వాటికన్నిటికీ చిహ్నంగా నేడు క్రి

గోచరిస్తాడు. కాని అనారోగ్యం ఎప్పుడూ అతన్ని పట్టి పీడిస్తూంటుంది. శాకాహారి. సత్య సూత్రప్రధానమైన జీవితం గడుపుతాడు. ప్రస్తుతం ఇంగ్లండు ఎదుర్కొంటున్న డాలరు సమస్య పరిష్కరించే భారం యితని భుజస్కంధాలపై పడింది. ఆ పరిష్కార ఫలితాలపై క్రిప్సు రాజకీయ భవిష్యత్తు ఆధారపడి ఉంటుందనడం సత్య దూరం కాదు.

## అన్యూరిన్ బెవన్

జననం 1897 లో. తండ్రి నేలబొగ్గు గనిలో కార్మికుడు. ఎలిమెంటరీ స్కూలు తర్వాత పదమూడో ఏటనే చదువుకు స్వస్తి చెప్పవలసి వచ్చింది. వెంటనే నేలబొగ్గు గనుల్లో కార్మికుడుగా చేరాడు. నేలబొగ్గు గనుల కార్మికుల యూనియన్‌లో రాజకీయ జీవితం ప్రారంభం. కార్మికుల తరఫున 1929 నుండీ పార్లమెంటులో మెంబరు. 1945 నుండి ఆరోగ్య శాఖామంత్రి.

నేటి బ్రిటిష్ మంత్రివర్గం అందరిలోకీ బహుశా యితడే చిన్న; అందరిలోకీ తెలివైనవాడు నిస్సంశయంగా యితడే. పత్రికల ప్రచారాలకి యితడిచ్చే సమాధానాలు గొడ్డలిపెట్టువలె ఉంటాయి. రాజకీయ రంగంలో ఎంత "గొప్ప" వ్యక్తితోనైనా కయ్యానికి దిగడానికి యీషణ్మాత్రమైనా జంకడు. రాజకీయాలలోని ముక్కోటి దేవతలూ ఎదురు వచ్చినా, ధైర్యంగా పోరాడతాడు. వెల్సుజిల్లా కార్మిక కుటుంబాల నుండి వచ్చినవాడు: వాక్కు ఉపన్యాస గాంభీర్యమూ, కార్యసాధన దీక్షా యితనికి సహజంగా అలవడ్డాయి. భోగి మనిషి. చురుకుపాలు ఎక్కువ. జలపాతం వలె ఉపన్యసించగలడు. ఇతడు రగిల్చిన వివాదాలతాలూకు నిప్పురులు యింకా రాజకీయ రంగంలో అక్కడక్కడ గోచరిస్తాయి.

బెవన్ ఆరోగ్యశాఖా మంత్రి అయిన తర్వాత దేశంలోని డాక్టర్లతో పెద్ద యుద్ధానికి దిగాడు. ఇంతటితో యితని పని సరి అనీ, యీ సమస్యతో అట్టడుక్కి వెళ్లిపోతాడనీ అంతా జోస్యం చెప్పారు. కాని, చివరికి యితడే నెగ్గాడు. లేబరు పార్టీవారి రెండు అత్యంత ముఖ్యమైన, కష్టమైన ప్రణాళికల ఆచరణలోకి తీసుకువచ్చాడు. ఒకటి జాతీయ ఆరోగ్య పథకం; రెండోది గృహనిర్మాణ ప్రణాళిక. గుండెల్లోకి చొచ్చుకుపోయే వాక్యం యితడి సొమ్ము—ఆ విషయం ప్రతిపక్షులకి బాగా అను



భవం అయింది. "ధనవంతుల చేతిలోనే ప్రభుత్వం ఉండాలని నచ్చచెప్పడానికి పనికివచ్చే కారణాలు కన్సర్వేటివ్ పార్టీవాళ్లు వెతుక్కుంటున్నారు" అన్నాడొకసారి. ఉపన్యాసాలవల్ల అశేషప్రజని ఉద్రిక్తపరచగలడు. వాగ్వాదాల్లో ఘటికుడు.

ప్రతిపక్షులు ఎక్కువవుతున్నకొద్దీ రాణించగల చిత్రమైన ప్రతిభ బెవన్‌లో ఉంది. పరిపాలనా దక్షతలోకూడా అద్వితీయుడు. లేబర్ పార్టీ వర్గాలలో అల్లారు ముద్దుబిడ్డలాంటివాడు. పార్టీ నాయకత్వపు కిరీటం ఒకనాడు యితడిని వరించడం నిస్సందేహం. అయితే, ఆ ముహూర్తం ఎప్పుడొస్తుందో అనే విషయంలో మాత్రమే భేదాభిప్రాయాలూ ఉన్నాయి. అనుకున్నదానికంటే త్వరగానే రావచ్చు. ఆధునిక సామ్యవాద యుగంలో బెవన్ ఒక అసాధారణవ్యక్తి: అయితే, యీ తరుణాన హెర్బర్ట్ మారిసన్, క్రిప్సు, యీ అతిరథుల్ని అతిక్రమించి నాయకత్వం యితనికి సంక్రమిస్తుందా అన్నదే సందేహాస్పదం.

## రాబర్ట్ ఏంథొనీ యీడెన్

జననం 1897లో. తండ్రి సర్ విలియం యీడెన్. విద్యాభ్యాసం యీటన్, ఆక్స్‌ఫర్డ్ విద్యాలయాల్లో. మొదటి ప్రపంచ యుద్ధంలో



సైన్యంలో చేరాడు. 1926 లో విదేశాంగ మంత్రికి పార్లమెంటరీ ప్రయివేటు సెక్రటరీగా పనిచేశాడు. అప్పటినుండి 1945 వరకూ అనేక మంత్రివర్గాలలో అనేక రకాల హోదాలు నిర్వహించాడు. గడచిన యుద్ధకాలంలో 1940 నుండి 1945 వరకూ బ్రిటిష్ విదేశాంగ మంత్రిగా పనిచేశాడు.

కన్సర్వేటివ్ పార్టీకి చర్చిల్ మకుటంలేని రాజు అనుకుంటే, యీడెన్‌ని యువరాజు అనవచ్చు. నిండైన విగ్రహం, పొడుగ్గా ఆకర్షణీయంగా ఉంటాడు. ప్రజాసామాన్యానికి ఏమాత్రమూ చెందడు. యీడెన్ "గొప్పవారి యింటిబిడ్డ." గడచిన అరువందల సంవత్సరాల నుండీ యీడెన్ పూర్వీకులు పాలకవర్గంతో సంబంధం కలవాళ్లు; అంతమాత్రాన, ప్రతిభ లోపించినవాడని కాని, పెద్ద కుటుంబానికి చెందినవాడు కాబట్టి పలుకుబడివల్లమాత్రమే రాజకీయాల్లో ఉన్నతస్థానం సంపాదించాడని కాని అనుకోకూడదు.

కాలేజీలలో అతి చురుగ్గా పరీక్షలు నెగ్గాడు; రాజకీయాల్లో సర్ ఆస్టిన్ చాంబర్లేన్ దగ్గిర శిష్యరికం చేశాడు; కన్సర్వేటివ్ పార్టీలో సునాయాసంగా నాయకశ్రేణికి రాగల్గాడు. మంచివ్యవహర్త. ఇంకేం కావాలి? కన్సర్వేటివ్ పార్టీయేకనక నెగ్గితే, యితని నాయకత్వానికి అవరోధం ఏమిటి? లేదనే అనిపిస్తుంది. వ్యక్తిగత జీవితమా? ఆదర్శప్రాయమైనది. చిన్నప్పుడు ప్రేమించి పెళ్లిచేసుకున్న భార్యతో సుఖమయ జీవితంగడుపుతున్నాడు. తీరికవేళల్లో మొక్కల్ని పెంచడం సరదా. సోమర్‌సెట్ మాఘమ్, రాబర్ట్ లూయీ స్టీవెన్‌సన్ - అతని అభిమాన రచయితలు. వీటన్నిటికీ తోడు సమ్మోహనకరమైన ఆకారం. చూడడానికి అందమైన సినిమా నటుడివలె గోచరిస్తాడు. ఇంక యితన్ని తోసిపుచ్చి నాయకత్వం గుంజుకునేవారు కన్సర్వేటివ్ పార్టీలో ఎవరున్నారు?

అయినా, కన్సర్వేటివ్ పార్టీలోని యువకవర్గానికి యితని నాయకత్వంమీద అంత విశ్వాసం లేదు. సైన్యం సేనానాయకుణ్ణి నియమించుకుని యుద్ధంలోకి ప్రవేశించాక, ఆఖరు ఘడియలో సేనాని కత్తి దాచేసుకుంటూ, ప్రత్యర్థి వాదనలోకూడా కొంత నిజం ఉందని అంగీకరిస్తే! యీడెన్ అలాంటి నాయకుడని వాళ్ళ భయం.

లేబర్ పార్టీవాళ్లు యితన్ని "యువరాజు" అని పిలుస్తారు. యీడెన్‌ని చూస్తే వాళ్ళకి ఒక కథ జ్ఞాపకం వస్తుంది. పారిస్‌నగరపు వీధుల్లో పెద్ద ప్రజాసమూహం ఒకటి ఆగ్రహంతో ముందుకి నడుస్తోంటే, ఆఖరున దిక్కుమొహం వేసుకుని ఒకతను నడుస్తున్నాడట. ఈ గుంపు వెనకాల నువ్వెందుకు నడుస్తున్నావని ఎవరో ప్రశ్నిస్తే "తప్పదు మరి, నేను ఆ గుంపుకి నాయకుణ్ణి" అని సమాధానం చెప్పాడట. యీడెన్ ఆ వ్యక్తివలె గోచరిస్తాడని లేబర్ పార్టీ వారు హాస్యం చేస్తారు.

అయినా, అతడి పలుకుబడి తక్కువ చెయ్యలేము. వాక్చాతుర్యంలో దిట్ట. లేబరుపార్టీ పరిశ్రమల్ని జాతీయంచేసే విధానాన్ని ఖండిస్తూ, ఒకసారి యిలా అన్నాడు: "సామాన్య మానవుడు తనదీ అంటూ ఒక యిల్లు, ఒక పెరడు ఉండడం ఎక్కువ వాంఛిస్తాడా, లేక జాతీయ-రైల్వేలలో పధ్నాలుగుకోట్ల పాళ్లలో ఒకపాలు తనదని సంతోషిస్తాడా?" ఏది యేలా ఉన్నా, చర్చిల్ పక్కన యితడు అంతగా రాణించ

లేదు. చర్చిల్ ప్రధానిపదవి నిరాకరిస్తేనే యితని ప్రస్తావన వస్తుంది.

## రిచర్డ్ ఆస్టిన్ బట్లర్

జననం 1902. ఇండియాలో. (తండ్రి సర్ మాంటెగూ బట్లర్ అప్పట్లో యిక్కడ



ఐ.సి.యస్. ఉద్యోగిగా ఉండేవాడు.) విద్యాభ్యాసం కేంబ్రిడ్జిలో. 1929 నుండి పార్లమెంటు సభ్యుడు. 1932 నుండి 1945 వరకూ కన్సర్వేటివ్ మంత్రివర్గాలలో అనేక పదవులు నిర్వహించాడు. 1932 నుండి 37 వరకూ ఇండియా ఆఫీస్ అండర్ సెక్రటరీగా ఉండేవాడు.

బట్లర్ కలలు కంటూన్న సమాజంలో కార్మికుడు, యజమాని, పెట్టుబడిదారుడు, తత్వవేత్త, మేధావి - అందరూ ఒకే సౌభ్రాతృత్వంలో సభ్యులు. సమష్టి క్షేమమే అందరికీ ఆదర్శం. "నిర్మాణాత్మకమైన సమాజం కావాలి-అందరూ ప్రభుత్వపు సత్రవుల్లో జీవించడం కాదు" అంటాడు తన సిద్ధాంతాలను సమర్థించడానికి కొన్ని వ్యవసాయిక, పారిశ్రామిక ప్రణాళికలు తయారు చేశాడు. ఆ ప్రణాళికలు విచిత్రంగా ఉన్నాయి. వ్యవసాయం, పరిశ్రమలూ జాతీయం చేసే విధానాన్ని ఒకపక్క ఖండిస్తూ, యింకొకపక్క అదే సూత్రాలపై ప్రణాళికలు తయారు చేశాడు. అది చూసి, లేబరు పార్టీ వారు తమ సిద్ధాంతాలకే కన్సర్వేటివు రంగు పూసి బట్లరు ప్రదర్శిస్తున్నాడని ప్రచారం సాగించారు.

కన్సర్వేటివ్ వర్గాల్లో కొందరికి యీ బట్లర్ ప్రణాళికలు నచ్చలేదు. అయినా కేవలం మేధాశక్తివల్ల యితడు పార్టీలో పెద్ద సంచలనం కలిగిస్తున్నాడు. కాలానుగుణంగా మారక తప్పదని, వ్యక్తి స్వాతంత్ర్యానికీ, ప్రభుత్వ సామ్రాజ్యానికీ సమన్వయం కుదర్చాలనీ యితని వాదన. పార్టీ సభ్యులలో సనాతనులకు యిది నచ్చదు. ఏవిధమైన అడ్డంకులూ లేని వ్యాపారసౌకర్యాలు, వ్యక్తి స్వాతంత్ర్యం, ప్రభుత్వం జోక్యం కలిగించుకోనక పోవడం - యివి సనాతనులు వాంఛించేవి.

కన్సర్వేటివ్ పార్టీలో బట్లర్ ఏకాకి. అతన్ని సమర్థించే అనుచరవర్గం లేదు. జాగ్రత్తగా తయారు చేసిన ఉపన్యాసం తీసుకొచ్చి, పార్లమెంటులో చదివేస్తాడు. ఆ చదవడం కేవలం నిష్కామకర్మవలె పురోహితుడు మంత్రం చదువుతున్నట్టు ఉంటుంది. రాజకీయంగా యితడిలో బాల్డ్విన్, చాంబర్లేన్, బోనర్ లా - వీళ్ల ఛాయలు గోచరిస్తాయి. ఇటువంటివాళ్ళు ప్రజానీకానికి దూరంగా ఉంటారు. ప్రజలకి వీళ్లంటే అభిమానమూ ఉండదు, ద్వేషమూ ఉండదు. ఒక్కొక్కప్పుడు అదే కారణంవల్ల వీళ్లకే పదవి సంక్రమిస్తూ ఉంటుంది.

ఈ అయిదు పేరులే నేడు తరుచుగా చర్చల్లో వినవస్తున్నాయి. కొద్దిమాసాల్లో జరగనున్న జనరల్ ఎలక్షన్ సరంభం అప్పుడే ఆరంభం అయింది. రాజకీయవేత్తలు- పిన్నలూ, పెద్దలూ-అందరూ అప్పుడే వ్యూహాలు పన్నుతున్నారు, మతాలు నిర్మిస్తున్నారు, తెరవెనక తతంగాలు నడిపిస్తున్నారు. పైకి ప్రశాంతంగా వీటికి సంబంధం లేనివారివలె నటించినా, లోలోపల రాజకీయ చదరంగంలో రకరకాల ఎత్తులు నడుస్తూనే ఉన్నాయి. ఈ పోటీలో గెలుపు ఎవరిది? ఏ పార్టీని విజయలక్ష్మి వరిస్తుంది? అనే ప్రశ్నలకు కాలమే సమాధానం చెప్పాలి. కాని, ప్రధానమంత్రి పదవి యీ అయిదుగురిలోనే ఎవరో ఒకరికి సంక్రమిస్తుంది కాని, వీరం దర్నీ దాటి పోదనిమాత్రం చెప్పుకోవచ్చు.





# 'జానపద' చిత్రాల పీడ

చాలా ఏళ్ల క్రితం కొత్తగా మార్క్సిజం అవగాహన చేసుకుంటున్న నా మిత్రుడొకడికి ధర్మ సందేహం కలిగింది: "జన సామాన్యం (అప్పట్లో) నాదియా స్టంటు చిత్రాలు ఎగబడి చూస్తున్నారుగదా, అదే నిజమైన ప్రజాకళ అనుకోవద్దా? వాటిని అల్ప సంఖ్యాకులైన మనవంటి మేధావులు తిట్టటం ప్రజాసామాన్యానికీ వారి అభిరుచులకూ ద్రోహం కాదా?'

ఈ ప్రశ్నకు నాకు అప్పట్లో తోచిన సమాధానం: "మేధావులు ప్రజాసామాన్యాన్ని అభిమానించవచ్చు గాని వారి దారిద్ర్యాన్నీ తక్కువ అభిరుచులనూ అభిమానించ నవసరం లేదు. ప్రజాసామాన్యం జీవితంలో అవసరమైన మార్పులు తెచ్చే దెవరు? వారిని అభిమానించే మేధావులే."

ఇవాళకూడా ప్రజాసామాన్యం ప్రకటించే తక్కువ తరగతి అభిరుచులు సమస్యగానే ఉన్నాయి. వాళ్లిప్పుడు 'నాదియా' స్టంటు చిత్రాలు చూడటం లేదుగాని 'జానపద' వంటి చిత్రాలు చూస్తున్నారు. ప్రజల అభిరుచి అంతేనని సమాధానంతో తృప్తిపడనవసరం లేదు.

కళాభిరుచిలో కూడా, ఇతర విషయాలలో లాగే, వ్యక్తివైఖరీ, సముదాయవైఖరీ ఉన్నాయి. ఈ తారతమ్యం అర్థం చేసుకోకపోతే వెనక నా మిత్రుడికి వచ్చినట్టే అనేకమందికి అనేక ధర్మసందేహాలు కలిగి, తప్పుడు సిద్ధాంతాలు ప్రచారంలోకి వస్తాయి–ఇప్పుడు వస్తున్నాయి కూడానూ. ఇటువంటి సిద్ధాంతాలు మచ్చుకు ఒకటి, రెండు మనవి చేస్తాను.

ప్రజలకు నచ్చటమే అభ్యుదయ కళకు గీటురాయిగా పెట్టుకోవటం గురించి ఇంతకుముందే చెప్పాను. ఇంకో సిద్ధాంత మేమిటంటే, మధ్య తరగతివాళ్ళ అభిరుచులు మంచివి కనక, ఆ అభిరుచులను ఏదోవిధంగా ప్రజాసామాన్యానికి అంటగట్టి అదే ప్రజాభిరుచి చేయాలని. మరో సిద్ధాంత మేమిటంటే ప్రజాసామాన్యానికి కూడా కళలా అని!

ఇటువంటి సిద్ధాంతాలు ప్రసాదించేవాళ్ళు గ్రహించని విషయ మేమిటంటే, ప్రజాసామాన్యానికి కళలతో అవసరం ఉండటమే కాక, కళలను ఆస్వాదించే శక్తి కూడా ఉన్నదని. వారికి లేని శక్తి ఏమిటంటే, "శిల్పం కోసం" శిల్పాన్నీ, "పాండిత్యం కోసం" పాండిత్యాన్నీ ఆరాధించటం. మధ్యతరగతి వాళ్ల అభిరుచులలో ఈ రెండు అంశాలూ తప్పిస్తే అవే ప్రజాసామాన్యం యొక్క అభిరుచులు కూడానూ. ఈ వ్యత్యాసం ఉన్నంత మాత్రంచేత ప్రజలకు కళ లవసరం లేదనిగాని అవగాహన కావనిగాని భావించ నవసరం లేదు. శిల్పనైపుణ్యాన్నీ, పాండితీ ప్రకర్షనూ చూసి ఆనందించటమే కళల యొక్క పరమార్థాన్ని గుర్తించటమని మధ్య తరగతివారు సంతృప్తి చెందవసరం అంతకన్నా లేదు.

అయితే ఈ మాట అనుకున్నంత మాత్రంచేత 'నాదియా', 'జానపద' చిత్రాల సమస్య తేలదు. ఈ చిత్రాలను జనసామాన్యం ఎందుకు విరగబడి చూస్తున్నారు? శిల్పం గాని, పాండిత్యం గాని లేకపోవటం మించి వీటిలో ఇంకే

మైనా ఉందా? లేదు! వీటిని కళాపిపాసతో ప్రజలు చూడటం కూడా లేదు. నిత్యజీవితం దుర్భరమైన ప్రజ తనచుట్టూ ఉన్న సాంఘిక వాతావరణాన్ని మరవడానికి ఈ అభూతకల్పనల శరణుజొచ్చుతున్నది. దీన్ని "ఎస్కేపిజం" అంటున్నాం. కాని ఇందులో "ఎస్కేపిజం" కన్న కూడా విశేషమైన అంశం ఒకటుంది. అదేమిటంటే, వ్యక్తి ప్రేరణలను తృప్తిపరచుకోవటం. ఇది అచ్చగా ప్రజాసామాన్యం యొక్క సొత్తు కాదు. ప్రబంధాలలోని పచ్చి శృంగారం ఆప్యాయంగా పఠించేవారంతా కవితా ప్రియత్వంతో ప్రేరేపించబడ్డవాళ్లే ననుకో నవసరం లేదు. అనేకమంది మేధావులు ఈ విధంగా వ్యక్తిగతమైన ఆనందాన్ని పొందుతారుగనక వాళ్లలో నిజమైనకళాపిపాస లేదనటంకూడా తప్పే.

"ఎస్కేపిజం" కూడా వ్యక్తిగత ప్రేరణే. దాన్ని మధ్యతరగతి వాళ్లుకూడా అవలంబిస్తారు. అయితే కళలద్వారా "ఎస్కేపిజం" వాంఛించినప్పుడు మధ్యతరగతివాళ్లు శిల్పానికి భంగం రాకుండా చూస్తారు. సామాన్య ప్రజలకు అది అవసరంలేదు.

యుద్ధం జరుగుతున్న కాలంలో "ఆర్సెనిక్ అండ్ ఓల్డు లేస్" అనే నాటకం అమెరికాలోనూ, ఇంగ్లండులోనూకూడా అతి విజయవంతంగా నడిచింది. ఆ నాటకంలో ఒక పిచ్చివాళ్ళ కుటుంబం ఉంటుంది. వాళ్ళలో ఇద్దరు వయసుమళ్లిన స్త్రీలు ఎంతో సద్బుద్ధితో జీవితంలో ఆనందాన్ని కోల్పోయిన ముసలివాళ్లను చేరదీసి హత్య చేసి ఎంతో భక్తిశ్రద్ధలతో వారికి రహస్యంగా ఉత్తరక్రియలు చేస్తూ ఉంటారు. ఈ నాటకంలో శిల్పసమృద్ధి కేమీ లోటు లేదుగాని కళాప్రయోజనం శూన్యం. అయినా ప్రజలు—అన్ని తరగతుల వాళ్లూ—ఈ నాటకం చూడటానికి వేలం వెర్రిగా ఎగబడ్డారు. యుద్ధకాల జీవితంగురించి మరిచిపోవటానికీ హత్యలు చేసేవాళ్లను చూసి నవ్వటానికీ ఈ నాటకం మంచి అవకాశం ఇచ్చింది.

ఈపనే ప్రస్తుతం 'జానపద' చిత్రాలుకూడా చేస్తున్నాయి. ఈచిత్రాలను మధ్యతరగతి మేధావులు సహించలేకుండా ఉన్నారంటే వారంతా 'ఎస్కేపిజం' కోరనివాళ్లని భావించరాదు. అందులో చాలామంది ఈ చిత్రాలలో శిల్ప సౌష్ఠవం ఉంటే తప్పక ఆనందించగలరు. అందువల్ల, ఏతావాతా, తేలేదేమంటే, కొందరు ప్రాజ్ఞులు 'జానపద' చిత్రాలనూ, వాటిని చూసే అసంఖ్యాక ప్రజలనూ తిట్టటానికి నిజమైన కారణం కళాభిమానం కాదు, ప్రజాభిమానమూ కాదు.

కాని ఈ 'జానపద' చిత్రాలకు విరుద్ధంగా తీవ్రమైన ప్రచారం జరిగి వీటిని నిర్మూలించవలసిన అవసరం ఉంది. ఇది ప్రజాజీవితాన్ని విధ్వంసం చేసే యుద్ధకాలం కాదు, ప్రజాజీవితం నిర్మాణం కావలసిన కాలం; ప్రజలు తమ జీవిత సమస్యల నుంచి పరారీ కావలసిన కాలంకాదు, వాటిని దృఢంగా ఎదుర్కోవలసిన కాలం. నైతికంగా కాగుడు ఎటువంటిదో తుచ్ఛమైన ఈ 'జానపద' చిత్రాలూ అటువంటివే. వీటి ద్వారా సాంఘిక ప్రయోజనం సాధ్యమవుతుందని ఎంత మతిమాలిన ప్రభుత్వం కూడా అనలేదు. అయినా అసంఖ్యాక ప్రజలు తాత్కాలికానందం కోసరం ఈ చిత్రాలమీద అంతులేని డబ్బు ఖర్చు చేస్తున్నారు. కాని ప్రభుత్వాన్ని నిషేధించమంటే ఈ చిత్రాలను నిషేధించదు. చిత్రనిర్మాణం ఒక పరిశ్రమ. పరిశ్రమలంటే మన ప్రభుత్వానికి భక్తి విశ్వాసాలు జాస్తి. పెట్టుబడిదార్ల లాభాలు అతి పవిత్రమైనవి. ప్రజాక్షేమం కన్న కూడా పెట్టుబడిదార్ల లాభాలు అత్యంత పవిత్రమైనవి. ప్రభుత్వం గీచిన నీతినియమాల గిరిలో ఉండి చిత్రనిర్మాతలు లాభాలకోసరం ఎంత పనికిమాలిన చిత్రాలైనా తీయవచ్చు.

నన్నడిగితే చిత్రాలలో "బూతు" కన్న కూడా "ఎస్కేపిజం" చాలా ప్రమాదకరమైనది. "ఎస్కేపిజం" కోసం కాకపోతే "బూతు"లో తప్పేమీ లేదు. సినిమా చిత్రాలు చూసే వాళ్లంతా నిన్ననే కళ్లుతెరిచిన పసిపాపలు కారు.

చిత్రనిర్మాతల లాభకాంక్షకూ కళాప్రయోజనానికీ ఉన్నది కేవల బాదరాయణ సంబంధం. ప్రజలలో ఉండే చైతన్యాన్ని అణచిపెట్టి వారి మాంద్యాన్ని బలపరిచే కళలను కళాభిమానులైన మేధావులు తీవ్రంగా నిరసించవలసి ఉన్నది. ఈ పనిని పత్రికలుకూడా దీక్షగా సాగించాలి.

"బృహస్పతి"

# విూదుకట్టిన జీవితం

సిద్ధాంతి మల్లికార్జునం

భర్త పిలుపు వినడంతోటే రివ్వున పరిగెత్తుకొచ్చింది సరోజ పమిట సర్దుకుంటూ.

"కాఫీ తయారైందా సరోజా?"

"ఆఁ చాలాసేపైంది. నే నెప్పుడో తాగేశానుకూడా. ఇంత ఆలస్యంగా వచ్చారేం?"

"మా కాలేజీలో ఇవ్వాళ ఒక మీటింగు జరిగింది. అందుకే ఈ ఆలస్యం" అంటూ లేచి వేష విసర్జన ప్రారంభించాడు. సరోజ లోపలికి వెళ్ళింది.

మూడుకట్టు, చొక్కా తగిలించుకొని తిరిగి సోఫామీద కూర్చునే సరికి సరోజ ఒక ట్రేలో టీ పాట్, కప్పు, సాసర్ తీసుకొనివచ్చి ఎదురుగా వుండే స్టూలుమీద పెట్టింది.

"నువ్వుకూడా కాస్త తీసుకో సరోజా" అంటూ సాసర్‌లో కాస్త కాఫీపోసి ఇవ్వబోయాడు మధుసూదన్.

"నాకు వద్దు బాబూ, తాగండి. ఇప్పటికెన్ని మార్లు తాగానో లెఖలేదు." అంటూ సరోజ వారించింది.

మధుసూదన్ కాఫీ తాగుతున్నాడు. కిటికీలోనుంచి, వినీలాకాశంలో మెల్లిగా వాహ్యాళి చేసే సంధ్యాకాలపు మబ్బు తెరలను నిదానించి చూస్తోంది సరోజ.

"భ్రమర జాబు రాసింది" అంటూ కప్పు, సాసరు స్టూల్‌మీద పెట్టాడు మధుసూదన్. చప్పున అతని వైపు చూపు మళ్లించింది సరోజ. ఆమె బంగారు వన్నె ముఖంలో అరుణ రేఖలు ఉదయించాయి. సూదిపోట్లవంటి సరోజ చూపులు చూసి అతను నిర్ఘాంతపోయాడు.

"ఏమిటి సరోజా—"

"ఏమీ లేదూ' లేని నవ్వు తెచ్చుకుంటూ "జాబు వచ్చిందనకపోతే జాబులోని సంగతులేమిటో చెప్పరాదూ" అంటూ చిన్న కూని రాగం తీసింది.

"ఇందుకేనా అంతకోపం" అన్నాడు మధుసూదన్ ఒక నవ్వు నవ్వుతూ.

"కోపాలు లేవు, తాపాలూ లేవు?"

"ఈసారి మనిద్దరికీ ఆహ్వానం."

"ఎక్కడికి?"

"తిరువాన్కూరుకు."

"దేనికి?"

"దేనికేమిటి. సరదాగా ఒక సమ్మర్ ట్రిప్."

"దానికేమీ పనిలేదు, పాటూలేదు. డబ్బు తగలెయ్యకుంటే నడుము కట్టుకొని ముందుకు దూకుతుంది. ఈ మాదిరి రైళ్ళకు డబ్బు తగలెయ్యకపోతే ఏ బీద పిల్లలకో యిస్తే, పాపం లక్షణంగా చదువుకొని వృద్ధికి రారూ."

"ఆ దానధర్మాలెట్లాగూ జరుగుతూనే వున్నాయిగా. అవన్నీ మన కెందుకు? రమ్మని పిల్చింది కాబట్టి వెళ్లుతున్నాం గాని."

"మీకూ దానిలో సగం పిచ్చి వుంది."

"పోనీ అట్లానే అనుకో, ప్రమాదమేముంది."

"ఎప్పుడు వెళ్ళాలట?"

"మా కాలేజీ మూసివేత కాగానే."

కాఫీ ట్రే లోపలికి తీసుకు వెళ్ళింది సరోజ. భ్రమర రాసిన జాబు మళ్ళీ చదువుతున్నాడు మధుసూదన్. ఇంతలో స్నానంచేసి తెల్లచీర కట్టుకొని గదిలోకి వచ్చింది సరోజ.

"మరి ఏం నిశ్చయం చేసుకున్నారు?" అని అద్దం ఎదుట నిల్చుని తిలకం దిద్దుకుంటూ సరోజ భర్తని ప్రశ్నించింది.

"మన ఇద్దర్నీ తప్పక రమ్మని పదే పదే ప్రార్థిస్తూ రాసింది. తక్షణమే జవాబురాయడం కూడా మంచిది."

"అయితే వెళ్తా రన్న మాట."

"నువ్వు?"

"ఏమో నాకు ఇష్టంగా లేదు."

"ఏం సరోజా! ముహూర్తం కలిసి సర్దాగా వెళ్దాం. తిరువాన్కూరు చాలా అందంగా వుంటుంది. తప్పక చూడతగింది. ఇటువంటి అవకాశాలు ఎప్పుడూ రావు." సరోజ భుజంమీద చెయ్యి వేసి అన్నాడు మధుసూదన్.

"ఈసారికి నన్ను వదలండి. నేను మా అమ్మ దగ్గరికి పోవాలి. చాలా రోజులైంది మా అమ్మను చూసి."

"ఓస్! ఇంతేనా. రోజురోజుకు మరీ బుజ్జి అమ్మాయి నౌతున్నావేం సరోజా" అన్నాడు చిరునవ్వుతో. సరోజను దగ్గరికి తీసుకొని, మునివేళ్ళతో గడ్డం పైకెత్తి చాలా మృదువుగా, అనురాగం ఒలికిస్తూ అన్నాడు-

"చూడు సరోజా. మీ అమ్మగారింటికి తర్వాత వెళ్లవచ్చుగానిలే. ఈసారి భ్రమరతో వెళ్దాం."

"ఈసారికి మన్నించమని రాయండి దానికి."

"అది మర్యాదగా వుండదు సరోజా. ఏదో మొదటినుంచీ మనకుండే స్నేహం కొద్దీ రమ్మని రాసింది. మనం పోకపోతే పాపం చాలా చిన్నబుచ్చుకుంటుంది."

"ఫరవాలేదు. నేను చెప్పానని రాయండి. పుట్టింటికి వెళ్ళి చాలా రోజులైంది. అందుచేత తనతో రావడానికి వీల్లేదని రాయండి" అన్నది సరోజ, వాలుజడకు రిబ్బను కట్టుకుంటూ.

"నామాట విను సరోజా" అన్నాడు మధుసూదన్ ప్రార్థనాపూర్వకంగా.

"దానికంటె మీ పోరు నాకెక్కువగా వుందే. కందకు లేని దురద బచ్చలి కెందుకు" అని కొంచెం చురుగ్గా అన్నది సరోజ.

ఆ వార్త వినడంతోటే సంతోషం పట్టలేక పోతుం దనుకున్నాడు మధుసూదన్. సరోజ అటువంటి మొండిజవాబు చెప్తుందని అతడు కలలో కూడా తలచలేదు. తీసుకొని వెళ్ళక పోతే భ్రమర ఏమనుకుంటుందో?—ఏమీ పాలు పోక తలవంచుకొని కాలి బొటనవేలితో నేలను రాస్తూ కూర్చున్నాడు. సరోజ గదిలోకి వెళ్ళి పూలు తెచ్చుకొని అద్దం ఎదుట నిల్చుని జడలో తురుముకుంటోంది.

"మరొకమారు బాగా ఆలోచించి చెప్పు సరోజా. నాకోసమైనా రారాదూ!"

"నే నెప్పుడైనా, ఏ విషయంలోనైనా మీకు రెండురకాలుగా చెప్పానా? నేను చెప్పినట్టే రాయండి. పోనీ, నాకోసం మా పుట్టింటికే ఈ సెలవుల్లో వెళ్దాం రండి. ఎప్పుడు ఇద్దరమూ వెళ్దామన్నా మీరు నాతో రారుగా. ఈసారి ఇద్దరం అవసరమైన పనిమీద మా పుట్టింటికి వెళ్తున్నామని రాయండి" అని దృఢ నిశ్చయంతో చెప్పింది.

"అయితే రావన్నమాట."

"ఆమాట నా నోట పలికించాలనా? నన్నెందు కింతగా బలవంత పెడ్తారు. మీ కిష్టమైన చోటికి మీరు వెళ్తానంటే నా కిష్టమైన చోటికి నేను వెళ్ళకూడదా? కోపగించుకోవద్దు. బాగా ఆలోచించి చెప్పండి' అని కొంచెం తీవ్రంగా అంది సరోజ.

"లేదు సరోజా. అభిప్రాయం అడుగుతున్నాను అంతే."

"మీరు అటు వెళ్ళండి. నేను ఇటు వెళ్తాను. ఇందులో మనకి తగవులెందుకు చెప్పండి."

* * *

"ఎప్పుడొచ్చావు రవీ?" అని చిరునవ్వుతో కలుసుకోడానికి వరండాలోకి వెళ్లింది సరోజ.

"ఇప్పుడే, ఏ గంటల బండికి. ఏడీ, మధూ ఎక్కడ?"

"నువ్వొచ్చిన బండికే వెళ్ళారు!"

"ఎక్కడికి?"

"భ్రమరను కలుసుకోడానికి" అన్నది సరోజ నిర్లక్ష్యంగా, రవి కళ్ళలోకి చూస్తూ. ఇద్దరూ లోపలికి వచ్చారు.

"ఇల్లంతా ఏమిటి ఇలా వుంది?"

"మూటాముల్లే సర్దుకుంటున్నా. నేను పుట్టింటికి ప్రయాణమౌతున్నాను ఇవ్వాళే."

"మంచి ముహూర్తానే వచ్చానే. ముందుగా ఉత్తరం రాసినా బాగుండేది. ఏదో నాలుగు రోజులు సరదాగా గడుపుదామని వచ్చాను సరోజా."

"చాలా సంతోషంగా వుంది. నువ్వు జ్ఞాపకం వుంచుకొని వచ్చావు. అదే పదివేలు. నా ప్రయాణం మానుకుంటానులే. నాలుగు రోజుల తా

వెళ్ళాను. ఇప్పుడు ముంచుకుపోయిం దేమిటి? నువ్వు వెళ్ళకు. సరేనా!" అన్నది చిరునవ్వుతో. సరే నన్నట్లు తల ఊపాడు రవి.

"అయితే మధూ ఎప్పు డొస్తాడు?"

"ఏమో, ఆ ప్రోగ్రాం ఎప్పు డౌతుందో, ఎప్పు డొస్తారో నాకు చెప్తారా ఏమిటి?"

"అంత పెద్ద ప్రోగ్రాం ఏమిటో?"

"ఇద్దరూ తిరువాన్కూరు వెళ్తారట, సమ్మర్ ట్రిప్."

"నిన్ను రమ్మనలేదా భ్రమర గాని. మధు గాని?"

"ఎవరో పెండ్లికి పోతూ, పిల్లిని చంక పెట్టుకు పోయారుట. అలా గుంటుంది నేను వెళ్ళటం."

"తీసుకు వెళ్లనన్నాడా?"

"నేనే రానని చెప్పాను- రాత్రంతా నిద్ర లేదుగా నీకు?"

"అవు" నన్నాడు రవి.

"సరే. వెళ్ళి పడుకో ఆ మంచంమీద. నేను వెళ్ళి భోజనం తయారుచేస్తా—మరిచి పోయా. కాఫీ అదీ అయిందా రవీ?"

"అయింది" అంటూ మంచంపై వాలాడు రవి.

11 గంటలకి భోజనానికి కూర్చున్నారు.

"నిరుడుకూడా ఎక్కడికో వెళ్లారుగదూ వీళ్లు?"

"ఆ, ఏటా వీళ్ల కిదొక అలవాటే. ఒక్క సారైనా సమ్మర్లో మా పుట్టింటికి వెళ్దామంటే రానేరారు."

"అయితే సరోజా, ఖర్చంతా ఎవరు భరిస్తారు?"

"అదే. దానికేం? తండ్రి కోటీశ్వరుడు. తాను ఏకైకపుత్రిక. ఇవన్నీ దానికో లెఖ్ఖా రవీ!"

"కాని ప్రతి సంవత్సరం ఇలాగే ప్రయాణాలు సాగిస్తూంటే తల్లిదండ్రులు ఒప్పుకుంటున్నారు. అదే చిత్రం."

"చెప్పానుగా, ఏకైక పుత్రికలు కోరిన వన్నీ జరిపించుకుంటారు."

"వీళ్లిద్దరేనా, ఇంకెవరైనా తోడు వెళ్తారా?"

"తోడెందుకూ, చిన్న పాపలా ఏమిటి ఇద్దరూ?"

"ఒక్క మాట అడుగుతా, కాని కోపగించుకో కుండా జవా బిస్తావా సరోజా? మన కుండే చనువు కారణంగా అడగడానికి ధైర్యం వచ్చింది."

"అడుగు రవీ. నా కేమీ కోపం లేదు."

"ఈప్రకారం మధూ భ్రమరతో తిరగడం బాగుంటుందా?"

"మన ఇద్దరి అభిప్రాయాలు ఒకేలా గున్నాయి రవీ."

గడియారం అరగంట కొట్టింది.

"పోనీ, మధూని మందలించలేకపోయావా?"

"ఆమాత్రం తెలివితేటలూ ధైర్యం నాకుంటే సుఖపడేదాన్నే."

"అధైర్యంతో ఏం చేస్తావు సరోజా. మధూతో గట్టిగా చెప్పు ఈసారి."

"లాభం లేదు రవీ. ఆయన నామాట వినరు. ఆయన దోవ ఆయనదే." అంటూ కంచం ముందునుంచి లేచింది సరోజ.

వారంరోజులపాటు రవి సరోజ అతిథిగా వుండి వెళ్లాడు. సరోజ పుట్టింటికి వెళ్లింది.

* * *

సౌందర్య ఖనిఐన కేరళదేశ పర్యటనం ముగించుకొని మధు భ్రమర లిద్దరూ భరతమాత పవిత్ర పాదపద్మమైన కన్యాకుమారీ అగ్రం చేరుకున్నారు. భగవత్ సృష్టిలోని సౌందర్యమంతా మూర్తీభవించిన మూడు సముద్రాల సంధిని తిలకించారు. గభీర ప్రశాంత వాతావరణ సౌఖ్యానుభవం ఏకొద్ది మందికో గాని లభించదు. మధు భ్రమర లిద్దరికీ అటువంటి అమూల్య సౌఖ్యం లభించింది.

నాటిసాయంకాలం సముద్రతీరంలో చిన్న చిన్న రాతి గుట్టలపై స్నేహితులిద్దరూ కూర్చొని మూడు దిక్కుల అనంతముగా ఆవరించిన సముద్రాన్ని చూస్తున్నారు. అక్కడ సూర్యాస్తమయం, చంద్రోదయం రెండూ ఒకేమారు సంభవిస్తాయి. ఆ అస్తమాన దృశ్యాన్ని తిలకించవలెనసే ఉద్దేశ్యంతో దేశదేశాలనుంచి ఎందరెందరో వస్తారు. ఒకవైపు అస్తమయరవి ప్రభలు సముద్ర తరంగాలను తమ బంగారు ఛాయతో

అలంకరించి, తన్మయత్వంలో వాటిని నాట్యం చేయిస్తున్నాయి. మరోవైపు పూర్ణచంద్రోదయ బాల కిరణావళి సముద్ర తరంగాలను స్పృశించి చక్కిలిగింతలు పెడుతూంటే వెన్నెలలో మెరిసే ముఖాలద్వారా తమ సంతోషాన్ని వెలిబుచ్చుతూ హాయిగా ఒయ్యారంగా చెలియలికట్టవైపు ఆ తరంగాలు నడుస్తున్నాయి. దక్షిణ దిశనుండి వీచే మెత్తని మందమారుతం స్నేహితు లిద్దరికీ నిద్రమత్తు కలుగ చేస్తూంది. పరిసరాలన్నీ నిర్మానుష్యంగా వున్నవి. సముద్రపు హోరుమాత్రం వినిపిస్తూంది.

ఒక్కొక్కటే అల వచ్చి భ్రమర పాదాలను స్పృశించి పోతూంటే, ఆ శీతల స్పర్శవల్ల భ్రమర శరీరమంతా గగుర్పాటు చెందుతూంది.

"ఎంత ప్రశాంతంగా వుంది మధూ ఈ పవిత్ర స్థలం!"

"అవును భ్రమరా. ఇక్కడ కూర్చుంటే మరొక సంగతి మనసుకు పట్టదు. ఈ ప్రకృతిలో లీనమైపోతాము."

"నామటుకు నాకు ఇక్కడినుండి వెళ్ళిపోవాలని లేదు మధూ."

"నిజమే. కాని కొత్తదేశం. పైగా ఇదొక చిన్న పల్లెటూరు. కొంత కాలానికి ఈజీవితంపైన కూడా విసుగుపుడుతుంది—నీకిది సరిపోతుందా? పట్నవాసాలలో నవనాగరిక జీవితాని కలవాటు పడినదానివి."

"మనసుకు ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ ప్రసాదించే వస్తువు కావాలిగాని పట్నవాసమైనా పల్లెటూరైనా జీవితానికి ఒకటే మధూ."

"నీకు ఆనందాన్ని ఇవ్వని వస్తు వేముంది భ్రమరా? ధనలోపమూ లేదు. నీకు, నీ మాటకు అంకుశముందే ఎదురు లేదు."

"నిజమే కాని అందువల్ల అసంతృప్తి వృద్ధి చెందటం తప్ప మరేమీ లేదు."

"బహుశా నీ అసంతృప్తికి కారణం ఒంటరితన మేమో."

పున్నమ చంద్రుని చూసి సంతోషం పట్టలేక ఉప్పొంగి ఉద్రూతలూగే సముద్రాన్ని చూస్తోంది భ్రమర. అల్లంత దూరాన ఒక చేప ఎగిరి మళ్ళీ నీటిలో పడింది.

"భ్రమరా!" తిరిగి చూచింది.

"నీ వివాహ ప్రయత్నాలు జరుగుతున్నట్లు విన్నాను. నిజమేనా!"

"నిజమే. కాని........." భారంగా గాలి పీల్చింది.

"ఏమిటి భ్రమరా!"

"ఆ ప్రయత్నాలను నేనే అడ్డపడుతున్నాను మధూ!"

"కారణం" అన్నాడు మధు కొద్దిపాటి ఆందోళనతో.

"మా నాన్న ఆస్తిపాస్తులను చూచి అందరూ నన్ను పెండ్లాడటానికి సిద్ధపడుతున్నారు."

"అది ఒక కారణం కావచ్చు. కాని కేవలం అందుకొరకేనని చెప్పడానికి వీలవుతుందా?"

"ఒకవేళ కాకపోయినప్పటికీ నాకు నచ్చిన పురుషు డింతవరకు దొరకలేదు."

"నీ తల్లిదండ్రు లేమంటారు భ్రమరా?"

"రవిని పెండ్లాడ మంటారు."

"మన రవినే, చాలా మంచిది భ్రమరా. కాలేజీలో అడుగుపెట్టినప్పటినుంచీ ఎం. ఎ. ప్యాసయేవరకు మన నలుగురం ఒకటిగానే వుంటూవచ్చాం నేనూ, సరోజకూ మీరిద్దరూ చేరి ముడివేశారు కదా. ఇప్పుడు మావంతు." అని చాలా ఉత్సాహంతో అన్నాడు మధు.

"నా కిష్టంలేదు మధూ."

"చాలా పొరబడుతున్నావు భ్రమరా. నువ్వంటే రవి కెంత యిష్టమో నేను చెప్పలేను. మీరిద్దరూ భార్యాభర్తలైతే చూచి ఆనందించాలని నేనూ సరోజా చాలా కోరుతున్నాము."

భ్రమర కళ్లు సముద్రపు టలలమీద తిరుగాడుతున్నాయి. క్షణంలో భ్రమర దృష్టికి కళ్ళనీళ్ళు తెరగట్టాయి. కాసేపు కంటికి మనసుకూ ఏమీ గోచరించలేదు.

"ఏమంటావు భ్రమరా?" అని మళ్ళీ ప్రశ్నించాడు మధు, సముద్రతరంగాలవలెనే నొక్కులు నొక్కులుగా వుండే ఆమె తల వెంట్రుకలను చూస్తూ.

భ్రమర బుగ్గలమీదినుంచి కన్నీళ్ళు జలజల రాలి చీరమీద పడ్డాయి. భ్రమర తల వంచుకుంది. ఆ దృశ్యం చూచి మధు దద్దరిల్లిపోయాడు.

"భ్రమరా ఏమిటది!"

అశ్రువుల తెరను చీల్చుకొని, ఆమె అనురాగ దృక్కులు మధుమీదికి ప్రసరించాయి.

"క్షమించు భ్రమరా, తెలియక అనవసరంగా నిన్ను దుఃఖింపచేశాను" అన్నాడు మధు మంద స్వరంతో.

"మధూ, నువ్వుకూడా ఈవిధంగా మాట్లాడు తున్నావా? నా హృదయాన్ని ఏవీ ఆకర్షించ లేదు, ఆకర్షించలేదు."

"మరి ఎంతకాలం ఈవిధంగా జీవిస్తావు భ్రమరా? మనసు ఏదోవిధంగా సమాధానపరచు కోవాలి. లేకపోతే ప్రపంచంలో జీవించడమే కష్టం."

"మధూ, నువ్వెన్నిమాటలు చెప్పినా నా మనసు సమాధానపడదు. నన్ను ఆకర్షించిన వస్తువు నా దైనప్పుడుగాని, నాకీ ప్రపంచంలో సుఖం లేదు."

"పోనీ ఆ వస్తువేదో చెప్పరాదూ?"

సముద్రం వెనకటికన్న మరింతగా ఉప్పొంగింది. అలలహోరు జాస్తయింది. చంద్రుడు తన చల్లని కిరణాలతో స్నేహితుల మనస్సులను కరిగించివేస్తున్నాడు. భ్రమరకు గుండె దడ జాస్తయింది. ఉప్పొంగిన సముద్రాన్ని చూస్తూ కంపితస్వరంతో "ఆ వస్తువు నువ్వే మధూ" అన్నది. పెద్ద అలవచ్చి మధు ధోవతిని తడిపింది.

"భ్రమరా?"

ఇద్దరి చూపులు కలుసుకున్నాయి. భ్రమర కళ్లలో అనురాగం వెలుగుతూంది. మధు నిర్విణ్ణుడైనాడు.

"నీ కోర్కె ఎంత విపరీతంగా వుంది!"

"నీ ఉద్దేశం నాకు మొదటనే తెలుసు మధూ. నీమనసు గాయపరచకుండా వుండాలని ఇంతకాలమునుంచీ ఊరుకున్నాను."

"భ్రమరా, ఇది సాధ్యమా అసాధ్యమా అనైనా ఆలోచించావా?"

"మానవులు సాధించలేని కార్యమేదో చెప్పు ఈ ప్రపంచంలో."

క్షణంసేపు నిశ్శబ్దం. అప్పటికే రాత్రి 9 గంటలైంది. గాలి విపరీతమవుతూంది.

"మనస్సును దానిష్టం వచ్చినట్లు వెళ్ళనిస్తే కష్టమేగాని సుఖంలేదు భ్రమరా."

దూరాన కన్యాకుమారీ ఆలయంలో గంటల నినాదం సన్నసన్నగా వినిపిస్తూంది.

"మధూ, నీ మాటలు నాకు తల కెక్కవు. ఏనాడో నేను ఈ నిశ్చయానికొచ్చాను. నా సుఖదుఃఖాలు, ప్రాణాలు అన్నీ నీ చేతిలోనే వున్నాయి. నేను వివాహం చేసుకుంటే నిన్ను తప్ప మరొక పురుషుణ్ణి చేసుకోను. ఇందుకు నువ్వు అంగీకరించకపోతే—" భ్రమర మొహం ఉద్రేకంతో ఎర్రగా కందిపోయింది, గొంతు కంపిస్తూంది.

"భ్రమరా, ఏమిటి నీ పిచ్చి?"

"ఆఁ, నాకు పిచ్చే పట్టింది. సాంతంగా ఓపికతో కాసేపు భరించు నా పిచ్చిని. నువ్వు అంగీకరించకపోతే ఈ క్షణమే ఈ పవిత్ర క్షేత్రంలో సముద్రుని ఒడిలో శాశ్వతంగా నిద్రిస్తాను."

"భ్రమరా, నా పరిస్థితి గమనించే ఈ శపథం తీసుకున్నావా?"

"ఆ. నీ పరిస్థితిని గమనించాను. నీ కంటే నాకే బాగా తెలుసు నీపరిస్థితి. సరోజ సంగతి నాకు బాగా తెలుసు. ఎందు కది మనతో రాలేదో కూడా తెలుసు" అన్నది భ్రమర.

మధు కల్లోల సాగరంలో పడిపోయాడు. ఇద్దరూ లేచి కన్యాకుమారి ఆలయం వైపు నడిచారు. గుడిలో పూజ జరుగుతూంది. వరించిన భర్త లభించక పోవడంచేత శాశ్వతంగా కన్యగా వుండిపోయిన త్రిలోకసుందరి ఈ కన్యాకుమారి. ఇద్దరూ వెళ్ళి ఆ దేవికి నమస్కారం చేశారు. మధు తన భర్త కావాలని, త్రికరణశుద్ధిగా అతణ్ణే వరించానని, తన కోర్కె నెరవేర్చమని కన్యాకుమారీ దేవిని భ్రమర మరీమరీ వేడుకుంది.

నాల్గురోజుల తర్వాత స్నేహితు లిద్దరూ మద్రాసుకు వచ్చారు. రెండు మూడు రోజుల తర్వాత భ్రమర మధుని సాగనంపింది. భ్రమర ఆనందాకాశంలో విహరిస్తూంది. మధు కల్లోల సాగరంలో మునిగి తేలుతున్నాడు. ఇతి కర్తవ్యతామూఢుడై కొట్టుకుంటున్నాడు. భ్రమరను పెండ్లాడితే సరోజకు ద్రోహం చేసినవాడౌతాడు. పెండ్లాడకపోతే భ్రమర ప్రాణాన్ని బలిగొన్నవాడౌతాడు. ఈ అయిదారు రోజుల నుంచీ పైకి సంతోషంగా వున్నా మధు మనస్సు చాలా బాధపడుతూనే వుంది. ఒక్కొక్కసారి

బాధానివారణకు మరణమే మార్గమనుకుంటాడు. కాని చచ్చి ఏం సాధిస్తాడు! రైలుబండిలో పోయేది అతడి శరీరమే. మనస్సు అంధకారంలో ఎక్కడో విహరిస్తోంది! రైలు చాలా వేగంగా పరుగిడుతోంది.

రాత్రి 12 గంటలైంది. అప్పుడే చంద్రాస్తమయం కూడా అయింది. అంతా గాఢాంధకారం. రైలు ఒక్కొక్కటే స్టేషన్లను వెనక వేసుకుపోతూంది. ఉన్నట్టుండి భూమ్యాకాశాలు బద్దలయేటంత శబ్దం. రైలుపెట్టెలన్నీ బోర్లగింతలైనాయి. క్షణంలో కొన్ని వందల ప్రాణాలు ఎగిరిపోయినాయి.

మర్నాడు పొద్దున వార్తాపత్రికల్లో రాత్రి ప్యాసెంజరు గూడ్సుబండితో ఢీకొన్నట్లు, వందలాదిగా చనిపోయినట్లు వార్త వచ్చింది. మరునటి రోజు పత్రికల్లో చనిపోయినవారి పేర్లను ప్రకటించారు.

భ్రమరా, సరోజ లిద్దరూ మధుసూదన్ పేరు అందులో చూశారు.

భ్రమర జీవచ్ఛవంగా బ్రతుకుతూంది. ఆమె తల్లిదండ్రులకు భ్రమర కథలు ఏమీ తెలియవు. ఆమెలో విపరీతమైన మార్పుకు స్నేహితుని మరణమే కారణమని వారు అనుకున్నారు. పెండ్లి ఈ దుఃఖాన్ని బాపుతుందని భ్రమరను పెండ్లి చేసుకోమని తల్లిదండ్రులు బలవంత పెట్టసాగారు. భ్రమర వివాహ విముఖురాలని వారింకా బాగా గ్రహించలేదు. ఇట్టుండగా ఒకనాడు భ్రమరకి కవరు వచ్చింది. లోపల రవి సరోజల వివాహాహ్వాన పత్రిక, వివాహానికి రమ్మని ప్రాధేయపడుతూ ఉత్తరము వున్నాయి. భ్రమర కిదొక అపూర్వ సృష్టివైచిత్ర్యంగానే కనిపించింది. కొన్ని రోజులవరకూ నమ్మలేకపోయింది. రవి సరోజల ప్రవర్తన భ్రమరకు పట్టరాని దుఃఖాన్ని కలిగించింది. అనారోగ్య మనే మిషమీద రాలేనని, వివాహమైన వెంటనే వారిద్దరికీ తన ఇంటిలో విందు చేస్తానని, దంపతు లిద్దరు ఆ విందుకు తప్పక రావలసిందని భ్రమర తిరుగు టపా రాసింది.

* * *

విందు ముగిసింది. దంపతులతో భ్రమర తోటలోకి వచ్చింది.

"భ్రమరా, నీపరిస్థితి ఏమిటో చాలా విచిత్రంగా వుంది" అన్నది సరోజ

"ఏం విచిత్రం కనిపించింది సరోజా?" అని నవ్వుతూ అన్నది భ్రమర.

"ఈ బ్రహ్మచర్యం ఎంతకాలం! ఈ కారణంగా నీ తల్లిదండ్రు లెంత క్రుంగిపోతున్నారో గమనించావా!" అన్నది సరోజ.

"నువ్వు వివాహం చేసుకుంటేగాని వారికి సుఖంలేదు. ఆ విధంగానైనా నీ తల్లిదండ్రుల ఋణం తీర్చుకో భ్రమరా. నీకు అన్నివిధాలా సరియైన వరుడు సిద్ధంగా వున్నాడు." అన్నాడు రవి.

"రవీ, ఎవరో ఒక పురుషుణ్ణి కట్టుకొని సంసారం చేస్తూ, బిడ్డల్ని కంటూ ఉండాలనే ఆశ నాకు లేనేలేదు ఆ ఆశే నాకుంటే ఏనాడో నా వివాహం జరిగివుండేది." అన్నది భ్రమర, గాలికి మొహంమీదపడి రాసుకునే ముంగురులను పైకి తోస్తూ.

"పోనీ నీకునచ్చిన పురుషు డెవరో చెప్పరాదూ, అతన్నే ఇచ్చి నీకు పెండ్లిచేస్తాము." అన్నది సరోజ కొంటెగా నవ్వుతూ.

"అటువంటి వాళ్లెవ్వరూ లేరు సరోజా."

"ఇక బ్రహ్మచర్యమేనా గతి?"

"అది చాలా అసభ్యంగా తోస్తూందా నీకు సరోజా?"

"లేకుంటే, పెండ్లి చేసుకోకుండా ఏం చేద్దామని, నీ ఉద్దేశ్యం!"

"కన్యగానే వుండి దేశసేవ చేస్తాను"

"ఏం పిచ్చి పట్టిందే భ్రమరా నీకు?"

"నన్ను ఆమాట అనని వాళ్లే లేరు సరోజా" అన్నది భ్రమర నవ్వుతూ

"భ్రమరా-నేనొకటి అడుగుతాను, హృదయం విప్పి చెప్తావా!" అన్నాడు రవి. తల ఊపింది భ్రమర.

"నీలో ఈమార్పు రావడానికి మధుసూదనేనా కారణం!" అన్నాడు రవి. భ్రమర కళ్లలో నీళ్లు తిరిగినట్లయింది. ఆమె సమాధానం చెప్పలేదు.

# ఉత్తమాట

## సూరంపూడి భాస్కరరావు

ఉత్తమాట! వెన్నెల, సెల,
ప్రశ్నోత్తరాల కన్నులవల,
చిరుమెత్తల తెలిపొనుపు లోపలి కల,
ఆకాశపు తునిపీడల నీలిమ తళతళ!
లోకంలో జీవించే లోభికి
ఒక ప్రియురాలా!
ఆకలితో శోషిస్తే ప్రాణికి
ఒక చిరునవ్వా!
మందారం మకరందం దాచిందా? విరిసిన
మందారం ఉత్సాహం చూపిందా?
మంచుముద్ద చంద్రుడు ఇతరుల
మంచిమీద జీవించిన నిస్స్వవుడు!
మధ్యాహ్నపు మణిదీపపు వేడిమి
మన లోకపు రుచి మారిన సత్యం!
పాటల మాటల అర్థం నేటికి
పడిపోయిన గతకాలపు భూతం!
నాలో
లోలో
చనిపోయిన మంచితనం
మనజాలని ఆనందం
ఈనాటికి ఉత్తమాట!
బాధలు శ్వాసిస్తూ, ఎండకు
ఎండిన ఈ ప్రాణాలను తడిచేస్తూ,
మాటలలో చాటుచేసి నిస్సత్తువ దాచేస్తూ,
తెలివెలుగున బ్రతకాలని పుస్తకాలు తిరగేస్తూ,
“సీతను’ పతిభక్తపు కమ్మని బాధిస్తూ,
బాధిస్తూ బాధలు శ్వాసిస్తూ,
నాకైతే స్వర్గం కావాలని
పెంకివాడి మంచుపట్టు సాగిస్తూ
ఆశ వెనుక ఆవేశం పేరుస్తూ,
నిజం కాని అబద్ధాలు పేరుస్తూ,
పోతూ-యాలా-యానాటికి ఉత్తమాట!
అద్దంలో చూచావా నీ అందం?
నిద్దట్లో పొందావా ఆనందం?
నిద్దురపో బ్రతుకంతా, బ్రతుకే
నిద్దురపో త్వరగా.
పాపం, పసి బారల కొండచిలువ దేహం!
దానిమీద జీవించే అయిదడుగుల నిలువుపాటి
జంతువు,
పాపం పసిమేకల భక్షించే వ్యాఘ్రం!
దానివెనుక వేటాడే జంతువు,
ఒకరివెనుక ఒకరిని వేటాడే జంతువు
ఇప్పుడైనా అద్దంలో చూచావా?
బ్రతుకంతా వెతుకులాట!
వెతుకులాట ఫలితం ఒక మృత్యువు!
మృత్యువు కనుపించని శూన్యం!
శూన్యం భయపెట్టని సత్యం!
బ్రతుకంతా నిద్దురపో, యీ
బ్రతుకే నిద్దురపో త్వరగా.
“నే చంపిన చిన్నతల్లి తానే
నన్ను చంపితింటుం దొకనాటికి”
వెతుకులాట నడికుప్పను దూలం
విరిగి తలలు పగిలించకముందే
“పిచ్చివాడి మాటలు సత్యం
పిచ్చితనం లోకపురూపం”
అని మనసులు హోరెత్తక ముందే
గుండెకాయ టపాకాయ ఠాం! ఠాం!
బ్రతుకంతా అమావాస్య ఠాం! ఠాం!
దీపావళి దీపావళి ఠాం! ఠాం!
అని పిచ్చిగాడు వీధుల్లో
ధ్వని చేయకముందే—
నిద్దురపో బ్రతుకంతా, నీ బ్రతుకే
నిద్దురపో త్వరగా!
ఉత్తమాట!

# పరచింతన

"హితశ్రీ"

ఆకాశం నల్లచీర ధరించింది. చీకటి చిదంబర రహస్యం తెలుసుకోవాలని కాబోలు రహస్యంగా తలుపుల సందుల్లోంచి దీపాలు తొంగి చూస్తున్నాయి. నిర్ణీతసమయానికి ముందే అవతరించిన చీకటిని పారద్రోలటానికి హోరుగాలి వ్యర్థ ప్రయత్నాలు చేస్తూ తన నడ్డగిస్తున్న కిటికీ రెక్కలమీద కసి తీర్చుకుంటోంది. 'నీకోసం ఎంతో దూరంనుంచి వొస్తున్నా' నంటూ వరుణుడు ధరిత్రిని చల్లని పెదవులతో ముద్దిడుకుంటున్నాడు. కప్పులో కాఫీ పోస్తున్న నన్ను వర్షబిందువులు పలకరించగా కిటికీ తలుపులు మూయటానికి వెళ్లి నిశాంగన గంభీర వదనావలోకనంతో స్తబ్ధుడనై నిలబడ్డాను. ఇంతలో మెరపు మెరిసింది. పరకాయించి చూశాను. అది ఒక స్త్రీమూర్తి. తలుపు తీశాను.

'తడుస్తున్నారు. ఇలా లోపలికి వచ్చి కూర్చోండి.' అన్నాను. ఆ అమ్మాయి కృతజ్ఞతగా చూసి లోపలికివచ్చి కుర్చీలో కూర్చుంది. చేతిలో పుస్తకా లున్నాయి. కాలేజీలో చదువుతున్నట్టుంది.

'అమ్మాయి, అబ్బాయి కథ అల్లుతున్నాడ్రోయ్ మనవాడు.' అన్నాడు స్నేహిత బృందంలో ఒకడు.

'అల్లిక బాగుంటే సరి, ఏదో ఒకటి.'

'వినేందుకూడా మీరు పనికిరారు.' అన్నాడు రామేశం కోపంతో.

'నీ ప్రేమకథ లెవడి క్కావాలిరా, లేకపోతే!'

'అయితే నువ్వు చిన్నప్పుడు క్లాసులో బెంచీ ఎలా ఎక్కిందీ చెప్పాలి కాబోలు.' పక్కన నవ్వారంతా.

'కానీరా రామేశం, వాడితో ఏమిటి?' అన్నాడు ప్రేమకథలంటే చెవికోసుకునే మరో స్నేహితుడు.

'అకస్మాత్తుగా వచ్చింది వాన. ఇంకో పది నిమిషా లాగితే ఇంటికి చేరుకునేదాన్ని.' అంది ఆమె.

'ఇప్పుడు మాత్ర మేం లెండి. వాన వెలిసిం తర్వాత నెమ్మదిగా చేరుకోవచ్చు' అన్నాను.

'మీకి బ్బందిగా ఉంటుందేమో—'

'అబ్బె.'

కప్పులో కాఫీ రెండుభాగాలు చేశాను. ఎంతో బలవంతంమీదగాని ఆమె తాగలేదు. శీతలవాయు ప్రసారం వేడివేడి కాఫీకి కొత్తరుచి ఇస్తోంది.

'అది కాదు కారణం—'

'నోరు ముయ్యి.'

'మీరు కాలేజీలో చదువుకుంటున్నారా?' ముభావంగా ఉంటే బాగుండదని సంభాషణకి దిగాను.

'అవునండి. ఇంటర్మీడియేటు చదువుతున్నాను.'

'మీ—'

'ఉషాదేవి.' భావం గ్రహించి అందుకుందామె.

'అలాగా?' తర్వాత ఏం మాట్లాడాలో తోచలేదు. అసహ్యంగా ఉన్న నిశ్శబ్దాన్ని ఆమే ఛేదించింది.

'మీరుకూడా చదువుతున్నారా?'

'లేదండి.' నాపేరూ, ఊరూ, ఉద్యోగమూ అచ్చుకొట్టిన కాగితం ఒక టందించాను.

ఆమె గదిచుట్టూ కలయచూసి అంది. 'అద్దె గది కాబోలు.' 'అవు' నన్నాను. పారిపోయిన నిశ్శబ్దం మళ్లీ వచ్చింది. నాలాంటి వాచాలుడికి ఆసమయంలో నోరు మెదలకపోవటం చూస్తే ఆశ్చర్యంవేసింది. గంటల తరబడిగా తెలిసిన వాళ్లతో కూడా టకటక మాట్లాడేవాడు అవ్యక్త స్త్రీ అయినంతమాత్రాన నోరు కట్టుబడి

పోవట మేమిటి? ఇదంతా మనస్సు కల్పించు కున్న కృత్రిమ వాతావరణంలా కనపడ్డది. ఇత రులతో మాట్లాడినట్టుగానే ఆమెతో మాట్లాడా లని ప్రయత్నించాను. సంభాషణ సాగుతున్న కొద్దీ ఆమెకూడా చనువుగా అనవసరమైన సిగ్గును అడ్డుపెట్టుకోకుండా మాట్లాడ సాగింది. రాజకీయాలు మాట్లాడాం. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం తక్షణం జరగాలని తీర్మానించాం. కాశ్మీర్ విషయంలో బ్రిటన్, అమెరికాలు చిత్తశుద్ధితో వ్యవహరించడంలేదని అనుమానించాం. అరబిక్ అంకె లుపయోగించడమే ఉత్తమం అను కున్నాం. జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు సింహావలోకనం చేశాం. తర్వాత సాంఘిక విషయాలు మాట్లాడాం.

'ఇంత చిన్న వయస్సులోనే మీకు చాలా విషయాలు తెలుసు' అన్నాను ప్రశంసాపూర్వ కంగా ఆమెవైపు చూస్తూ.

'అన్నీ వొచ్చు, ఏదీ రాదు' అని నవ్వింది. నవ్వి, 'అంటే' అన్నాను.

'అంతా పైపై విజ్ఞానమే. ఏదీ క్షుణ్ణంగా రాదు. అయినా, రోజులు అలాంటి వారివే లెండి.'

నవ్వాను. మాగది బయటి తలుపుకి ఎదురుగా లోపలి భాగంలోకి వెళ్లే తలుపుదగ్గర ఎవరో తుమ్మారు. ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది ఉమ. తలుపుదగ్గర అలికిడీ, చిన్నగా నవ్వులూ వినిపించాయి.

'మీరు పత్రికలు చదువుతా రనుకుంటాను.'

'ఏవో కొన్ని చదువుతాను. వొస్తున్న పత్రిక లెక్కువే ఐనా చదవతగ్గ వెన్నో లేవు.' ఫలానా ఆయన ఎలా రాస్తాడని అడిగితే ఆయన కేమీ రావంది. ఫలానా ఆయన గొప్ప రచయిత అంది. 'ఇవన్నీ నా స్వంత అభిప్రాయాలే, వాళ్ల రచనలే నా ఊహాశక్తికి గీటురాళ్లు కావొచ్చు, నాకంతా తెలుసని చెప్పటంలేదు' అంది. ఆమె అభిప్రాయా లెలా ఉన్నా ఆమె మాట్లాడే ధోరణి చూస్తే ముచ్చట వేసింది.

'మీ విలువైన కాలమంతా పాడుచేస్తున్నాను.'

'కాదు. కాలంకి విలువ తగ్గిస్తున్నారు.'

'వ్యాఖ్యానం కావాలి.'

'మనం చాలాసేపు మాట్లాడాం. అయినా విసుగు కలిగించే ప్రభావం కాలంకి లేదు.'

'అయితే నేను కాలంకి శత్రువునా!'

ఇద్దరం నవ్వాం. తలుపుదగ్గర మళ్ళీ అలికి డయింది.

'కొంతమందికి రహస్యంగా మాటలు వినటం హాబీ.' నెమ్మదిగా అన్నాను

'గట్టిగా మాట్లాడండి. విని ఆనందించేవా ళ్ళున్నారు.' అంది ఉమ. నాకు కొంచెం చిన్న తనమనిపించింది. ఉమ గదంతా కలయ చూసింది.

'ఏం కావాలి?' ఆమె మాట్లాడలేదు.

'ఏమిటి చూస్తున్నారు?'

'ఈ గదంతా ఇలా బూజుకట్టి ఉంటే ఎలా ఉంటున్నా రీ ఇంట్లో?' అంటూ ఉమ లేచి తలుపుచాటున ఉన్న చీపురు తీసుకుని బూజు తుడవటం ఆరంభించింది.

'అయ్యయ్యో...మీరు తుడవటమేమిటి? అలా ఉంచండి చీపురు...' అంటూ చీపురు అందుకో టానికి లేచాను. ఇంతలో ఆమె హఠాత్తుగా చీపురుపుల్ల ఒకటి తీసి తలుపు కంతలో గుచ్చింది. తలు పవతల కెవ్వుమని కేక వినిపించింది.

'అంతట రాజకుమారుడు ఆర్తనాదము విన వచ్చిన దిక్కుగా ఖడ్గహస్తుడై హుటాహుటిని బయలు దేరెను.

'అచ్చటేమియు గానరాక రాజకుమారుడు తిరిగిరాగా ఆ సుందరాంగి కన్పట్టదాయె. అప్పు ట్టున రాజకుమారుడు ఘోరున విలపించుచు నిట్లనె: కష్టా, కష్టడి దైవంబు చేసునవచ్చు. ప్రేయసీ, నేను లేనితరి ఏవన్య మృగంబు బారిబడితివోగదా, ఏ ముష్కరుడు నిన్ను దస్కరించెనోగదా. హా. ఇంక నేను బ్రతికి...' నాటక ఫక్కీలో అభినయపూర్వ కంగా అంటున్న మిత్రుడి జుట్టు పట్టుకున్నాడు రామేశం.

'అవును. నువ్వు బతికి ఏం లాభంలేదు. చావు.'

'కానీరా, రామేశం. ... కథ.'

దిగ్భ్రమతో అతనివైపు చూసి అన్నాను.

'ఏం చే...

'ప్రాయశ్చిత్తం. ఈ చుట్టుపక్కల కళ్ళ డాక్టరెవరైనా ఉన్నాడా?'

'ఆ.'

'ఇంకేం, ఆయన అదృష్టం పండిందన్న మాట.'

కాని చాలా చిక్కుపని చేశారు. కేసు పెడితే—?'

'మీరు సాక్ష్యం ఇస్తారా వాళ్ళతరఫు!' అన్నాను. కాని నాకు దిగులుగానే ఉంది. ఈ ఇంట్లోంచి నాకు ఉద్వాసన జరుగుతుందన్న దానికి సందేహ మేమీ లేదు. మళ్లీ గదులకోసం తిరగ డం ప్రారంభించాలి. నా వాలకం కనిపెట్టి నట్టుందామె; అంది, 'క్షమించండి, మీకు చాలా ఇబ్బంది కలిగించాము. కాని అలాంటి మనస్తత్వం గలవాళ్లకి జరగవలసిన శిక్షకి ఎక్కువేమీ జరగ లేదు.' 'ఫరవాలేదు లెండ'న్నాను. ఇంతలో పక్కగదిలో అలజడి వినపడ్డది. 'హుం, వీళ్లని బజారు కీడవకుండా వదలి పెడతానా?' అని అరుస్తున్నాడు ఇంటి అసామీ. మరు క్షణంలో మాగది తలుపులు తపీమని మూసుకున్నాయి. గొళ్లెం పెట్టారు. నాకు ముచ్చెమటలు పోశాయి. బయటికి వెళ్లటానికి అదొక్కటే దారి. 'ఏమిటి చేయటం' అన్నట్టుగా ఆమెవైపు చూశాను. 'నీచులు' అందామె వొణుకుతున్న పెదవులతో. ఆమెకళ్లలో నీళ్లు గిర్రున తిరగటం గమనించాను. 'తిరస్కారిణీ విద్యలాంటి దేదైనా వస్తే ఎంత బాగుణ్ణు?' నాలో నేను గొణుక్కు న్నట్టుగా అన్నాను. ఆమె పెదవులు చిన్నగా నవ్వాయి. వాన వెలిసింది. భరించలేని నిశ్శబ్దం ఆవరించి పరిస్థితిని మరింత దుర్భరంగా చేస్తోంది.

బయట సవ్వడి వినిపించింది. మాటలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి. ఇంతలో తలుపులు ఠప్పున తెరుచుకున్నాయి. 'చూడండి– బయటికి పెద్ద మనుష్యులు, కిటికీలు తలుపులూ మూసుకుని వీళ్ళుచేసే పని ఇది.' ఉక్రోషంతో వైద్యం అంతా వొలకబోస్తూ ఇంటి అసామీ హేళనగా అన్నాడు. పక్కన ఇద్దరు పెద్ద మనుష్యు లున్నారు.

'ఇక్కడున్నావా అమ్మాయ్! వర్షానికి [illegible] కాలేజీలోనే ఉండిపోయావేమో నని కాలేజీకి వెళ్తున్నా. సరి–వానదగ్గరికే చేరా వన్న మాట... మా అమ్మాయేనండి. వాడు మా చెల్లెలి కొడుకే. ఇద్దరికీ వివాహం ఏనాడో నిశ్చయమైపోయింది. పాపం, మీరనవసరంగా శ్రమపడ్డారు. ఒరేయ్, నా కార్డు పని ఉండి అలా వెళ్తున్నాగాని దాన్ని కాస్త ఇంటిదాకా దిగపెట్టిరా— సెలవు, వొస్తానండి.' పక్క వాళ్ళని మాట్లాడనీయకుండా ఏక టాకిని అడేసి రెండో ఆయనతో సహా నిష్క్రమించాడా పెద్దమనిషి. నా కంతా అయోమయంగా ఉంది. ఇంటి అసామీ కన్ను నుసుముసుకుంటూ చిర్రు బుస్సుమని లోపలి కెళ్లాడు.

'మీ నాన్నగారా?'

'కాదు!' ఆమె నావైపు ఆశ్చర్యంగా చూసి అంది. 'అయితే ఆయన మీ మామయ్య కాదా!'

'మా మామయ్య ఎలా అవుతాడు! ఆయ న్నెప్పుడూ నే నసలు చూడనే లేదు' అన్నాను ఆశ్చర్యంగా ఆమెవైపు చూసి.

'తమాషాగా ఉంది. ఆయనకి మనం చాలా ఋణపడ్డాం. పరిస్థితి గ్రహించి ఎంతో ఉదారంగా ప్రవర్తించాడు.'

'అనవసరంగా ఇతరుల విషయాల్లో జోక్యం కలిగించుకుని ఎప్పుడూ తప్పులువెదికే వాళ్ళకి గొప్ప గుణపాఠం చెప్పాడు. ఇంకా ఇలాంటి వాళ్ళుండటం చేతే సంఘం పూర్తిగా కుళ్ళి పోలేదు.'

ఈ అనుమాన రోగపీడితులు సంఘానికి చీడ పురుగులు. ఎన్నో లేతహృదయాలను కలిచివేసిన ఈ పురుగుల కిలాంటి పరాభవాలు జరిగితేగాని సంఘానికి క్షేమంలేదు.' అవు నన్నట్టు తలూ పాను.

'తర్వాత.'

'ఇంకా తర్వా తేమిటి? ఐపోయింది.'

ప్రేమకథల ప్రియుండి నోరు "చపట" అందా మనుకుందిగాని మెదడు వొద్దంది.

'అలా దేబె మొహాలేసి చూస్తారేం!' అన్నాడు రామేశం. కిమ్మన లేదు స్నేహిత బృందం.

గాంతెమ్మ కోరికలు

# రైలుప్రయాణాలు రాణించాలంటే-

'సనకసనందన'

ఇండియా రైల్వేశాఖ స్టేట్ మంత్రి శ్రీ కె. సంతానంగారు దక్షిణదేశ పర్యటనంలో తిరుచిరాపల్లి పట్టణంలో యిటీవల పౌరసన్మాన వినతిపత్రాలు స్వీకరించారు. పురప్రముఖులు త్రివేంద్రం ఎక్స్‌ప్రెస్‌ను ఆ వూరిలో ఆపి వారి వార్తాపత్రికలను అందులో దిగుమతి చేయించమని వేడికోగా, ప్రక్కనున్న విజ్ఞుడు - చీఫ్ ట్రాఫిక్ మానేజరు (యస్. ఐ. రైల్వే) శ్రీ సిడ్నీ స్మిత్తుగారు ఈ బండిని యింకా వేగంగా నడిపించే ప్రయత్నానికి అంతరాయం కలుగుతుందని అంటూంటే, శ్రీ సంతానంగారు "ఫరవాలేదు, నగుఆలోచన చేస్తాం - వార్తాపత్రికల కట్టలు బండి వెళ్లుతూండగా తిరుచిరాపల్లి టవునులో పడవేసేటట్లు చేస్తాం" అన్న సమాధానం చూస్తే శ్రీ గవర్నమెంటు ప్రజల మొరలు బాగ ముందడుగు వేసుంటలేదని ఎవ రనగలరు?

అలాగే మూడుగానుల కార్డు మదరాసు నుంచి చీరాల రావడానికి మూడురోజులు పట్టుతూంది - విమానం ఎక్కుతున్నారు గనూ - అనే మొర వారిచెవిని పడినట్లయితే, ఆ వూరి టపా కట్టగూడా విమానంనుండి సరాసరి చీరాలలో పడవేసే ఏర్పాటుచేసి ఉండేవారేమో!

ప్రతీదీ ప్రభుత్వాన్ని చేయమంటుంటే ఇలాగే మంత్రాలకు మామిడికాయలు రాలుతూన్నట్లుంటాయి!

ఈ సందర్భంలో ప్రభుత్వం చేయవలసింది కొద్ది. ప్రజలు చేసుకోవలసింది కొండంత. రైళ్లు, రైళ్ళు నడిచే సరంజామా అంతా ఇవ్వవలసింది ప్రభుత్వం. వాటిని సక్రమంగా ఉపయోగించుకొని అనుభవించవలసింది ప్రజ - ఆ బాధ్యత ప్రజలది.

ఇరవైమంది కూర్చునే పెట్టెలో యాభైమంది కూర్చున్నారంటే ఆ పనిని అరికట్టడం ప్రభుత్వం తరమా? ఇప్పటికే ప్రభుత్వాన్ని అతి స్వల్పవిషయానికే దుమ్మెత్తిపోసేవారు బహుళమవుతూంటే రైలు ప్రయాణాలలోనూ తుపాకి మందులు, తూటాలు కావలసివస్తే తప్పెవరిది!

చుట్టా బీడీ సిగరెట్ల పొగలు, నారింజ అరటి పండ్లతోళ్ళూకలు, వేరుశనగబటానీల పొట్టులు, ఉమ్ములు ఇత్యాదులతో, రైలు వాసనకొడుతూందంటే, 'ప్యాసింజర్లు' కంటె 'స్కావెంజర్లు', 'రన్నింగు టైము' కంటె 'క్లీనింగు టైము' ఎక్కువ చేస్తే తీరుతుందా, ప్రజలు సక్రమంగా రైళ్ళను ఉపయోగపర్చుకుంటే తీరుతుందా?

బిచ్చగాళ్ల పాటలు అరుపులు, వ్యాపారస్థుల వేరులమార్కెట్లు కేకలు,- ఇంకా వారి 'చేతి దెబ్బలు', జేబు కత్తిరింపులు-పైగా నెత్తిమీద బియ్యపుమూటలు !- బాబో, భిక్షుకులను తోలివెయ్యటమే! బియ్యపు మూటలను ఆపటమే! అలా చేసినవాడికి మానమర్యాదలు దక్కనిస్తారూ మన సహస్ర ప్రయాణీకులు!

ఇలాంటి విషయాల్లో మార్పు రావలసింది ప్రజలలో. విజ్ఞానం విరియవలసింది ప్రజలలో. దీనికి తర్కవితర్కములు, పరస్పర నిందారోపణలు పనిచెయ్యవు.

నేటికీ భారత సామాన్య ప్రజానీకం ప్రతి విషయములోనూ ఎంతో వెనుకపడి ఉన్నది; అందు ముఖ్యముగా 'పబ్లికు కన్‌సరన్సు'ను వాడుకోడంలో పెక్కుచోట్ల మిక్కిలి శోచనీయంగా, అమానుషంగా కూడా ప్రవర్తిస్తోంది. దీని కంతటికీ కారణం సాంఘిక దృష్టి లోపించడం.

ప్రయాణ విజ్ఞానాన్ని ప్రజలలో వెదజల్లుటకు పత్రికలు అన్నీ ప్రయత్నించాలి. ప్రయత్నించడమే కాదు, విధిగా నిత్యమూ చేసి తీరాలి. ప్రతి నాటకసంస్థా ఈ విజ్ఞాన నాటకాలను నియమబద్ధంగా ఆడితీరాలి. ప్రతి సినిమా ప్రొడ్యూసరు ప్రతి ఫిల్ములోను కొన్ని అడుగులు ఈ విజ్ఞానవ్యాప్తికి జాగా ఇచ్చి తీరాలి

కవులు దీనినే కథావస్తువుగా స్వీకరించాలి. చిత్రకారులు యథాతథంగాను, వ్యంగ్యం గాను బొమ్మలు గీసి మానవమనస్సులకు సహితం హత్తుకొనేలా చేయాలి. వ్యాసరచయితలు, విజ్ఞానవేత్తలు, అభ్యుదయ సంఘాలు కృషి చేసి భారత ప్రజలమీద ఈ ముద్రను ముద్రించివేయాలి. విద్యాసంస్థలు, విద్యాధికారులు వారి పరీక్షలలో ఈ ప్రయాణ విజ్ఞాన పాఠ్యాన్ని జోడించి బిడ్డలకు బాల్యమునుండీ దీని విల్లుకట్టు కొని ఊదివేయాలి. నేటి ఎలక్షను 'కాంపెయిన్' ల కంటే ముందు ఈ విజ్ఞాన 'కాంపెయిన్' లను లేవదీయాలి. మొన్నటి స్వాతంత్ర్య దినోత్సవం వేడుకలు చూడడానికి బాల్య యౌవన మధ్యస్థ కిశోరులు కట్టలు కట్టలుగా ఆ బండికి వెళ్ళి విజయవాడకు, ఈ బండికి చుట్టలు చుట్టలుగా స్వాతంత్ర్యసిద్ధి చేసుకుని ఎగారే టిక్కెట్టు లేకుండా! ఇలాంటి తండాలలో ఆ బాలుడు చేరగలడా? టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయడం తన తల్లిని మోసగించడం అనే నగ్నసత్యాన్ని విస్మరించి ఉన్నాడు గాదా? తోడిబాలుర ఈ అనీతికి కుమిలిపోడా? ఈ విధంగా పురాణాదులనుండి విజ్ఞానాన్ని పునర్నిర్మాణము కొండంతలుగా చేసుకోవలసింది మన కర్తవ్యం.

ఇంకా ప్రభుత్వమూ చేయవలసిన దుంది. లేదనను. నేడు ప్రయాణం ప్రజల అవసర సౌకర్యాలకు ప్రభుత్వం, ప్యాసింజరు గైడులు 'ప్లాటుఫారం గైడులు, ట్రెయిన్ కండక్టరులు అనే కొత్త ఉద్యోగుల్ని నియమించింది. టిక్కెటు కలెక్టరులను అధికం చేసి ప్రతి బండికీ ఉండేలా చేసింది. ఆ ఉద్యోగులు కృషి చేస్తున్నారు కాని ఫలితాలు పైకి రావడంలేదు. మితిమించిన ప్రయాణీకుల అవకతవకల్లో అది అడవిని గాచిన వెన్నెలవుతోంది.

పైగా ప్రభుత్వం నేడు తెచ్చిపెట్టిన ఈ నూతనోద్యోగులకు వారి విధులను ఏర్పరచుటలో తప్పు చేశారు. ట్రెయిను కండక్టరులను ట్రెయినులోని ఫిటింగ్సు, సీట్సుకు వేసే పైనవు పట్టాలు వగైరాలను తమ కాపలాలో ఉంచుకోమన్నారు. 'ప్యాసింజరు గైడు' లను ప్రయాణీకులకు ఇబ్బందులు కలుగకుండా వారివారి తరగతులకు 'గైడు' చేయమన్నారు. టిక్కెట్టు కలెక్టర్లను వారి పనులతో వారిని వ్యవహరించమన్నారు.

ఈ ఉద్యోగులందరకు నైతికసూత్ర రీత్యా ప్రజాసేవకులనే ఉమ్మడిబాధ్యత వినా విడివిడిగా ఉద్యోగధర్మాలను ఏర్పరచడమైనది. ఇది చాలా పొరబాటు, కార్యానుసరణ దృష్ట్యా.

ఈ త్రివిధ ఉద్యోగుల బాధ్యతలను కలిపి ప్రతి ఒక్కొక్కరికి అన్ని పనులు చేయుటకు సమానబాధ్యత ఇచ్చి పెట్టెకు ఒకరిని ఏర్పరిస్తే అమోఘమయిన సత్ఫలితాలు కలగవచ్చు. ప్రజలకు ప్రయాణసౌఖ్యం నిండురూపంలో ఇవ్వవచ్చు. ఏ పెట్టెకయితే తాను బాధ్యుడుగా ఉన్నాడో ఆ పెట్టెలోని ప్రతివ్యక్తినీ తన చూపులో ఉంచుకుని టిక్కెట్టు లగేజీ వగైరాలు తణిఖీ చేసుకుంటూ, ఫిట్టింగ్సు వాటిని వాచ్ చేస్తూ, ఎక్కే దిగే వారికి సకాలంలో 'గైడెన్సు' ఇస్తూ నిజమైన ప్రజాసేవకుడు తానేనని నిరూపించ వచ్చు. పెట్టెలు మార్కెట్టులు గాకుండా తాను ద్వారంలోనే ఉండి ఎన్నో సత్ఫలితాలను కలిగించవచ్చు.

ఇరవై ఇద్దరు ప్రయాణం చెయ్యగల రోడ్డు ట్రాన్సుపోర్టు బస్సు ఓనరు ఒక కండక్టరు ద్వారా తాను లాభంపొంది ప్రజలకు ప్రయాణ సౌఖ్యం ఇస్తుండగా, 150 మంది పయనించే రైలు ట్రాన్సుపోర్టు పెట్టె ఓనర్సు ఒక నూతనోద్యోగిని నియమించి ఫలితం పొందడం అసంభవం కాదు.

ప్రభుత్వం ఈ సూచనను మచ్చుకు మదరాసు విజయవాడల మధ్య ఒక వారంరోజులు మెయిళ్లలోగాని, ప్యాసింజర్లలో గాని ఆచరణలో పెట్టి ప్రయత్నించి అనుసరణ యొక్క అవసర అనవసరాలు, ప్రజాహితాహితాలు తేల్చుకుంటారా?



కథానిక

# రక్త సంబంధం

అవసరాల రామకృష్ణారావు

బూజాలతో నిండిన దూలాలు, మాసిపోయిన నల్లటి గోడలు, పడిపోయిన గుమ్మాలుగల ఆ ఇంట్లో వీధి వసారాలో నిలబడింది శారద. అవును, తన కంతకన్న అర్హతేమిటి? అన్నిట్లో గాలించగా గాలించగా చివరికి 6 రూపాయిలకు యీ కొంప దొరికింది. అయినా తినడానికంటూ ఇంతవుంటే ఏచెట్టు నీడయినా పడుకోవచ్చు.

చిరిగిన గ్రాఫింగుతో, చిరిగిన చొక్కాతో చెమటలో మునిగిపోయి ఉద్యోగంకోసం ఊరంతా తెగతిరిగి తన మగడు మధ్యాహ్నం పది కొండు గంటలకి వస్తే గుప్పెడు అన్నం పెట్టలేక పోయింది. తనేం చెయ్యగలదు? చదువుకున్న వాళ్ళకే ఉద్యోగాలులేని ఈ రోజుల్లో యింటరయినా ప్యాసవని తనమగడికి ఎవరు ఉద్యోగం యిస్తారు? ఎక్కడ తిరుగుతున్నారో, ఎవర్ని పట్టుకున్నారో-శారదమగని కోసం నిరీక్షిస్తోంది.

"ఏమమ్మా శారదా, మా వాడింట్లో లేడు కదా!" 60 ఏళ్ళు దాటిన తన మామగారు అలా వచ్చారు.

"లేరండి ... కూర్చోండి" తలుపు వెనకాల చింకిచాప తీసి వేసింది, శారద.

"ఏం శారదా, అలా వున్నావేం!" అని మామగారు ప్రశ్నించారు. అసలే శారదకు మామగారంటే ఎంతో అభిమానమూ, ఆదరమున్నూ. ఆయన అలా అడుగుతే శారద ఆపుకోలేక పోయింది.

"ఏమమ్మా, మాట్లాడవేం!"

ఓదార్చిన కొద్దీ ఆగర్భవతికి దుఃఖం ఎక్కువై పోయింది.

చిరిగిన పమిటతో కన్నీరు ఒత్తుకుంటూ,

"ఏం లేదు మామగారూ!" అంది.

"అయ్యో, ఏడుస్తున్నావా ...ఎందుకూ!" అని ఆప్యాయంగా ప్రశ్నించారు. ఏం చెప్తుందీ అభాగ్యురాలు!

మామగారు అన్ని విషయాలూ యిట్టే గ్రహించారు.

"మా వాడికి ఎక్కడా ఉద్యోగం దొరకలేదా? ఏమిటి శారదా!" అని తిరిగి ప్రశ్నించారు.

"లేదు"

"పొద్దుటనుంచీ భోంచేశావా శారదా?"

"లే-దం ... డీ!" చెప్పలేక చెప్పలేక చెప్పింది శారద.

"మా వాడో?" ఆప్యాయంగా అడిగేరు.

"ఏదో నాలుగు మెతుకులు కొరికేరు"

ఆ తండ్రి హృదయం యిక ఆగలేక పోయింది.

"శారదా, ఇదిగో యీ పాతిక రూపాయిలూ వుంచు ..."

"అబ్బ. వద్దండీ- ఆయన కోప్పడతారు."

"ఫరవాలేదు - నే నిచ్చానని చెప్పకు"

ఆ నోట్ల కట్ట అలా వదిలేసి మామగారు చరచర నడచి పోయారు.

మామగారు డబ్బిచ్చారన్న సంతోషం కంటే శారదకు భయం ఎక్కువై పోయింది. రామ్మూర్తి వచ్చి డబ్బెక్కడిదని అడుగుతే! మీ నాన్నగారు యిచ్చారని చెబుతే యింకేమైనా వుందా!

* * *

శారద చిన్నతనంలోనే కాపురానికి వెళ్ళింది. మామగారికి ఎవరూ ఆడపిల్లలు లేరు. రామ్మూర్తీ, అతని తర్వాత 16-17 ఏళ్ళ సుందరం- వీళ్ళిద్దరే ఆయన బిడ్డలు. మామగారు తను రాగానే మాయింటికి లక్ష్మి వచ్చిందని పొంగిపోయారు. ఆయనకు కోడలంటే యింతా అంతా కాదు అభిమానం.

రామ్మూర్తి తండ్రి కూడా ఓ విధంగా ధనికుడే. మంచి యిల్లూ, కొన్ని భూములూ, కొద్దిగా పెన్షన్‌తో ఆయన జీవితం వెళ్ళబుచ్చుతున్నాడు. రామ్మూర్తికి అహంకారం, గర్వం మహా ఎక్కువ. ఎన్ని తప్పులయినా తను చెయ్యవచ్చు గాని తండ్రి

ఒక్కమాటా అనడానికి వీలులేదు. ఈ సంగతి అతని స్కూల్ ఫైనలు పరీక్షా ఫలితాలనాడే తెలిసిపోయింది.

ఆ వాళ జగన్నాథంగారూ, సుందరం వీధి అరుగుమీద ఎంతో ఆత్రుతతో రామ్మూర్తి ఎలాంటి వార్త తెస్తాడో అని నిలబడ్డారు. సిగ రెట్టు పీలుస్తూ, కూనిరాగాలు తీస్తూ, నవ్వు కొంటూ వస్తున్న రామ్మూర్తిని చూడగానే జగన్నాథంగారు సంతోషంతో "హమ్మయ్య!" అనుకున్నారు. "లే బాబూ భోజనానికి— ఎండలో వెళ్లివచ్చేవు కాబోలు!" అని జగన్నా థంగారు రామ్మూర్తిని లేవదీశారు. ఇంతలో సుందరం న్యూస్ పేపరు తీసుకొచ్చి "ఇందులో నీ నెంబరేదిరా అన్నయ్యా!" అన్నాడు. రామ్మూర్తి అతినిర్లక్ష్యంగా 'ప్యాసైందని ఎవ రన్నారూ!" అన్నాడు. జగన్నాథం గారి గుండె గుభేలుమంది- ఆయన ఒళ్లు మండి పోయింది.

"ప్యాసవలేదని విచారమేనా లేకుండా ఆ వెధవ సంతోష మేమిట్రా! సిగ్గులేదే?" అన్నారు అతికోపంగా.

రామ్మూర్తి మరింత కోపంగా—

"అనవసరంగా వెధవా గిధవా అని తిట్టకు నాన్నా—సీలా అతిగా సాధించబట్టే ఎందరో విద్యార్థులు ఆత్మహత్య చేసుకుంటున్నారు!'

ఈ మాటలు జగన్నాథం మనస్సులో శూలాల్లా గుచ్చుకున్నాయి- ఇదే మహావిద్య అనుకుని, యిది లేకపోతే జ్ఞానమే లేనట్లు ఇందులో తప్పినంతమాత్రాన జీవితంలో ఓడి పోయామనుకుని ఎందరో అమాయక విద్యా ర్థులు, వెర్రిబాగులాళ్లు చనిపోడం మాట నిజమే. కర్కశప్రాయులైన కొందరి తల్లిదండ్రుల కఠి నోక్తులు భరించలేక ఎందరో విద్యార్థులు గతిం చడం సత్యమే—కాని, కాని...పడక కుర్చీలో పోతులా పడుకుని కిళ్లీ నములుతూ "వెధవ సంతో షం" అన్నంత మాత్రాన అవమాన మొచ్చిం దేం! అయినా యీరోజుల్లో విద్యార్థులకు యీ తెగింపు బాగా కనిపిస్తోంది. పాపం- యిల్లూ వాకిలీ ధారపోసి చదువు చెప్పించినా, "ఏం నాయనా పోయింది!" అనడానికే జడుస్తు న్నారు తల్లిదండ్రులు!

ఆ రోజు నుంచే జగన్నాథంగారికి 'రామ్మూర్తి' అంటే అసహ్యం మొదలు. ఒక్క ఏడాది కష్టపడి చదివిన చదువు పోతే 'అయ్యో!' అనేనా అనుకోని కొడుకుని చూస్తే ఆ తండ్రికి ఒళ్లు మండిపోయింది.

వరుసగా మూడేళ్లూ పరీక్ష పోగొట్టుకుని రామ్మూర్తి "ఏదో జయించేనని" ఎంతో గర్వ పడి ఆ గర్వం తన శరీరంలో చూపించు కున్నాడు. ఈ మూడేళ్ళలోనూ 80 పౌనుల మనిషి 150 పౌనులయి కూర్చున్నాడు. ఈ లోగానే పెళ్లికూడా అయింది.

ఇంతమనిషినీ, వీడి ఖర్చునీ భరించేసరికి జగ న్నాథంగారి పొలాలూ, సహం యిల్లూ ఆహు తయిపోయాయి. వీడిమీద అసహ్యమంతా సుందరంమీద ప్రేమగా పరిణమించింది. వా డప్పుడే స్కూలుఫైనలు ప్యాసయి యింట ర్లో చేరేడు. ఓనాడు రామ్మూర్తికీ జగన్నా థంగారికీ చాలా ఘర్షణ అయింది.

"సుందరం చదువుకుంటున్నాడు— నీ స్నేహి తులతో నువ్వు గొడవచేస్తే ఎలారా రామం!"

'వాళ్ళు వున్నారనేనా లేకుండా ఏమిటీ అల్లరి? వాళ్లు రాకరాక వస్తారు, పొమ్మంటారా! వెధవ యిల్లు- ఓగదియు స్నేహితులతో నైనా మాట్లాడడానికి వీలులేదు.'

"మాటలతో చెప్తే వినేలా లేవు రామం- వాడికి పరీక్షలని తెలుసా?"

"మాటలతో వినకపోతే కొడతావా? ఏదీ కొట్టు" అన్నాడు. జగన్నాథంగారి కోపం విజృం భించింది.

"దమ్మిడీ సంపాదించడం చేతకాని వెధవ కూడా..."

"నోర్ముయ్."

"ఎవర్నిరా! ఎంత మాటన్నావురా దౌర్భా గ్యుడా!"

"నిన్నే-ఏం చంటిపిల్లాడి ననుకున్నావా మాటలు పడడానికి? వెధవా బోడీ అని రానియ్య యీసారి. ఏం చేస్తానో!"

"వట్టిగొడ్డుకి అరుపులెక్కువ; ఇంట్లో కూర్చుని వెధవ కబుర్లు..."

"అదుగో... మళ్లీ పేలుతున్నావ్, జాగ్రత్త

కాఫీ కలుపుతున్న శారద గబగబా పరుగెత్తు కొచ్చింది. ఇద్దరి మధ్యా నిలబడి-

"ఏమండీ! వారు పెద్దలు...మిమ్మల్నో మాట అన్నా..."

శారదని తోసేశాడు రామ్మూర్తి.

"ఛీ, పో- నీనుంచే అంతా వచ్చింది."

గుమ్మం తగిలి శారద తలనుంచి రక్తం కారుతోంది. జగన్నాథంగారు-

"ఓరి అప్రాచ్యుడా, ఎంతపని చేశావురా! చాలు నాయనా చాలు- ఇంక నీ వెధవ మొహం కళ్ళ జూపకు. ఆస్తిలో నీకు దమ్మిడీ..."

"ఎవరి క్కావాలోయ్ నీ వెధవ ఆస్తి! అది తినబట్టే అక్షరం ముక్కకూడా లేకుండా పోయింది! నీ ముసలి విగ్రహం ముందు పాతుక్కూర్చుంటా ననుకున్నావ్ కాబోలు - పద శారదా!"

ఆవేళ రామ్మూర్తి శారదతో యిల్లు విడిచి పోయాడు. జగన్నాథంగారు సుందరం ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

అయిపోయిన సంఘటనలన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటోంది, శారద. అలా యింట్లోంచి వెళ్ళి పోయాక తన నగలు ఒక్కొక్కటే అమ్ముకు తినడం, చివరికి మెళ్లో పసుపు కొమ్ముతో తయారవడం. స్కూలుఫైనలు అయినా ప్యాసవని తన మగనికి ఉద్యోగం ఎవరిస్తారూ?

ఇంట్లో [illegible] పెడితే తినడం, స్వయంగా సంపాదించుకు తినడంలో ఉన్న భేదం రామ్మూర్తికి బాగా అవగాహన అయింది. కానీ సంపాదించడం ఎంతకష్టమో అతనికి బాగా బోధపడింది. కాని అతని నిర్లక్ష్యం, అహంకారం, తండ్రిమీద పగా యింకా తీరలేదు.

* * *

"ఏమండీ, ఎక్కడేనా నౌకరీ దొరికిందా?" రాగానే అడిగింది శారద. రామ్మూర్తి నిట్టూరుస్తూ, విషాదంగా-

"ఎక్కడ దొరుకుతుంది శారదా? ఈ పూట నువ్వూ నేనూ పస్తే" అన్నాడు.

"అన్నం వండేను- రండి" అంది శారద ఆప్యాయంగా.

"ఆఁ- బియ్యం ఎక్కడివి?" రామ్మూర్తి ఆశ్చర్యపోయాడు.

"మా పాత స్నేహితురాలు ఒకామె కన బడితే ఓ పాతిక రూపాయలు బదులు పుచ్చుకున్నాను."

రామ్మూర్తి మనస్సు ఎంతో తేలిక అయి పోయింది. శారదను చేతుల్లోకి తీసుకుంటూ-

"శారదా!... నువ్వుండబట్టే నాకు కొంచెమేనా సౌఖ్యంకలుగుతోంది-ఆ ముసలి వెధవ..."

"తప్పు, ఆయన్ని తిట్టకండి."

* * *

శారదకి ఒకనాడు పురుడు వచ్చింది. చక్కని కొడుకు పుట్టేడు. ఆ అందమైన బిడ్డను చూసి తల్లిదండ్రులిద్దరూ మురిసిపోయారు. పుట్టిన నాల్గవనాడే శారద-

"ఏమండీ, అబ్బాయి అచ్చు నాన్నగారి పోలికనుమండీ" అంది.

దాంతో రామ్మూర్తికి ఒళ్లు మండిపోయింది. పిల్లాణ్ణి తేరిపార చూశాడు. అచ్చు తాతగారి పోలికే, నిజమే! ఆ కళ్లు, ఆ చిన్ని పెదిమలు తన్ను వెక్కిరిస్తున్నట్టున్నాయి.

చేతుల్లో పాపాయిని దభేలుమని మంచమ్మీద పడేశాడు. పిల్లాడు గుక్కపట్టి ఏడవడం మొదలెట్టేడు.

"అదేమిటండీ...అలా పడేశారు!" అంటూ శారద పిల్లాణ్ణి చంకలోకి తీసుకుంది.

"ఆ అందమైన చంద్రబింబం, అందులో తన తండ్రి ప్రతిబింబం"...రామ్మూర్తి సందిగ్ధంలో పడ్డాడు.

పురుడూ, ఖర్చూ. పాతిక రూపాయలు ఎన్నాళ్ళు వస్తాయి? ఆవేళతో అన్ని సామానులూ అయిపోయాయి. రామ్మూర్తి ఎక్కడేనా అప్పు తెస్తానని బయలుదేరాడు. తీర్చలేని వాళ్ళకి అప్పు లెవరిస్తారు?

"శారదా, నీకు అబ్బాయి పుట్టేడని విన్నాను. పిల్లాడూ, నువ్వూ కులాసాగా వున్నారా?" అంటూ మామగారు వచ్చారు. శారద పిల్లాణ్ణి మామగారి చేతి కిచ్చింది.

"మూడు మూర్తులా మా పోలికే!..." మామగారి హృదయం ఆనందంతో పొంగి పోయింది.

అవును, తన పోలికే! ఆకళ్లు, ఆముక్కు, ఆ బుల్లి నోరు - అంతా తనే!

పిల్లాణ్ణి గట్టిగా కౌగిలించుకుని ఓ అరడజను ముద్దులు పెట్టుకున్నారు జగన్నాథంగారు అతి ప్రేమతో.

"నా తండ్రి ఎంత బాధ పడుతున్నాడో యీ చింకి చాపమీద పడుకుని! ఈ చింకిబట్టలు కప్పుకొని ఎంత యిబ్బంది పడుతున్నాడో. పాలుతాగేడా శారదా?" అని ఆదుర్దాగా అడిగేరు.

"లే—దం—డీ" అంది శారద.

"అయ్యో, నేను కలిగివుండీ చెయ్యలేక పోతున్నాను. ఎంత నిర్భాగ్యుడి నమ్మా! ఇదిగో యీ ఏభైరూపాయిలూ వుంచి నాచిట్టి తండ్రి కోసం ఖర్చుపెట్టు తల్లీ" అని జేబులోంచి ఏభై రూపాయిలు తీశారు జగన్నాథంగారు.

"అమ్మబాబోయ్, ఏభయ్యో... మీ అబ్బాయి నన్ను చంపేస్తారు."

"పుచ్చుకోక తప్పదు శారదా, ఉంచు." మామగారు పిల్లాణ్ణి ఒళ్ళోకి మరోమారు తీసుకు ముద్దెట్టుకొని-పెద్దపెద్దగా అడుగు లేసుకుంటూ యింటికి వెళ్ళిపోయారు

రామ్మూర్తి ఎలాగో ఐదురూపాయిలు సంపాదించుకుని చిరునవ్వుతో యింటికి వచ్చాడు. ఇంటికి వచ్చేసరికి శారద పిల్లాడికి పాలు పడుతోంది. రామ్మూర్తికి ఆశ్చర్యం వేసింది.

"పాలెక్కడివి శారదా?"

"............"

"మాట్లాడవేం, ఎక్కడివి?" గద్దించాడు.

ఏమని చెప్తుంది నిర్భాగ్యురాలు. మగని కోపం చూసి అబద్ధం ఆడలేక పోయింది.

"మీనాన్న 50 రూపాయలు ఇచ్చారు."

"ఏ మొహం పెట్టుకుని పుచ్చుకున్నావ్?" కోపంతో అనేశాడేగాని రామ్మూర్తి మనసులో తుఫానులు చెలరేగాయి.

తన తండ్రి, తన శత్రువు, తనని పెట్టి పోసిన ముసలి...తనకు ఏభై రూపాయలు ఎలా యిచ్చాడూ?

"శారదా, నువ్వు అడిగేవా?"

"లేదు—ఆయనే యిచ్చి మీతో చెప్పవద్దని చెప్పి వెళ్ళిపోయారు. నా మాట వినండి... తాత్కాలికంగా దెబ్బలాడుకున్నా రక్తసంబంధం యెక్కడికి పోతుంది! మీరు యిబ్బంది పడుతూవుంటే ఆ ముసలి ప్రేగు, మిమ్మల్ని కన్న ప్రేగు సహించగలదా! తన మనవణ్ణి చూసి మురిసిపోయిన ఆ బోసి నవ్వుల తాత..."

"చాలింక, నీ లెక్చరు కట్టిపెట్టు."

* * *

నిజంగా ఆలోచిస్తే తన తండ్రి చేసిన తప్పేముంది? తనకు చదువు చెప్పించాడు... పెద్దచేసి పెళ్ళి చేశాడు. తాత్కాలికంగా పొంగే తన యువకరక్తం మూర్ఖ ఆలోచనలకి దారి తీసింది. కాని, నిజంగా తన తండ్రి తనతో సంబంధం తెంపుకుని, తను యిబ్బంది పడుతూంటే చూడలేక డబ్బెందుకివ్వాలి...రక్తసంబంధమే తన తండ్రిని యిలా ప్రేరేపించిందేమో! రామ్మూర్తికి ఆరాత్రి నిద్దర పట్టలేదు.

* * *

ఆవాళ జగన్నాథంగారు మనవడికి మర పాలవెల్లి తెచ్చిపెట్టేరు. అది తిరుగుతూ, ఆ మనవడు బోసినవ్వు నవ్వుతూంటే ఆ తాతకీ బోసినవ్వు వచ్చింది! అవును, తనకు మాత్రం పళ్ళేవీ?

శారద కిటికీలోంచి మగడు వస్తూండడం చూసింది. "మామగారూ, వారొస్తున్నారు" అంది హడావిడిగా.

జగన్నాథంగారు గబగబా లేచి నిలబడ్డారు. రెండడుగులు వేసేసరికి పాపాయి కెవ్వుమన్నాడు. ఆ ఏడుస్తున్న పాపాయిని వదల బుద్ధి వెయ్యలేదు వాళ్ళ తాతకి...శారద ఏం జరుగుతుందో అని హడలిపోతోంది. రామ్మూర్తి యింటికి వచ్చేశాడు...జగన్నాథంగారు వణుకుతూ పాపాయిని గట్టిగా హత్తుకొని-

"రామూ, నువ్వు నన్ను ఏంచేసినా సరే, యీ పాపాయిని మాత్రం ఒక్క నిమిషం అయినా వదల్లేను. నేను తప్పులు చేస్తే నన్ను క్షమించు బాబూ." ఆ ముసలికళ్ళల్లోంచి కన్నీళ్ళు టప టపా రాలాయి.

రామం మనస్సు కరిగిపోయింది.

"నాన్నా, యీ చేతకాని దుర్మార్గుణ్ణి క్షమించండి" అని ఆయన పాదాల మీద వాలాడు.

శారద కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లాయి.




[సెప్టెంబరు 2 వ తేదీ సంచిక తరువాయి]

## ఇమ్మడి దేవరాయలు
### (క్రీ. శ. ౧౪౨౨-౧౪౪౬)

కళింగయుద్ధము సమాప్తమైన పిమ్మట ఆఱే డేండ్ల కాలము వైదేశిక దండయాత్రలుగాని క్షుద్రోపద్రవములుగాని లేక రాయసామ్రాజ్యమున శాంతి నెలకొని యుండినది. తరువాత మరల యుద్ధము యథాపూర్వ మారంభమైనది. బహమనీ సుల్తాను అహమదుశాహా క్రీ.శ. ౧౪౩౫ వ సంవత్సరమున పరలోకగతుడాయెను. ఇతనికి పుత్రులు నలువు రుండిరి. పెద్దవాడు అల్లావుద్దీను; రెండవవాడు మహమూదు ఖానుడు; మూడవ వాడు దావూదు; కడగొట్టువాడు మహమ్మదుడు. తన జీవిత కాలముననె తన కుమారులకు రాజ్యమును పంచియిచ్చుట యుక్తమని యెంచి యహమదు శాహా క్రీ.శ. ౧౪౩౦ వ సంవత్సరమున తనయేలుబడిక్రింది రాష్ట్రము నిట్లు విభజించెను: జ్యేష్ఠుని యల్లావుద్దీనును యౌవరాజ్యాభిషిక్తుని జేసి రాజ్యమునం దన్ని విషయముల మీదను పారుపత్యము నతని కొప్పజెప్పెను; కడగొట్టు కొడుకు మహమ్మదుఖాను పసివాడగుటచే రాజతంత్రవిధానము నలవఱచు కొనుట కతని నల్లావుద్దీనునికి సహాయునిగ జేసెను. రెండవవాడగు మహమూదు ఖానునికి ఉత్తర తెలింగాణమందలి రామగిరి మాహురారు కల్లము దుర్గములను బేరారు దేశములో గొంత భాగముతో గూడ నిచ్చెను. మూడవవాడగు దావూదుఖానునకు తెలింగాణము గాని రాయచూరుదుర్గము నొసగి పెక్కండ్రు అమీరులతో నతని నా దేశమున కంపెను. ఈ యేర్పాటు ననుసరించి యహమదుశాహా మృతి నందగనె అతని జ్యేష్ఠపుత్రు డల్లావుద్దీను రాజ్యాధిపతియై తఖ్తునెక్కెను. అల్లావుద్దీను రణప్రియుడు. ఇతడు తన రాజ్యకాలమున రెండుమారులు రాయసామ్రాజ్యముపై నెత్తిపోయినట్లు మహమ్మదీయ చరిత్రకారులు జెప్పెదరు. ఈ రెండు యుద్ధములును నడచిన రణక్షేత్ర మొక్కటియే; కృష్ణా తుంగభద్రల మధ్యదేశమున రాయచూరు ముదుగల్లు దుర్గముల చుట్టుపట్లయుండే రెండుదండయాత్రలును పోట్లాటయుంతయూ సాగినది. మొదటిదండయాత్ర క్రీ.శ. ౧౪౩౫ వ సంవత్సరమున ప్రారంభమైనది. ఈ యుద్ధవృత్తాంతమును మహమ్మదీయ చరిత్రకారులొక్కొక్క రొక్క విధముగ వర్ణించి యున్నారు. ఒక్కొక్కరు చెప్పు విషయమును మొదట సంగ్రహముగ బొందుపఱచి తరువాత వానికి గల భేదములను వివరించి విమర్శించుట యొప్పును. అందఱికంటె ప్రాచీనుడైన నిజామ్-ఉద్-దీన్ అహమదు ఇట్లు చెప్పుచున్నాడు:

సుల్తాను ఇమ్మడి యల్లావుద్దీను దన తమ్ముడగు మహమ్మదుఖాను నొక గొప్ప సైన్యముతో

కూడ విజయనగర సామ్రాజ్యమును జయించుట కొఱకు పంపెను. అతడు కృష్ణాతీరమును చేరగనే, అంతకు పూర్వమే యచటికి పోయి యుండిన ఇమాద్-ఉద్-దీన్ ఘోరీ యనునతని ప్రత్యుద్గమ సార్థ మేగి కృష్ణాతీరమున నతని గలిసికొనెను. అంతట మహమ్మదుఖానుడు ఘోరీని వధించి సుల్తానుపై దిరుగబడెను. అతని దండించుటకొఱకు సుల్తాను అల్లావుద్దీను స్వయముగ దండు నడుపుకొని పోయి యుద్ధమున నతని నిర్జించెను. మహమ్మదుఖానుడు భయకంపిత చేతస్కుడై పాఱిపోయెను; అంతట నల్లావుద్దీను భ్రాతృస్నేహము వలన నతని నేరమును క్షమించి తెలింగాణ మండలి రాయాచల దుర్గమున కధిపతిని గావించెను.

సయ్యాద అలీ చెప్పు వృత్తాంతమున గొంత వ్యత్యాసము గానవచ్చుచున్నది. దాని నిట్లు సంగ్రహము జేసి చెప్పవచ్చును:

క్రీ. శ. ౧౪౩౫ వ సంవత్సరమున సుల్తాను తమ్ముడు మహమ్మదుఖానుడు స్వామిద్రోహము దలపెట్టి కిస్ట్ నదీతీరమున నిమాద్-ఉల్-ముల్కు ఘోరీని వధించి, రాజఛత్రమును ధరించి, సుల్తానుపై తిరుగుబాటు చేసెను. సుల్తానుకీ వర్తమానము దెలియవచ్చినంతనే గొప్ప సైన్యమును గూర్చుకొని తమ్ముని దండించుటకు బయలు వెడలెను. ఉభయ పక్షములును ఒండొరుల దారసిల్లెను; ఘోరయుద్ధము సంప్రాప్తమైనది. మహమ్మదుఖా నోడి పాఱిపోయెను. సుల్తా నతని తప్పును క్షమించి తెలింగాణములోని రాయాచల సీమను జాగీరుగ నిచ్చి యచటికి పంపెను.

మహమ్మదుఖానుని పోకడవల్ల గలిగిన రాజ్య సంక్షోభమును సందు చూచుకొని విజయనగర కాఫరులు మహమ్మదీయ రాష్ట్రముపై దండెత్తి వచ్చి ముదుగల్లు దుర్గమును స్వాధీనము జేసికొని దేశమును చూఱగొనిరి. సుల్తాను అల్లావుద్దీను దళములను గూర్చుకొని వచ్చి ముదుగల్లును ముట్టడించెను. కొంతకాలము పోరు జరిగినది. కాఫరు లంత సంధికి వచ్చిరి. కప్పము కట్టుటకును సుల్తాను ఖరాజాకు విస్తారధనమును చెల్లించుటకును సమ్మతించుటయే కాక, సుల్తాను ప్రజలకు వారివలన గలిగిన నష్టమును గట్టి యిచ్చుటకు గూడ నొప్పుకొనిరి. మఱియు సుల్తాను రాష్ట్రముపై నెన్నడును ఎత్తిరామనియు మాటనిచ్చిరి.

ఫెరిష్తా చరిత్ర ప్రకార మీ యుద్ధ వృత్తాంతమును ముక్తసరిగ నిట్లు చెప్పవచ్చును:

సింహాసన మెక్కినవెంటనె ఇమ్మడి యల్లావుద్దీను షాహా విజయనగరముపై దండయాత్ర వెడల నిశ్చయించెను. తత్పూర్వ మైదేండ్లనుండియు రాయలు కప్పము గట్టలేదు; కట్టవలసినదని యడిగిన నిరాకరించెను. కావున దన చిన్న తమ్ముడు మహమ్మదుఖానుని కొక గొప్ప సేన నిచ్చి వజీరు ఖ్వాజా-ఇ-జహాన్ అస్త్రబాదీ, యమీర్-ఉల్-ఉమ్రా ఇమాద్-ఉల్-ముల్కు ఘోరీలను సహాయులుగా నొసగి రాయ సామ్రాజ్యము మీదికి దండయాత్ర యంపెను. దండయాత్ర జయప్రదముగ సాగినది. విస్తారము ధనమును, మదగజముల నిరువదింటిని, సంగీతనాట్య విద్యా విశారదలగు విలాసినులను నిన్నూర్వురిని సుల్తానుకును, విలువగల యుపలంభాలను లెక్కింటిని మహమ్మదుఖానునకును సమర్పించి రాయలు సంధిచేసికొనెను.

దండు వెనుదిరిగెను. ముదుగల్లు సమీపమును చేరగనె మహమ్మదుఖాను స్వామి ద్రోహమును దలపెట్టి ఖ్వాజా-ఇ-జహాన్ అస్త్రబాదీ, ఇమాద్-ఉల్-ముల్కు-ఘోరీల సహాయమును నర్థించెను; వా రందు కియ్యకొనలేదు; ఆ కారణము వలన మహమ్మదుఖాను వారిపై గోపించి వారినిద్దరిని జంపించెను; తరువాత తనకు సహాయముగ; విజయనగర రాయలకడనుండి దళముల రప్పించుకొని, ముదుగల్లు రాయచూరు షోలాపూరు బిజాపూరు నల్దుర్గు మొదలగు దుర్గముల నాక్రమించుకొనెను.

ఈసంగతి తెలియవచ్చినంతట నెయల్లావుద్దీను షాహా సేనల గూర్చుకొని దుష్టవర్తులను శిక్షించుటకు బయలువెడలెను. భీకరయుద్ధము జరిగెను. మహమ్మదుఖాను పరాజితుడై పాఱిపోయెను. సుల్తాను తమ్ముని క్షమించి, తెలింగాణ మండలాధిపతియగు నాపూరాముఖానుని మరణమువలన ఖాళీపడియుండిన దుర్గాధిపత్యము నొసగి యతని నచటికి పంపెను.

మహమ్మదీయ చరిత్రకారుల వ్రాత లిట్లు పొందికలేక పరస్పర విరుద్ధముగ నున్నను వారందరు నొక్క విషయమునం దేకీభవించుచున్నారు;

శత్రుసైన్యము వెంటనే ఇమ్మడి యల్లావుద్దీను శాహు రాయరాజ్యముపై దండు వెడలెనని యైకకంఠ్యముగ నొప్పుకొనుచున్నారు. కావున, నిది వాస్తవ చరిత్రాంశమని యొప్పుకొనవచ్చును; కాని దీని పూర్వాపరములు సందిగ్ధములై యున్నవి. ముహమ్మదుఖాను తిరుగుబాటునకుముందు విజయనగర దండయాత్ర నడచినట్లు నిజామ్-ఉద్-దీన్, ఫెరిష్తాలు చెప్పినను, సయ్యదు అలీ వీని క్రమమును దారుమారు సేయుటయేకాక వీని కొండొంటితో సంబంధమున్నట్లు సూచింపనైన సూచింపడు. ముహమ్మదు ఖానుని తిరుగుబాటును బందుచేసికొని విజయనగర కాఫరులు మహమ్మదీయ రాష్ట్రముపై నెత్తి వచ్చిరని తెల్పుచున్నాడు. ఇది సాధ్యమే; కాని ఇతర చరిత్రకారుల సాక్ష్యము దీనికి విరుద్ధముగ నున్నది. దీనిని బలపఱచగల సాధనాంతరము లభించువఱకు యథార్థమును నిశ్చయించుటకు వీలుగాదు. మఱియు ఫెరిష్తా, విజయనగరదండయాత్రకు సుల్తాను తన చిన్నతమ్ముఁ డగు ముహమ్మదు ఖానునితోఁ గూడ ఖ్వాజా-ఇ-జహాన్ ఇమాద్-ఉల్-ముల్క్ ఘోరీలను నాయకులనుగ నియమించి వారి నందఱి నొక్కట రాయరాజ్యముపై యుద్ధమున కంపెననియు, వారు యుద్ధయాత్రను జయప్రదముగ గొనసాగించి, రాయలను సంధి కొడంబఱచి యతనిచే గప్పముగొని మగిడివచ్చునప్పుడు ముదుగల్లు కడ ముహమ్మదు ఖానుడు స్వామిద్రోహమును జింతించి తోడి దండనాయకుల నిద్దఱిని వధించి సుల్తానుపై తిరుగుబాటుచేసె ననికదా వ్రాసియున్నాడు. ఇది యంతయు సత్యమని యంగీకరించుటకు వలను పడదు. ఏలనగా, ఫెరిష్తా కంటె నించుక పెద్దవాడును బూర్వరచయితయునగు నిజామ్-ఉద్-దీన్ అహమదు, సుల్తాన్ అల్లావుద్దీన్ శాహు మొట్టమొదట విజయనగరముపై నిమాద్-ఉల్-ముల్కును యుద్ధమున కంపెననియు, దరువాత నతనికి బ్రాపుగ దన చిన్న తమ్ముఁడగు ముహమ్మదు ఖానుని సైన్యముతోఁ గూడ నంపెననియు, ముహమ్మదు ఖానుడు దన్ను దుర్కొనుటకు కృష్ణాతీరమునకు వచ్చిన నిమాద్-ఉద్-దీనును వధించి సుల్తానుపై దిరుగబడెననియు వక్కాణించియున్నాడు. ఇమాద్-ఉల్-ముల్కు లేక ఇమాద్-ఉద్-దీను, ముహమ్మదు ఖానునిచే వధింపబడినది కృష్ణాతీరము నందేయని సయ్యదు అలీ దృఢపఱచుచున్నాడు. * కావున ఫెరిష్తాకంటె నిజామ్-ఉద్-దీనే విశ్వాసపాత్రుఁడని తోచుచున్నది. అగుటచే నల్లావుద్దీను శాహు విజయనగరము మీఁదికి ఖ్వాజా-ఇ-జహాన్ ఇమాద్-ఉల్-ముల్కు ముహమ్మదు ఖానుల నందఱి నొక్కట యుద్ధమున కంపలేదనియు, మొదట నిమాద్-ఉల్-ముల్కు నంపెననియు, వానికి జయము గలుగకపోగా నతనికి తోడ్పడుటకు ముహమ్మదు ఖానుని సైన్యముతోఁ గూడ నంపెననియు, తనకు సహాయుడై వచ్చుచుండిన ముహమ్మదుఖాను నెదుర్కొన నిమాద్-ఉల్-ముల్కు కృష్ణాతీరమునకు రాగా ముహమ్మదుఖాను డతని వధించి సుల్తానుపై దిరుగబడెననియు, నంకట విజయనగరదండయాత్ర యాగిపోయెననియు నవగాహనము చేసికొనవలసియున్నది.

ఫెరిష్తా చెప్పెడి యుద్ధవృత్తాంతమునందు దసంగత విషయములు మఱికొన్ని కానవచ్చుచున్నవి. ముహమ్మదుఖాను సుల్తానుపై దిరుగబడినది విజయనగరదండయాత్రను జయప్రదముగ గొనసాగించి మరలిస్వదేశమునకు బోవునప్పుడని ఫెరిష్తా చెప్పుచున్నాడు; కావున పైదండయాత్ర సాగుచున్నప్పుడే యతని హృదయమున స్వామిద్రోహబీజ మంకురించియుండును. ఈ స్థితియందాతడు రాయలతో సఖ్యము జేసికొనక యతనితో సుల్తానుకొఱకు బోట్లాడుట యసంభవము. ఏలన రాయలు సుల్తానుకు బ్రబలశత్రువు; అతని కలిమిబలములకు మితిలేదు. అతనితో జెలిమి కలిగిన దన కోరిక నెఱవేరుటకు సంశయ ముండదు;

---

* 'దర్-కినార్ ఆబెకిన్ (శేక్) కన్' అని బుర్హాన్-ఇ-మఆసీరు వ్రాతప్రతులందు గలదు. 'ఆబెకిన్' అనునదియె సరియైన యుచ్చారణ. వ్రాయసకాండ్ర ప్రమాదమువల్లగాని యజ్ఞానమువల్ల గాని కిషన్ 'కన్' శబ్దముగ మారియుండవలయును.

కావున, తాను తలపెట్టిన కార్యమును కొనసాగించుటకు దన కింతయుం దోడ్పడగల రాయలతో సఖ్యము చేసికొనక యతనితో యుద్ధము చేసి సుల్తాను పక్షమును బలపఱచుట యసంభవము. ఫెరిష్టా చెప్పినట్లు మహమ్మదుఖానుడు సుల్తాను పక్షమున రాయలతో పోరి యతని నోడించి సంధి కొడబఱచెనని యొప్పుకొన్నను, సుల్తాను దరువాతి ప్రవర్తన దురవగాహమై యున్నది. తన యధికారమును గూలద్రోయ గడగిన తమ్ముని, నా తమ్మునికి తోడై వచ్చిన నిజసహజ శత్రువగు రాయలను రణాంగణమున బరాజితుల గావించియుం, వారియం దొకని కతని స్వామిద్రోహమును విస్మరించి రాజాచల రాజ్యాధిపత్యము నొసగుటయుం, మఱియొకని సమయఘాతకతను సైచి వానిపై పెట్టి చర్యను దలపెట్టక మిన్నకుండుటయుం జిత్రము. వాస్తవముగ సుల్తాను విజయము వందియే యుండిన నతడేల రాజాచల రాజ్యమును మహమ్మదుఖానున కిచ్చియుండును? ద్రోహియైన తమ్మునికి తోడ్పడిన రాయలను దగినరీతిని శాస్తిచేయక యేల వదలిపెట్టి యుండును? ఈ యంశముల నన్నిటిని పరిశీలించి చూడగా విజయనగరముపై నల్లావుద్దీను కావించిన మొదటి దండయాత్ర భంగపడెననియుం, రెండవ పర్యాయము సేనాధ్యక్షుడైన మహమ్మదుఖానుడు సుల్తానుపై దిరుగబడి రాయలతో మైత్రి గావించుకొనుట వలన యుద్ధ మాగిపోయెననియుం, వారిని శిక్షించుట కొఱకు సుల్తాను ద్వయము దండు నడపుకొనుచు వచ్చియుం జయమును బొందజాలక మహమ్మదుఖానునకు రాజాకొండ రాజ్యము నిచ్చి రాజీ పడెననియుం దోచుచున్నది.

సుల్తాను అల్లావుద్దీనుషాహు ద్వితీయ విజయనగర దండయాత్ర క్రీ. శ. ౧౪౪౩-౪ వ సంవత్సరమున నడచినది. ఈ దండయాత్రయొక్క కారణము నిట్లు ఫెరిష్టా వివరించియున్నాడు.

క్రీ. శ. ౧౪౩౭ వ సంవత్సరమునం దిమ్మడి దేవరాయలు బహమనీ సుల్తానులతోడి యుద్ధములం దడుగడుగునకు దనకుపరాజయ మేల కలుగుచున్నదో కనుగొనుటకు విచారణను బ్రారంభించెను. ఈ విచారణవలన దన కపజయము రెండు కారణములవల్ల గలుగుచున్నట్లు తేలినది. (౧) కర్ణాటాశ్వములకంటె దురక గుఱ్ఱము లధిక దేహదార్ఢ్యము గలవగుట. (౨) బహమనీ సేనయందు ధనుర్విద్యయం దారితేఱిన విలుకాండ్ర బలగ మొకటి యుండుట. ఈ కారణముల మూలమున దన కపజయము గలుగుచున్నదని తెలియగనే ఇమ్మడి దేవరాయలు తన సేనయందలి లోపములను దొలగించి దాని పోటరితనము హెంపొందించుటకొఱకు తగు నేర్పాటుల గావించెను. తురక విలుకాండ్రకు దన కొలువునం దుద్యోగము లిచ్చి వారిచే దన భటులను ధనుర్విద్యయందు శిక్షితుల గావించెను. అచిరకాలముననె యతని సేనయందు విలుకాండ్ర సంఖ్య యధికమాయెను. తురకలసంఖ్య రెండు వేలు, హిందువు లఱువదివేవురు. ఇట్లె యాశ్విక పదాతుల సంఖ్యయు హెచ్చినది. రౌతు లెనుబది వేలమంది; కాల్బలగణము రెండు లక్షలు. ఇంతటి గొప్ప సైన్యము దన పశ్చాత్పు ప్రగీతియందు చేరగనె, ఇమ్మడి దేవరాయలు బహమనీ రాజ్యమును జయింప నడుగట్టి దండు వెడలెను.

ఇంత విపులముగ యుద్ధకారణములు ఫెరిష్టా వివరించినను ఇది సత్యము గాదు. తన సైన్యమందలి లోపముల గనుగొనుట కిమ్మడి దేవరాయ లప్పుడు క్రొత్తగ విచారణ సాగింపవలసిన యావశ్యకత లేదు. ఆద్యమునుండి కాకపోయినను మొదటి దేవరాయల కాలమునుండియు రాయ రాణువయందు తురకపటాలము లుండినవి. క్రీ. శ. ౧౩౩౦ వ సంవత్సరమున సుల్తాను అల్లావుద్దీను సింహాసన మధిష్ఠించుట కాఱేండ్లముందు ఇమ్మడి దేవరాయల సైన్యమునం దాఱువేల తురుష్కభటు లుండిరని శాసననిదర్శనమువల్ల దెలియుచున్నది. యుద్ధమునకు వాస్తవమైన కారణ మిమ్మడి దేవరాయలు బహమనీ రాజ్యమును జయింప దలకొనుట కాదు; అతని కపుడు సంప్రాప్తమైన విపత్తు సాక్షాత్కారము చేసికొని సుల్తా నల్లావుద్దీ నతని బెదరించి యుపాయధనమును నాచికొన గడగుటయే. సమకాలిక మహమ్మదీయ రచనలు దీని యాథార్థ్యమును రుజువు సేయుచున్నవి. ఈ యుద్ధ ప్రారంభసమయమున పారశీక దేశమునుండి వచ్చిన రాయబారి యబ్దుర్ రజాకను నతడు విజయనగరమందు నివసించుచుండెను.

అప్పు డచట జరిగిన విషయముల నన్నిటిని అతడు విరచించిన 'మత్లఉస్సాదీన్' - అను గ్రంథమున వర్ణించియున్నాడు:

క్రీ. శ. ౧౪౪౩ వ సంవత్సరమున అబ్దుల్ రజాకు విజయనగరమునకు వచ్చుచు పశ్చిమ సముద్రతీరమున కళ్ళికోట యందు కొంతకాల ముండెను. అప్పుడు విజయనగరమం దొక వైపరీత్యము సంభవించినది. ఇమ్మడి దేవరాయల సోదరు డొకడు నూతన సౌధమును నిర్మించు కొనెను. గృహప్రవేశ మహోత్సవమును దన యంతస్తునకు దగిన రీతిని గడు వైభవముతో చేయనిశ్చయించి యా సమయమున విందారగించుటకు రాయలను రాజకుమారులను సామంత మండలాధ్యక్షాది నియోగి వర్గములను దొరలను నాయకులను రాజధానియందు ముఖ్య జనుల నెల్లర నాహ్వానించెను; అందఱును వచ్చిరి; కాని రుగ్ణత వలన రాయలొక్కడు మాత్రము రాడాయె. రాయలు రాకపోవుట వలన దన యత్నమంతయు విఫలమాయెనని వ్యథ నొందెను. అతని మనోవ్యథకు ప్రబల కారణము గలదు. గృహప్రవేశ మహోత్సవము సేయదలపెట్టుట యం దతనియుద్దేశము దన సిరిని చూపి సరివారి మెప్పు వడయవలయునని కాదు. రాయలను రాజ్యమున దేశెన్నిక కెక్కినవారి నందఱిని కపటోపాయము వలన నొక్కమారు వధించి రాజ్యము నాక్రమించుకొనవలయు ననియే. నిర్ణయించుకొన్న పథకము ననుసరించి యతడు వచ్చినవారిని వచ్చినట్లు సౌధాంతర్భాగమునకు గొంపోయి రహస్య విధమున భటులచే జంపించెను. పట్టణము నందుండిన రాజకుమారులు మండలాధిపతులు దొరలు మున్నగువా రొక్కరైన మిగులక యందఱు నొక్క సమయమున నకాలమృత్యువు నోటబడిరి. రాయలొక్కడే మిగిలి యుండెను. రాయలు జీవించి యుండిన నింతయత్నము బూడిదయందు చేసిన హోమము వలె వ్యర్థమగును గదా. తన యుద్యమము నెఱవేరుటకు రాయల నెట్టులైన నెలయించి తోడ్కొనివచ్చి రూపుమాపుట యావశ్యకము. కావున నతడు రాయలను స్వయముగ బోయి తోడ్కొనివచ్చు నెపమున తాంబూల పేటిక నెత్తికొని బయలువెడలెను. మార్గమున నుండు వాకిటి వారిని బూటకపు మాటలచే లాలించి తేలించి విందుగుడువ నందఱిని దన మందిరమున కంపెను. రాచనగరికి గా పెవ్వరును లేక పోయిరి. పిమ్మట నా దురాత్ముడు రాయల సముఖమునకు బోయి వినయ విధేయతలతో బతిమాలుచున్నట్లు నటించుచు, దటాలున దాంబూల పేటికయందు గుప్తము చేసి యుంచిన కటారిని దీసి రాయల దేహముపై చెక్కుపోటుల బొడిచెను. సొమ్మసిలి మృతి నందినవానివలె రాయలు క్రిందబడెను. ఆద్రోహి వాస్తవముగనే మరణమందెనని భ్రమించి రాజ మందిర ముఖమంట పోపరితలమునకు బోయి యచట నిలిచి రాజమార్గమున సంచరించుచుండిన జనులతో దాను రాయలను వధించితినని చాటి చెప్పి యటుపై రాజ్యమునకంతటికిని దానె రాయలనని ప్రకటించుచుండెను. దేవరాయల కంతటనె స్మారకము వచ్చినది; సోదరుని ద్రోహ ప్రయత్నము విశదపడినది. ఎట్లో కష్టముతో శరీరము తేర్చికొనుచు దానును ముఖమంట పోపరితలమునకు బోయి, తాను జీవముతో నున్నాడననియు నాహంతకుని బంధింపవలసిన దనియు నుద్ఘోషించెను. రాయల యెలుగును విని జనులు రాజమందిర పురోభాగమున గుమికూడి యా ద్రోహినిబట్టి వధించిరి. అంతట దేవరాయలు సింహళకడప్రాంతములకు బోయియుండిన మంత్రిని మహా ప్రధాన లక్కణ దండనాయకుని రాజధానికి రప్పించి జరిగిన వృత్తాంతము నాతని కెఱుకపరచెను. స్వామి ద్రోహమును దలపెట్టిన సోదరునికి సహాయభూతులై యతని దుర్వ్యాపారమును గొనసాగింపగడగిన దుర్మార్గుల నందఱిని బంధించి తగినరీతిని వారిని శిక్షించెను.

విజయనగరమున జరిగిన వర్తమానమంతయు బీదరుకు వెంటనె తెలియవచ్చినది. సుల్తాను అల్లావుద్దీను రాయలను జయింప నదియె తరియని నిశ్చయించి యేడులక్షల వరహాలను దనకు బంపవలయుననియు లేనియెడల దండువెడలి వచ్చుచున్నాడననియు బెదరించుచు దూతల నంపెను; దేవరాయ లందు కియ్యకొనలేదు; తత్కారణమున యుద్ధము ప్రారంభమైనది.

(సశేషము)





## 2

రాజేశ్వరమ్మ రాజమండ్రీలో పుట్టింది. ఆమెకు పద్ధెనిమిదవ ఏట వివాహం అయింది. ఆమెవన్నీ ఉన్నతాశయాలు. ప్రపంచంలో కష్టాలు, బాధలు గుర్తించి తనంతట తనే బాధాకరమైన జీవితాన్ని ఎంచుకుని కష్టాలు, బాధలు అలవాటు చేసుకొంది. ఆమె ఆశయాలు, నడవడిక, స్థిర చిత్తం ఆమెకు అమోఘమైన శక్తిని కలుగజేశాయి.

వెంకటేశ్వర్లు ఎలాంటివాడో తెలియకుండా, తెలుసుకుందుకు ప్రయత్నించకుండా, తన తండ్రిని సంతోషపెట్టడానికి ఆమె వివాహం చేసుకుంది. 'తన భర్త ఎలాంటివాడైతేనేం తను సమర్థించుకో గలిగితే' అనుకొన్నది. అలాగే ఆమె బాధలన్నీ ఏకాంతంగా భరించింది. ఓర్పుగా బాధలను సహించడం ఆమె అభ్యసించింది. ఆమె భర్త అదోరకం మనిషి. అతను చాలా సభ్యత, శృంగారం తెలిసినవాడు. అయినప్పటికీ ఎందుకూ కొరగాకుండా పోయాడు. అతడు బాగుపడాలని, మంచిగా వుండాలని ప్రయత్నిస్తే వుండగలడు. కాని అతను ఆ దౌర్భాగ్యపు జీవితాన్నే ఎంచుకున్నాడు.

వెంకటేశ్వర్లు వ్యసనాలకి బాగా లోబడ్డ వ్యక్తి. అయినప్పటికీ అతని అభిప్రాయాలు చాలా ఉత్కృష్టమైనవి. అతని హృదయం చాలా మెత్తనిది. అతను ఏ దుర్మార్గం చేసినా బాగా తెలిసివుండి చేసేవాడు; చేస్తూ సిగ్గు పడేవాడు కాదు. అతను చెయ్యదలుచుకుంటే మంచి కూడా అలాగే చేసేవాడు. కాని మంచిపనులు చెయ్యటానికి అతనికి కుతూహలం వుండేది కాదు.

అతను మొదటిసారి భార్యను ఆట బొమ్మగా చేసి ఆడుకున్నాడు. రాజేశ్వరమ్మ చాలా అందమైనది. ఆమె అందం, శీలం, గుణసంపద మొట్ట మొదటిసారిగా ఆఘ్రాణించాడు వెంకటేశ్వర్లు. తరువాత ఆమె నిస్సారంగా, పాతగా కనబడసాగింది అతనికి. ఆమె స్థిరబుద్ధికీ, నిశ్చలత్వానికీ, ఉన్నతాదర్శాలకీ వెంకటేశ్వర్లు రాను రాను తట్టుకోలేక పోయేవాడు. ఆమెను వశపరుచుకోలేక అసహ్యించుకోవటం నేర్చుకున్నాడు. ఆమె ముందు తాను బలహీనంగా కనబడటం యిష్టంలేక వెంకటేశ్వర్లు ఆమెను తప్పించుకు తిరగటం నేర్చుకున్నాడు. ఎంత తప్పించుకున్నా ఆమె పశ్చాత్తాపం అతన్ని అమితంగా బాధించేది. అతను మళ్ళీ పాత పంథాలో పడి, నీచసౌఖ్యాలకోసం పరుగెత్తేవాడు. తన కొక సంసారం, బాధ్యత వున్నట్టుగా అతనికి జ్ఞాపకమే వుండేది కాదు.

కొద్దికాలమే అయినా రాజేశ్వరమ్మ అతన్ని గాఢంగా ప్రేమించింది. ఆ తరవాతనుంచి అతన్ని అలక్ష్యంగా చూడటం ప్రారంభించింది. హృదయంలో గాయాన్ని కాల్చిన ఇనుముతో కాలినట్టుగా ఆమె బాధపడేది. ఆమెకు పశ్చాత్తాపం తప్ప యింకే అనుభూతీ లేదు. ఆమె ధైర్యాన్ని చెప్పుకుని రోజులు వెళ్ళ

జబ్బేదీ; కాని జీవితంలో శూన్యం తప్ప ఆమె కింకేమీ కనుపించేది కాదు. ఆమె ఆశయాల్ని ఎప్పుడూ వదిలిపెట్టలేదు; కాని చుట్టూ అంధకారం తప్ప ఆమెకి వెలుగు గోచరించ లేదు. ఆమె హృదయంనుంచి రక్తం స్రవించి ఆమె ఏకాంతఘోషలో జీవితాన్ని తిరిగీ ప్రారంభిస్తే బాగుండు ననిపించేది.

రాజేశ్వరమ్మ పెళ్ళయిన ఐదు సంవత్సరాల లోగా ఆమె తలిదండ్రు లిద్దరూ చనిపోయారు. ఆమెకు సహాయం చెయ్యడానికిగాని, ధైర్యం చెప్పడానికిగాని ఒక్క బంధువుకూడా లేదు. ఆమె భరించలేని ఏకాంతాన్ని అనుభవించింది. తన ఏడాది వయస్సుగల పిల్లతో ఒక గదిలో తలుపులు మూసుకుని కూర్చునేది. ఆ చిన్న పిల్ల మరోక విధంగా తన తల్లి కోల్పోయిన ప్రేమను రుచి చూపించి కొంత ఊరట కల్గించేది. ఆ చిన్నపిల్ల ప్రేమకోసం, ఆపిల్ల సంరక్షణ కోసం మాత్రమే ఆమె జీవించి వుంది.

అరు సంవత్సరాలు ఆమె తన కుమార్తెతో ఏకాంతవాసం చేసింది. ఆమె తన కుమార్తె దగ్గరకు ఎవ్వరినీ రానిచ్చేది కాదు. తన కుమార్తెకు సేవకురాలు, స్నేహితురాలూ కూడా తనే. ఆమె జీవితం శాశనం అయిపోయింది. తన కుమార్తె ఆధారంగా, ఆమెకోసం మాత్రమే బ్రతుకుతోంది.

సరోజ ఆమె కాళ్ళదగ్గర ఆడుకుంటుంటే ఆ పిల్లగురించి ఎంత చక్కని కలలు కనేది! ఆమెకు ఎల్లకాలం తను సహాయంచేస్తూ, ఆలోచనలు చెబుతూ ఆమెను రక్షించాలని ఆ తల్లి కోర్కె. తన కుమార్తె పెళ్ళి చేసుకున్నట్టూ, సుఖంగా వున్నట్టూ కలలు కనేది. వాళ్ళిద్దరినీ మృత్యువు వేరు చేస్తుందని ఆమె కలలోకూడా అనుకోలేదు. ఆమె కలలన్నీ కల్లలయినాయి. తల్లి అనుభవాలు పిల్లకి పనికిరాకుండాపోయాయి. ఆమె తన తెలివి తేటల్ని వృద్ధిచేసుకుని తనని తాను రక్షించుకోగలుగుతుందో లేదో. రేపటి నుంచి సరోజ తండ్రి సంరక్షణలో పడుతుంది. ఆ తండ్రికి సంసార బాధ్యత గాని, జాగ్రత్త గాని కించిత్తయినా లేదు. ఆమె మనస్సు, ఆత్మ ఎంతగా వ్యథచెందినవంటే, తాను కట్టుకొన్న భర్తను తన కుమార్తె విషయంలో నమ్మలేక, తను పెంచిన ఒక నిరాశ్రయుణ్ణి కుమార్తెకు రక్షకుడుగా నియమించవలసి వచ్చింది.

రాజేశ్వరమ్మ చనిపోయే సమయంలో వెంకటేశ్వర్లు విలాసిని యింట్లో వున్నాడు. విలాసిని నిర్లక్ష్యజీవి. ఆమె పురుషుల్ని ఉద్రిక్తుల్ని చేసేటంత అందంగా వుంటుంది. వెంకటేశ్వర్లుకి భార్య జబ్బుతో బాధపడుతోందని తెలుసు. కాని ఆమెతో తానూ బాధపడటం యిష్టంలేదు. జబ్బు ఎక్కువైతే చనిపోతుంది, తగ్గిపోతే ఆరోగ్యంగా వుంటుంది. ఎలాగైనా మంచిదే. తను మాత్రం వుండి చేసేదేముంది, చచ్చేవాళ్ళతో చావటం తప్ప. ఈ సిద్ధాంతం అతన్ని విలాసిని యింట్లో కట్టేసింది.

వెంకటేశ్వర్లు డబ్బంటే లక్ష్యంలేని మనిషి. ఎవడికైనా ఎంత డబ్బైనా పారేసి పని చేయించుకుంటాడుగాని, ఆ మాత్రం కష్టం తాను పడలేడు. అతనిదగ్గర స్వార్థపరులకీ, పిరికి పందలకీ వుండే ఆత్మవంచన వుంది.

అతను వైద్యుణ్ణి ప్రొద్దుటే కలుసుకున్నాడు. వైద్యుణ్ణి తను కలుసుకుని, తన భార్య ఆరోజున ఏ ఘడియలోనైనా చనిపోతుందని తెలుసుకున్నందుకు తన్ను తాను నిందించుకున్నాడు. డాక్టరు తన భార్య సంగతి చెప్పేటప్పటికి అతని రక్తమంతా చల్లబడిపోయింది. మృత్యువంటే అతనికి అమితభయం. చనిపోయిన తర్వాత జరిగే కర్మకాండంతా అతని కళ్ళకు కట్టినట్లు కనిపించింది. భార్య చనిపోతే అతనికెంతో స్వేచ్ఛ వస్తుంది. కాని యీ లోపున జరిగే దహనం, తైలం, కర్మకాండ, దొంగ ఏడుపులు యివన్నీ ఎలాగ? అందరూ తాను కోరకుండానే ఎంతో సానుభూతి చూపిస్తారు. 'అబ్బే, నా భార్య అప్పుడే చావదు. జబ్బుచేసి పదిహేను రోజులేగా అయింది.' ఈ మాటలు కంపించే, తడబడే, ఎండిపోయిన గొంతుకతో అన్నాడు. తన మనస్సుని బెదరగొట్టి శాంతిని పోగొట్టడానికి చూసేవాళ్ళను మోసం చెయ్యటానికి, తాను నిశ్చయంగా వున్నట్టు చాటడానికి యీ మాటలు అతను ఉచ్చరించాడు.

ఆఖరికి, సాయంత్రానికి అతను విలాసిని యింటికి వెళ్ళాడు. ఈ లోపుగా ఎవరు ఘోర వార్తను మోసుకు వస్తారోనని అతను భయపడు

-తూనే వున్నాడు. ఒక అరగంటలో అతను మామూలు వెంకటేశ్వర్లు కాగలిగాడు. విలాసిని సుందర మందిరంలో అతను స్వర్గంలో వున్నట్టుగా భావించుకోగలడు. పక్కలకు దాలినంత ఎంత సుఖంగా, వెచ్చగా వుంటుందో అతనికి విలాసిని యింట్లో అలా వుంటుంది.

కాని విలాసిని ఆవేళ అదో మోస్తరుగా, ఆందోళనగా వుంది. వెంకటేశ్వర్లుకి సరిగా మర్యాద చెయ్యలేదు; కాని దానికి అత నంతగా లెక్క చెయ్యలేదు. అతనికి కావలసినవి, అతను ఆనందం పొందేవి - విలాసిని దేహంమీదనుంచి వచ్చే ఘుమ ఘుమలు, ఆమె దేహంమీద వదులుగా వ్రేలాడే వలువలు, ఆ వల్చని దుస్తులలోంచి కనుపించే ఆమెదేహం, ఆమె వాక్స్వాతంత్ర్య మూలంగా మాట్లాడే మాటలు, ఆమె గదిలో చిందర వందరగా పడివున్న సామాను—యివి చాలు అతనికి. వెంకటేశ్వర్లు ఆమెతో వేళా కోళాలాడి కష్టాల్ని మరచిపోవటానికి ప్రయత్నించాడు. విలాసినిమాత్రం చిరచిర లాడుతూనే వుంది. ఆమెను రాత్రి నాటకానికి తీసుకువెడ తానని బుజ్జగించాడు. విలాసినిని బుజ్జగించి, కుప్పించి వంటో డిగ్గా మునుకుతో సమయంలో వెంకటేశ్వర్లుని యింటికి అతిత్వరగా రమ్మని కబురువచ్చింది.

వెంకటేశ్వర్లు కొయ్యబారిపోయాడు. అతని దేహం వణికిపోయింది. విలాసిని దగ్గర సెలవైనా పుచ్చుకోకుండా అతను యింటికి పరుగెత్తాడు. మేడమెట్లు దిగుతూంటే అతనికి అనిపించింది- విలాసినితో చెప్పకుండా బయలుదేరి రావటం చాలా పొరపాటని. కాని ఆమె కీపాటికే కోపం వచ్చివుంటుంది, యిక వెనక్కి వెళ్ళినా విలాసిని కరగదు. అందుకనే, యీ చివర ఏదో వదిలించుకుంటే, ఆ తర్వాత ఏకంగా పెద్ద క్షమాపణ చెప్పుకోవచ్చని అతను ముందుకే సాగాడు.

మేడకింద వెంకటేశ్వర్లు అంతరంగిక బంటు సూరయ్య వున్నాడు. సూరయ్య సన్నగా, పొడుగ్గా వుంటాడు. వాడు వెంకటేశ్వర్లు చేతిలో కీలుబొమ్మ. సూరయ్యదగ్గర ఒక తీర్పువుంది. వాడికి ఏ విషయమూ అవసరం లేనట్టుగా



వుంటాడు, దేనిగురించీ మాట్లాడడు, వినటానికి ఇష్టపడడు. వాడొక యంత్రంలాంటి వాడు. మర తిప్పితేనే యంత్రం తిరిగినట్లు వాడు ఏదైనా చెబితేనే ముక్కుసూటిగా వెళ్ళి చేసుకొస్తాడు. అయితే కొన్ని యంత్రాల్లో రహస్యపు మరలుండి వాటంతటవే ఒక్కొక్కప్పుడు తిరుగుతున్నట్లుగా సూరయ్యలోకూడా కొన్ని అణగివున్న భావాలు ప్రకటితమౌతూవుంటాయి.

సూరయ్య వెంకటేశ్వర్లుతో సరోజ అతని కోసం యిల్లంతా కలయ వెదుకుతోందని మాత్రం చెప్పాడు. సూరయ్యకి రాజేశ్వరమ్మ అంత్య సమయం ఆసన్నమైందనీ తెలుసు, ఆ సమయంలో తాను వెంకటేశ్వర్లు ఆనందం భంగంచేస్తున్నాడనీ తెలుసు.

వెంకటేశ్వర్లు పూర్తిగా కలత చెందాడు. భయమూ, బాధా కన్నీళ్ళరూపంలో గిర్రున తిరిగినాయి. అదంతా స్వార్థపరత్వంతో కూడుకొన్న బాధ. ఆ సమయంలో గనక అతన్ని ప్రశ్నిస్తే ఆ బాధంతా తనభార్య చావుగురించి గాదని అతను సత్యంచెప్పేస్తాడు. అయితే అతనికి ఆత్మవంచన అనేది తెలియనివిద్య గాబట్టి, తన దుఃఖమంతా తన భార్య చావుగురించే ననుకొని, తనెంతో ఆమెకు మహోపకారం చేస్తున్నాననుకొని సంతృప్తి చెందుతాడు.

ఆ జబ్బుమనిషి వున్న గది ప్రవేశించేటప్పటికి అతని నరాలన్నీ పటుత్వాన్ని గోల్పోయి మూర్ఛవచ్చినట్లయింది. విలాసిని యింట్లో మత్తు నిచ్చే అత్తరు వాసనల్లోంచి మందు వాసనలు కొట్టే రోగి గదిలోకి వచ్చేటప్పటికి అతనికి స్వర్గంలోంచి నరకంలోకి వచ్చినట్లయింది.

ఆమె పక్క దగ్గరకి వెళ్ళి మృత్యుముఖంలో వున్న ఆమె పాలిపోయిన ముఖాన్ని చూచేటప్పటికి అతనికి కళ్ళ నీళ్ళు అకస్మాత్తుగా వచ్చాయి. ఆ దీపపు వెలుగులో ఆమె తలదిండు ఆనుకొని, కళ్ళు మూసుకొని మృత్యుదేవత పిడికిలిలో వుండే పాలరాతి విగ్రహంలా వుంది. ఆమెలో కదలిక లేకపోయినా, వెంకటేశ్వర్లుకి ఆమె అంటే యింకా భయమే. బెదురుచూపులు చూస్తూ అలాగే మంచందగ్గర నిలబడ్డాడు. ఆమెలో ఏమన్నా యింకా కొన ప్రాణం వుందేమోనని ఆమెమీద కొరిగి వణకుతూ, 'రాజేశ్వరీ-ఇలా చూడు, నేను వచ్చాను' అన్నాడు.

ఆమె తల కొంచెం తిప్పి మెల్లిగా కనురెప్పలు విప్పింది. ఆమె కళ్ళలోని అసాధారణ కాంతి యిటూఅటూ వెతుకుతోంది. చివరకామె కళ్లు వెంకటేశ్వర్లు స్వరూపం దగ్గర ఆగాయి.

వెంకటేశ్వర్లు ఎప్పుడూ, ఎవరూ చనిపోతుండగా చూడలేదు. అతనికి నిష్కల్మషమైన, అభిమానంతో కూడుకొన్న విచారమంటే ఏమిటో తెలియదు. శవాన్ని ముట్టుకుని ఏడవడం అతనెప్పుడూ ఎరుగడు. చావంటే ఎలా వుంటుందో అతను ఆలోచిస్తున్నాడు. తనూ ఒకానొక రోజున చచ్చిపోవాలి; అంటే ఆమె లాగ అయిపోవాలి అనుకున్నాడు.

రాజేశ్వరమ్మ అతన్ని గుర్తుపట్టింది. ఆమె నిట్టూర్చి, నవ్వటానికి ప్రయత్నించింది. ఆ ఆఖరు ఘడియలో ఆమెలో క్షమాబుద్ధి తప్ప యింకేమీ లేదు. అయినా ఆమెలో తన పెళ్ళి అయిన దగ్గరనుంచీ గడిపిన కష్టదినాలు జ్ఞాపకం వచ్చి యీర్ష్య రేకెత్తి, అంతర్యుద్ధం జరుగక పోలేదు. తన అంత్యసమయంలో అందరితోనూ మంచిగా మాట్లాడటానికీ, తన ఔన్నత్యం కనపరచటానికి అప్పుడే తాను చనిపోయినట్లుగాను, యింక తనకి లౌకిక సుఖదుఃఖాలతో సంబంధం లేనట్లుగాను ఆమె భావించుకోసాగింది. పైగా ఆమెను తన భర్తను పిలవమని ఎవరితోనూ చెప్పినట్లుగా జ్ఞాపకం లేదు.

ఒకానొక సమయంలో ఆమె కెవ్వరూ నమ్మకమైనవారు కనబడక, తన కుమార్తె విషయంలో, భర్త దగ్గరనుంచే ప్రమాణకం తీసుకొందామని అనుకొంది. కాని, యిప్పుడు సరోజకు రక్షకుడేర్పాటయాడు గాబట్టి ఆమె కా ప్రసక్తి యిక అనవసరం.

వెంకటేశ్వర్లుని అక్కడ చూసేటప్పటికి ఆమెకి ఆశ్చర్యం కలిగింది. అయితే అతనిమీద యిప్పుడు ఆమె కేమీ పగగాని, వగగాని లేదు. ప్రయాణంచేసే బాటసారి దారిలో నిలుచున్న పెద్దమనిషిని చూసి ఓ చిరునవ్వు నవ్వినట్టుగా ఆమె వెంకటేశ్వర్లుని చూసి నవ్వింది.

ఆమె తెలివచ్చిన కొద్ది తన చివరిక్షణం ముందు అతని పిరికితనం చూసి జాలిపడింది. వెంకటేశ్వర్లు స్థితి చూసి ఆమె కెక్కడలేని జాలి కలిగింది.

"మీరు రావటం మంచి పనిచేశారు. నేను ప్రశాంతంగా చనిపోతాను" అన్న దామె [illegible]గా.

వెంకటేశ్వర్లు హృదయం మెత్తబడి మళ్ళీ ఏడ్వటం ప్రారంభించాడు.

"మీరు ఆశ్చర్యపడకండి. నే నింక బాధపడే దేమీ లేదు. నే నిప్పుడు హాయిగా ప్రశాంతంగా వున్నాను. నా కొక్కటే కోరిక వుంది యిప్పుడు. అదేమిటంటే మన యిద్దరి మధ్యా వున్న భేదాభిప్రాయాలు ఇక పూర్తిగా పోవాలి. నాతో కూడా మీగురించి నేను అసంతృప్తి భావం మోసుకెళ్ళడంగాని, నేను పోయినా మీరు నాగురించి చెడ్డగా భావించడంగాని నా కిష్టంలేదు. మీకు నేను ఏదైనా కష్టం కలిగిస్తే నన్ను క్షమించండి" అంది రాజేశ్వరమ్మ.

ఈ మాటలు వెంకటేశ్వర్లు హృదయంమీద చాలా సున్నితంగా పనిచేశాయి. అతని హృదయం మెత్తబడిపోయి, కరిగిపోయి బద్దలైపోతుందేమో ననిపించింది. ఇప్పు డతను విచారించటానికి జంకటం లేదు. బాగా విచారిస్తేగాని అతని హృదయం, మనస్సు తేలిక పడేటట్టుగా లేవు.

"నేను నిన్ను క్షమించడానికి నీలో ఏమీ తప్పులేదు. నువ్వు చాలా మంచిదానివి. మన యిద్దరి తత్వాల్లో వున్న భేదమే మన ఎడబాటుకి కారణం. చూశావా, నే నెంతగా విచారిస్తున్నానో. నా కిప్పు డంతా అయోమయంగా వుంది."

అతను మాటలకోసం తడుముకోవటం రాజేశ్వరమ్మ గ్రహించింది. ఆమె కతను చాలా దీనంగా కనిపించాడు. అతను తన ప్రవర్తన నేమీ ఖండించుకోవటంగాని, క్షమాపణకోరటంగాని చెయ్యలేదు. అతను భయోత్పాతంలో మాత్రం వున్నాడు.

ఒకవేళ కర్మవశాత్తున ఆమెగాని అప్పుడు చావకుండా బ్రతికితే, అతను మరునాడు మళ్ళీ అదే జీవితాన్ని గడిపి, ఆమెను యింకోసారి పరిత్యజిస్తాడు. కాని ఆమె చనిపోతోంది. ఆమె మరణం అతని కేమీ పాఠాన్ని చెప్పలేదు. పైగా అతను అనవోయత చూపే ఒక దుఃఖకరమైన పరిస్థితిమాత్రమే అది.

ఆమె మళ్ళీ అతనికేసి చూసి చిరునవ్వు నవ్వింది. "నాకు సెల వివ్వండి. మీమీద నాకు కోపం లేదు—ప్రమాణ పూర్వకంగా చెబుతున్నాను. ఇప్పుడు కాకపోయినా ముందు ముందు యీ నా వాక్యాలు మీకు సంతృప్తి నివ్వకపోవు." అన్నది.

ఆమె మాట్లాడటం పూర్తిచెయ్యగానే- "నీ కేమన్నా తీర్చవలసిన కోరిక లున్నాయా?" అని అత నడిగాడు.

"నా కే కోరికలూ లేవు. నేను మిమ్మల్ని కోరేదిగాని, మీకు సలహా యిచ్చేదిగాని ఏ విషయమూ లేదు. మీ హృదయం ఏది కోరితే అది చెయ్యండి."

వాళ్ళ కొమార్తె విషయమై ఆమె మాటాడలేదు. అతను నిలబెట్టని ప్రమాణాలు అతనిచేత చేయించుకోవటం అనవసరం అనుకొంది ఆమె.

తరవాత సున్నితంగా "నాకు సెల వివ్వండి, మీరు మనస్సును పాడుచేసుకోకండి" అంటూ ఆమె ఆఖరుసారి అతన్నిచూసి కళ్ళు మూసింది. అతను ఆమెదృష్టి తాళలేక కొంచెం పక్కకు జరిగాడు.

సేవకులు వైద్యుణ్ణి తీసుకురావటానికి వెళ్ళారు. వైద్యుడుకూడా నిరాశ చెందుతూనే అదే సమయానికి అక్కడికి వచ్చాడు, ఒక పురోహితుడుకూడా అప్పుడే వచ్చాడు. అతను రామనామాన్ని జపిస్తూ ఆమె నోట్లో తులసి దళంతో నీళ్ళుపోసి, తరువాత కర్మకాండను పూనుకున్నాడు.

అంతవరకూ ఒకమూల ఒదిగి అంతా పరికిస్తున్న రామబాబు పక్కగదిలోకి వెళ్ళి



జార్జిరాజు, రెండవ కుమార్తె ప్రిన్సెస్ మార్గరెట్. పందొమ్మిది సంవత్సరాలు నిండిన యీమెకు యువజనోద్యమాలంటే అభిమానం. వాండ్స్‌వర్త్ జిల్లా (లండన్ బస్తీ)లో యిటీవల జరిగిన యువజనసభకు వెళుతున్న దృశ్యం.





అక్కడ ఆడుకొంటూన్న సరోజను తల్లి దగ్గరకు తీసుకువచ్చాడు. సరోజను ఎత్తుకొని తల్లిని చూపించాడు.

సరోజ విడవలేదు. తన తల్లి పాలిపోయిన ముఖంకేసి అమాయికంగా, ఆశ్చర్యంగా చూసింది. తన తల్లి ముఖంమీది శాంతం, చిరునవ్వు చూసి సరోజకూడా అమాయకంగా నవ్వింది.

రాజేశ్వరమ్మ చనిపోయింది. ఆమె ముఖంలో ఒక విధమైన ప్రార్థన, ఒక విధమైన శాసనం కూడా బాబుకి కనిపించాయి. అతను సరోజను ఎత్తుకునే వున్నాడు. అతని కర్తవ్యం ప్రారంభమయింది.

సేవకులు దీపాలన్నీ వెలిగిస్తున్నారు పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు. బాబు సరోజను ఎత్తుకునే వున్నాడు. ఆగదిలో జనం ఎక్కువ కాగానే పక్క గదిలోకి వెళ్ళిపోయి కిటికీమూల నిలుచుని ఏడ్వటం ప్రారంభించాడు. సరోజ మాత్రం కిటికీలోంచి రోడ్డుమీద పోయే బళ్ళ దీపాలకేసి వింతగా చూస్తోంది.

(ఇంకా వుంది)

# సంవిధానం

ఆరుద్ర

సంవిధానం అంటే రచించే విధానం.

కవిత్వం ఉద్రేకజనితం. ఉద్రేకానికి సరిపోయిన పదాలు, సమాస నిర్మాణం ఉన్నప్పుడు కవిత్వంలో ఔచిత్యం, అందం తొణికిసలాడుతాయి. చెయ్యి తిరిగిన రచయితల కవిత్వంలో నిగూఢంగా కొంత, ఉపరి భాగంలో కొంత సంవిధానం కనబడుతూ ఉంటుంది.

పరశురాముడు శత్రురాజుల్ని చెప్పలేనంత కోపంతో చావచంపేడు. ఈ సంగతి చెప్పడానికి నన్నయగారు శార్దూలవృత్తం వాడేరు. నిజంగా శార్దూలం నిప్పులు కక్కగలిగిన వృత్తం. 'ఉద్ధతమదాంధీభూత విద్వేషి భీమోగ్రశ్వసనుండు' రాముడు, అలుకన్ రణక్రీడతో 'దీర్ఘ నిర్ఘాత క్రూరకుఠారలూన నిఖిలక్షత్రియ కాంతారుడై' జంపెం వైరి ధరాతలేశ్వరుల బల్వరన్ అన్నది ఆ పద్యానికి దండాన్వయం. రాముడు అన్న పదానికి విశేషణంగా వాడిన 'ఉద్ధత...' సమాసం అతడి అలుకని శబ్దాలతో స్ఫురింప చేస్తుంది. 'దీర్ఘ నిర్ఘాత-' అనే సమాసం రణక్రీడని ఆమోఘంగా చూపెడుతుంది. మొత్తంమీద పద్యమంతా అలుకని శుద్ధధ్వనితో చెపుతున్నాది.

అలాగే తిక్కన గారు కూడా వీర రసానికి ఒక శార్దూలాన్ని వాడేరు. ద్రౌపది నయాన చెప్పినమాటలు కీచకుడి బుర్ర కెక్కలేదు. భయాన చెప్పాలి. కీచకుడు సామాన్యుడు కాడు; సింహబలుడు. లాకాయి లూకాయి వాళ్ళు అతడిని పడగొట్టలేరు. ద్రౌపది తన భర్తలు నిజంగా కీచకుడిని చంపగలరని చెప్పాలి. అందుకే తిక్కనగారు పద్యం ఎత్తుకోడంతోటే పెద్ద సమాసం వాడేరు. గుక్క తిప్పుకోకుండా "దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోక ప్రతాప స్ఫురద్గర్వాంధ ప్రతివీరనిర్మథన విద్యాపారగుల్" అని ద్రౌపదిచేత ఆమె భర్తల గురించి చెప్పించేరు. నాలుగు పాదాల పద్యంలో ఈ సమాసం ఒకటిం ముప్పాతిక పాదాలు విస్తరిల్లింది. నిజంగా సింహబలుడిని ఆ అయిదుగురూ చంపగలరని ఈ సమాసమే శబ్దశక్తితో చెపుతున్నాది.

నిగూఢంగా ఉన్న సంవిధానం దాన్ని తెలుసుకొన్నాక పాఠకుడికి చక్కటి తృప్తిని ఇస్తుంది. "తాసా మానవికాస వాసనల..." అన్న ముక్కుని వర్ణించే పద్యంలోని అనుప్రాసాలని గుర్తించేక కవి రచనలో చక్కటి ఔచిత్యాన్ని పాటించినందుకు మనకు ముచ్చటవేస్తుంది. దేవతాంశలని వర్ణించేటప్పుడు సాంప్రదాయం ప్రకారం ఒక క్రమంలో వర్ణించాలి. దాన్ని సగౌరవంగా లక్ష్యపెట్టక నిగూఢంగా కొత్త మార్గాలు తొక్కుతూ పైకి వినమ్రంగా కనబడే నన్నెచోడుడి తిరుగుబాటుని వార్జించేందుకు అతడి అసమాన సంవిధానం ముఖ్యకారణం. (చూ: ఆంధ్ర వార పత్రికలో తిమ్మావఝ్ఝులవారి వ్యాసాలు).

నాటినుంచి నేటిదాకా ఒక్కొక్క కవి ఒక్కొక్క సంవిధానాన్ని వాడుతున్నాడు. పరిపూర్ణమైన సంవిధానమే కావ్యంయొక్క చిరంజీవత్వానికి ముఖ్యకారణం. దాన్ని తెలుసుకోవడం అవసరం.

ఇటీవలి రచయితల సంవిధానం గురించి తెలుసుకొనేముందు ప్రత్యేక ఛందాలు ప్రత్యేక సంవిధానంవల్ల ఎలా పరిపక్వత పొందుతాయో చూడాలి. నన్నయగారికి ఏ ఛందంమీదా పక్షపాతం ఉన్నట్టు కనబడదు. తిక్కన్నగారు కందానికి అందం తెచ్చారు. నన్నెచోడుడి సీసం శ్రీనాథుడి చేతిలో వన్నెలు దిద్దుకొంది. ఒక్కొక్క కాలాని కొక ఛందం పైకి వచ్చింది. చివరికి గురజాడ అప్పారావుగారు ముత్యాల సరాలు ఆంధ్ర సరస్వతికి సమర్పించేరు. గీతం భావకవుల సొమ్ము. (నాయని సుబ్బారావుగారి చేతుల్లో గీతపద్యం తెలుగుతనం పొందింది). శ్రీ శ్రీ మళ్ళా ముత్యాల సరాలని అందుకొన్నాడు. వాటి సహజమైన మార్పు రకరకాల గేయాలకి దారితీసింది.

ఉపజ్ఞ ఉన్న కవి ఛందస్సుకి సంవిధానాన్ని మారుస్తాడు, గానీ అసంగతి పరోసారి.

సాంప్రదాయాన్నిబట్టి నేటి రచయితలు గేయాలమీద మక్కువ చూపుతున్నారు. వాటిలోనే రకరకాల సంవిధానాలు ఉన్నాయి. వాటిగురించి మాట్లాడుకొందాం.

'ఎక్కడున్నావే గొంగళీ?...'

# సంస్థానప్రజలు - స్వాతంత్ర్యం

మోపర్తి వెంకటరమణయ్య

స్వతంత్ర భారత ప్రభుత్వం సాధించిన ఘన విజయాలలో సంస్థానాల సమీకరణ ఒకటిగా పేర్కొనబడుతున్నది. ఈ విజయ గౌరవమంతా ఉపప్రధాని సర్దార్ పటేలుగారిదేననీ, వారి సమర్థతవల్లనే యిదంతా నెరవేరిందనీ చెప్పుతున్నారు. ఇది పూర్తిగా అసత్యం కాకపోయినా, అతిశయోక్తి అని మాత్రం చెప్పక తప్పదు. సంస్థానాలలోని ప్రజోద్యమాలు, సంస్థానాధిపతుల ముందుచూపుకూడా ఇందుకు చాలా తోడ్పడినవి. బ్రిటిష్ ఇండియాలోని ప్రజలు విదేశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న కాలంలోనే, సంస్థానాలలోని ప్రజలుకూడా తమ నిరంకుశ స్వదేశ రాజులపై స్వాతంత్ర్య సంగ్రామధ్వజ మెత్తారు. అయితే బ్రిటిష్‌వారు ఇండియాలో ఉన్నంతకాలం వారి సహాయంతో సంస్థానాధిపతులు ప్రజోద్యమాలన్నీ అణచివేయ గలిగారు. కాని బ్రిటిష్‌వారి నిష్క్రమణతో వీరిస్థితి నీటిలోనుండి బయటపడిన చేపలస్థితిలా తయారయింది. ఇకముందు తమ సంస్థానాలలోని స్వాతంత్ర్యోద్యమాలను యెదుర్కోవాలంటే తమ దగ్గర అంత శక్తిలేదు, పూర్వంవలె బయటినుండి సహాయం లేదు. తమ స్థితి యింకా అధ్వాన్నం కాకముందే మేలుకోవటం మంచిదని గ్రహించారు. ఇంతవరకు బ్రిటిష్ ప్రభుత్వంవారి దయాధర్మాలపై బ్రతుకుతున్న వీరు, యికముందు కాంగ్రెస్ ప్రభుత్వపు అనుగ్రహం సంపాదించటం అవసరమనికూడా గ్రహించారు. దీనికి తగినట్లు కాంగ్రెస్‌వారికి కూడా సంస్థానాల విషయంలో విప్లవకరమైన మార్పులు ప్రవేశపెట్టటం యిష్టం లేకపోయింది. ఇది కారణంగా భారత ప్రభుత్వంవారికీ సంస్థానాధిపతులకూ స్నేహం కుదిరి ఉభయతారకంగా ఉండే విధానం అవలంబిస్తున్నారు. ఏదోవిధంగా సంస్థానాలపై తమకు పైకైనంత యెక్కువ అధికారం యేర్పడితే చాలునని భారత ప్రభుత్వంవారు అనుకుంటే, 'చచ్చినవాడి పెళ్లికి వచ్చిందే చాలు' ననుకుంటున్నారు సంస్థానాధిపతులు. దీనితో సంస్థానాలలో శ్రీ పటేలుగారి విజయయాత్ర నిర్విఘ్నంగా సాగిపోతున్నది. అయితే యీ విధానంవలన ఎక్కువ లాభం పొందుతున్నది సంస్థానాధిపతులా లేక ప్రజలా అన్నదే చర్చనీయాంశం.

బ్రిటిష్‌వారు తొలగిపోయే సమయానికి మన దేశంలో మొత్తం చిన్నవి, పెద్దవి అన్నీ కలిసి 556 సంస్థానా లున్నవి. బ్రిటిష్ కాబినెట్ ప్లాన్ ప్రకారం, అంతవరకు బ్రిటిష్‌వారి సామంతులుగా ఉన్న యీ సంస్థానాధిపతులంతా ఒక్కసారిగా తెల్లవారేటప్పటికి సర్వ స్వతంత్ర పాలకులైనారు. అయితే బ్రిటిష్‌వారు పోతూ పోతూ వీరికి తమకు సన్నిహితంగా వుండే యేదో ఒక డొమినియన్‌లో—ఇండియాలోగాని, పాకిస్తాన్‌లోగాని— చేరవలసిందని హితోపదేశం చేసి మరీ వెళ్లారు. తిరువాన్కూర్, జూనాఘడ్, భోపాల్, హైదరాబాద్ లాంటి సంస్థానాధిపతులు మొదట పెడసరంగా ప్రవర్తించినా చివరకు నయాన కొందరు, భయాన కొందరు భారత ప్రభుత్వం చేతిక్రిందికి వచ్చారు.

భారత ప్రభుత్వ విధానాన్ని అనుసరించి సంస్థానాలను నాలుగు తరగతులుగా విభజించవచ్చును. (1) రాష్ట్రాలలో విలీనం చేయబడినవి. (2) కేంద్ర ప్రభుత్వ పాలనలోకి తీసుకోబడినవి. (3) సంస్థానాల యూనియనులుగా చేర్చబడ్డవి. (4) యథాప్రకారం ఉంచబడినవి. వీటిలో మొదటి తరగతికి చెందినవాటి సంఖ్య 214, విస్తీర్ణముదాదాపు లక్షచతురపుమైళ్లు, జనసంఖ్య 175లక్షలు. రెండవ తరగతికి చెందినవాటి సంఖ్య 25; విస్తీర్ణం దాదాపు 27 వేల చ. మైళ్లు; జనసంఖ్య 2౦ లక్షలు. మూడవ తర

గతికి చెందిన వాటి సంఖ్య దాదాపు 304 పై చిలుకు. ఇవన్నీ యూనియన్లుగా, యేర్పాటు చేయబడినవి. వీని మొత్తం విస్తీర్ణం 250 వేల చ. మైళ్లు, జనాభా 375 లక్షల పై చిలుకు. ఇక నాల్గవతరగతికి చెందినవి మూడు పెద్ద సంస్థానాలు—మైసూరు, హైదరాబాద్, కాశ్మీరు. ఇవిగాక బనారస్, మణిపూరు, త్రిపుర, ఖాసీ కొండల సంస్థానాల విషయంలో యింకా యే నిర్ణయం చేయబడలేదు.

సంస్థానాల విషయంలో భారత ప్రభుత్వ ప్రధాన లక్ష్యాలు రెండు—ప్రభుత్వాన్ని బలవత్తరం చేయటం; దేశంలో రాష్ట్రాలకు సంస్థానాలకును, ఒక సంస్థానానికి మరొక సంస్థానానికి మధ్యనున్న అసహజమైన అడ్డంకులు తొలగించి పారిశ్రామికాభివృద్ధి, వర్తక వ్యాపారాల విస్తరణకు అవకాశం కలిగించటం. వీటిలో మొదటి లక్ష్యం యెంతవరకూ సాధింపబడిందో యిప్పుడు పరిశీలిద్దాం. రాష్ట్రాలలో కలిపివేయబడినవి, కేంద్ర ప్రభుత్వపాలనలోనికి తీసుకోబడ్డ సంస్థానాలు పూర్తిగా భారతప్రభుత్వ అధికారం క్రిందికి వచ్చినట్లే. ఇక సంస్థానాల యూనియనుల అంతరంగిక పాలన నెరపేటందుకై రాజప్రముఖులు, ఉపరాజప్రముఖులు నియమింపబడ్డారు. అయితే ఆచరణలో వీరంతా భారత సంస్థాన శాఖామంత్రికి లోబడి పరిపాలించవలసిందే. ఇందుకే ఒక్కొక్క సంస్థానాల యూనియన్ ప్రభుత్వానికి ఒక్కొక్క సలహాదారును నియమించారు. ఈ సలహాదారులంతా సంస్థాన శాఖామాత్యుని మనుషులైనందున వీరు యూనియనుల పాలకులంతా కేంద్రప్రభుత్వ ఆజ్ఞలు జవదాటకుండా ఉండేటట్లు చూస్తూ ఉంటారు. ఇట్లు యీ సంస్థానాల యూనియనులన్నీకూడా ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా భారత ప్రభుత్వ అధికారం కిందికి వచ్చేటట్లు చేశారు.

ఈవిధంగా స్వదేశ రాజాలందరూ తరాజాలు చేయబడినా వారికి యితరవిధాల చాలా సౌకర్యాలు కలిగాయి. రాజ్యాంగం కోల్పోయిన సంస్థానాధిపతులకు పెద్దపెద్ద పెన్షనులు యేర్పాటు చేశారు. చిన్న సంస్థానాల విషయంలో యీ పెన్షనులు సంస్థానం మొత్తం రాబడిలో నూటికి 15 వంతులదాకా నిర్ణయించారు. వీరిలో కొందరికి ఉన్నతపదవులు, ఉద్యోగాలూకూడా కట్టబెట్టారు. శ్రీ భావనగర్ రాజాగారిని తీసుకువచ్చి చెన్నరాష్ట్రానికి గవర్నర్ చేశారు; ఫాల్టాన్ రాజాగారికి బొంబాయి మంత్రివర్గంలో స్థానమియ్యనున్నారు. మరికొందరు విదేశాలలో భారతప్రభుత్వ ప్రతినిధులుగా నియమింపబడ్డారు. ఇంతవరకు తమ సొత్తైన సంస్థానాలలో పాలన సాగిస్తున్న యీ నరేంద్రుల కిప్పుడు యీవద్ధ్యారత పరిపాలన వ్యవహారాలలో కలుగుబడి సంపాదించే అవకాశం లభించింది. వీరు తమధనాన్ని, విశ్రాంతిని వినియోగించుకొని దేశరాజకీయ రంగంలో ప్రముఖస్థానాలను ఆక్రమించ ప్రయత్నించకపోరు. దీనికితోడు వీరిలో కొందరు పారిశ్రామిక సంస్థలలో ప్రవేశించి దేశ ఆర్థిక రంగంలోకూడా పెత్తనం సంపాదించ చూస్తున్నారు. ఈ జమీందారీ, పెట్టుబడిదారీ వర్గాల కలయిక ఫలితంగా దేశంలో బలవంతమైన అభివృద్ధి నిరోధకవర్గం పెంపొందే ప్రమాదమేర్పడింది.

ఇక సంస్థానాల ప్రజలు 'ఎక్కడ ఉన్నావే గొంగళీ అంటే వేసినచోటనే ఉన్నా' నన్న స్థితిలో ఉన్నారు. ఈ నాటి వరకూ సంస్థానాలలో జాగీర్దారీ విధానం అలాగే ఉంది. వెట్టిచాకిరి, అధిక వసూళ్లు మొదలైనవన్నీ యథాప్రకారం సాగుతూనే ఉన్నవి. మూలవిరాట్ తొలగింపబడినా చిల్లర దేవుళ్ళకు చలనం లేదు. సంస్థానాల ప్రజలకు రాజకీయాధికారాలు ప్రసాదించి, పూర్తిగా బాధ్యతాయుత ప్రభుత్వాలు స్థాపిస్తామంటున్నారు. ఇప్పటికే చాలా సంస్థానాలలో కాంగ్రెస్ మంత్రివర్గాలు నెలకొల్పారు తాత్కాలికంగా. కాని యీ మంత్రివర్గాలు మన రాష్ట్రాలలోని మంత్రి వర్గాలకంటె హీనంగా ఉన్నవి. వీరికి అంతరంగిక కలహాలతో, పదవుల ప్రాకులాటలతోనే సరిపోతున్నది. ఇక ప్రజాశ్రేయస్సుకై పాటుపడేటందుకు తీరిక ఎక్కడ? రాజపుత్రస్థానం, తూర్పు పంజాబు, పాటియాలా సంస్థానాల మంత్రివర్గాలకు, అచ్చటి కాంగ్రెస్ సంఘాలకు మధ్య రేగిన కలహాలు లోకవిదితమే.

ష్టా అయితే అసలు మంత్రివర్గాలనే రద్దు చేస్తానని బెదిరించారు పటేలుగారు. కేంద్రప్రభుత్వపు కలంపోటుతో దొగిరి పోయే యీ మంత్రివర్గాలు యెంతవరకు ప్రజాస్వామ్య ప్రభుత్వాలనిపించుకోగలవో వారికే తెలియాలి.

దీనినిబట్టి యీ మంత్రివర్గాలన్నీ సంస్థాన శాఖామాత్యులకేగాని, సంస్థాన ప్రజలకు బాధ్యత వహించటంలేదని విదితం కావటం లేదా? కేవు సంస్థానాల్లో నూతనరాజ్యాంగాన్ని ప్రవేశపెట్టినా పరిస్థితులు యిందుకు భిన్నంగా ఉంటాయని ఆశించ వీలులేదు. రాష్ట్రాల ప్రజలకు వలెనే సంస్థాన ప్రజలకుకూడా కొన్ని నామమాత్రపు రాజకీయాధికారాలు లభించుతాయి. వీరు కావుకుంటున్నదే వారు కావుకుంటారు, అంతే. నామమాత్ర ప్రజాస్వామ్య విధానం ఎక్కడ ప్రవేశపెట్టినా, ఎవరు ప్రవేశపెట్టినా ఫలితం ఒకటే.

భారత ప్రభుత్వం పై విధానానికి మారుగా సంస్థానాధిపతులకు న్యాయమైన పరిహారమిచ్చి, సంస్థానాలన్నిటినీ రద్దుచేసి భాషా ప్రయుక్త విభజన సిద్ధాంతం అనుసరించి ఇరుగుపొరుగు రాష్ట్రాలలో కలిపివేస్తే ఇంతకంటె ఉత్తమంగా ఉండేది. అయితే వీరందరికీ పరిహార మివ్వటానికి ప్రభుత్వానికి యింత ధనం యెక్కడనుండి వస్తుందని ప్రశ్నించవచ్చును. ఇందుకు మార్గాంతరం లేకపోలేదు. ప్రస్తుతం రద్దుచేసిన సంస్థానాధిపతుల కిచ్చిన పరిహారం మితిమీరిపోయింది. న్యాయమైన పరిహారమంటే జీవనోపాధికి లోటులేనంత అని అర్థంకాని, సంస్థానాధిపతులను కొట్టుబడి దారులుగా తయారుచేసేటంత అని అర్థం కాదు. ఈ మొత్తాన్ని అంతటినీ ఒక్కసారిగా యివ్వవలసిన అవసరంకూడా లేదు. ఎవరో మరీ చిన్న సంస్థానాధిపతులకు తప్ప మిగిలిన వారందరికీ బాండులరూపంలో పరిహారమిచ్చి యీ బాండులు కొంత నిర్ణీతకాలంలో చెల్లుబడి అయిపోయే యేర్పాటుచేయటం అసాధ్యం కాదు. దీనికితోడు ప్రజలకు నామమాత్రపు రాజకీయాధికారంకాక, ప్రభుత్వాన్ని అదుపులో ఉంచుకొని తమ భవిష్యత్తు తాము నిర్ణయించుకొనే అధికారం, అవకాశం ప్రాప్తింపజేస్తే ప్రజాస్వామ్యము సార్థకమౌతుంది. అయితే నేటి మన నూతన రాజ్యాంగాన్ని పరిశీలిస్తే కనుచూపు దూరంలో యెక్కడా ఆశారేఖ కనిపించటంలేదు.



## కాలవు ....

'భాస్కర్'

హిమవన్నగ పరిశిఖరం - !
నా ధైర్యం, నాఆశ - ! కాలవు...
కాలవు వెనుకోఅల నోరు !
అగక పరుగెత్తే కాలవు...
ఆవరించి కమ్ముకొనే కాలవు...
కాలవు వెనుకోఅల నోరు !
నిజం - అబద్దం -
తెలియదు. ఏమీ తెలియదు.
హిమవన్నగ శిఖరాలే
వెక్కిలాడి, బెల్లురాలి, అంద విరిగి
పడిపోతే !
పిడుగుల కిక గొడుగు లెవరు
పట్టేరో ! నేనా !
నే నొక్కడ్నే ! ఇంత బరువు !
ఒక్కడ్నే ! నేనే ! గో——గో
పర్జనగిరి శక్తిలేదు. ఏమో

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీశీర్షిక క్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## రేడియో–బడిపిల్లల కార్యక్రమం

ఈనెల మొదటి పక్షానికి తెలుగులో వెలువడ్డ రేడియో కార్యక్రమాల పత్రిక ఆఖరిపేజీ అట్టకాగితం అలంకరించేరు రచయిత శ్రీశ్రీ, "మరో ప్రపంచ" మహాప్రస్థానంతో. క్రింద సెప్టెంబర్ 6వ తేదీ విద్యార్థుల కార్యక్రమంలో వినొచ్చున్నారు.

ఆ తేదీన ఆ సమయానికి మొదటి 15 నిమిషాలూ చైతన్య స్వామిగురించి యేదో ఒక ప్రసంగం వినిపించారు. తరువాత "యిప్పుడు బృందగానం వింటారు" అన్నారు. ఒకావిడ మొదలెట్టింది, సంగీత పాఠం ఫక్కీలో "యేదీ క్రిందటిసారి చెప్పింది పాడండి!" అంటూ. విద్యార్థులు "మరో ప్రపంచం మరో ప్రపంచం" అని యెత్తి మొదలెట్టేరు. కొన్ని చరణాలయేక "ఇంక క్రొత్తపాఠం వినండి" అని, "యెముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులారా చావండి" అని పాడి– "యెముకలు కుళ్ళిన అంటే యేమిటో తెలుసునా?" అనడిగి, "యెములు చిక్కిన" అని అర్థం చెప్పేరు. తరవాత "హరోమ్ హరో హర" అని పాడి, "హరోం హరోహర" అంటే యేమిటో తెల్సునా అనడిగి, "అంటే సర్వదా హరినే స్మరించండి" అని అర్థం చెప్పేరు. పరమ నాస్తికత్వానికి మూలకందంగా నిలిచే ఆ గేయానికి యిచ్చే వ్యాఖ్యానం, చెప్పే అర్థం అదా?

కాలంమళ్ళిన పెద్దల్ని, వృద్ధుల్ని దైవసములుగా భావించాలంటుంది- మన భారతీయ సంస్కృతి. మన పిల్లలకి చెప్పే తొలిపాఠంకూడా అదే. "యెముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులారా చావండి" అని శాసించే ఆ గేయం ముక్కు పచ్చలారని సెకండరీ విద్యార్థులకు ప్రబోధించడంలో సభ్యత ఏమిటి? అదే గేయం నుంచి మరో చరణం తీసి "సర్వదా హరినే స్మరించండి" అని విపరీతార్థంతో చెప్తారు! కాలం పైబడి తమ పిల్లల క్షేమం కోరే వృద్ధుల్ని "వయస్సు మళ్ళిన యెముకలు కుళ్ళిన సోమరులారా చావండి" అని శాసించటం వారి భక్తి పరాయణత్వానికి గుర్తు ఎలా అవుతుంది! విచక్షణ జ్ఞానం వుండని బడిపిల్లల మనస్తత్వాలలో చెలగాటలాడటం దేశాభ్యున్నతికి, ప్రజాస్వామ్య సిద్ధాంతాలకి- కాదు జాతి మనుగడకే ఒక పెద్ద గొడ్డలిపెట్టు. దీనికి రేడియో వారిచ్చే సమాధానం తెలుసుకోవాలని వుంది.

ప్రజాస్వామిక సిద్ధాంతాల్లో నమ్మకమున్న ప్రతి రేడియో శ్రోతా- ముఖ్యంగా విద్యార్థుల తలిదండ్రులు, ఉపాధ్యాయులు పట్టించుకు ప్రజాస్వామ్యంపేర పగలూ రాత్రీ కాలక్షేపం చేసే కాంగ్రెస్ పెద్దలకి చూపించాలి వాళ్ళ కాళ్ళక్రిందే త్రవ్వబడుతున్న కందకాలు.

విజయనగరం ఈ. సత్యనారాయణరావు

# తెలుగు స్వతంత్ర

## విషయసూచిక



సంపుటి 2. సంచిక 8.
శుక్రవారం, సెప్టెంబరు 23, 1949





పుట



చిత్రకారుడు : దేవీప్రసాద్ రాయ్ చౌధురీ

## భవిష్యత్తులో చిత్రకళ:

ఇక వంద సంవత్సరాల తర్వాత, స్వర్గ భామినులు ఊర్వశి, మేనకలు చిత్రకారుల చేత ఈవిధంగా చిత్రింపబడతారు.

అయితే, ఒక ప్రశ్న: అంతవరకూ స్వర్గమనేది నిలిచి ఉంటుందా, అని –

# స్వతంత్ర

సంపుటి-2
సంచిక-8

సెప్టెంబరు 23, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## భవిష్యత్కార్యక్రమం ఏమిటి?

దేశాన్ని ఎదుర్కొన్న ఆర్థిక సమస్య గురించి కేంద్రప్రభుత్వ అధికారులు నిశితంగా ఆలోచిస్తున్నారనీ, దానిని పరిష్కరించే సూత్రాలు త్వరలోనే కనిపెడతారనీ హామీ యిచ్చే వార్తలు ఆమధ్య ఢిల్లీనుండి అనునిత్యం వెలువడుతూండేవి. అలా కొన్ని రోజులు ఎడతెగకండా వచ్చిన వార్తలు, సూచనలు, "అభిజ్ఞ" వర్గాల ఊహాగానాలు, "విశ్వసనీయ" వర్గాల అభిప్రాయాలు—హఠాత్తుగా, కారణమేమిటో తెలియకండానే ఆగిపోయాయి. అతిముఖ్యమైన సమస్య గురించి ప్రభుత్వం ఆ విధంగా మౌనం తాల్చడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. రకరకాల భయాలకు, అభిప్రాయాలకు తావిచ్చింది. వాషింగ్టన్‌లో జరిగిన డాలర్ స్టెర్లింగ్ చర్చల పర్యవసానం వల్ల మనకేదయినా ఆర్థిక సహాయం లభిస్తుందని కేంద్ర ప్రభుత్వం ఆశించి ఉంటే, స్టెర్లింగ్ మారకపు విలువ తగ్గింపుతో అందరికీ కనువిప్పు అయుంటుంది. స్థూలంగా పరిశీలిస్తే, నేడు ఇంగ్లండు ఆర్థికసమస్యలకీ, మన ఆర్థికసమస్యలకీ తేడా లేదు. మనమూ, వాళ్లూ ఆహారపదార్థాలలో కొంతభాగం అమెరికానుండి కొనుక్కోవాలి; ఇంకా ఎన్నో అమెరికానుండి దిగుమతి చేసుకోవాలి. అందుకుగాను కావలసిన డాలర్లు అమెరికాకు సరుకు ఎగుమతి చేసి ఆర్జించాలి. అమెరికాతో వ్యాపారం చేసే ప్రతి దేశానికీ యిక్కడే వస్తుంది చిక్కు. అమెరికాకు తక్కిన దేశాలనుండి కావలసిన సరుకు బహు తక్కువ; తక్కిన దేశాలకి అమెరికా నుండి కావలసినవి బోలెడు. ఇండియా ముఖ్యంగా వ్యావసాయిక దేశం; ఇంగ్లండు ముఖ్యంగా పారిశ్రామిక దేశం. కాని అమెరికా రెండు రకాల వస్తువుల్నీ అపారంగా ఉత్పత్తి చేస్తుంది. అంచేత భారతదేశం గాని, ఇంగ్లండు కాని అమెరికాకు ఋణపడకుండా ఉండాలంటే ఒక్కటే మార్గం: మనం ఎంతమేరకు అమెరికా నుండి సరుకు దిగుమతి చేసుకుంటున్నామో, అంతమేరకు అమెరికా మన దగ్గిర సరుకు కొనాలి.

డాలరుతో బ్రిటిష్ పౌను మారకం రేటు తగ్గిస్తే, ఇంగ్లండు నుండి అమెరికాకు ఎక్కువ సరుకు ఎగుమతి చెయ్యడానికి వీలవుతుందని సర్ స్టాఫర్డ్ క్రిప్సు అంచనా. పౌను విలువ తగ్గగానే, దాని కివ్వవలసిన డాలర్లు తగ్గుతాయి. డాలరు కొనుగోలు శక్తి హెచ్చు

తుంది. అందువల్ల అమెరికా వ్యాపారస్థులు ఇంకా ఎక్కువ బ్రిటిష్ సరుకులు కొంటారు. బ్రిటన్ ఎక్కువ డాలర్లు సంపాదించడానికి అవకాశం కలుగుతుంది. అయితే, యీ విధంగా ఎన్నాళ్లు జరుగుతుంది? తమ మార్కెట్టులోకి బ్రిటిష్ సరుకులు పోటీకి వస్తే అమెరికాలోని ఉత్పత్తిదారులు వూరుకుంటారా? తమ ఉత్పత్తి కర్చులు తగ్గించుకుని, సరుకుల ఖరీదు తగ్గిస్తారు. అమెరికా ఉత్పత్తిదారుల వద్ద అపారమైన మూలధనం ఉంది. అమెరికాలోని కార్మికుల సామర్థ్యం జగద్విదితం. ప్రపంచంలోని ఏ దేశపు కార్మికుల కంటే అమెరికా కార్మికుడి "టర్న్ ఓవర్" జాస్తి. అందుకు ఒక కారణం అధునాతనమైన ఉత్పత్తి సాధనాలు. ఈ రీతిగా, కార్మికుల వేతనాలు ఎక్కువయినప్పటికీ, అమెరికా ఉత్పత్తిదారుడు కర్చు తగ్గించుకుని వస్తువులు పోటీలో చవకగా అమ్మగలడు. కాలక్రమాన బ్రిటన్ యీ పోటీలో నిలువగల్గుతుందా అనేది సంశయాస్పదం. అయితే పౌను విలువ ఎందుకు తగ్గించినట్లు? గత్యంతరం లేక తాత్కాలికంగానైనా కొంత ప్రయోజనం ఉంటుందని.

ఏది యెలా ఉన్నా, బ్రిటన్ పౌను మారకం రేటు తగ్గించడం వల్ల ఇంగ్లండులో కలిగే పరిస్థితి వేరు: రూపాయి మారకం రేటు తగ్గించడంవల్ల ఇండియాలో కలిగే పరిస్థితి వేరు. కారణం, రెండు దేశాల్లోనూ ప్రస్తుతం అమల్లోనున్న ప్రభుత్వాల ప్రణాళికలోని తేడా. స్వదేశానికి సంబంధించినంతవరకూ, ఇంగ్లండుది సోషలిస్టు ప్రభుత్వం. ఈ సందర్భంలో యిటీవలి బ్రాడ్‌కాస్టు ఉపన్యాసంలో సర్ స్టాఫర్డ్ క్రిప్సు యిలా అన్నాడు: "ప్రజల కనీసపు జీవనావసరాలకి భంగం కలగకండా, మన పరిశ్రముల ఉత్పత్తి కర్చులు తగ్గించే మార్గం అనుసరించాలి. పూర్వకాలంలో అయితే, కార్మికుల వేతనాల తగ్గింపువల్ల, నిరుద్యోగంవల్ల, దివాలా పరిస్థితులవల్ల ఉత్పత్తి తక్కువ కర్చుతో జరిగేది. నిరుద్యోగులకి ఆనాడు ముడి పదార్థాల అవసరమే ఉండేది కాదు: కార్యం చేసేందుకు వాళ్ళకి పనిలేదు. ఆర్జన లేనందువల్ల వాళ్ళు కొనుక్కోగలిగిన ఆహార పదార్థాలు సైతం అట్టే వుండేవి కావు. ఈ రీతిగా, విదేశీ దిగుమతుల కయ్యే కర్చు ఆనాటి ప్రభుత్వాలకు తక్కువగా ఉండేది. వేలకొద్దీ నిరుద్యోగుల్ని సృష్టించగల్గినాను వాళ్ళ భయాన్ని, దారిద్ర్యాన్ని ఆధారంగా తీసుకొని, వేతనాలు తగ్గించడం జరిగేది. ఈ మాదిరిగా సరుకు తక్కువ ఖరీదులో తయారై విదేశీ మార్కెట్టులలో పోటీకి నిలిచేది. ఈనాడు ప్రస్తుతపు ప్రభుత్వం అటువంటి విధానాలు అనుసరించడం అసంభవం. దేశంలోని యావత్తు ప్రజానీకపు ఉత్పత్తి శక్తిని వినియోగించి అందరికీ ఉద్యోగం కల్పించడమే మా ఆశయం. అడిగిన ప్రతివారికీ పని కల్పించడం ప్రభుత్వ కర్తవ్యం. కుబేరసంపదల మధ్య కుచేల దారిద్ర్యం ఉండే వెనకటిరోజులు మళ్ళీ రాకూడదు. అందుకే యీ ప్రయత్నమంతా." సమాజ క్షేమంకోసం కార్మికులకూ, మధ్యతరగతి ప్రజలకూ ప్రభుత్వం కలిగిస్తున్న సౌకర్యాలేమీ తగ్గింప

బడవని క్రిప్సు హామీ యిచ్చాడు ప్రభుత్వ ప్రణాళికలన్నీ యథాతథంగానే నడుస్తాయి. ఒక్క రొట్టె ఖరీదు తప్ప, యింకే జీవితావసరాల ఖరీదులూ హెచ్చవు. ప్రభుత్వం కర్చు బాగా తగ్గించుకుంటుంది. ఈ రీతిగా, క్లిష్ట పరిస్థితులలో ఉన్న బ్రిటిష్ ప్రజానీకానికి నేడు ప్రభుత్వం సరియైన వారి చేతుల్లో ఉందనే హామీ ఉంది; ప్రజాజీవితంతో చెలగాటం ఆడడానికి అక్కడి పెట్టుబడిదారులకు అవకాశం లేదు.

ఇక భారతదేశం విషయం పరిశీలిస్తే, రూపాయి మారకపు విలువ తగ్గించడం వల్ల ప్రస్తుతానికి అన్నీ నష్టాలే కలుగుతాయి. మార్కెటులో ఉన్న అమెరికా తయారీ వస్తువుల ఖరీదు కనీసం నూటికి ముప్ఫైపాళ్లు పెరుగుతుంది. అమెరికా నుండి మనకి దిగుమతి అయే భారీ యంత్రాలు, చిన్న యంత్రాలు, విడి భాగాలు, పనిముట్లు, అన్నిటి ఖరీదూ పెరిగిపోతుంది. అంతటితో తమకి రక్షణ కావాలని మన పారిశ్రామికులు నినాదాలు లేవదీస్తారు. కొన్ని వర్గాలనుండి అప్పుడే యీ నినాదాలు ప్రారంభమయాయి. ప్రభుత్వం వారి ప్రణాళికలు ఏరూపం తాలుస్తాయో పరిశీలించవలసి ఉంటుంది. ఆహారపదార్థాల దిగుమతులు, అధికాహారోత్పత్తికి కావలసి వచ్చే యంత్రాలు, ట్రాక్టర్లు- యివన్నీ యింకా ఎక్కువ డబ్బు వెచ్చించి కేంద్రప్రభుత్వం కొనవలసి ఉంటుంది. ఈ అదను చూసుకుని మన పారిశ్రామిక వేత్తలు, వణిక్పుంగవులు కేవలం సరదాకోసం అన్ని తయారీ వస్తువుల ఖరీదులు హెచ్చించవచ్చును. అటువంటి ప్రవర్తన సహించబోమని ప్రభుత్వం ప్రకటనల ద్వారా హెచ్చరించినా, ఆచరణలో ఏమీ చెయ్యలేక పోవచ్చును. మన కేంద్రప్రభుత్వానికి నిర్దుష్టమైన ఆర్థిక ప్రణాళిక ఏదీ లేదు. భిన్న సమయాల్లో భిన్నమైన అభిప్రాయాలను వెలిబుచ్చే ప్రభుత్వాధికారులు, తమ పరిస్థితి రోజుకు రోజుకూ దుస్తర మవుతున్నదని మహోపన్యాసాలిచ్చే పారిశ్రామిక వేత్తలు, పెట్టుబడిదారులు, ప్రభుత్వం కార్మికులకు అన్యాయం చేస్తోందని ఎలుగెత్తి చాటే కార్మిక నాయకులు- అంతా ఒకరినొకరు విమర్శించుకోవడంతో కాలక్షేపం చేస్తున్నారు. రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా సెంట్రల్ బోర్డు నివేదికలో యిలా పేర్కొనబడింది: "మొత్తం మీద చూస్తే, సంవత్సరం క్రితం కన్న నేడు పరిస్థితులు మరీ విషమంగా ఉన్నాయి. వస్తువుల ఖరీదులు తగ్గే సూచనలు లేవు. పరిశ్రమల్లో ఎక్కువ పెట్టుబడి పెట్టడానికి ముందుకు వచ్చే ధనం తక్కువ. ముడిపదార్థాల కొరత, యంత్రాల విడిభాగాలు దొరక్కపోవడం, రవాణా సౌకర్యాలలో రద్దీ, యీ కారణాల వల్ల మామూలు పరిస్థితికి దేశం రావడానికి వీలులేకుండా ఉంది. ప్రస్తుతం మనకి ఉత్పత్తి ఎక్కువ కావాలి; ఇంకా అధికంగా దేశీ సరుకులు ఎగుమతి చెయ్యాలి."

రూపాయి మారకం తగ్గింపు గురించి మాట్లాడుతూ, సోషలిస్టు నాయకుడు శ్రీ అశోక మెహతా యిలా అన్నాడు: "రూపాయి విలువ తగ్గడం వల్ల ప్రస్తుతం అమల్లో ఉన్న ధరలు యిలాగే

శాశ్వతంగా నిలిచిపోతాయి. ఇంకా ఎక్కువవుతాయి గాని తగ్గవు. అంచేత, ధరల హెచ్చింపుకి అనుగుణంగా కార్మికుల వేతనాలు హెచ్చించి తీరాలి... ఈ తరుణంలో కార్మికలోకం అప్రమత్తతతో ప్రవర్తించాలి. వారి భుజస్కంధాలమీద యింకా బరువు ఎత్తడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి"

అఖిలభారత పారిశ్రామిక వేత్తల సమావేశంలో ఉపన్యసిస్తూ, శ్రీ శాంతిప్రసాద్ జైన్, కార్మికుల వేతనాలు హెచ్చినకొద్దీ ఉత్పత్తి తగ్గిపోతుందని అంకెలతో సహా నేర్పుగా రుజువు చేశాడు. ఈయనకు సమాధానం చెపుతూ, పారిశ్రామిక మంత్రి డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీ, పారిశ్రామికులు లాభాలు తగ్గించుకుని, ఖర్చులు తగ్గించుకుందికి లవలేశమైనా ప్రయత్నం చెయ్యడంలేదని నేరారోపణ చేశాడు. దానికి పారిశ్రామికవేత్తల ఎదురు ప్రశ్న యిది: ప్రభుత్వం తన ఆదాయాన్ని ఎంత దుర్వినియోగం చేస్తోందో ఎప్పుడైనా ఆలోచించిందా?

పరిస్థితులిలా నడిచినన్నాళ్లు మన ఆర్థికసమస్య మరింత క్లిష్టతరం అవుతుంది. ఈ చిక్కు విడదీయవలసిన బాధ్యత కేంద్ర ప్రభుత్వానిది. పారిశ్రామిక వేత్తల బెదిరింపులకు లొంగిపోక, మనకు ఉన్న పారిశ్రామిక అవకాశాల్ని పూర్తిగా వినియోగింపచేసి, ఉత్పత్తి అధికం కావించే మార్గాలు కేంద్రం అన్వేషించాలి: ఆహారోత్పత్తి స్వయం సమృద్ధం కావాలి. మన పరిశ్రమలూ, ఆహారపదార్థాలూ- అన్నిటికీ విదేశీదిగుమతులపై ఆధారపడవలసిన ఆర్థికవ్యవస్థ దేశపతనానికి దారి తీస్తుంది. ఇప్పటికైనా కేంద్రప్రభుత్వం మేలుకుని, భవిష్యత్కార్యక్రమం నిర్ణయించుకోవడం అత్యంతావసరం.




మాట వరసకి మాధవయ్యగారు అనుకుందాం. ఆయన మా చిన్నప్పుడు మావూరి మునిసిపాలిటీకి "చేర్మేను"గా ఉండేవారు. ఒకే పలుకుబడికల వ్యక్తి. ఆయన నిత్యం హాసావాసూట్టే ధరించేవాడు. ఆయనకి ఊళ్లో నాలుగైదు సారా దుకాణాలూ, ఒక [illegible] సినిమా హాలూ, సోడా ఫ్యాక్టరీ — వగైరాలు ఉండేవి. నలుగురు అన్నదమ్ముల్లోనూ మాధవయ్యగారు ఆఖరివాడు. పట్టణ రాజకీయాల్లో మాత్రం ప్రథముడు. 'చేర్మేను' అంటే పట్టణపితలాంటివాడు కదా మరి! ఆరోజుల్లో మాధవయ్యగారికి ఉండుకున్న అవసరాలు బహుకొద్దే అయినా, ఘనమైనవి: అంటే, యుగయుగాలనుండీ మానవుడు హృదయంలో పదిలంగా దాచుకున్న సౌఖ్యానుభూతులే ఆయన అవసరాలు: అవేళ స్త్రీహారిణభాషితం కాని రసపుష్టికల భోగాలు. పెద్దలతోటి సాంగత్యం, పేకాటలోని మాధుర్యం, కలకంఠి పరిష్వంగోపలబ్ధి. ఇన్ని ప్రశంసనీయమైన గుణగణాలు

ఒక చోట పోగుపడ్డం చూసి, పుర ప్రముఖులంతా విభ్రాంతులై ఆయన్ను చేర్మనుగా ఎన్నుకున్నారు. ఒకసారి యెన్నుకున్నాక, అక్కడే సుస్థిరంగా ఉండే ఏర్పాటుకి అవసరమైన మార్గాలేమిటో ఆయనకి తేటతెల్లంగా తెలిసిపోయాయి. అసలే శ్రీమంతుడు. ఒకనాడైనా పొలాలకి వెళ్లవలసిన కర్మ ఆయనికెన్నడూ పట్టలేదు. అంచేత పుట్టుకతో వచ్చిన బుద్ధిని చాంచల్యం లేకండా కాపాడుకుంటూ వచ్చాడు. అంచేత తెలిసిపోయిన మార్గాలని అమలులో పెట్టడానికి ఆయనకి అడ్డేమిటి?

ఎలక్షను రెండుమాసా లుందనగానే ఊరిలో కోలాహలం ప్రారంభమయేది. ఆ రెండు మాసాలూ పట్టణం దేవేంద్ర వైభవంతో ప్రకాశించేది. రంగురంగుల తోరణాలు, ఊరేగింపులు, భజనలు, ప్రభాత భేరీలు, బహిరంగ సభలు. ఊళ్లోని ప్రతి క్లబ్బూ ఒక అగ్నిమిత్రుని ఆస్థానమయేది. ఇక మాళవికలకు లోటేమున్నది? "మీవోటు ఎవరి కిస్తారు?" "మీ వోటు ఊదారంగు పెట్టెలో వెయ్యండి." "పదకొండో వార్డు అభ్యర్థి మాధవయ్యగారికే మీ వోటు." ఈ రకరకాల ప్రబోధాలతో ఊరిగోడల నిండా ప్రకటనలు. కాఫీ క్లబ్బుల్లో చర్చలు. పురజనులు ఎవరి మొహాన్నైనా చూసినా నవనవోన్మేషోత్సాహమే. పోలింగు రోజువాడు ఊళ్లో ఒంటెద్దుబళ్లు, జట్కాలు (అప్పట్లో రిక్షాలు లేవు) అన్నీ మాధవయ్యగారే బాడుక్కి తీసుకునేవారు. ఆ వొక్కరోజూ ఏ కాఫీ హోటలులోనైనా సరే ఫలహారంచేసి, ఎవరైనా సరే, మాధవయ్యగారి పేరు చెప్పేస్తే చాలు - బిల్లు చెల్లించ నక్కరలేదు.

ఈవిధంగా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల వైవాహికోత్సవంవలె — కౌన్సిలర్ ఎలక్షన్లు గడిచిపోయేవి. ఆపైన చేర్మన్ ఎలక్షన్. దురదృష్టవశాత్తూ యీఎన్నికలోకి పురజనులు రారు. ఇంక చేర్మన్ ఎన్నిక మూడురోజు లుందనగా, కౌన్సిలర్లలో అధికభాగం అదృశ్యమైపోయేవారు. మాధవయ్యగారి భక్తశ్రేణిద్వారా వార్తలు తెలిసేవి—కౌన్సిలర్లు మాధవయ్యగారింట్లో సురక్షితంగానే ఉన్నారనీ, ఆయన ఆతిథ్యానికి కడుంగడు సంప్రీతు లయారనీ. నిత్యారామ విందులు, పేకాటాణీలు. ఆ మూడురోజులూ మూడు లిప్తలవలె వారికి గడిచిపోయి, 'పసిడి రెక్కలు విసిరి కాలం పారిపోయిన జాడ' లే తెలిసేవి కావు. ముహూర్తకాలానికి అందరూ కార్లలో వచ్చి, కలక్టరుగారి సమక్షంలో మాధవయ్యగారికి వోటువేసి కర్తవ్యం ముగించుకునే వారు. జయజయ ధ్వానాలు. తిరిగివిందులు. బాణాసంచా. ఈవిధంగా మాధవయ్యగారు పదహారు సంవత్సరాలు ఏకతాటిచేర్మనుగా పరిపాలన సాగించారు. కాలక్రమాన ఆయనకు 'రావుసాహేబ్' బిరుదు రావడమూ, ఆయన తైలవర్ణ చిత్రం కౌన్సిలు హాలులో ఆవిష్కరింపబడటమూ (అప్పటి గవర్నరుగారి చేత) జరిగాయి

* * *

ప్రజాస్వామ్యం అంటే ఏమిటో, అందులోని సుడిగుండాలూ, ఊసరవెల్లి రంగులూ అర్థం చేసుకోదల్చుకున్న వారంతా, ప్రజాస్వామ్యంమీద మాధవయ్యగారి దిగ్విజయం పరిశోధన చెయ్యవలసి ఉంటుంది. కనీసం తెలుగు దేశానికి సంబంధించినంత వరకూ, చాలా మునిసిపాలిటీలలోనూ, జిల్లాబోర్డుల్లోనూ చాలామంది మాధవయ్యలు ఉన్నారు. ఈ మాధవయ్యలు అనుసరించే విధానాన్ని "మాధవయ్యత్వం" అందాం. మా వూరి మునిసిపాలిటీ చక్కని ఉదాహరణంగా ఉపకరిస్తుంది. అవూరు కూడా అన్ని వూళ్ళలాంటిదే: ఆమాట కొస్తే చాలా వూళ్ళకంటె అవూరు చారిత్రికంగా ఆంధ్ర సంస్కృతికీ, విద్యా విభవాలకీ, లలితకళల పోషణకీ పేరెన్నిక గన్నది. అటువంటప్పుడు అవూరిలోని ఓటర్లంతా ఇంగితజ్ఞానం లేని కుంతలే ననుకోవడం హాస్యాస్పదం. అందులో మునిసిపాలిటీ ఎన్నికలు క్లిష్టమైన రాజకీయ సూత్రాల అవగాహనకి గాని, అవర్గాలలో అభిప్రాయ విభేదాలకి గాని అవకాశం లేదు. మునిసిపాలిటీ నిర్వహించవలసిన విధులు స్పష్టమైనవి పరిమితమైనవి. మునిసిపాలిటీ సక్రమరీతుల్లో నడిపించడానికి సభ్యులకి కావలసిన అర్హతలు ఏమిటో అందరికీ తెలుసు. మాధవయ్యగారికి పరిపాలనా దక్షత ఏమైనా ఉన్నదా? పట్టణప్రజల కష్టసుఖాలు ఆయ కేమైనా ప్రత్యేకంగా తెలుసుకున్నాడా? ఇళ్ళపన్నులు సక్రమంగా విధింప

అనుకున్నారో లేదో, నగరం శుభ్రంగా ఉంచడానికి ఏ చర్యలు తీసుకోవాలో, మునిసిపాలిటీ ఆదాయమెంతో, అది ఏ విధంగా ఖర్చుపెట్టవలసి ఉందో, మొదలైన విషయాలు మాధవయ్యగారికేమైనా తెలుసా? నాడు ఓటర్లెవరూ యీ విధంగా ఆలోచించలేదు. మరి మాధవయ్యగారిలో ఏ ప్రత్యేకతలు చూసి హర్షించి ఓట్లు వేశారు?

ఆయన బాగా డబ్బు కలవాడు.

ఆయన జల్సాలమీద బాగా డబ్బు ఖర్చుపెట్టగలడు.

ఆయనకి నాలుగైదు సారా దుకాణాలు ఉన్నాయి.

ఆయన ప్రాపకంక్రింద చాలామంది రౌడీలు, కేడీలూ, లేడీలూ జీవిస్తున్నారు.

ఓటు వేసినవాడికి తృణమో పణమో పారేస్తాడాయన.

పై గుణగణాల్లో ఏ ఒక్కటీ 'చేర్మన్' పని నిర్వహించేందుకు అక్కరలేదు. పైపెచ్చు అటువంటి వ్యక్తి చేతుల్లో అధికారం ఉండటం హానికరం: అయినా ఎవరూ పట్టించుకోలేదు. పట్టణంలోని విద్యావంతులు, సమాజ శ్రేయస్సు కోరేవారు, నిజమైన ప్రజాస్వామికం ఎలా ఉండాలో బోధపరచుకున్న వాళ్లు, దేశభక్తులు, ఎవరూ జోక్యం చేసుకోలేదు. కారణం!

అది సున్నితమైన ప్రశ్న. నిరాశావాదులు, మానవస్వభావపు ఔన్నత్యంలో నమ్మకం లేని వాళ్లు ప్రజానీకం ఎప్పుడూ అంతే అంటారు. మానవస్వభావం ఎప్పుడూ క్షుద్రేచ్ఛలకూ, స్వార్థపూరితమైన ప్రోత్సాహాలకూ, క్షణికమైన ఆనందాలకూ రంజిల్లినట్లు హేతువాదానికీ, వివేకానికీ రంజిల్లదని వారు గాఢంగా విశ్వసిస్తారు. సంక్లిష్టమైన యీ సమస్య తత్త్వవేత్తల చర్చలకు వదలిపెట్టి, యింకొంచెం లౌకికంగా పరిశీలిస్తే, మానవస్వభావం మారదేమోగాని, సమాజంతో పాటు మానవ ప్రవర్తన పరివర్తనం చెందుతూనే ఉంది. గడచిన ముప్ఫైసంవత్సరాల మన జాతీయ జీవనం గమనిస్తే, వ్యక్తుల సాంఘిక ప్రవర్తన నెమ్మదిగా, కొన్ని వేళల్లో నిస్పృహ కలిగించేటంత నెమ్మదిగా మార్పు చెందుతూనే ఉంది. ప్రజాస్వామిక సిద్ధాంతంలోనే అంతర్గతంగా యీ దౌర్బల్యం ఉంది. దాన్ని అనేక దేశాల వాళ్లు అనేకమార్గాల్లో ఎదుర్కొండానికి ప్రయత్నిస్తున్నారు. ఎన్ని రకాల ప్రయత్నాలు చేసినా, జనబాహుళ్యంలో సాంఘిక చైతన్యం విస్తరిల్లితేగాని మాధవయ్యలనుండి మనకి విముక్తి లేదు. వివేకంతో వినియోగించబడిన ఓటు సంపూర్ణారోగ్యానికి అమృతతుల్యమవుతుంది. లేని నాడు అది విషప్రాయమే.

ఇటీవల ఆంధ్రదేశంలో జరిగిన జిల్లాబోర్డు ఎన్నికలు పైసత్యాన్నే మళ్ళీ రుజువుచేశాయి. గెలుపు మళ్ళీ మాధవయ్యలదే. ప్రజాస్వామికం పేరిట తిరిగి అవే విధానాలు అవలంబించబడ్డాయి. కొద్ది మార్పులతో గాంధీజీ పేరు, అలనాటి కాంగ్రెస్ వైభవం భారీ యెత్తున ఉపయోగించబడ్డాయి. అసలు జిల్లాబోర్డులు ఎందుకు సృష్టించబడ్డాయి? చేసు వాటి ప్రయోజనం ఏమిటి? అందులో సభ్యత్వం కోరేవారికి ఉండవలసిన అర్హతలేమిటి?.. ఈ ప్రశ్నలు అందరూ విస్మరించారు. "కాంగ్రెస్ నే మీరు నమ్ముకోండి: కాంగ్రెస్ మార్కు సభ్యులనే ఎన్నుకోండి. నకలు సరుకు చూసి మోసపోకండి"– అని ఒక వర్గంవారు. "సోషలిస్టులొక్కరే మీకు సుఖం చేకూరుస్తారు." అని యింకొకరు. "కమ్యూనిజమే సిసలైన నిజం. వర్గపోరాటం వర్ధిల్లుగాక!" అని యింకొకరు. కులతత్వాల ప్రబోధం, ప్రత్యర్థులను అధికార ప్రాపకం కలవాళ్లు జైళ్లో పెట్టించడం, బాలెట్ కాగితాలు మాయం చెయ్యడం, పొలాల్లో పంటలు నాశనం చెయ్యడం—యీ ముచ్చటలన్నీ జరిగాయి. ఫలితాలు తేలాక, కాంగ్రెస్ కి అఖండవిజయం అని ఒక నాయకుడు ఉద్ఘోషిస్తే, కాంగ్రెస్ పూర్తిగా ఓడిపోయింది అని యింకో వినాయకుడు ఎలుగెత్తి చాటాడు. అసలు ఓటమి ప్రజాస్వామిక సిద్ధాంతానిది: గెలుపు మాధవయ్యత్వానిది——(గోరా)

# నేటి ప్రధానవార్త



కజ్జలరేఖ

ఎక్కడో చెప్పలేము కాని, యీ విశాల ప్రపంచంలో ఎక్కడో ఒక మానవుడు కూర్చున్నాడు. బహుశా అతను ఒంటరిగా కూర్చుని ఉంటాడు. తెల్లనివాడో, నల్లనివాడో, లేత గులాబీరంగో—ఏమో చెప్పలేం. ఎలాంటి వాడైనా అవొచ్చు. అతని ముఖంలో అనేక జాతుల ప్రత్యేక చిహ్నాలు ప్రతిఫలించవచ్చు—లేకపోనూ వచ్చు. ఏం చెప్పగలం?

అయితే అతని ఇల్లెక్కడ? అది మాత్రం ఏం తెలుసు? పాపికొండలమధ్య కోయపల్లెల యిరుకు సందుల్లోనా? పారిస్ నగరపు భవనతోరణాల విభ్రాంతుల్లోనా? ఏమో, ఊహించలేం.

అతని కుటుంబవివరాలు, వంశచరిత్ర, వయోరూపాలు, విద్యావిభవం, యివి తెలుసుకుందికి కూడా యిప్పుడప్పుడే మనకు కలకు మించిన పని. సామ్రాజ్యాలు పరిపాలించిన చక్రవర్తుల వంశానికి చెందినవాడు కావొచ్చు; లేదా కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, వ్యవసాయకూలీ-ఏకుటుంబంలోనైనా తల్లికి పదకొండో సంతానంగా జన్మించవచ్చు. ప్రయోజకుడై డబ్బు సంపాదిస్తున్నాడా? లేదా కప్పు కాఫీకోసం ఆగంతుకుల్ని అర్థిస్తున్నాడా? ఏదైనా చెయ్యొచ్చు.

ఒకటిమాత్రం నిజం : యీ విపులమైన పృథ్విలో, యే గరికపచ్చ మైదానంమీదనో, వంటింటి చీకటిలోనో, అతడు కూర్చున్నాడు; కూర్చుని ఆలోచిస్తున్నాడు: మన కష్టాలు అంతరింపచేసేందుకు మార్గాలు అన్వేషిస్తున్నాడు. మనల్ని విముక్తుల్ని చేసే తరణోపాయం అతడికి స్ఫురిస్తుంది.

ఆలోచించండి! యీ పదివేలసంవత్సరాలలోనూ మనం చేతులారా పరిస్థితిని ఏ గాడికి తెచ్చుకున్నామో! మన ప్రారంభదశ గమనించండి! వేలకొద్దీ సంవత్సరాలు తక్కిన సృష్టితో పాటు పరిణామం చెందుతూ, క్రమంగా ప్రథమస్థానం ఆక్రమించాం. సృష్టి ప్రసాదించిన మేధాశక్తి ఎంత అమూల్యమైనదో, దానితో ఎన్నెన్ని సాధించగలమో గ్రహించాం. ప్రకృతికి మన మీద యింత అధికారం దేనికి?—అని తిరగబడి యుద్ధం సాగించడానికి తీర్మానించాం. ఆ యుద్ధం ఎంత భీకరంగానో నడిపించాం. అనేక ఘట్టాల్లో తీవ్రమైన దెబ్బలు తిని ప్రకృతి చేతిలో చిత్తు అయిపోయినా, ప్రతి ఒక్క ఓటమీ మన ఉత్సాహాన్ని మరింత యినుమడింప చేసింది.

ఆ విధంగా జీవితం ప్రారంభించిన మనం, ఆనాడు పచ్చిమాంసంతిని కొండగుహల్లో తల దాచుకున్న మనం,—యివాళ యిదిగో యీ విధంగా తయారయాం. ఆనాడు తారకీ తరణికీ తటిల్లతకీ అంజలి ఘటించాము. సంఘాలుగా ఏర్పడ్డాం. 'అసతోమా సద్గమయ' అని నిర్మలాంతఃకరణతో ప్రార్థించి, భగవంతుడి స్వర్గధామం మన హృదయంలోనే ఉందని విశ్వసించగలిగాము. బోధివృక్షచ్ఛాయల్లో తెలిసిన వాళ్ళమయాము.

ఇన్ని జరిగాక ఆఖరికి మనం రంగస్థలంమీద రంగువేసుకు ప్రవేశించాం. సుమారు రెండువేల సంవత్సరాలనుండి తర్ఫీదు పొందుతున్నామే, చివరకి పాత్రపోషణ ఎలా నిర్వహిస్తున్నాం? తెలుసుకోవాలని ఉందా? దినపత్రికలు చదవండి (ఖరీదు రెండణాలకి మించదు) మీకే తెలుస్తుంది.

ఇదేమిటి, గిరీశం చెప్పినట్టు కథ అడ్డంగా తిరిగింది! అపూర్వ నటీనట సమ్మేళనం! ఖరీదైన దుస్తులు. స్ప్రింగు తెరలు. ఇరవై శతాబ్దాల శిక్షణ. అయినా నాటకం రక్తికట్టకపోగా

పాత్రధారులందరికీ విడుపోస్తోంది. ఏదో పొరపాటు జరిగింది. ఎప్పుడు! ఎక్కడ! చరిత్రలో ఏ ఘట్టంలో! ఈ తరిచిచూడ్డంవల్ల అవగింజంతైనా ప్రయోజనం లేదు. చరిత్రపుటల్ని భూతద్దంలోంచి పరీక్షిస్తే వంకరటింకరలు తెలుస్తాయి నిజమే. కాని—! మన వ్యక్తిగత జీవితంలో ఎన్ని పొరపాట్లు చెయ్యలేదు! "ఇలా కాకుండా, అలా ప్రవర్తించి ఉంటే! ఫలానా విషయంలో ఫలానా పద్ధతి అవలంబించి ఉంటే!" అని మనలో జరిగిన విషయాల్ని తలుచుకుని విచారించేవాళ్లు ఎవరు లేరు! కాని, రెండూ నిష్ప్రయోజనమే. మానవచరిత్రలో అంతర్వాహినులుగా ప్రవహించిన రెండు ప్రోద్బలాలు భిన్నమార్గాలు అనుసరించి మనల్ని చవిటి నేలను వదిలిపెట్టాయి. ఆ రెండే కనక కలుసుకొని ఉంటే, మనకి శాంతికీ, కాంతికీ ఇంత కరువు ఎందుకు కల్గును?

మన భౌతికమైన అవసరాలు మనల్ని ఒక దిక్కుకి యీడ్చుకు వెళ్ళాయి. శరీరానంతేతరమైన మనలోని మానవత్వం యింకో మార్గం పట్టింది. ఈ రెండునదులూ వేర్వేరుగా ప్రవహించాయి.

వాటిమార్గాన అవి నిర్నిరోధంగా ప్రవహించేవరికి ప్రమాదం సంభవించింది. ఒక్కొక్కవేళ ఆ నదులకి బ్రహ్మాండమైన వరదలొచ్చి గట్లూపుట్లూ తెగి ప్రవహించాయి కొన్ని వేళల అవి సన్నని పాయలుగా చీలిపోయి, యింకిపోయి, అందరి గొంతుకలు ఆర్చుకుపోయినట్లు చేశాయి. వీటిల్లో దేనికి వరదవచ్చినా, మానవకోటికి ప్రాణసంకటం ఆయేది. రెండోది గుంటలు గుంటలుగా విర్పడి చుట్టూ బతికేవారికి రకరకాల పీడలు తెచ్చి పెట్టేది.

ఇలా ఉంటూంటే, యుగానికి ఓ మాటు, జగమందు ఒక చోట—ఒక అజాను బాహువు లేచి, పరిస్థితి సింహావలోకనంచేసి, ఆ రెండు నదుల్నీ సక్రమమార్గంలో నడిపించచేసి, సమానికి తోడ్పడాలని ప్రయత్నించేవాడు. రెండూ జీవవాహినులే. ఒకటి శరీరారోగ్యానికీ, రెండోది ఆత్మవికాసానికీ— అత్యవసరం. కాని, ఇంతవరకూ అజానుబాహువు లెవరూ కృతకృత్యులు కాలేదు. ఏ క్షణంలో చూసినా, మరుగుజ్జులే ఎక్కువ. వాళ్ళదే ప్రాబల్యం. అల్పమైనవాళ్లు తాపత్రయాలకి అడ్డు తగులుతారేమోనని మరుగుజ్జు లెప్పుడూ అజానుబాహువులకి అడ్డు తగులుతునే ఉన్నారు. వీళ్లకి, యీ అంగుష్ఠమాత్రులకి, ఎలా ఉన్నది అలా ఉండడమే సరదా. అదే వాళ్లకి లాభకరం. చిందర వందరగా ఉన్నదైనా వాళ్ల ఆటలు సాగుతాయి. ఈ అల్లకల్లోలం అంతా సర్ది ఒక దారికి తీసుకొద్దామని ఎవరు ప్రయత్నించినా, వామనమూర్తులు ప్రతిఘటిస్తారు. వాళ్ళంతా కలిసి సంఘాలు స్థాపించి, మూలమూలలకి వెళ్లి అమాయకులమధ్య ప్రచారం సాగిస్తారు: "చూడండి! యీ జీవితాల్లో మార్పులు చేయడానికి ఎన్ని ప్రయత్నాలు జరుగుతున్నాయో! సంప్రదాయాలు మంట కలుస్తున్నాయి. మీ తండ్రి తాతలు యిలాంటివి సహించేవారా? ఆలోచించండి!" అని విషయజ్ఞానం లేనివాళ్లని భయపెడతారు. అంతా హడలిపోతారు. వాళ్ళకి భావదాస్యం తప్ప మరేమీ తెలీదు. అందుచేత భయపడతారు. ఆలా మరుగుజ్జుల పొలికేకలు విని విని మరీ భయపడిపోయి, మతిభ్రమించిన అమాయకుడెవడో బయలుదేరి అజానుబాహువుని కత్తి తీసుకు నరికేస్తాడు లేదా తుపాకితో కాల్చేస్తాడు.

ఇదీ సంగతి. రెండువేల సంవత్సరాల నుండీ యీ కథ మళ్లీ మళ్లీ నడుస్తోంది. ఎన్నాళ్ళని! ఆఖరుకి యీనాడు భరించలేని స్థితికి వచ్చేసింది; మానవుడి కథ. ఏ శాస్త్ర మైనా మానవత్వం హృదయంలో మిగిలి ఉన్న వాత్సల్యమైనా సరే, కడీ విషయం గ్రహించక తప్పదు. పరిస్థితులు ముంచుకొచ్చాయి. ఏదో ఒకటి చెయ్యక తప్పదు. ఎలాగయినా మనల్ని మనం కాపాడుకోవాలి. లేకపోతే—నినెవియన్లూ, సుమేరియన్లూ ఏదారిని పోయారు! తక్షశిలా, పాటలీపుత్రం, హరప్పా, మొహెంజొదారో; అలాగే ఔ కాన్సాసూ లాసాంజిలాస్, ఆక్స్‌ఫర్డూ అలహాబాదు! తెల్లనిగుడ్డ కప్పబడిన విగతప్రాణివలె, యీ శతాబ్దపు నాగరికత కాలచక్రంలో కలిసిపోతుంది.

ఈ క్షణంలో ఎక్కడో ఆ మానవుడు కూర్చుని, దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. గతించిన రెండువేల సంవత్సరాలలోనూ ఎవరూ



చెయ్యలేని పని అతడు చెయ్యగల్గుతాడు. ప్రస్తుతం మన శాస్త్రవిజ్ఞాన శక్తి అపారం: ఎంత మహోజ్వలశక్తి అది! ఎంత సమ్మోహనంతో కూడుకున్నది! దానిశక్తి పంటపొలాల్లో రజావు కాలేదు నిజమే: కాని, జపానులోని నగాసాకీ, హిరోషిమా పట్టణాల్లో ఎంత అమోఘమైన విజయం పొందింది! నేటి మానవుడు కంటూన్న ఆధ్యాత్మిక స్వప్నాలు ఏ రూపంలో ఉన్నాయి? కాని అతడు అనుసరిస్తూన్న భౌతిక నాగరికత ఎటువంటి వికటనృత్యం సాగిస్తోంది? ఈ ప్రపంచం కేవలం నరరూపరాక్షసుల విహార భూమిగా కాక, సన్మనుష్యకోటి సంచరించే స్థలంగా ఎలా మార్చగల్గడం? ఈ క్షణంలో యే మూలనో కూర్చుని ఆలోచిస్తున్న మానవుడు ఆ సమస్యాపరిష్కార విధానమే ఆలోచిస్తున్నాడు. ఎక్కడున్నాడంటే చెప్పలేం. బహుశా ఏదో ఆఫీసులో గుమాస్తాగా ఉంటున్నాడు; లేదా గదిలో కార్మికుడు; కార్ఖానాలో మేస్త్రీ: లేదా ప్రపంచంలోని వేనవేల చెరసాలల్లో ఒకదాంట్లో నిముషాలు లెక్కిస్తూ ఉండి ఉంటాడు. మరుగుజ్జులంతా కలిసి అతన్ని ఇనుప కటకటాల్లో బంధించారు—శాంతి భద్రతలకోసం.

కాని ఒక సుప్రభాతాన్ని అతడు మనందరి మధ్యకీ వచ్చి నిల్చుని, "ఇదీ పద్ధతి: మనం అందరమూ కలిసి యికముందు యీవిధంగా జీవించాలి. అలాగయితే ఎంతో బాగుంటుంది. అందరికీ హాయిగా ఉంటుంది." అంటాడు మనకి. ఆశ్చర్యం వేస్తుంది. "ఇంతేనా?" అంటాం. "ఇంత సులభమా? నిజంగానే?" అంటాం. అతడి కళ్లు ఏదో దీప్తితో మెరుస్తాయి. "అవును, నిజంగానే! ఆచరించి చూడండి, ఎంత బాగుంటుందో!" అంటాడు. "అందరం కలిసి నిలుచున్న యీ భూమి ఆనందకరంగా చేసుకునే మార్గం యింత సులభమైతే, యిన్నివేల సంవత్సరాలుగా ఎవరూ చెప్పలేదేం?" అంటాం. "చెప్పకేం! చాలామంది చెప్పారు. కాని మీరు వినిపించుకో లేదు." అంటాడతడు. సిగ్గుతో మనం కుంగిపోతాం. ఇమాటు తప్పకుండా వింటామని అతడికి వాగ్దానం చేసి, మెళ్లో పూలమాలలు వేస్తాం. శిలావిగ్రహాలు నిర్మిస్తాం: జై అంటాం. సత్యమేవ జయతే అని నడుములు బిగిస్తాం.

లేదా, అతని మాటలు వినిపించుకునే ధైర్యం ఉండకపోవచ్చు; మన అజ్ఞానాన్ని వెక్కిరిస్తున్నాడని కోపం రావచ్చు మనకి. కోపమే వస్తే యింకేముంది? అతణ్ణి పట్టుకు నడిబజారులో నిలువునా చీరేస్తాం. అంతపని చేస్తామా అని అనుమానమా? వినండి, మన మరుగుజ్జు నాయకుల ఉపన్యాసాలు. పత్రికలు ప్రచురించే పతాక శీర్షికల వార్తలు చదవండి. ఇంకా అనుమానమే? అయితే దేశచరిత్రల పుటలు తిరగవెయ్యండి.



# అన్నప్రాశన

"జీవితం జీవించడానికే అన్నట్టు, కళ కళ కోసమే పుట్టింది. కళారాధకుడు ఎప్పుడూ ప్రపంచానికి ఒక దివ్య సందేశాన్ని అందిస్తూ వుంటాడు. తన బుద్ధి చాతుర్యాన్నుపయోగించి చిత్ర పరిభాషలో తన ఆదర్శాలూ, ఉద్దేశాలూ వ్యక్తపరుస్తాడు. సామాన్య ప్రజానీకానికి సామాన్యంగానే గోచరించే విషయాన్ని కళా స్రష్ట అయిన చిత్రకారుడు అనేక విధాల రూపకల్పనలచేత ఆశ్చర్యకరంగా చిత్రించ గలుగుతాడు. కాబట్టే స్రష్ట అయిన చిత్రకారుణ్ణి అపర బ్రహ్మ అన్నారు. కాని జీవంపోసే శక్తిమాత్రమే అతనిలో లేదు."

అని చదివాడు గోపాలం, చిత్రలేఖనం విషయాల్ని గురించి విపులీకరించబడిన పుస్తకం చూసి. సీత మాట్లాడలేదు. ఊరుకున్నట్టే వుండి ఒక్కసారిగా నవ్వి—

"ఔను నిజం. సామాన్యమైన విషయాలన్నింటికీ ఏనాడో తెల్ల దొరలు రాసిపెట్టిన నిబంధనలకు ముడిపెట్టి గాలి పోగుచేసి, పొడుగు పేజీలు నింపి, తన నైపుణ్యాన్నంతా వినియోగించి రాసి అధికారి పొదలిపోయేటట్టుగా టపాలో పంపించి అంతా నాప్రజ్ఞ, నేను కాబట్టి రూల్సన్నీ చూసి రాసి డ్రాఫ్టు పెట్టాను అని ధీమాగావుండి, యథాతథంగా అధికారి సంతకం పెడితే చంక లెగరేసి, కొట్టేసి అవకతవక ప్రశ్నలువేసి డ్రాఫ్టు తిరగ్గొడితే సణుక్కుని, ఓ పండుగా పబ్బమూ, ఆదివారమూ అమావాస్యా, సంవత్సరాదీ శ్రీరామనవమీ లేకుండా కాయితాలు చంకన బెట్టుకుంటూ పొద్దునా సాయంత్రం ఆఫీసుకు పోవటమూ చేసినాగూడా ఒక కళే. చిత్రకారుడి చిత్రం మాదిరే గుమాస్తా డ్రాఫ్టు వుంటుంది. కాబట్టి చిత్రకారుడూ గుమాస్తా ఒకటే!" అంది సీత.

గోపాలం విస్తుపోయి పుస్తకం మూసేశాడు. ఇదేమిటి, సీత యిలా మాటాడుతోంది!

"ఇవాళ ఇట్లా తల్చుకున్నావ్, ఏమిటి విశేషం? మా ఆఫీసు కాయితాలూ, గుమాస్తాలమీద పట్టించావేమిటి?" అన్నాడు.

"లేకపోతే పనుకోక ఎందుకొచ్చిన పుస్తకాలండీ అవి! సాయంత్రంవరకూ ఆఫీసులో రాసి

బి. యస్. ఆర్. కృష్ణారావు

రాసి వచ్చారుకదా! లాగానే భోజనం చేశారు. ఏదో కాసేపు కష్టసుఖాలు మాట్లాడుకోకుండా ఇప్పుడు కళ లెట్లా వుంటే ఎవరిక్కావాలి? చిత్రలేఖనం ఏమయితే ఎవరిక్కావాలి? కానీ వచ్చేదా ఏమన్నానా, చమురు కర్చు తప్ప! అయితే అబ్బాయి అన్నప్రాశన విషయం ఏం చేస్తారు? చెయ్యదల్చుకుంటే మా అన్నయ్యను ముందుగానే ఉత్తరం ముక్క రాయొద్దూ! మేనమామ ముందు నాకించాలి కదా!"

"ఆడవాళ్ళకి ఎంతసేపటికీ ఇలాంటి గొడవలే తప్ప ప్రపంచంలో ఏం జరుగుతున్నదో తెలుసుకోరు. మన దేశ పరిస్థితులు యెలా ఉన్నాయో, దేశంలో ఆహారధాన్యాల కొరత ఎట్లావుందో, దేశనాయకులంతా యీ విషమ సమస్యను పరిష్కరించడానికి ఎంత కష్ట పడుతున్నారో, ప్రజానీకమంతా ప్రభుత్వానికి తోడ్పడాలని ఎన్నెన్ని ఉపన్యాసా లిచ్చి ప్రాధేయపూర్వకంగా అడుగుతున్నారో నీకేమయినా తెలుసూ, రవ్వంతయినా? పత్రికలు చూడు, తెలుస్తుంది. ఆహార సమస్య తేల్చాలంటే ఒక్కటే తరుణోపాయం ప్రభుత్వం ఆలోచించింది. దాన్ని అమలులో కూడా పెట్టబోతున్నారుట." అన్నాడు గోపాలం.

"ఏమిటది?" అంది సీత, మొహం చిట్లిస్తూ.

"పెద్దా చిన్నా, ఆడా మొగా అన్న విచక్షణ లేకుండా దేశంలో ఉన్నవారంతా వారానికొకరోజున విధిగా ఉపవాసం చెయ్యాలి. తద్వారా లంకణం పరమౌషధం అన్నట్టుగా ప్రజారోగ్యం బాగుపడటమే కాకుండా తిండి కొరత తీర్చే విషయంలో ప్రభుత్వానికికూడా సహాయంచేసిన వారవుతారు. దేశ పరిస్థితు లిట్లావుంటే నువ్వేమో అన్నప్రాశనలూ, ముద్దకుడుములూ, అక్షరాభ్యాసాలూ అంటున్నావు. అన్నం అలవాటయిన మనమే బియ్యం దొరక్క చస్తూంటే అలవాటులేని వాడిక్కూడా అన్నం అలవాటు చెయ్యట మెందుకు!" అన్నాడు, అన్నప్రాశన విషయంలో తన ఉద్దేశం తెలుపుతూ.

"అలాగే చెప్పారులెండి. చేతకాకపోతే సరి. ఏదెట్లావున్నా అన్నప్రాశన జరక్క తప్పదు. ఒక్కగానొక్క మగపిల్లాడు. చివరికి వాడి చదువు సంధ్యలూ ఆస్తిపాస్తులూ ఎట్లా వున్నా అడుగులోనే హంసపాదు అన్నట్టుగా వాడి అన్నప్రాశన విషయంలోనే మీరు వెనకాడితే యెట్లా?"

"మన సంసార పరిస్థితులు నీకు తెలిసికూడా అలా మాట్లాడితే ఎలా సీతా? ఎంత ఎవర్నీ పిలవకపోయినా మా వాళ్ళనీ మీ వాళ్ళనీ అయినా పిలవాలా? అంతా చేరి ఓ పదిహేను మందయినా అవుతారా? కనీసం మూడు రోజులయినా వుంటారా? పైనాట్లు లేకుండా మన కుటుంబం మాత్రం వుంటేనే జీతం డబ్బులు చాలటంలేదు. అటువంటప్పుడు ఇంత జంజాటన పెట్టుకుంటే ఓ యాభై రూపాయిలన్నా తిండిఖర్చు, మరో ఏభై బట్టల ఖర్చు అవుతుంది. ఈ ఖందా ఎక్కడ్నుంచి తీసుకురావాలి?"

"అవుననుకోండి. గొర్రె తోక ఎప్పుడు చూసినా బెత్తెడే అన్నట్టుగా ఇప్పట్లో మీ జీతం ఎక్కువయ్యే సూచనలేవీ లేవు. అందుకని అన్నప్రాశన ఆపుతుంటా చెప్పండి! ఒక్కగానొక్క మొగపిల్లాడు, ఇద్దరాడపిల్లల తరవాత! వాడి విషయంలోనే మీరు వెనకాడితే!" అన్నది సీత జాలిగా.

గోపాలం ఆవేశంతో "నాకు మాత్రం పిల్లలంటే ప్రేమలేదా సీతా! దరిద్రుడికి పిల్లలూ ఎక్కువే, పిల్లలంటే ప్రేమా ఎక్కువే; గొప్పవాళ్ళకు సామాన్యంగా పిల్లలంటూ వుండనే వుండరు. ఒకవేళ వున్నా వాళ్ళను దాదులు పెంచవలసిందే కాని కొమ్ము చెంబుడు పాలు పట్టేందుకయినా కన్నవారికి మన స్సొప్పదు. గొప్పవాళ్ళ పిల్లలంతా 'నూటికి తొంభైమంది నౌకర్లచేతుల్లోనే పెరుగుతారు. ఎందుకంటే అష్టయిశ్వర్యాలమీద మమకారంచేత, ఇంత డబ్బుందికదా అనే గర్వంచేత! బీదవాడికి డబ్బుమీద అపేక్ష వున్నప్పటికీ అది లభ్యం కాకపోవటంనుంచి వాళ్ళ దృష్టంతా పిల్లలమీదనే ఇనుమడింపచేస్తారు." అన్నాడు.

"నా కివన్నీ తెలును. కాపరాని కొచ్చి అయిదారేళ్ళయింది; ఇంకా మన సంసార పరిస్థితులు నాకు తెలీవనేనా మీ ఉద్దేశ్యం! పోనీ ఎవ్వరినీ పిలవొద్దు, మా అన్నయ్య కొక్కడికే ఉత్తరం రాయండి రమ్మనమని. ఉంగరంతో

ఆ శాస్త్ర పరమాన్నమూ నాకించి వెళతాడు." తను కొలకుల్లోనుంచి జారే కన్నీళ్లను చీర చెంగుతో తుడుచుకుంటూ, భారంతో అంది.

ఇంక తప్పదనుకున్నాడు గోపాలం. మర్నాడు బావమరిదికి ఉత్తరం రాశాడు.

"అయితే వాడికి ఏవో శాస్త్ర తేలిక రకమైనా బట్టలు పెట్టొద్దంటీ మరి!" అంటూ మొదలెట్టింది సీత.

"బాగానే వుంది, బట్టలూ లేవు ఏం లేవు. అపూట వాడూ భోంచేసి పోతాడు, అంతకన్న పెట్టేదేమీ లేదు."

"మీ చాదస్తం బంగారంగానూ! అన్నం నాకించినవాడికి విధిగా బట్టలు పెట్టాలి. వాడు మటుకు ఊరికే చేతులు ఊల్లాడించుకుంటూ వస్తాడా ఏమిటి? వాడి కివన్నీ తెలుసు. మా పెద్దక్కయ్యకొడుకు బిడ్డకి చేశాడు అన్నప్రాశన. ఆరోజు క్షీరాన్నం ఎందులో పోసి నాకిస్తాడని మీ ఉద్దేశ్యం?" అంది సీత, గోపాలం ఉద్దేశ్యం కనుక్కుందామని.

"ఎందులో పోసే దేముంది. మనం మజ్జిగ పోసుకునే మట్టు సత్తుగిన్నెలో పోస్తే సరి! శాస్త్ర వెశల్పుగా ఉండి పరమాన్నం చల్లార్తుంది, పిల్లాడిగొంతు కాలకుండా" అన్నాడు. ఆమాట విని సీత పొట్ట చెక్కలయేటట్లుగా నవ్వింది.

"ఇంతేనా మీ తెలివి! మేనమామ ఓ వెండి గిన్నె కొనుక్కురావాలి. అందులో పరమాన్నం పొయ్యాలి. అప్పుడు అన్నప్రాశన. అంతేగాని పులుసు రాచ్చిప్పలోనూ మజ్జిగ తప్పేలాలోనూ కాదు. ఓ ఇరవై రూపాయిలు పెట్టి వెండిగిన్నె తెస్తాడేమో, కొత్తబట్టలు కట్టుకుపోతాడు. ఇందులో మనకొచ్చిన నష్టమేముంది చెప్పండి?"

"ఎందుకు సీతా, వాడో పాతికా మనమో పాతికా వొదిలించుకోటం తప్ప, ఇందులో చెప్పుకోతగింది నాకేం కనబడలేదు. పుట్టి పాతిక రూపాయిలు అమ్మేరోజుల్లో పెట్టిన సంప్రదాయాలు బస్తా ధాన్యం పాతికరూపాయిల ఖరీదు గల రోజుల్లోనూ ఆచరించాలంటే ఎంతకష్టమో ఆలోచించు. వాడూ పిల్లలుగలవాడా! పాతికో, ఇరవయ్యో వాడు మటుకు ఎందుకు వదిలించుకోవాలి? నీదంతా చోద్యం కాని!"

"మనం మళ్లా కని పెంచినప్పుడు ఆలోచిద్దాం గాని యీతడవ కిట్లా కానివ్వండి" అని వంటింట్లోకి వెళ్లిపోయింది సీత.

మర్నాటి సాయంత్రానికల్లా వచ్చాడు గోపాలం బావమరది వెంకట్రావు. వస్తూనే గోపాలంతో "ఈ కరువురోజుల్లో ఇంకా అన్నప్రాశనలూ, ముద్దకుడుములూ ఏమిటిరా, ఓ పక్క ఆర్థికంగా దేశం నలిగిపోతూంటే!" అంటూ ఉపదేశాల్లోకి దిగాడు.

"ఆముక్క మీ చెల్లెలికి చెప్పు, ఎంత చెప్పినా సుతరాం చెవి కెక్కించుకోదు. ఈ తడవకు ఇట్లా కానివ్వాల్సిందేనని మంకుపట్టు పట్టి కూర్చుంటే ఇంక చేసేది లేక నీకు ఉత్తరం రాశాను."

వెంకట్రావు మరి మాట్లాడలేదు. తను తెచ్చిన చిన్న వెండిగిన్నె తీసి చెల్లెలికీ బావ మరిదికీ చూపించాడు.

"చాలా బావుందిరా, అన్నయ్యా! ఎంతయింది?" అంది గిన్నె చూస్తూ సీత.

"ఇరవై రెండు రూపాయిలయింది."

"అయితే అయిందిగాని చాలా బావుంది. నువ్వుకొనే అన్నివస్తువులూ చాలా బాగుంటాయి. ఇదిగో మీ బావకొనే వస్తువులు చూడాలి సంబడం!" అంది, గోపాలంవేపు చిలిపిగా చూస్తూ.

"నెలకో నాలుగువందల రూపాయిలు ఎవరయినా ఇస్తూంటే నేనూ ఎంతటి చక్కటి వస్తువులు తేవాలంటే అంత చక్కనివి తేగలను." అన్నాడు గోపాలం యీసడింపుగా.

"ఐతే మా అన్నయ్యకి నెలకి నాలుగయిదు వందలు ఎవరయినా ఇస్తున్నారా ఏమిటి? వాడూ రెక్కలమీద బ్రతుకుతున్నవాడేగా" అంది సీత.

"సరే ఈ కబుర్లంకేంగాని రేపటి క్కావాల్సిన వేవో చెప్పు"

"అన్నీ తెచ్చారుగా, బట్టలొకటే." అని పని మీద వెళ్ళిపోయింది సీత.

* * *

మర్నాడు అన్నప్రాశన. గోపాలం ఆరోజు సెలవు పెట్టాడు. పదకొండు గంటలకు ముహూర్తం. పిల్లాడికి తలంటి నీళ్లుపోసి పొద్దుగ్గా కుంకం బొట్టు పెట్టారు. పీటమీద కూర్చోపెట్టి ఎదు

రుగా ఇంకో పీట వేశారు. దానిమీద ఒక చాకు, ఒక కలమూ, ఒక నిమ్మపండూ, ఒక పుస్తకమూ పెట్టారు.

"చాకు పట్టుకుంటే మామంచి శౌర్యవంతుడూ, ధైర్యసాహసాలు కలవాడూ అవుతాడు. కలం తీసుకుంటే వాళ్ళ నాన్నమాదిరి గుమాస్తా ఉద్యోగం చేస్తూ పొద్దున్నే వెళ్ళి రాత్రికి ఇంటికి వస్తాడు ఉసూరుమంటూ. నిమ్మపండు పట్టుకుంటే వ్యవసాయం చేస్తాడు, పుస్తకం తీసుకుంటే విద్వాంసుడౌతాడు. ఇందులో ఏం తీసుకుంటావు బాబూ?" అంది సీత పిల్లాడి బుగ్గలు ముద్దుగా సాగదీస్తూ.

"నా పోలికే రావాలి వాడికి! ఈ గుమాస్తా ఉద్యోగం వద్దులే బాబూ వాడికి. నే ననుభవిస్తున్నా చాలదూ!" అన్నాడు గోపాలం.

పిల్లవాడు అయిదు నిమిషాలు వాటన్నింటినీ చూస్తూ చేతులు ఆడిస్తూ నవ్వుతూ కలం తీసి నోట్లో పెట్టుకుని, నిమ్మపండొక చేత్తో, కత్తి ఒక చేత్తో పట్టుకుని పుస్తకంమీద ఎక్కి కూర్చున్నాడు.

"వీడు అందర్నీ మించిన వాడవుతాడు. మంచి అదృష్టవంతుడౌతాడు." అన్నాడు మేనమామ.

"వాడు పెద్దవాడైన తరవాతనే నాకు యాత్రల మనస్సు గాని, పుణ్యక్షేత్రాలు చూట్టం గాని జరిగేది. వీళ్ళ నాన్న సాయమంతా వంటింట్లోనే గడిచిపోతుంది." అంది సీత.

"పోనీలే నా జీవితం ఇంట్లోనే వెళ్ళిపోతుంది. నన్నుద్ధరించేవాడు వాడేననుకో. వాడు పెద్దవాడై సంపాదించేటంత వరకూ నేనే పోషించాలి కదా! అందాకా నే చెప్పినట్టుగా విను. తరువాత నువ్వూ నీ కొడుకూ ఒకటవుదురుగాని!" అన్నాడు.

వెంకట్రావు రిస్టువాచీ చూసి "ముహూర్తం దగ్గరయింది, ఇంక పరమాన్నం నాకిస్తారు" అని వేలి ఉంగరం తీసి పరమాన్నంలో ముంచి మూడు సార్లు నాకించాడు

"ఇక పిల్లి కూడా శేషను లెక్కల్లో చేర్పొచ్చు" అన్నాడు వెంకట్రావు.

"మేం ఇంత లక్షణంగా తింటున్నాం. ఇంక వీడు తినలేకపోయాడు." అన్నాడు గోపాలం.

"శుభమా అంటూ అన్నప్రాశన చేసుకుంటూ ఈ పాడుమాటలు మాట్లాడతారేం!" అంది సీత.

"బాబుగారూ" అనే కేక వీధిలో వినిపించింది.

"ఎవరూ?" అంది సీత.

"నేనండీ అమ్మగారూ అప్పన్నని. బాబుగారున్నారా?"

"ఏమిటోయ్ అప్పన్నా? దొరగారు పిల్చారా?" అంటూ బయటికొచ్చాడు గోపాలం.

"దొరగారు రమ్మంటున్నారండీ. ఏదో టెలిగ్రాం వచ్చిందిట. అర్జంటుగా ఉన్నపాటున రమ్మంటున్నారు."

"సరే భోంచెయ్యబోతున్నాను. వస్తా పద" అన్నాడు గోపాలం. అప్పన్న వెళ్ళిపోయాడు.

'సెలవుపెట్టినా అనుభవించే యోగం లేదు. పాడు ఉద్యోగం' అంది సీత.

గబగబా నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని ఆఫీసుకు వెళ్ళాడు గోపాలం. గోపాలాన్ని చూడగానే మండిపడుతూ,

"ఏమయ్యా. ఈ టెలిగ్రాం చూడు. గ్రోమోర్ ఫుడ్ రిటర్న్ పంపించక్కర లేదూ? అది పంపించకుండానే సెలవుపెట్టావే! టెలిగ్రాం వచ్చేటంత వరకూ కళ్ళు మూసుకుని కూర్చున్నావ్. ఇంతవరకూ ఏం చేస్తున్నావ్?" అన్నాడు ఆఫీసరు.

"చిత్తం. నాలుగు రోజులే అయింది రిటర్న్ ఓవర్‌డ్యూ అయి. అయినా నిన్నటిదాకా అకౌంట్లతోనే సరిపోయింది. ఇవాళ వేసేస్తానులెండి సాయంత్రానికల్లా."

"ఇవాళ మనాఫీసు నుంచి రిటర్న్ వెళ్ళేటంత వరకూ ఆఫీసు వదలటానికి వీల్లేదు తెల్సిందా? నే బంగళాలో వుంటా. పూర్తి చేసి నాదగ్గరకు తీసుకురా సంతకాలకి." అని మరోసారి హెచ్చరించి వెళ్ళిపోయాడు ఆఫీసరు.

ఇంటిదగ్గర అన్నప్రాశన తతంగం కాక పూర్వమే ఇట్లా రావాల్సొచ్చిందని తనను తాను నిందించుకున్నాడు. స్టేట్మెంట్లు బల్లమీద పరిచి కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. ఏనాటి

కర్మఫలమో ఈనాడు అనుభవిస్తున్నా ననుకున్నాడు. ఆఫీసు ఎదురుగా ఉన్న మేడమీద నుంచి రేడియో పాటలు వినిపిస్తున్నాయి. "మా బాబు పెద్దవాడైతే వాళ్ళ నాన్న మాదిరిగా గుమాస్తా ఉద్యోగం చెయ్య"డని సీత అన్న మాటలు పదేపదే స్ఫురణకు వస్తున్నాయి. పిల్లవాడు అన్ని వస్తువులూ తీసుకుని పుస్తకంమీద కూర్చున్నప్పుడు "వీడు అందర్నీ మించినవాడవుతాడు. మంచి అదృష్టవంతుడవుతాడు" అన్న బావమరది మాటలు ఇంకా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. ఎవరెట్లా పోతున్నా, ఎవరెన్ని అన్నా, ఎవరెంత అదృష్టవంతులయినా నువ్వు మటుకు చేసేది ఈ లోవర్ డివిజను గుమాస్తాపనే అన్నది అంతర్వాణి. అవును అనుకుని తెల్లకాయితాలమీద స్టేట్‌మెంట్ ఫారం గీస్తున్నాడు. రేడియోలో పాట వినిపిస్తున్నది. తన పరిస్థితి కనుగుణంగానే ఉన్నదా పాట. వేణునాదానికి గోవులు తలలెత్తి ఆలకిస్తున్నట్లుగా, నాగస్వరానికి నాగుబాములు పడగలెత్తి వింటున్నట్లుగా వినసాగాడు.

పాట విన్నాడు గోపాలం. అతని అంతరాత్మ అభిమానంతో క్రుంగిపోయింది. ఇచ్చేది ఎనభై రూపాయిలు, నెలఖర్చు అంతకు నాలుగురెట్లు. చేస్తున్నది గుమాస్తాగిరీ. తినేది చివాట్లు. అభిమానం చేత ఒళ్ళు జలదరించింది.

స్టేట్‌మెంట్ ఫారం గీసి మొదటి ఐటము రాస్తున్నాడు.

"గోపాలం, గోపాలం" అంటూ వెంకట్రావు రొప్పుకుంటూ వచ్చాడు. అతని గుండె నిమిషానికి కొన్ని వందలసార్లు కొట్టుకుంటున్నట్టువుంది. అతని వాలకం చూస్తే ముచ్చెమటలు పోశాయి. ముఖాన కత్తివేసినా నెత్తురుచుక్క లేదు.

"ఏమిటి బావా ఇట్లా వచ్చావ్. ఏం ప్రమాదం జరిగింది?" అన్నాడు ఆదుర్దాగా—వెంకట్రావు భుజాలు పట్టుకుని ఊపుతూ.

"ఏం చెప్పను! బాబు..."

"బాబు ఏమైనాడు? నే వచ్చేటప్పుడు పరమాన్నంతిని ఆడుకుంటున్నాడుగా!"

గోపాలం కాళ్లవణికాయి నాలుక తడారిపోయింది.

"బాబు పోయినాడు" అన్నాడు వెంకట్రావు చెప్పలేక.

"బాబు పోయినాడా!" అంటూ కుర్చీలో కూలబడ్డాడు.

"ఇట్లా కూర్చుంటే ఎట్లా? పోదాంపద." అన్నాడు వెంకట్రావు.

"ఎంతపని జరిగింది! వెళ్ళరండి గోపాలంగారూ" అన్నారు తోడిగుమాస్తాలంతా.

నిల్చున్నవాడు నిల్చున్నట్లుగానే బయల్దేరాడు గోపాలం. వరండాలోంచి దిగుతూవుండగా బంగళాజవాను వచ్చి "గ్రోమోర్‌ఫుడ్ రిటరన్ట, అయిందాండీ గోపాలంగారూ?" అన్నాడు.

గోపాలానికి ఇదేదీ వినిపించలేదు.

"గ్రోమోర్‌ఫుడ్ రిటర్న్ అర్జంటుగా పట్టుక్కురమ్మన్నారండీ!" అని మళ్ళీ కేకవేశాడు జవాను.



## జంతు శాస్త్రంలో మొదటి పాఠాలు

స్త్రీ పురుషులు ఒండొరులను ఆకర్షించుకుందుకు చేసే ప్రయత్నాలూ, కట్టుకునే రంగుల దుస్తులూ, పూసుకునే సువాసన ద్రవ్యాలూ, పెట్టుకునే పూల చెండ్లూ యివన్నీ గాక పెద్దలు వ్రాసిపెట్టిన గ్రంథాల ద్వారానూ, చిత్రకారులు వ్రాసిపెట్టిన చిత్రాల ద్వారానూ, పడక గదులలో తలుపులు బిగించుకుని కూర్చొని పొందే రహస్య వాతావరణంలో, ఒంటరితనంలో, సిగ్గు విడియాలనుంచీ, దుస్తులు మొదలైన కట్టుబాట్లనుంచీ, తాత్కాలికంగా పొందే మోక్షంద్వారానూ కూడా వీరిలో కాముక వ్యాపారప్రవృత్తి ప్రబలింది. యూతావాతా, మనుష్యులు యితర జంతువులకు మల్లేగాకుండా జాత్యభివృద్ధితో బాటు శృంగార కళ అనే - పశుపక్ష్యాదులకు అర్థంకాని - ఒక ప్రత్యేక కళను అమలులోకి తీసుకు వచ్చారు. ఇది మానవజాతికి వివాహాన్ని, శోభనమూ, శోభనపు గదులను, అల్లసాని పెద్దన్నలనూ, శృంగార శ్రీనాథులనూ, డాన్ జువాన్‌లనూ, వ్యభిచారాలనూ, దైహికోద్యోగాలనూ ప్రసాదించింది.—(శ్రీరామమూర్తి)




## 3

ప్రొద్దుటే రామదాసు మళ్ళీ తన గదికి వెళ్లాడు. అతనికి పద్ధెనిమిదేళ్ళ వయసైనా అతని హృదయమాత్రం చంటిపిల్లల హృదయమంత సున్నితం. అతనికి గడచిన కొద్ది రోజుల్లోనూ జరిగిన సంఘటనలన్నీ చాలా ఆశ్చర్యాన్నీ భయాన్నీ కలిగించాయి. అతన్ని చూస్తే అతనికే ఆశ్చర్యం వేసింది.

అతను కాకినాడ శరణాలయంలోనూ, రాజమండ్రీ కళాశాల వసతిగృహంలోనూ పెరిగాడు- రాజేశ్వరమ్మ ధనసహాయంతో, ఆమె రక్షణ క్రింద. ఆమె అతనికి విద్యాలోపం, ధనసహాయ లోపం లేకుండా ఇన్నాళ్ళూ పెంచింది. తాను ధనసహాయం చేస్తున్నట్టుగా అతనికి తెలియటం ఆమెకు ఇష్టంలేదు. అందుకనే అతణ్ణి కలుసుకునేది కాదు. భగవంతుడే సహాయం చేసినట్టుగా అతను భావించాలని ఆమె ఉద్దేశ్యం.

ఆమె వివాహ సమయంలోగాని, ఆ తర్వాత గాని తను సహాయం చేస్తున్న అనాథబాలుడి గురించి ఆమె ఎప్పుడూ వెంకటేశ్వర్లుకి చెప్పలేదు. ఆమె చేసిన గుప్త దానాల్లోను, రహస్య పుణ్యకార్యాల్లోను ఇది ఒకటి.

రామదాసు బడిలో చదువుతున్నప్పుడు అతని వికారపు చేష్టలు, దిక్కులేనివాడనే లోకువ- వీటివల్ల మిగతా పిల్లలంతా హేళన చేసి, ఏడిపించి వెలివేసినట్టుగా చూసేవారు అతడిని. అందువల్ల అతనిలో అసమర్థత ఇంకా హెచ్చింది. అతను ఎప్పుడో ఒంటరిగా వుండేవాడు. దానివల్ల అమాయకత్వం బాగా ఏర్పడింది. కాని దానివల్ల చెడ్డ సహవాసాలు, చెడ్డ అలవాట్లు తప్పినాయి.

అతనికి ఏ విషయంలోనూ అనుభవం లేదు. అసలు జీవిత మంటేనే ఏమిటో ఎరుగడు. కాని, అతనికి ఏకాంత వాసంవల్ల పుస్తకాలంటే మంచి ప్రేమ, చదువులో విశిష్టత ఏర్పడ్డాయి. అతనికి శాస్త్ర చర్చలన్నా, లెక్కలన్నా, కవిత్వమన్నా చాలా ఇష్టం. ఆ ధోరణిలో పడి అతను ఎంత కాలమైనా వెళ్ళబుచ్చగలడు. ఎక్కువ కాలం అతను ఆలోచనలతో గడిపేవాడు.

మానవ సమూహం అంటే అతనికి భయం. అతని కెవరూ స్నేహితులు లేరు. ఆలోచనా సముద్రంలో ఒకవిధమైన సత్యాన్వేషణ చేస్తూ, యీ భౌతిక ప్రపంచాన్ని మరచి అతను ఎంత కాలమైనా వుండగలడు. తన అంద వికారం, తోటి కుర్రాళ్ళు పెట్టే బాధలు-ఇవన్నీ మరచి పోగలిగే వాడు.

సాటి కుర్రవాళ్ళకి భయపడి అందరినీ అసహ్యించుకుని అతను ఎవరినీ ప్రేమించటం నేర్చుకోలేదు. ఈ ప్రపంచంలో అతను ప్రేమించిన దల్లా తనని కాపాడి, ప్రేమించి సంరక్షించే తల్లి - రాజేశ్వరమ్మ నొకర్తినే. అతనికి వయస్సు వచ్చిన కొద్దీ ఆమె నొక మాతృదేవతగా ఆరా

ధిస్తూ వుండేవాడు. ఆమెవల్ల అతను జీవించి వుండేవాడు. ఆమె అతనికి ఎంత దూరంగా వుండాలని ప్రయత్నించేదో అంతపవిత్రంగానూ, హృదయానికి అంత సన్నిహితంగానూ వుండేది. అతను ఆమెను మూడు, నాలుగుసార్లు కలుసుకొన్నందువల్ల బాగా ఎరుగును. ఆమె తన పాలిట భాగ్యదేవత అని అతని దృఢ విశ్వాసం.

అతనికి పద్దెనిమిదేళ్ళు వచ్చాక ఒకరోజున రాజేశ్వరమ్మ అతనిని రమ్మని కబురు చేసింది. ఆరోజున అతని ఆనందానికి మేరలేదు. అతనామెను స్వేచ్ఛగా కలుసుకుని ఆరాధించటానికి అనువు దొరికింది. తన కృతజ్ఞత తెల్పటానికి అవకాశం చిక్కింది.

కాని, అతను వెళ్ళి చూసేటప్పటికి ఆమె జబ్బుతో చావు బ్రతుకులమధ్య వుంది. వారం రోజులపాటు ప్రతిరోజూ అతను వెళ్ళి ఆమెను దూరంనుంచే చూసి కన్నీళ్ళు కార్చి, దుఃఖించి చక్కావచ్చేవాడు. ఆమెవంటి ఉత్తమోత్తము రాలైన యిల్లాలికికూడా జబ్బు చెయ్యటం, మామూలు వాళ్ళకు మల్లే ఆమెకూడా చనిపోవటం అతనికి ఆశ్చర్యం వేసింది.

ఆఖరికి అతను చెయ్యగలిగిందేమంటే ఆమె దగ్గిర మోకరించి ఆమె కోరికను చెల్లిస్తానని వాగ్దానం చెయ్యడమే.

ఆరాత్రి శవందగ్గర రామదాసూ, కాపలా వాడూ మాత్రమే వున్నారు. వెంకటేశ్వర్లు ఒక గంటసేపు వుండి తరువాత చిరాకుగా వెళ్ళిపోయాడు.

కాపలావాడు నిద్రపోయాడుగాని, రామదాసు మాత్రం కంటిమీద కునుకు లేకుండా, అలా ఆరిపోయిన కళ్ళతో చూస్తూ, ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆ రాత్రంతా ఒకటే విషయం ఆలోచించాడు—అది సరోజ విషయం. తను ఆరాధించే, ప్రేమించే రాజేశ్వరమ్మ చనిపోయింది; కాబట్టి తన ఆరాధనంతా సరోజమీదికి మరల్చాలి.

అతనికి తెలియకుండానే ఒకవిధమైన ధైర్యం, ఆవేశం అతనిలో ఆరాత్రి ప్రవేశించాయి. అతనికి క్రతనంపోయి పెద్దవాడవుతున్నాడు. అంతకు పూర్వమే అతడు ఒంటరిగా నిలబడిన భయంకర రంగం, ఇన్నాళ్ళుగా అతన్ని కదల్చి చూసిన ఒంటరితనం, నిరుత్సాహం, బాధలతో తట్టుకోవడమనే విద్య- ఇవన్నీ అతని చిన్నతనపు పిరికితనాన్ని పోగొట్టాయి. ఒకవిధమైన అమానుష శక్తి అతన్ని కొద్దిగంటలలో మార్చేసింది.

రామదాసు ప్రొద్దుటే తనగదికి వెళ్ళిపోయాడు. తాగినవాడికి మల్లే మత్తులో వుండి అతను తనగదినే గుర్తుపట్టలేక పోయాడు. అతని గది ఇరుకుగా, పొడుగ్గా వుంది. దానికి దక్షిణం వైపు ఒకటే కిటికీ వుంది. ఆ కిటికీలోంచి అవతల వున్న పచ్చని చేలూ, చెట్లూ ఒక సరస్సులాగ అతనికి కనిపిస్తున్నాయి.

దాసు చాపమీద కూర్చున్నాడు. అతనికి రాత్రంతా నిద్ర లేక చాలా అలసటగా వుంది. కాని అతనికి విశ్రాంతి తీసుకోవాలనే కోరిక లేదు. చాలాసేపు అలాగే ఏమీ తోచక కూర్చున్నాడు. కొంతసేపటికి తెలిసింది అతనికి తను ఏడుస్తున్నట్టుగా. కాని అంతసేపూ తన రోదన అతనికి వినబడలేదు. దాసు లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి నిల్చున్నాడు. చల్లనిగాలి కొంత సుఖాన్ని యిచ్చిందతనికి.

పట్టణమంతా మెల్లిగా మేలుకొంటోంది. సూర్యరశ్మి చెట్ల ఆకులమీదపడి ప్రకాశిస్తోంది. ప్రకృతి యథావిధిగా సాగిపోవటం, తన చుట్టు ప్రక్కల సానుభూతి చూపేవారు లేకపోవడం అతని విచారానికి కారణభూతమైనాయి. కొంతసేపు ఏడ్చి అతను తేలికచెందాడు. అతనికి ఏమి చెయ్యాలో తోచడం లేదు.

ఏమీ తోచక గది అంతా సర్దటం మొదలు పెట్టాడు. ఇక్కడి వస్తువులు అక్కడా, అక్కడి వస్తువులు యిక్కడా పెట్టాడు. పెట్టెలో బట్టలూ, సామానూ సర్దాడు. చివరకి ఆకలివేసి గదిలోంచి పైకి వెళ్ళిపోయాడు. కాని భోజనం సరిగా సహించలేదు. ఏదో కొంచెం తిని వెంకటేశ్వర్లు యింటికి వెళ్ళాడు.

వెంకటేశ్వర్లుని ఓదార్చటానికి అతని తరఫు బంధువులే ఎవరో వచ్చారు. రాజేశ్వరమ్మకు బంధువులే లేరు. రామదాసు వెళ్ళేటప్పటికి శవానికి స్నానం చేయించి, బొట్టుపెట్టి, పువ్వులూ అవీ జల్లారు. నలుగురు బ్రాహ్మణులు శవాన్ని మోయటానికి వచ్చారు. దాసు వెళ్ళిన అర

గంటలో శవం బయలుదేరింది శ్మశానానికి. వెంకటేశ్వర్లు నిప్పుకుండతో ముందు నడిచాడు. వెంకటేశ్వర్లు పరిచయస్థులూ, ధనాశ గల బ్రాహ్మణులూ చాలామంది కూడా వెళ్ళారు. రామదాసు కూడా వారిని దూరంగా వెంబడించాడు.

శవదహనం జరిగి పోయింది. రాజేశ్వరమ్మ పవిత్ర దేహాన్ని అగ్ని ఆహుతి చేసుకుంది. రామదాసు ఒకమూల నిల్చొని ఆమె భౌతికశరీరం దైవత్వం పొందటం చూశాడు. అతని రోదన చెప్పటానికి వీలుకాదు.

శవదహనం కాగానే అందరూ యిళ్ళకి తిరిగి వచ్చేస్తున్నారు. ప్రొద్దుట వాతావరణమంతా హాయిగా వుంది. ప్రకృతి ప్రశాంతంగా ఆహ్లాదకరంగా వుంది. ఆకాశమంతా స్వచ్ఛంగా, నిర్మలంగా వుంది. ఎక్కడ చూసినా వసంతకాలం రామణీయకత ద్యోతకమవుతోంది. ఆ ఉత్సాహ పూరిత వాతావరణంలో శవదహనానికి వెళ్లి వచ్చినవారు వాహ్యాళికి వెళ్ళి వచ్చినట్టుగా నడుస్తున్నారు. అందరూ నవ్వుతూ, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు. ఎక్కడికక్కడికే చిన్న చిన్న ముఠాలుగా తయారయి వూళ్ళో వ్యవహారాలు, రాజకీయాలు మాట్లాడుకుంటూ నడుస్తున్నారు.

రామదాసు మాత్రం భూమికేసి చూస్తూ మెల్లిమెల్లిగా అడుగులువేస్తూ తన చిన్నతనపు రోజులూ, చదువూ, తన భావీ, గతరాత్రి జరిగిన సంఘటనలూ ఆలోచించుకుంటూ నడుస్తున్నాడు. అతని చుట్టూ ఆయింటి సేవకులూ, పరిచారికలూ వున్నారు. అతనికి యిష్టం లేకపోయినా, బాధగా వున్నా ఆపరిచారకులు చెప్పుకునే మాటలు వినవలసి వచ్చింది. ఒక్క మాటైనా తప్పిపోకుండా అన్నీ అతని చెవుల్లో పడ్డాయి.

రాజేశ్వరమ్మ అకాలమరణం గురించి అతనెంతో బాధ పడుతున్నపుడు, ఆమె గురించి ఎంతో పవిత్రమైన ఆలోచనల్లో అతను వున్నప్పుడు- ఆ సేవకులనుకునే పోటు మాటలు అతని చెవుల్లో తప్పనిసరిగా పడ్డాయి. అతని వెనకాల నడుస్తూ మాట్లాడే సేవకుల్లో ఒకడు వెంకటేశ్వర్లు వైపూ, యింకొకడు రాజేశ్వరమ్మ పక్షంగానూ మాట్లాడుతున్నారు.

"అమ్మగారు సచ్చిపోవటమే మంచిదిరా, ఆయమ్మ ఆ బాబుతో నానాబాధలూ పడ్డది. ఎందుకొచ్చిన బతుకు లేరా, సచ్చిందో సుకపడ్డదో" అన్నాడు ఒకడు

"నీకేం తెలుసులేరా. ఆ బాబా యమ్మను ఎప్పుడూ కొట్టనైనా లేదు. ఆయమ్మ కెక్కడలేని గర్వ. ఎప్పుడూ నవ్వుతా వుండేది- అవతలోళ్లు సచ్చోళ్లయినట్టు, నేతగాని ఎదవలయినట్టూ" అన్నాడు రెండోవాడు.

"నాకు తెలిసిందేదో నాకు బాగా తెలుసులేరా. ఆయమ్మ గట్టిగా ఏడవటం నేనెన్నో సార్లు ఆలకించాను. ఆబాబు ఆయమ్మను కొట్టనే లేదనుకో; కానయితే ఆయ నెవర్నో ఉంచుకున్నాడు గాదంట్రా. మరి ఓనాడయినా యీయమ్మగార్ని సరిగా జూసినాడా? ఆ యిచారంతోనే ఆయమ్మ పేణాలోయినాయి."

"ఆయన ఆ యమ్మని సరిగా చూడలేదంటే తప్పంతా ఆ యమ్మదేరా. ఆయన పేణాలు కొనక్కి తినేసుంటది. అందుకే ఒదిలేసుంటాడు. నామట్టుకు నేను అట్టాటి ఆడదానితో కాపరం చెయ్యలేనుగా. బాబుగారు పైతిరుగుళ్లు తిరుగుతున్నారని ఆయమ్మే గబ్బులేపుంటాది."

"నువ్వెక్కడైనా చూశావంట్రా బాబుగారుంచుకునోళ్లని."

"ఆ మాడకేం. ఒకామె దగ్గరకో సారి పగిలిపోయిన పేకోజీ పెట్టుకెళ్లాను. ఆ యమ్మ నన్ను జూసి నవ్వి అట్టాటి చెడిపోయిన బతుకు మానాలు ఎప్పుడూ పంపొద్దని మనయ్యగారితో చెప్పమంది. నన్ను జూసి నవ్వగానే అనుకొన్నాను ఆమె ఎట్టాటిదో."

ఆ రెండోవాడు పకిలిస్తూ, యికిలిస్తూ యింకా యిలా అన్నాడు:

"అయ్యగారు పైతిరుగుళ్లు తిరుగుతే నేట్రా తప్పురన్న యిళ్ళల్లో మొగాళ్ళంతా అంతే. నేనిదివరకు పనిచేసిన ఇంట్లో అయ్యగారు ముండనుంచుకొంటే, అమ్మగారు యింకోడితో పోయేది. సంసారం సక్కగా సాగిపోయేది. మనమ్మగారు గూడా సావకపోతే అట్టా చేసుండరామా!" అన్నాడు.

"అందరికీ అన్నాటికన్నా నచ్చుతాయంట్రా! మనమ్మగారు అగ్గినిప్పులాటి మనిషి."

"ఆ, ఏటోరా. ఉట్టి పున్యానికి అంత తొరగా సావకపోతే నాపోటిగాణ్ణి ఏదో సాయం సెయ్యమంటే సెయ్యనూ. ఆ యమ్మ సాలా అందంగా వుండేదిరా. బాబుగారి అందం సాలదురా ఆ యమ్మముందు." అన్నాడు.

రామదాసు యిదంతా వింటున్నాడు. ఇంక అతను భరించలేకపోయాడు. వాళ్ళవైపు తీక్షణంగా చూశాడు. అతని తీక్షణదృష్టి చూసి ఆ ఆతి వాగుడుగాళ్ళు మరొక సంభాషణలోకి దిగిపోయారు.

ఆ వాగుడు వెధవల ప్రక్కనే వున్న సూరయ్యను చూసి రామదాసు పోల్చుకొన్నాడు. అయితే వాడింతసేపూ ఏమీ మాట్లాడకుండా చాలా మర్యాదగా వాళ్ళ సంభాషణంతా వింటుటున్నాడు. రామదాసు చూడగానే ఒక విధమైన సిగ్గుతో వాడు వినయపునవ్వు నవ్వాడు.

రామదాసు మళ్లీ ఆలోచనలో పడ్డాడు. రాజేశ్వరమ్మ గంభీరంగా పలికిన బాధంతా అతని కిప్పుడు అర్థమైంది. ఆమె నిజంగా ఎంత బాధ ననుభవించిందో అంచనా వెయ్యటం మొదలుపెట్టాడు. ఆ రాత్రి ఆమె భావ గర్భితంగా తన బాధ నంతనూ అతనితో చెబితే రామదాసు లేత మనస్సుకు సరిగ్గా అర్థంకాలేదు. ఈవేళ యింటికి జవానులు మాటలాడుకొన్న దాన్నిబట్టి కొంత అర్థం చేసుకొన్నాడు. ఆమెకు కలిగిన అపచారమంతా తనే చేసినట్టుగా రామదాసు అవమానంతో తల వంచుకున్నాడు. ఆమె చనిపోయాక కూడా ఆమెగురించి అలాగ మాట్లాడటం ఆమె ఆత్మకు అపచారం చెయ్యటమేనని అతని అభిప్రాయం.

రామదాసుకి వాళ్ళ వాక్స్వాతంత్ర్యం మరీ ఆశ్చర్యం కలిగించింది. ఆమె యీ లోకంలో యిక లేకపోయినా ఆమెను గురించి యింత తర్జనభర్జన లెందుకో అతనికి అర్థంకాలేదు. అతనికి ప్రతీ విషయం ఆశ్చర్యంగా వుంది. ప్రతి విషయంలోనూ అతనికి కొంచెం కొంచెంగా ప్రపంచం బోధపడుతోంది.

దారిలో చాలామంది వెంకటేశ్వర్లు పరిచితులూ, స్నేహితులూ అతనితో చెప్పి యిళ్ళకు వెళ్లిపోయారు. దహనక్రియ జరిగి అందరూ వెళ్లిపోగానే వెంకటేశ్వర్లు మనస్సు కుదుటపడింది. అతనింక ఆ దుఃఖకర పరిస్థితులన్నీ మర్చిపోవచ్చు.

రామదాసు ఆ యింటిలోకి యింక వెళ్లడమా మానడమా అనే సందిగ్ధావస్థలో పడ్డాడు. గేటు దగ్గర ఒకజవాను దాసును చూసి అతను క్రొత్తవాడేమోనని ఆటకాయించబోయాడు. రామదాసు సమాధానంతో సంతృప్తిపడి లోపలికి వదిలాడు. గేటుకీ భవనానికీ మధ్య తోట వుంది. ఆ తోటలో పరిచారకులంతా కూర్చున్నారు. దహనక్రియకు రాని సేవకుడొకడు బండి కడుగుతున్నాడు. సింహద్వారంగుండా భవనంలోకి వెళ్ళటం యిష్టంలేక రామదాసు సేవకుల దగ్గర నుంచి భవనం వెనుకప్రక్కకు వెళదామనుకున్నాడు. రామదాసు దగ్గరికి వెళ్లేటప్పటికి వాళ్ళసంభాషణ మానేశారు. అందరికళ్ళూ అతనినే చూడటం రామదాసు చూశాడు. అందరూ అతన్ని తిరస్కారంగా, యీర్ష్యగా చూడటం మొదలుపెట్టారు. ఇంటికి తిరిగి వస్తున్నపుడు తన చూపులతో దారిలో నోరు మూయించిన యిద్దరు సేవకులూ ఆ గుంపులో వున్నారు. అందరూ ఏవో గుసగుస లాడటం మొదలుపెట్టారు. గుసగుసలు పెద్దవయి అందరూ అతన్ని బహిరంగంగా దూషించటం మొదలు పెట్టారు.

దాసు ముఖం అవమానంతో కందిపోయింది. అతను వెనక్కి తిరిగి వెళ్లిపోదా మనుకున్నాడు. కాని యింతలో రాజేశ్వరమ్మ ధైర్యం, స్థైర్యం జ్ఞాపకం వచ్చాయి. ఆ పట్టుదలతో అతను ముందుకే నడిచాడు. అతను వెడుతూంటే అందరూ నానామాటలూ అన్నారు; వికటపు నవ్వులు నవ్వారు. ఎవరికి తోచింది వాళ్ళు అన్నారు.

"అమ్మగారు పెంచిన దిక్కులేనోడు యీడేరా!" అని ఒకడు.

"అదికీ బాగానే చదువు సెప్పించిందటా. మన మింతశ్రమ యీ పొట్టకోసం పడుతున్నాం గాని, యీ బద్దకస్తుడి పనే బాగుందిరా" అని యింకొకడు.

"మన పేటలో అయ్యగారి కోసం కావలి కాయాల్రా. ఇంకెన్నాళ్లో లే" అని మరొకడు.

"పైకి తగిలెయ్యండ్రా యీ ముష్టోణ్ణి" అని వేరొకడు.

రామదాసు మాటాడకుండా వెళ్ళిపోయాడు. బండికడిగే ఆసామీదగ్గరికొచ్చేసరికి వాడు "యిలా గొచ్చి వో చెయ్యి వెయ్యవోయ్" అన్నాడు. సేవకులంతా గొల్లున నవ్వారు.

దాసు కంపిస్తూ వెళ్లిపోయాడు. ఆ సేవకుల వరస చూస్తే తనని ఏడిపించే తోటి విద్యార్థులు జ్ఞాపకమొచ్చారు. తిరిగీ అతనికి పాత రోజులు వచ్చాయి. ఏకాంతవాసంకోసం తపించిపోయాడు. ఆ పోకిరీవాళ్ళ మోటు మాటలతో అతని సున్నిత హృదయం గాయపడింది. దాసుని బెదరగొట్టి వాళ్లు ఆనందం పొందారు. దాసుకి అపరిమితమైన కోపం వచ్చింది. అతను ముందుకి నడుస్తూ వాళ్లవైపు చాలా తీక్ష్ణంగా చూశాడు. వాళ్లు అతని చూపులకి నివ్వెరపోయి, తాము తొందరపడినందుకు కొంచెం భయపడ్డారు. అవసరమైతే దొంగవిషయం చూపించి కాళ్లమీదకూడా పడే మనుష్యులు- అతను తన చూపులతోనే వాళ్ళ నోళ్లు కట్టించి ముందుకు సాగాడు. అంత శక్తి వ్యయం చేసినందుకు అతనికి కాళ్లు తడబడ్డాయి. అలాగే అతను మెట్లు ఎక్కాడు.

కొంత పైకి వెళ్ళాక వెంకటేశ్వర్లు కిందికి దిగివస్తున్నాడు. దాసు గోడవైపు తప్పుకున్నాడు. ఆ యింటి యజమాని దాసును ఎరుగనే ఎరుగడు; 'యీ కొత్తవాడికి తన యింట్లో ఏమి పనా!' అన్నట్టుగా చూశాడు.

వెంకటేశ్వర్లు చూపు దాసుకి అర్థమైంది. అతను మాట్లాడటానికేమీ లేదు.

వెంకటేశ్వర్లు తికమక పడుతూనే దిగిపోయాడు. దాసు తడబడుతూ పైకి వెళ్ళిపోయాడు. ఆ యింట్లో విచారకరమైన పరిస్థితి ఏర్పడినప్పుడు అతనుమాత్రం అక్కడ ఎలా వుంటాడు! ఆ విషయం అతను యింతవరకూ ఆలోచించలేదు. కాని ఆ యిల్లు వదిలి వెళ్ళాలంటే అతనికి బాధగా వుంది. అతని మాతృదేవత అక్కడ లేదు. ఆ యింట్లోనుంచి వెళ్ళనంటే ఎవరుపడితే వారు అతన్ని మెడ బట్టుకు గెంటుతారు.

తోటలో సేవకుల నవ్వులు యింకా వినపడుతున్నాయి. ఆ నవ్వులు వినగానే అతనికి ముచ్చెమటలు పోశాయి. అతను ఆ యింట్లోనుంచి వెళ్ళిపోవటానికే నిశ్చయించుకున్నాడు.

జీవితమంటే అతని కేమిటో తెలియదు. ఎప్పుడూ ముక్కుకు సూటిగా, తిన్నగా ప్రవర్తించడమే అతనికి తెలుసు. అతనికి సరోజ జ్ఞాపకం వచ్చింది. తను ఆ యిల్లు వదిలివెడితే ఆమెకు సహాయం చేయటం ఎలాగా అని ఆలోచించాడు. అతను విధిగా ఆ యిల్లు వదిలిపోవాలి; కాని తాను రాజేశ్వరమ్మకు చేసిన వాగ్దానం ప్రకారం ఆ అవమానంలో ఆ కత్తుల బోనులో వుండటం ముఖ్యం. కాని అది సాధ్యంకాని పని. ముందు తనా యింట్లోంచి వెళ్ళిపోవాలి, ఆ తరువాత సరోజ విషయం ఆలోచించవచ్చు. అతను కూర్చున్న చోటనుంచి లేచాడు. అతని సామాను కొంత అక్కడ వుంది. ఖరీదైన బట్టలూ, పుస్తకాలూ వున్నాయి. బల్లమీద కొంత సొమ్ముతో పర్సు కూడా వుంది.

అతను ఏమీ సర్దుకోలేదు- ఏమీ ముట్టుకోలేదు. మర్యాదతెలియని సేవకుల మాటలు యింకా అతని చెవిలో మ్రోగుతున్నాయి. ఆ వస్తువులన్నీ తనవిగా తోచలేదతనికి. ఏ వస్తువైనా ముట్టుకుంటే తన కళ్ళకు తనే దొంగలా కనిపించాడు. అతను తొడుగుకొన్న బట్టలుతప్ప ఆ యింట్లోనుంచి ఏమీ తీసుకు పోలేదు. దాసు నెమ్మదిగా యింట్లోంచి బయటికి వచ్చాడు.

తోటలోంచి యివతలికి వస్తుండగా సరోజ బాటమీద ఆడుకుంటూ కనిపించింది. వెళ్ళిపోతూ ఆమెదగ్గర కొకసారి వెళ్ళకుండా వుండలేకపోయాడు. సరోజ కొంచెం కంగారుపడింది. దాసు తను జ్ఞాపకమున్నాడా అని అడిగాడు. ఆ పిల్ల జవాబివ్వకుండా అతనికేసి చూసింది. అతను నవ్వటం చూసి ఆమె ఆశ్చర్యపోయింది. అయితే సరోజ అతనెవరో జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నించక పోలేదు. అదంతా చిరాకుగా తోచి ఆమె లేచి పారిపోవటానికి ప్రయత్నించింది. దాసు ఆమెను పట్టుకున్నాడు.

"నువ్వు నన్ను గుర్తుపట్టలేకపోయావు, కనక యిప్పుడైనా సరిగా చూడవు. మనిద్దరం జత. ఏం? నువ్వంటే నాకెంతో యిష్టం. నేనంటే నీ కిష్ట మేనా!" అన్నాడు.

సరోజకి సంభాషణ అర్థంకాలేదు. అయితే అతని కంఠం మృదువుగా వుంది. ఆ పిల్ల నవ్వడం మొదలుపెట్టింది.

"నువ్వెప్పుడూ నన్ను గుర్తుపట్టాలి. నేను వెళ్ళిపోతున్నాను. మళ్ళీ వస్తాలే. నువ్వు మంచిగా వుంటే నీకెన్నో మంచి సంగతులు చెబుతాను. ఏదీ నాకో ముద్దియ్యి, మీ అమ్మకిచ్చినట్టు." అన్నాడు నవ్వుతూ. అతను వంగాడు. అమ్మసంగతి జ్ఞాపకంరాగానే ఆ పిల్ల ఏడవటం మొదలు పెట్టింది. "అమ్మా, అమ్మా," అని ఏడుస్తూ దాసుని తోసేసింది. దాసు పాపం నిశ్చేష్టుడైపోయాడు. ఎవరో సేవకుడు అక్కడికి వస్తుండటం చూసి అక్కడనుంచి మెల్లిగా సాగిపోయాడు. ఎవరిశ్రేయస్సు కోసరం అతను కంకణం కట్టుకొన్నాడో, ఆ పిల్ల నలా దుఃఖంలో ముంచి వెళ్ళిపోవలసి వచ్చినందుకు అతను చాలా బాధ పడ్డాడు.

వీధిలో, రోడ్డుమీద సర్వనాశనమైన సన్యాసిలా నిలబడ్డాడు. అతని భుజాలమీద మహత్తర కార్యం వుంది. అతనిదగ్గరనిష్కల్మష ప్రేమ, కార్యదీక్ష తప్ప యింకేమీ లేవు. అప్పుడే సాయంకాలం నాలుగుగంటలైంది.

(ఇంకా వుంది)

(జనప్రగతి) సెప్టెంబర్ 23-1949

# హ్యూమనిజం - గాంధిజం

ఆవుల గోపాలకృష్ణమూర్తి

(9-9-49 తేదీ సంచిక తరువాయి)

గాంధీజంలో సత్యం, నీతి, అహింస అన్న విషయాలు విశిష్టమైనవి. గాంధీజీ సత్యాన్నిగురించి వ్రాసినంత మరిదేన్నిగురించీ వ్రాయలేదు; పోతే అహింసనుగురించి వ్రాసి వుండవచ్చు. సత్యం అనగా దేవుడు అన్నారు. సత్యం అనగా వునికి అన్నారు. సత్యంగనక నిత్యమైన దన్నారు; వునికిఅల్లా నిత్యమన్నారు. ఉనికి నిత్యంగనక సత్యం, సత్యంగనక సనాతనం అన్నారు. ఈ నిర్వచనమే మారుపేర్లతో వారి రచనల్లో విశేషంగా పొడచూపుతుంది.

ఈ వాదనను హ్యూమనిస్టు అంగీకరించడు. ఉన్నదల్లా నిత్యమై, నిత్యమైనదల్లా సత్యమై, సత్యమైనదంతా సనాతనమైతే, ప్రతి వస్తువూ సనాతనమే కదా? కనుక సత్యం మారనిదైపోతుంది. మారని సత్యం పెరగనిదన్నమాటే. పెరగనిదేకదా సనాతనంగా వుండేది? ఇది మత దృష్టి; హిందూదృష్టి. హ్యూమనిస్టు సత్యాన్ని జ్ఞానాంశంగా పరిగ్రహిస్తాడు. జ్ఞానం సదా పెరుగుతుం దంటాడు. అందువల్ల సత్యమూ పెరుగుతూ, మారుతూ వుంటుంది. గాంధీవాదం హ్యూమనిజానికి చుక్కెదురు.

అహింస విషయం. మనోవాక్కాయ కర్మల్లో అహింసానిరతి కుదిరినప్పుడే తపస్సిద్ధి జరుగుతుం దని గాంధీజీ అభివాదన. ఇది వైదిక దృష్టి, మతదృష్టి. పదార్థవిజ్ఞాన శాస్త్రంగానీ, మరే శాస్త్రంగానీ యీ వాదాన్ని సమర్థించదు. శక్తి (energy) ఒకవిధమైన హింస. శక్తి లేక జగత్తు లేదు. జీవోత్పత్తినుండీ, జీవకోటి పెంపుదలద్వారా మరణంవరకూ యీ శక్తి, యీ హింస జరుగుతూనే వుంది. అందువల్ల శాస్త్రరీత్యా మనోవాక్కాయ కర్మల్లో అహింసఅంటే మరణంగా హ్యూమనిస్టు భావిస్తాడు. అంతమాత్రాన, హ్యూమనిస్టు హింసా వాదాన్ని ఆరాధ్యంగా చేస్తాడని కాదు. హింస అన్నదాన్ని మరీ అంతదూరం గాంధీజీలాగా అన్వయిస్తే విపరీతార్థద్యోతక మౌతుందని భావిస్తాడు.

ఈ అహింసా విధానం ఆచరణలో ఎట్లా వుందో చూద్దాం. జర్మనీ పోలెండుమీద పడితే, పోలెండు ఆయుధాల్తో జర్మనీని ప్రతిఘటించటం

అహింసగా గాంధీజీ అంగీకరించారు. జర్మనీ ఫ్రాన్సుని కబళించి ఇంగ్లండుమీదికి దరవళ్లు తొక్కుతుంటే, గాంధీజీ ఇంగ్లండును అస్త్ర సన్యాసం చేసి హిట్లరును ఆహ్వానించమంటూ, అది అహింసా మార్గమన్నారు. రాజకోటలో తాను నిరసనవ్రతం పూనటం అహింస అన్నారు. విదేశ వస్తువస్త్ర బహిష్కరణ, వాటి దహనం, ఆయా కేంద్రాల్లో సత్యాగ్రహం అహింస అంటారు; విద్యార్థులు అన్నామలై విశ్వవిద్యాలయంలో సమ్మె చేస్తే అది హింస అన్నారు. జపాను గెలుస్తుందని తాను భావించి అలహాబాదు తీర్మానం చేయించి దాన్ని అహింస అంటే, పండిత నెహ్రూ ప్రతిఘటించారు. కాశ్మీరులో ఇండియా సేనలు పోరటం అహింసకు, సత్యానికి జయమన్నారు. ఈ విధంగా అహింస నిర్వచనంలో వివిధ రకాలైన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అందువల్ల అహింస విషయంలో వారి నిర్వచనమే గాక, వారి ఆచరణనే హ్యూమనిస్టు అంగీకరించడు.

కాని, మానవుడు శాంతంగా బ్రతకాలని కోరుకుంటాడు. ఆ భావాన్నే గాంధీజీ వ్యక్తం చేస్తే, దాన్ని హ్యూమనిస్టు అంగీకరిస్తాడు.

ఇక నీతి. గాంధీజీ సత్యాహింసల నిర్వచనాన్ని బట్టే నీతిని గురించీ చెప్పారు. "నీతి లేని వాని నిందింత్రు లోకులు" అని అందరూ అంగీకరిస్తారు. నీతి అంటే శాస్త్రసమ్మతమైన నడవడిగా గాంధీజీ గ్రహించారు. వారి నీతికి పరిధి దేవుడు; మానవుడు కాదు. నీతి తప్పి చరిస్తే దేవుని సన్నిధిని మానవుడు వుత్తరవాది కావాలి. అందువల్ల దైవమార్గాన్ని తప్పక చరించటమే నీతి. నీతిని దేవునితో ముడిపెట్టటంతో, నీతి మతైకదృష్టిలోకి చేరి, అభౌతిక పంథాను తొక్కుతుంది. దీనివల్ల మానవుడు నీతికి కొరముట్టుగా వుండిపోతాడు. ఈ వాదన హ్యూమనిస్టు అంగీకరించడు. నీతి దైవికం కాదు; అపౌరుషేయం కాదు, పౌరుషేయమని హ్యూమనిస్టు అంటాడు. నీతి అనగా హేతువాద బద్ధమైనది. మానవుడు ప్రాయికంగా హేతువాదనీ, అందువల్ల నీతిమంతుడనీ హ్యూమనిస్టు అంటాడు. మానవుని ప్రవర్తననూ, రెండవవానితో అతని సంబంధ బాంధవ్యాలను హేతువాద దృష్టిని నిర్ణయించటమే నీతిగా హ్యూమనిస్టు భావిస్తాడు.

కాని, గాంధీజీ నీతి, శాంతి, దాంతి, దయ శౌచం, ధర్మం, అహింస, సత్యం అని పదేపదే లోకంలో వున్న అవినీతిపట్ల తిరుగుబాటు పోరాటాన్ని హ్యూమనిస్టు సానుభూతితో చూస్తాడు. ఆయనలోని జీవకారుణ్య దృష్టి ప్రతి మతప్రవక్తలోనూ వుంది. ఇంచుమించు గాంధీజీ ఒక మతవాది. కాని యీ గుణాలన్నింటినీ దేవునికి ముడివేసి, మానవుణ్ణి ఒక కొరముట్టుగా చేయటం హ్యూమనిస్టు సహించడు.

గాంధీజీ దృష్టి ఈశావాస్య దృష్టి. సృష్టి, ప్రకృతి, మానవుడు, చిజ్జడములు దైవస్వరూపచ్ఛాయలు. మానవుడు దేవుని చేరటాని కొక సాధన; కొరముట్టు. ఈ భావం ప్రతి మతంలోనూ వుంది. దీన్ని హ్యూమనిస్టు అంగీకరించడు. మానవుడు సాధనా, కొరముట్టా కాడు; మానవుడు పరమావధి. దేవుణ్ణి కూడా మానవుడొక దశలో సృష్టించుకొని, ఆ సాధన ద్వారా మానవుడు తన పరిధిని పెంచుకోవటానికి ప్రయత్నం చేశాడని హ్యూమనిస్టు భావిస్తాడు. గాంధీజీకి దేవుడు ఆదర్శం; మానవుడు సాధన. హ్యూమనిస్టుకు మానవుడే పరమావధి, ఆదర్శం; యితరమైనవన్నీ సాధనలు.

గాంధీవాదంలో నిరాడంబర జీవనం, ఉత్కృష్టభావన జరగాలన్న భావం ఒకటుంది. ఇది మనదేశంలో ఋషుల కాలంనుంచీ వస్తూ వున్న విషయమే: సాంప్రదాయమే. శారీరకంగా సంతృప్తిగల వాతావరణం లేందీ, మేధో రంగాల్లో కృషి విరివిగా జరగటానికి సావకాశం లేదని మనం నిత్యానుభవంలో గుర్తిస్తున్నాం. కొన్నికోట్ల ప్రజలు, హిందూసంఘం ఫూళ్ళకు కాస్తమారంలో వుండిన పల్లెల్లో వుంటూ వున్నారు. వాళ్లు నిరాడంబర జీవులే; కాని మేధాసంపత్తి శూన్యం. ఆచరణకందని, అనుభవానికి లొంగని యీ సూత్రాల్ని హ్యూమనిస్టు అంగీకరించడు.

తర్వాత గాంధీవాదంలో అత్యంత ముఖ్యాంశం-ఆదర్శ సాధనల సంబంధం. ఆదర్శమూ వుత్తమంగా వుండాలి, ఆ ఆదర్శాన్ని చేరేందుకైన సాధనలూ వుత్తమంగా వుండాలని గాంధీజీ అభిప్రాయం. ఇంతవరకు హ్యూమనిస్టు ఆయ

నతో సంపూర్ణంగా యేకీభవిస్తాడు. కాని జీవిత పరమార్థంగా గాంధీజీ యేర్పరించుకొన్న దాన్ని హ్యూమనిస్టు అంగీకరించడు. ప్రపంచంలో వున్న రాజకీయవాదాల్లో చాలా భాగం యీ భావాల్ని-ఆదర్శ సాధనల సంబంధాన్ని - అంగీకరించవు. ప్రపంచ బాధల్లో యెక్కువభాగం యీ అనంగీకారంవల్ల కలుగుతున్నాయి. మంచిని చెడుద్వారా సాధించలేమన్న సూక్తిమీద యీ వాదన ఆధారపడి వుంది. నియంతృత్వంద్వారా ప్రజాస్వామ్యాన్ని చేరలేము, ప్రజాస్వామ్యం పేరుతో—అది నిజమైన ప్రజాస్వామ్యం ఐతే - నియంతృత్వాన్ని స్థాపించ వీలులేదు.

కాని, ఒక్కవిషయం చెప్పాలి. గాంధీజీలో ఆదర్శం మారనిది. మారని ఆదర్శాన్ని చేరే సాధన కూడాయించుమించుమారనిదే అవుతుంది. ఈవిషయంలో హ్యూమనిస్టుగాంధీవాదంఅంగీకరించడు.

అధికార రాజకీయాల్నీ, రాజకీయ పక్ష వ్యవస్థల్నీ హ్యూమనిస్టు వదలి వేయాలంటాడు. గాంధీజీ జీవితమంతా ఆ రెంటితోనే గడచింది. కాని, (వారు మరణించిన తర్వాత ప్యారీలాల్ ప్రచురించిన) చివరి రోజుల్లో అధికార రాజకీయాల్ని గూర్చిన గాంధీజీ ప్రసంగమున్నూ, కాంగ్రెసును పార్టీగా రద్దుచేసి లోక సేవా సంఘంగా మార్చాలన్న సూచనా పరిశీలించి చూస్తే, అంత్యదశలో గాంధీజీ యెంతో ఆరోగ్యంగా ఆలోచనలు ప్రసరించగల్గినట్టు కనబడుతుంది. ఇంకా నాల్గుకాలాలపాటు వుండి ఆలోచనలనే సాగిస్తే, ఆ గాంధీజీ కొత్తరాజకీయాల్ని ప్రారంభించిన వారయేవారు. ఈ బాటను హ్యూమనిస్టులు 1946 నుంచి ప్రచారం చేస్తూండడంచేత, గాంధీజీకూడా ఆ బాటకే వచ్చేవారన్న ఆశ కొంతకుకొంత లేక పోలేదు. గాంధీజీలోవున్న యీ హ్యూమనిస్టు ఛాయలు వారిచివరిరోజుల్లో వెల్లివిరియ మొదలుపెట్టినై.

ఈ విధంగా గాంధీవాదం, హ్యూమనిస్టు దృక్పథాల్ని తరచివెళ్లిచూస్తే, ఒంటరిగా ఆయా వాదాల్ని పరిశీలించినదానికన్నా సుబోధకంగా వుంటుంది. గాంధీజంలో వర్గ సామరస్యం, హృదయపరివర్తన ముఖ్యస్థానాన్ని ఆక్రమిస్తాయి. వర్గసంఘర్షణ వ్యామోహాన్ని ఆరాట పోరాటం దాకా లాగిన అపచారం మార్క్సు చేస్తే, వర్గ సామరస్యం, హృదయపరివర్తనం, ధర్మకర్తృత్వం పేరుతో గాంధీజీమరో వక్రమార్గంలోకి లాగారు. సత్యం వీటి రెంటికీ మధ్యమార్గంలో వుంటుంది. పోరాటంగాని, సామరస్యంగాని వాస్తవికతకు విరుద్ధం; అసలు సంగతి, సమన్వయంచేయటంలో వుందని హ్యూమనిస్టు అంటాడు. మార్క్సు వర్గాన్ని తన నిర్మాణక్రమంలో యూనిట్ గా భావించి వర్గపోరాటం వూహించాడు; గాంధీజీ జాతిని యూనిట్ గా గ్రహించి, జాతిలో వున్న వ్యత్యాసాల్లో సామరస్యం తేజూచారు. హ్యూమనిస్టు వ్యక్తిని యూనిట్ గా భావించి వ్యక్తికీ వ్యక్తికీవున్న సంబంధబాంధవ్యాల్ని సమన్వయ పరుప యత్నిస్తాడు. పదార్థజగత్తులోని వివిధఅణువుల సమన్వయ స్వరూప నిర్ణయం మీదనే సంఘగమనం జరుగుతుంది; అందువల్ల హ్యూమనిస్టు సాపేక్ష సిద్ధాంతానుసారంగా తన నిర్వచనాన్ని చేస్తాడు.

గాంధీజీ మోక్షవాది; హ్యూమనిస్టు స్వేచ్ఛావాది. గాంధీవాదం జాతీయవాదం; హ్యూమనిజం మానవవాదం. గాంధీజం మతవాదం; హ్యూమనిజం హేతువాదం. గాంధీవాదంలో వ్యక్తి పరమార్థాన్ని చేరటానికి సాధన; నవ్య మానవవాదంలో వ్యక్తి ఆదర్శం, వివిధ సంస్థలు, భావాలు, వుద్యమాలు సాధనలు. గాంధీజీకి సత్యం మారనిది; హ్యూమనిస్టుకు సత్యం జ్ఞానాంశం; నిత్యమూ మారేది. గాంధీజీ రివైవలిస్టు, రినైజాన్సువాది. గాంధీవాదంలో విశ్వాసం ప్రధానం; హ్యూమనిజంలో హేతువాదం ప్రధానం. గాంధీజంలో నీతి వైదికతకు దగ్గరగా వుంటుంది; హ్యూమనిజంలో నీతిఅంటే హేతువాదం. ప్రకృతి దైవనిర్మాణం అంటారు గాంధీజీ; ప్రకృతి స్వయంప్రభువు అంటాడు హ్యూమనిస్టు. పరిశ్రమల్ని వర్జిస్తారు గాంధీజీ; వాటిని వాంఛిస్తాడు హ్యూమనిస్టు: విశ్రాంతి చెడుదారికి లాగుతుం దంటారు గాంధీజీ;విశ్రాంతి విజ్ఞానానికి మూలం అంటాడు హ్యూమనిస్టు. దేవుడు సర్వానికీ అధినేత అంటారు గాంధీజీ: మానవుడే సర్వానికీ అధినేత అంటాడు హ్యూమనిస్టు.

(సమాప్తం)

# శాస్త్రజ్ఞానం పెరిగినా, శాస్త్రీయదృష్టి ఏదీ?

వి. యస్. అవధాని

గత రెండు శతాబ్దాలలో భౌతికశాస్త్ర పరిశోధనలు విరివిగా సాగినయి. వాటి ఫలితంగా ప్రకృతి స్వయంపోషకమనీ, దానిని నడిపే ఇతర శక్తులేవీ లేవనీ తేలిపోయింది. అంతలో శాస్త్రానికీ, తాత్వికతకీ ఉన్న సంబంధం మరీ గురుతరమై అన్ని శాస్త్రాల సమన్వయమూ తాత్వికత అయింది. శరీర శాస్త్ర పరిశోధనలు ఇంకా సాగవలసివున్నా జ్ఞానసముపార్జనకు కావలసినంత మటుకూ తృప్తికరంగానే ఉన్నవి. అట్లానే రసాయనిక శాస్త్ర పరిశోధనలు పెచ్చుపెరిగి రసాయనిక శాస్త్రానికీ, భౌతిక శాస్త్రానికీ ఉన్న సంబంధాన్ని తేల్చినవి. అవి రెండూ చదువుకునేవిద్యార్థికి సౌలభ్యంకోసరం విడివిడిగా బోధింపబడుతున్నా పరస్పర భిన్నమయినవీ, వ్యతిరేకమయినవీ కావు. ప్రకృతిశాస్త్రాలూ చాలా అభివృద్ధి నొందినవి. మొక్కలలోని రసాయనిక ప్రక్రియలకు బాక్టీరియా ఉపకరిస్తుంది. మన్నును సారవంతం చేయడానికి మొక్కలు పిండిపదార్థం తయారు చేసుకోవడానికి, బొగ్గుపులుసు గాలిని తీసుకుని అందులోని బొగ్గును విడదీయడానికి—మొక్కలలోని ఇటువంటి అన్ని పనులకీ ప్రకృతిలోని అంతర్గత చలనమే కారణమవుతోంది. మనస్తత్వ శాస్త్ర పరిశోధనలు ఇంకా జరగవలసి ఉన్నవి. అయినప్పటికీ ప్రకృతిలోని ఏ ఒక్క ప్రతిపత్తీ ఇంకో దానికి భిన్నమయిందీ, వ్యతిరేకమయిందీ కాదని రుజువు చేయడానికి. మనసులోని ఒక భావం మరొక భావానికి వ్యతిరేకమయింది కాదని— అట్లానే ఒక ఇన్‌స్టింక్ట్ మరొకదానికి వ్యతిరేకమయింది కాదనీ గెస్టాల్ట్ మెథడ్ రుజువు చేస్తోంది. ఒక భావాభివృద్ధికి మరొక భావం వాడిపోవలసిన అవసరం లేదు. ఇట్లానే భూగర్భ శాస్త్రం, నక్షత్ర శాస్త్రం, (అణు సిద్ధాంతం) మొదలయిన శాస్త్రాలన్నీ ఒక ఉద్దేశ్యాన్ని— ఆయా పరిశోధకులు అంగీకరించినా, అంగీకరించకపోయినా — వెలిబుచ్చుతున్నవి. ఆ ఉద్దేశ్యం ఏమిటి? ఈ ప్రకృతి స్వయం పోషకమైనది. అనంతమైనది. దాని గమనం దానిలోని అణువులు స్వభావాల ననుసరించి జరుగుతుంది. ఆ అణువు లెటువంటివో, వాని గమన సూత్రాలేవో ఆయా శాస్త్రాలు సిద్ధాంత రూపేణా, ప్రయోగాల రూపాన రుజువు చేస్తున్నవి. కాబట్టి ప్రకృతిని నడిపే శక్తి ఏమీ లేదని తేలిపోయింది. అట్లా తేలినందువలన ప్రయోజనం ఏమిటి? ఈ శాస్త్ర పరిశోధనలు మానవాభ్యుదయానికి ఉపకరిస్తున్నవా? ఉపకరించకపోతే దానికి కారణాలేమిటి?

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పబోకముందు ఇంకొక విషయం గుర్తుంచుకోవడం మంచిది. విశ్వం స్వయంపోషకమే. దాన్ని మనం తెలుసుకోలేక పోయినంతమాత్రాన అది స్వయంపోషకం కాదని అర్థం కాదు. మనుష్యుకు విశ్వానికి ఉన్న సంబంధంకూడా తేలిపోయింది. మనసు కూడా పదార్థమే. అయితే అది చైతన్యవంతమయినది. దానిలో complex, impulse, consciousness అనేవి పరిణామ దశలు. రెండోది, శాస్త్రీయపరిశోధన లభివృద్ధినొందినా మానవులు శాస్త్రీయదృక్పథంలో వెనుకబడుతున్నారు. అలా ఎందుకు వెనుకబడుతున్నారు? అంటే దానికి అనేక కారణాలున్నాయి. ఆ కారణాలను తొలగించుకునేందుకు ప్రయత్నించి లభించినజ్ఞానాన్ని మానవాభ్యుదయానికి ఉపయోగించవలసిన బాధ్యత స్వేచ్ఛాప్రియులు-తాత్వికులకు ఎంతయినా ఉన్నది.

అటువంటి కార్యక్రమానికి దిగకముందు దానిని అమలులో పెట్టనున్నవారు ముందుగా

అదృశ్యపథాన్ని ఆకళింపుచేసుకుని స్వేచ్ఛపట్ల తనకుగల అభిప్రాయాన్ని నిశ్చితంచేసుకోవాలి.

ప్రకృతిని స్వయంపోషకం అని అంగీకరించాలి. దానికి మూలం పదార్థం అని అన్నందువలన మనకు కనిపించేవన్నీ యథార్థం అని సిద్ధిస్తుంది. కాబట్టి మన పంచేంద్రియాలు మనకు కలుగచేసే (మానసిక) చిత్రాలు వస్తువుల యథార్థ మూర్తులకి దగ్గరగా నున్నవే. ఇంకా అభివృద్ధిచెందవలసిన అవసరం లేదని కాదు. ఉన్న పరిస్థితులలో కలిగే జ్ఞానం యథార్థమయినది.

ప్రకృతి ఒక ప్రవాహంలా సాగిపోయేదే కాని ఒక మేరలో ఆగేది కాదు. కాబట్టి మార్పు ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. ఆ మార్పు ఒక నియమాన్ని అనుసరించి జరిగేదే కాని అద్భుతమయినది, మానవమేధ కందరానిది మాత్రం కాదు. కొన్ని వేళల అప్పటికప్పుడు జరిగిన ఒక ఘటనకు మూలం చెప్పలేకపోయినా కొంత కాలానికి ఆ కారణాన్ని విపులీకరించగలం. ఈ ఘటనలు ఒకదానితో నొకటి గొలుసులాగా సంబంధం కలిగి ఉంటవి.

ఇట్టి తాత్త్వికత మన భవిష్యత్తుకు కారకులం మనమే అనే సూత్రానికి దోవతీస్తుంది. అట్లా సంఘంలో అందరూ అనుకోగలిగినప్పుడు యథార్థ జ్ఞానం సాధ్యం అవుతుంది. నా భవిష్యత్తుకు నేనే కారకుడను, ఎవరిమంచికి చెడుకి వారే పూర్తిగా బాధ్యులు అనే సాంఘికజ్ఞానం ఇట్టి తాత్త్వికత ననుసరించే కలుగుతుంది. లేకపోతే నీతికి మానవచర్య బాధ్యత వహించకపోతుంది.

పదార్థ తాత్త్వికత నీతి బాహ్యమైనదని కొందరంటూంటారు. నిజానికి పదార్థవాదికి నీతి ఒక నియమం. ఈ నియమం బలవంతంగా రుద్దినది కాదు. వ్యక్తి ప్రకృతినుండి పరిణామం పొందినవాడు కాబట్టి ప్రకృతి నియమాలు మానవునిలో లీనమై అతని సాంఘిక ప్రవర్తనలో ఆవే నీతివంతంగా ప్రతిఫలిస్తవి. ఆ విధంగా నీతినికూడా ప్రకృతి పరిణామం తోలగింపుచేసి పదార్థవాది దానికి యథార్థత కలిగిస్తున్నాడు. తను నీతివంతంగా తన శారీరక ప్రవృత్తి ననుసరించి ఉంటాడు. తను నీతిబాహ్యమైన వ్యవహారలో ప్రవర్తించలేదు. కాబట్టి సంఘాన్ని నీతిమంతం చేయడానికి ప్రయత్నిస్తాడు. ఈ నీతి ఆనేది మెట్ట వేదాంతులూ, అధ్యాత్మిక వేదాంతులూ చెప్పేదికాదు. ప్రవర్తనలో ఇమిడివుండి, కార్యకారణ జ్ఞానయుతమైన హేతువాదన ప్రతిబింబించి, స్వేచ్ఛా ప్రవర్తనకి ఆస్కారం ఉంటుంది. హేతువాద దృష్టిలో వాస్తవిక జగత్తును సమన్వయం చేయసాగితే వ్యక్తికి భయం (తననుగురించి, తన నడవడినిగురించి-తనను పొరుగువారు ఎలా అనుకుంటారో అని) పోయి, అవసరముకు ప్రతి గమనికయూ కారణంగా ఎరిగి, నిర్లిప్తతతో (detached) కూడిన ప్రవర్తన సాగును. ఈ నిర్లిప్తతతో కూడిన నడవడి కార్యకారణ సంబంధం అంగీకరించును. కావున, తన స్వేచ్ఛకూ, పొరుగువాని స్వేచ్ఛకూ ఉన్న సంబంధం అంగీకరించి వ్యక్తి తన ప్రవర్తనను సదా నికరంగా ఉంచుకొన యత్నించును. "అయితే ఆడపిల్ల, కాకపోతే మగపిల్ల" అనెడి రెలెటివ్ నీతిని పదార్థవాది అంగీకరించడు. అతనికి యథార్థమగు జ్ఞానము, దానినుండి వ్యక్తిని అన్ని పరిస్థితులలోను అతని ఆదర్శమునకు దగ్గరకు తీసికొనిపోవు ధర్మము కావలెను. ఆ ధర్మమెట్టిదో- అట్టి ప్రవర్తనను అలను నడచి తన ద్వారా పరులు తెలిసికొని ఆచరించ గలుగునట్టి స్థితిని అతను చూడగలడు.

అగుట, పదార్థవాది ప్రతి విషయినీ (objective) సకారణంగా విమర్శించగలగాలి. అట్లు విమర్శించుటచే అతనికి శాస్త్రీయ దృక్పథ మేర్పడును. ఈ శాస్త్రీయ దృక్పథమే నీతివంతమయినది. అట్టి నీతివంతమయిన దృక్పథం సాంఘిక బాధ్యతలను మన్నించును. సాంఘిక బాధ్యతలను మన్నించక తాను బ్రతకలేడు. తన "బాగు", "వ్యాపారములు" (health and becomings), సాంఘికమైన వాటికన్న భిన్నంకానట్లు శాస్త్రీయ జ్ఞానంతో సమన్వయపరచగలడు. అలా సమన్వయపరచే తాత్త్వికత పదార్థవాదమే అవుతున్నది. ఇక్కడ ఇంకొక విషయం గమనించాలి, సృష్టికి మూలం పదార్థం. ఆ దృష్టితోనే ఈ పదార్థవాదం అనే మాట వాడబడుతోంది.

పదార్థవాదం దృష్టిలో మాత్రం మనసు పదార్థం. దాని విక్రియలగు భావాలు కూడా పదా

క్షమే అవుతాయి. అనగా, చైతన్యం పురుష ప్రయత్నంమీద వ్యక్తి అలవరచుకొన గలదు కాని, మరి ఏ యితర విధానం కాదు. ఈ చైతన్యానికి జ్ఞానం కావాలి. జ్ఞానమన ప్రకృతి సూత్రాల తెలిసి, వాటిని తనలో ఆకళింపు చేసుకోనడమే. ప్రకృతి ఇపుడు ఇదివరకంతటి భయానక మయింది కాదు. దానిని పూర్తిగా జయించక పోయినా - చాలామటుకు స్వాధీనపరచుకుని దానిని మానవ సుఖానికి అనువైనట్టు చేసికొనగలిగిన శక్తి నేటి శాస్త్రీయ జ్ఞానం ఇస్తోంది. ఆ శక్తి అందరికీ కలిగేటట్టు - అందరూ తెలిసికొని వాటిని ఆచరించగలుగునట్టు చెయ్యాలి.

అందుచేత పదార్థవాది విద్య ప్రతివ్యక్తికీ ముఖ్యావసరం అంటాను. ఇట్టి విద్య కాదనడానికి ఇంత చెప్పిన తర్వాత ఆస్కారం లేదనుకుంటాను.

విద్యావంతుడైన వ్యక్తి. స్వేచ్ఛపట్ల ప్రబలాభిమానంగల వ్యక్తి, ప్రకృతిని తాను జయించగలనన్న ధీమాగల వ్యక్తి, తనకు తన స్వేచ్ఛ ఎంత అవసరమో ఇతర్లకు వారి స్వేచ్ఛ అంత అవసరం అని ఎరిగిన వ్యక్తి,(తాను నీతివంతంగా ఉండడం) ఇతర్లకోరకుగాక అంతకు భిన్నంగా తానుండలేడు గనుక నీతివంతుడగు వ్యక్తి సాంఘిక అజ్ఞానాన్ని పటాపంచలు చేయగలడు.

సాంఘిక అజ్ఞానం శాస్త్రీయదృక్పథం ఉన్న చోట బ్రతుకలేదు. శాస్త్రీయజ్ఞానం పెరిగినా శాస్త్రీయ దృక్పథం అలవరచుకోని కారణాన మనం ఈనాడు చూస్తున్న గందరగోళాలన్నీ జరుగుతున్నాయి. శాస్త్రీయ దృక్పథంమాత్రమే వ్యక్తిని క్రియాశూరుణ్ని చేస్తుంది. క్రియాశూరుడుమాత్రమే నీతివంతుడు కాగలడు. క్రియాశూరుడు బలవంతంగాకాక, స్వేచ్ఛగా నియమాల్ని అనుసరించగలడు. ఆ నియమం ఎంతవరకు తనకూ, తనపొరుగువానికీ అవసరమో అతనికి (హేతువాదం) శాస్త్రీయ దృక్పథమే తెలియచేస్తుంది.



# పూచిన మోదుగులు

దాశరథి

నాను మోదుగులు ఎర్రగా మండినై. అడవి అంతా వసంతంతో నిండిపోయింది. ఎన్ని ఎండలు కొట్టినా ఆ వసంతశోభ అవంతైనా తగ్గలేదు. ఎంత బావున్నాయి పూచిన మోదుగులు! మోదుగు పూచిందంటే పండగ.

ప్రతి సంవత్సరం మోదుగు పూతకోసం ఎదురు చూసేవాడు సారంగపాణి. వాడికి పసితనంనుంచీ అదే పిచ్చి. మోదుగు పూలకోసం తహతహలాడే పిచ్చి వాడికి ఎన్నడూ తగ్గలేదు.

రెండేళ్ళక్రితం మోదుగుపూలు చల్లారిపోయి వానలు పడగానే జైలుకుపోయాడు సారంగపాణి. కొన్నాళ్ళు వానలూ, చలీ గడిచాక మళ్ళీ మోదుగులు పూచినాయి. మోదుగులు పూస్తున్నాయని వాటిని చూడాలని చాలా బాధపడ్డాడు సారంగపాణి.

వరంగల్లు సెంట్రల్ జైలు ఒక పెద్ద లోతైన బావిలా వుంటుంది. అందులోంచి ఆకాశం తప్పితే మరేమీ కనపడదు.

"నన్ను మరో జైలుకు మార్చండి" అని సారంగపాణి సూపరింటెండెంటుతో మొర పెట్టుకున్నాడు.

"ఎందుకూ?" అన్నాడు సూపరింటెండెంటు.

"మోదుగులు పూయగా చూడాలి." అన్నాడు సారంగం. వాడి మాటలు సూపరింటెండెంటుకు అర్థంకాలేదు. సారంగపాణి వరంగల్లు జైల్లోనే వుండిపోయాడు.

మేము ఎత్తయిన కొండ శిఖరంమీద వున్న 'నైజామాబాద్' జైల్లో గడిపాం వసంతం. కొండ కొమ్మున దేవాలయంలా వున్న ఆ జైల్ని నాలుగువైపులా, మోదుగులు చుట్టేసినాయి. అంతా అడవి. అడవిలో 'నైజాం సాగర్' చెరువు కాలవ కాలవ పక్కగా అక్కడక్కడా

చిన్న చిన్న చెరుకు తోటలు. నీలాలు జారిపోయే కాలువ గట్టుమీద యెర్రటి మోదుగులు, చల్లని యిప్పపూల వాసన.

ఎన్ని యిబ్బందులు పడినా, నైజాం నవాబు కరకుకత్తి యెంత పదునైనా మేం ఆ వసంతం హాయిగా గడిపాం, 'హైదరాబాద్' జైల్లో. పూచిన మోదుగుల్ని చూసినప్పుడల్లా నాకు ఒకే ఒకవిచారం కలిగేది-సారంగం లేడయ్యేనే అని.

సారంగం వరంగల్లు జైల్లోనే వున్నాడు. మోదుగులు పూచినాయి, చల్లారినాయి. వానలు మళ్ళీ వచ్చినాయి. మూడునాలుగు దీర్ఘమాసాలు సారంగం తన మోదుగుల్ని చూడకుండా యెలా గడిపాడో తెలీదు.

తీరా వానలు పడ్డాక సారంగం మా జైలుకు వచ్చాడు. కుంకుమ నోచుకోని విధవ స్త్రీలలా వున్నై మోదుగులు. వాడికి అప్పటికి ఇంకా రక్తవమన వ్యాధి పూర్తిగా తగ్గలేదు. ఎందుకో గాని చారెడు చారెడు రక్తం కక్కేవాడు. పాపం, పాడుజబ్బు దాపరించింది.

"ఎందుకు నవ్వుతావు?" అని అడిగాను.

"మోదుగులు పూచినై" అన్నాడు సారంగం.

"మోదుగులు పూచినప్పుడూ, పూచి విచ్చుకున్నప్పుడూ, అంతటా పరచుకున్నప్పుడూ నువ్వు జ్ఞాపకం వచ్చేవాడివి. తీరా అవి చల్లారిపోయాక వచ్చావు." అని విచారపడ్డాను. సారంగపాణి అందుకు జవాబుగా మళ్లీ రక్తం కక్కాడు. నాకు భయంవేసింది. చనిపోతాడేమో అనుకున్నాను.

వాడు చనిపోలేదనే తేల్చుకున్నాం— నేనూ నా మిత్రులూ, జైలు అధికార్లూ, హోం సెక్రెటరీ. విడుదల ఆర్డరు వచ్చింది సారంగపాణికి. గొంతువిగుతో రక్తం కక్కి మెట్లన్నీ తడిపాడు. తడుపులో వెళ్ళిపోయాడు.

* * *

"ఆయన జైలునించి వచ్చాక వానలూ, వాంతులూ మరీ యెక్కువైనై" అంది సారంగం భార్య రమణమ్మ యేడుస్తూ.

"మరి ఇక్కడ్నించి యెటు వెళ్లాడు?" అని అడిగాను నేను.

"నెత్తురు కక్కడం తగ్గకుండానే ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. ఎక్కడో 'బోర్డర్ క్యాంపు' లో చేరాడని విన్నాం. పోలీసులు మళ్ళీ వచ్చి ఆయన్ని వెతికారు. నన్ను కొట్టారు. నిజంగా ఆయన దగ్గరనుంచి వుత్తరమైనా రాలేదు నాకు. ఇంకా నెలకి సైన్యాలు వొస్తాయి అనగా ఒక 'గన్ను', తోటాల బెల్టూ వేసుకుని అర్ధరాత్రి ఇంటికి వచ్చాడు. చాలా నీరసంగానే వున్నాడు. భోజనం చేసి పోతూ 'పూచిన మోదుగుల' చిత్రం తీసుకుపోయాడు. మళ్ళీరాలేదు." అని యేడిచింది పెద్దగా రమణమ్మ.

జైల్లో వున్నా బావుండేదేమో మాతోపాటు చల్లగా విడుదలయేవాడు, ఈబాధంతా లేకపోయేది అనుకున్నా నేను. వాడు చనిపోయినట్టు యెక్కడా సరియైన గుర్తులు కనబడలేదు. బోర్డర్ క్యాంప్ వాళ్ల లిస్టుల్లోనూ వాడు చనిపోయినట్టు పేరు లేదు. వాళ్లూ వాడికోసం వెతికారు. నిరాశపడి వూరుకున్నారు.

సారంగపాణి యింటినిండా రమణమ్మ కన్నీళ్లే కనపడ్డయ్. భరించలేకపోయాను. ఓదార్చే దారే కనిపించలేదు. ఇంటికి వచ్చి విచారంతో మా అమ్మకు ఈ గాథంతా చెప్పాను. ఆమె ఆశ్చర్యంతో గబగబా ఇంట్లోకి వెళ్లి ఒక చిత్రం తెచ్చి యిచ్చింది. 'పూచిన మోదుగులు!'

"ఇది యెలా వొచ్చింది?" అని అడిగాను అమ్మను. ఆమె చెప్పింది—నేను జైల్లో వుండగా రహస్యంగా వొక అర్ధరాత్రి సారంగం మా ఇంటికి వచ్చాడుట. వాడు పాపం, నా క్షేమ సమాచారం, జైలుగొడవా చెప్పి, భోజనంచేసి వెళ్లిపోయాడట. ఈ చిత్రం మాత్రం మరిచిపోయాడు. మళ్లీ రాలేదు.

వాడు వెళ్లిపోయిన తెల్లవారగట్టే రజాకార్లు, పోలీసులూ ఒక కాంగ్రెసు వాణ్ణి చంపి 'గన్ను', తోటాలూ తెచ్చారట. వాడే సారంగమేమో!

సైన్యాలు వచ్చాక మేం సారంగం స్మృతి చిహ్నంగా ఒక వేదిక కట్టి దానిమీద మూడు రంగులూ యెగరేశాం.

కాని వూరిచుట్టూ మోదుగులు పూచినప్పుడల్లా సారంగం వాటినీడల్లో నడయాడుతున్నట్టు అనిపిస్తుంది. రమణమ్మ సారంగంకోసం ఇప్పటికీ ఆ మోదుగులన్నీ వెతుక్కుంటోంటుంది.




(క్రిందటి సంచిక తరువాయి)

యుద్ధమునకు వాస్తవమైన కారణము నిట్లు అబ్దుర్ రజాకు వర్ణించుచున్నాడు. అబ్దుర్ రజాకు సమకాలికుడు; పై చెప్పిన మారణకర్మ జరిగిన పిమ్మట నెలదినముల కతడు విజయనగరమునకు వచ్చెను; అచట పై యుద్ధము నడచునపుడు నివసించుచుండెను. యుద్ధరంగమునకు బోయి కయ్యమును గనులార గాంచకపోయినను యుద్ధమున బాల్గొనిన లక్కణ దండనాయకాది యోధులతనికి పరిచితులు; వారిని విచారించి వాస్తవ స్థితి నరయుట కతనికి మంచి యవకాశముండెను. మీదు మిక్కిలి యతడు మతముచే మహమ్మదీయుడు; పై దేశికుడు. కావున నతడు వివరించిన యుద్ధకారణమె సత్యమనియు, ఫెరిష్తా చెప్పిన దంతయు కేవల కైతవకల్పన యనియు మనము నిశ్చయింపవచ్చును.

యుద్ధకారణము నింత సత్యముగ వివరించిన ఫెరిష్తా, యుద్ధవృత్తాంతమును మఱియెంత సత్యముగ వర్ణించియున్నాడో కనుగొనుటకు శక్యము గాదు. అంద్ధపురాణమున నెద్ది వాస్తవమో, యెద్ది కల్పనయో, విశ్వాసపాత్రములగు సత్యాధారములు లేనప్పుడు, నిర్ణయించుట యెట్లు? ఎంతటి కైతవకల్పనయైనను, సత్యాన్వేషణార్థము సంగ్రహముగనైనను ఫెరిష్తాయుద్ధవృత్తాంతము నిచట పొందుపఱచుట సరి. ఫెరిష్తాచరిత్ర బట్టి యిమ్మడిదేవరాయలు కృష్ణాతుంగభద్రల మధ్య దేశముపై దండువెట్టెను. ముదుగల్లు దుర్గమును ముఖ్యస్కంధావారమును జేసికొని యిమ్మడి దేవరాయలచట విడిసి తన పుత్రులిరువురిలో నొకనిని రాయచూరు దుర్గమును, మఱియొకనిని బంకాపురమును సాధింపనియమించి, సగర బీజాపురముల పర్యంతముగల బహమనీ రాష్ట్రమును చూఱలాడి పాడుగావించెను. సుల్తాను అల్లావుద్దీను శాహు ౫౦,౦౦౦ గుఱ్ఱములను ౬౦,౦౦౦ కాల్బలమును గొల్వ వచ్చి ముదుకల్లునకు పండ్రెండుమైళ్ళదూరమున విడిసి, మల్లిక్-ఉల్-తుజ్జారును రాయల పుత్రులపై పంపెను. మల్లిక్-ఉల్-తుజ్జారు మొట్టమొదట రాయచూరి కడ రాయల పెద్ద కుమారు నోడించెను; అంతట నతడచటినుండి పాఱిపోయి బంకాపురమును ముట్టడించి యుండిన తమ్ముని గలిసికొనెను; ఇరువురును బంకాపురి ముట్టడిని విసర్జించి యచటు పాఱిపోయిరి. ఆ లోపల నట ముదుగల్లు పరిసరముల మూడు భయంకర యుద్ధములు నడచినవి. మొదటి యుద్ధమున జయము రాయలకే చేకూడినది; సుల్తాను పక్షమున విశేష జనక్షయము గలిగినది. రెండవ యుద్ధమున సుల్తాను జయమందెను; కాని దీని వివరములు తెలియరావు; మూడవ యుద్ధమున జయము మరల సుల్తానుకే కలిగెను. రాయచూరు బంకాపురములనుండి పాఱివచ్చిన దేవరాయల జ్యేష్ఠపుత్రుడీ రణక్షేత్రమున వీరస్వర్గమును జూఱగొనెను. రాజకుమారుని మరణముచే భయకంపితచేతస్కుడై

విజయనగర సైనికులు యుద్ధము చాలించి ముద్గలు కోటలోనికి పాఱిపోయిరి. వారిని వెన్నంటి తఱుముచు పోయిన బహమనీ సర్దారు లిద్దఱు వారిచే జిక్కి బందీకృతులైరి. ఆ సర్దారు లిద్దఱును సుల్తానున కభిమాన పాత్రులు. కావున నతడు వారిని విడువకున్న, దానికి ప్రతీకారముగ రెండు లక్షల హిందువులను వధించెదనని బెదరు మాటల రాయలకు సందేశమంపెను. ఆ సందేశమును వినగనె, దేవరాయలు జడిసి సంధి ననుగ్రహింపవలయునని సుల్తానును వేడుకొనెను. తక్షణమె సుల్తాను సంధి కొప్పుకొనెను. ఈ యొడంబడిక ప్రకారము దేవరాయ లటుమీద సుల్తాను రాష్ట్రముపై దండు వెడలరాదనియు, ప్రతివర్షము నిర్ణీతమైన కప్పమును జెల్లించెద ననియు నొప్పుకొని పై జిక్కియున్న సర్దారుల నిరువురిని విడిచి పెట్టెను

ఫెరిష్తా వర్ణించిన యుద్ధవృత్తాంతము నాధునిక చరిత్రకారు లనేకులు సత్యాత్మకమని యొప్పుకొన్నను, నది విశ్వాసపాత్రము గాదని త్రోసి పుచ్చుటకు కారణములు లేకపోలేదు. సుల్తాను బెదిరింపులకు జడిసి యిమ్మడి దేవరాయలు సంధిని ప్రసాదింప గోరెననుట నమ్మదగినది కాదు. అంత దృఢముగ ఫెరిష్తా యొత్తి చెప్పెడి బహమనీ సుల్తానుల దిట్టతనము దేవరాయ లెఱుగనిది కాదు; వానివలన నప్పు డంతగ భయపడవలసిన కారణమును గానరాదు. విజయనగర చక్రవర్తులు నిజబాహుబలముచే సామ్రాజ్య నిర్మాణము గావించి పృథ్వీపాలన మొనర్చిరి, కాని బహమనీ సుల్తానుల యనుగ్రహమును సంపాదించి కాదు. మహమ్మదీయుల యాటలే సాగియుండిన, రాయరాజ్య మొక్క పూటయైన జరిగియుండదు. ఈ పట్టున విచారింపదగిన ముఖ్యాంశ మింకొక్కటి కలదు. అది ముదుగల్లు దుర్గమును బహమనీ సుల్తాను సాధింపజాలకపోవుటయే. సంధిషరత్తుల నంత విపులముగ దెలిపి వ్రాసిన మహమ్మదీయ చరిత్రకారు లీ సందర్భమున ముదుగల్లు మాట యెత్తరు. కృష్ణా తుంగభద్రల మధ్య దేశమందలి యాయపట్టు స్థలములలో ముదుగల్లు దుర్గము ముఖ్యమైనది. ఈ యుద్ధప్రారంభ దశయందె యిమ్మడి దేవరాయలు బహమనీ సుల్తాను చేతినుండి ఈ దుర్గమును సాధించెనని ఫెరిష్తా వ్రాసియున్నాడు. సంధి చేసికొనిన పిమ్మట, ఈ కోట దేవరాయల స్వాధీనమందే యుండినదో, మహమ్మదీయ చరిత్రకారు లెంత బడాయి కొట్టినను, బహమనీ సుల్తాను దానిని మరల స్వాధీనము చేసికొనజాలకపోయె ననుట నిశ్చయము. ఇచ్చట స్మరింపదగిన చరిత్రాంశ మొకటి యున్నది. ఇమ్మడి దేవరాయలు బహమనీ సుల్తానును సంధిని ప్రసాదింప వేడినాడని చెప్పు సమయమునకె, రాయ సైన్య మొకటి తీరాంధ్రముపై దండువెడలి బలసంపన్నుడైన కళింగ గజపతిని రణరంగమున నోడించి జయము గొనెను. జయోజ్జ్వలితమైన సైన్య మొకటి దగ్గఱనుండ సంసిద్ధమై యుండగ సుల్తాను బెదిరింపులకు జంకి ఇమ్మడి దేవరాయలు సంధిని వేడెననుట హాస్యాస్పదము. కృష్ణా తుంగభద్రల మధ్యదేశమునందు సుల్తా నల్లావుద్దీను కధికారము చెల్లలేదనుటకు కొంత శాసనాధారము గలదు. బీజాపురజిల్లా ఇండి తాలూకాకు చేరిన హాల్సంగి గ్రామమున గానవచ్చు నాలుగు శాసనశిలలపై 'హామ్-ఎ అలా-ఉద్-దౌలవద్ అహమద్ షాః సుల్తాన్' అను పార్సీ శాసనములు గలవు. ఇందువల్ల నిమ్మడి అల్లావుద్దీన్ షాహు రాజ్యపు దక్షిణపు పొలిమేర యందు హాల్సంగిగ్రామ ముండెనని నిశ్చయమగు చున్నది; కావున కృష్ణా తుంగభద్రల మధ్య రాష్ట్రము ఇమ్మడి అల్లావుద్దీన్ షాహు కాలమున బహమనీ రాజ్యాంతర్గతము గాదని విదితమగు చున్నది. పైజెప్పిన యంశముల నన్నిటిని అవలోకనముచేసి చూడగా, ఫెరిష్తా చరిత్రయందు గానవచ్చు యుద్ధవృత్తాంతము నిష్పక్షపాతము గాదనియు, సత్యదూరమనియు దోచుచున్నది; కావున విజయనగర చరిత్ర పునర్నిర్మాణమునకు గడగు నాధునిక పరిశోధకు లాతని చరిత్రయందు గానవచ్చు విషయములను వినియోగించుకొనునప్పుడు, కడు జాగరూకతతో బరామర్శించి గ్రహించుట యుక్తము.

ఇమ్మడి దేవరాయల సమర వ్యాపారమంతయు బహమనీ యుద్ధములతో ముగిసిపోలేదు. కొంచె మించుమించు అల్లావుద్దీన్ షాహుతో పెనగులాడుచుండిన సమయముననె, యితడు పర రాజ్యములపై రెండు దండయాత్ర లంపియుం

డెను. అందు మొదటిది సింహళ ద్వీపముపై నడచిన నౌకాయుద్ధయాత్ర. క్రీ. శ. ౧౪౪౨-౪౩వ సం॥నవంబరు మాసమున పారశీక రాయబారి అబ్దుర్ రజాకు దక్షిణహిందూదేశమునకు వచ్చియుండి నప్పు డిమ్మడి దేవరాయల ప్రధాన మంత్రియు, విశ్వాసపాత్రుడును నగు లక్కణ దండనాయకుఁడు నావికాదళమును గొని సింహళముపై యుద్ధయాత్ర చేయబోయి యుండెనని వ్రాసియున్నాడు. ఈ నావికాదళయాత్ర అంతకు మూడు నాలుగు సంవత్సరములకు పూర్వమె ప్రారంభమాయెనని శాసన సాక్ష్యమువలన దెలియవచ్చుచున్నది. ఇమ్మడి దేవరాయ లేల సింహళముపై దన నావికాబలముల నంపవలసి వచ్చెనో తెలియదు. దక్షిణ సముద్రాధిపత్యము కొఱకు ఉభయ రాజ్యములకును ఘర్షణ కలిగి యుండవచ్చును; సింహళాధిపతికి బుద్ధిచెప్పుటకై ఇమ్మడి దేవరాయలు నౌకాదళముతో గూడ లక్కణ దండనాయకు నంపిన నంపియుండ వచ్చును. ఏ కారణమువలన నైన నేమి? నౌకాదళయాత్ర మాత్రము జయప్రదముగ కొనసాగినది. సింహళాధిపు డపజయమంది రాయలకు గప్పముగట్ట నొప్పుకొనవలసి వచ్చెను; లక్కణ దండనాయకుఁడు దక్షిణ సముద్రముపై రాయల యాధిపత్యమును నెలకొల్పెను. ఈ నౌకావిజయ ప్రసక్తి యప్పటి శాసనములందు కలదు; లక్కణ దండనాయకుడందు దక్షిణ సముద్రాధిపతి యని ప్రశంసింపఁ బడియున్నాడు; కొన్నిటియం దిమ్మడి దేవరాయ 'లిలంకైకొండ' (అనఁగా సింహళము నుండి కప్పముగొన్నవాడని) కలదు. కావున నీ నౌకాదళయాత్రవలన సింహళము రాయసామ్రాజ్యముక్రిందికి వచ్చెనని మన మూని చెప్పవచ్చును.

బహమనీసంగ్రామము ముమ్మరముగ సాగుచుండునప్పుడె ఇమ్మడి దేవరాయలు రాజమహేంద్రవర రెడ్డిరాజ్య వ్యవహారములలో జొరవ గలిగించుకొన వలసివచ్చినది. రెడ్లకును కళింగ గజపతులకును గలహము మరల సంప్రాప్తమైనది. అల్లయవేముడును వీరభద్రుడును కళింగమును మరల నాక్రమింపగడగిరేమొ; కాని కళింగమున రాజకీయ వాతావరణము మారినది. నాల్మడిభానుదేవుడు క్రీ. శ. ౧౪౩౪ వ సంవత్సరమున గతించెను. అతనిస్థానమున సూర్యవంశ క్షత్రియుడు, కపిలేశ్వర గజపతి, కళింగాధిపత్యము వహించెను; కపిలేశ్వరుడు శూరాగ్రణి. సరివారిలో నతనిమించిన పరాక్రమశాలియు దళనాయకుడును మఱియొకడు గానరాడు. రెడ్డి దౌర్బల్యము నాతడు సహింపజాలకపోయెను. ఎట్టయిన వారిని మట్టుపెట్టుటయె శ్రేయస్కరమని యాతడు నిశ్చయించెను. కావున రెడ్లకు ప్రకృతిచే నమిత్రులైన వెలమవారితో బూర్వికుల మార్గముబట్టి చెలిమి నెఱపి, రాయ బహమనీ సురత్రాణ సంగ్రామమును బందుచేసికొని రాజమహేంద్రవరముపై దండువెడలెను. ఇమ్మడి దేవరాయలు దన మిత్రులను చెయి విడువలేదు; ప్రచండసైన్యమును మల్లప్ప ఉడయుల యాధిపత్యముక్రింద గోదావరీ తీరమున కంపెను. యుద్ధ మెట్లు నడచెనో తెలియదు; కాని దాని పర్యవసానమునుగూర్చి సంశయము లేదు; కపిలేశ్వరుడు పరాజితుడై నిజరాజ్యమునకు బాఱిపోయెను. మల్లప్ప ఉడయులు కొంతకాలము రాజమహేంద్రవరమున నిలిచి రాయల యాజ్ఞమేరకు, రెడ్డి రాజ్యమును మరల ప్రతిష్ఠ గావించెను. *

* గంగాదాస ప్రతాప విలాసములో (పోస్పస్, ౨౯), నిమ్మడి ప్రతాపదేవరాయల మరణానంతరము, తరుణవయస్కుఁడగు మల్లికార్జున రాయలు సింహాసనము నధిష్ఠింపగనే, దేవరాయలచే మున్ను పరాజితులైన దక్షిణసురత్రాణుడును గజపతియు సిద్ధులు నేకమై యెత్తివచ్చి విజయనగరమునకు ముట్టడివేసిరని చెప్పియున్నది. ఇమ్మడిదేవరాయల మరణానంతరము దక్షిణసురత్రాణునితో గూడ విజయనగరముపై నెత్తివచ్చినది గజపతి కపిలేశ్వరుడు. అతడు క్రీ శ. ౧౪౩౫ వ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించియుండుటవలన, నతడు దేవరాయలచే బరాజయమందినది క్రీ.శ. ౧౪౪౩-౪౪ వ సంవత్సరమున నడచిన మల్లప్ప ఉడయుల దండయాత్రయందై యుండవలయును. క్రీ.శ. ౧౪౪౩-౪౪ నాటి ద్రాక్షారామ శిలాశాసనమువలన విజయనగర సైన్యము లప్పుడు గోదావరీతీరమున యుద్ధముచేయుచుండెనని తెలియవచ్చుచున్నది. ఈ శాసనమున మల్లప్ప ఉడయులకు మేలు కలుగుట కొఱకు అల్లయవేమ వీరభద్రుల యాజ్ఞానుసారము వీరబణజిగశెట్టి చేసిన దానము వర్ణింపబడియుండుటవలన మల్లప్ప ఉడయులు వేమ వీరభద్రులకు సహాయము చేయుటకొఱకే యచటికి వచ్చెనని విదితమగుచున్నది.

ఇమ్మడి దేవరాయల రాజ్యకాలమునందు జరిగిన యుద్ధములలో నతని ద్వితీయకళింగదండయాత్ర కడపటిది. తరువాత నతడు రెండేండ్ల పర్యంతము రాజ్యపాలన మొనర్చినను, రాజ్యమున నెచ్చటను యుద్ధవార్త వినరాలేదు. శాంతి యవిచ్ఛిన్నముగ వర్ధిల్లినది. ఇరువది యైదేండ్లు కడు వైభవముతో పృథ్వీపరిపాలన మొనరించి, క్రీ శ. ౧౪౪౬ వ సంవత్సరము మే ౨౪ వ తేది మంగళవారమునా డిమ్మడి దేవరాయలు దేహము చాలించి లోకాంతరగతు డాయెను.

ఇమ్మడి దేవరాయలు శక్తిసంపన్నుడైన చక్రవర్తి. రాజ్యవిస్తారమున భారతావనియం దప్పు డతనితో సరితూగగల నరపాలుడు లేడు. కృష్ణానది మొదలు సింహళము వఱకును, అరేబియా సముద్రము నుండి బంగాళాఖాత పర్యంతమును గల దక్షిణ భారతభూమి యంతయు నతని యేలుబడిక్రింద నుండినది. అతని వరుంబడికి మితిలేదు. రాష్ట్రము నుండి వసూలగు పన్నులే గాక, యసంఖ్యాకములగు రేవు పట్టణములనుండి శుల్కరూపమున నపారధనము ప్రతి వర్షమును జమ యయ్యెడిది. చతుస్సముద్రాధిపతి యగు నతని యుద్ధనావ లడ్డులేక సాగరమును దరించిపోయి కొల్లము, సింహళము, పెగు, దనాసరి దేశముల నుండి కప్పము గొనివచ్చెడివి. అతని గజదళమున వేయేనుగులు గలవు. పదాతుల సంఖ్య పదునొకండు లక్షలు.

అతడు రాజ్యమేలిన ఇరువది యైదేండ్ల కాలమును ఇమ్మడి దేవరాయలు శత్రువులతో నిరంతరము పోరాడవలసి వచ్చినను, ప్రజా పరిపాలన వ్యవహారములను శ్రద్ధతో నిర్వహించువాడు. అతని యేలుబడిక్రింద యప్పటి కాలమానముల చొప్పున రాజ్యసంపద చక్కగ నభివృద్ధి నందినది; జనులు సుఖముగ కాలము గడపుచుండిరి.

ఇమ్మడి దేవరాయలు విద్యాప్రభువు. అతడు స్వయము విద్వాంసుడు. గ్రంథకర్త యనుట కాధారము గలదు. బ్రహ్మసూత్ర భాష్యమొకటి యాతని పేరట గలదు; మహానాటక సుధానిధి యను పేర రామాయణ కథను చంపూకావ్యముగ రచించెను. దేవరాయలు కవిజన కల్పభూజము. గీర్వాణాంధ్రకర్ణాటక కవులనేకు లతని యాస్థానమున వెలసిరి. ఇతని యోలగము నలంకరించిన కవిసత్తములలో డిండిమ కవిసార్వభౌముడు సుప్రసిద్ధుడు. ఇతడు పెక్కుకావ్యములను సంస్కృతమున రచించెను. ఆంధ్ర కవిసార్వభౌముడు, శ్రీనాథుడు, కనకాభిషేకగౌరవ మందిన దిమ్మడి దేవరాయల యాస్థానమునందే యని యాంధ్ర వాఙ్మయ పరిశోధకులయం దనేకుల యభిప్రాయము. కాని ఇది సంశయాస్పదము. కర్ణాట కవు లనేకులు దేవరాయల యాదరణకు పాత్రులైరి. విద్వత్సభలను గూర్చి, పండితులచే శాస్త్రవాదములను జేయించి వారి నుచిత రీతిని సంభావించుట ఇమ్మడి దేవరాయలకు గరము ప్రియమైన వినోదము. మతముచే నిమ్మడి దేవరాయలు వైష్ణవుడు; వీర శైవుడని కొందఱందురుగాని యది విశ్వాసార్హముగాదు. అతనికి నచ్చిన మతము వైష్ణవమైనను, సామాన్యముగ హిందూ ప్రభువు లందఱివలెనే యన్యమత ద్వేషము నెఱుగడు. తన యేలుబడిక్రింది ప్రజల భక్తి విశ్వాసములకు గురియైన మతముల నన్నిటిని యతడాదరించి గౌరవించెను; హంపి బజారునం దొక జైనాలయమును నిర్మించెను. విఠలస్వామి యాలయ మంతయును గాక పోయినను గొంతయైనను నతని కాలమున గట్టబడెను; లలితకళ లతని పాలనక్రింద చక్కగ వర్ధిల్లినవి.

ఇమ్మడి దేవరాయలకు పెక్కు బిరుదు లున్నట్లు శాసనములవల్లను సమకాలిక వాఙ్మయమువల్లను తెలియవచ్చుచున్నవి. అందు ముఖ్యమైనవి ప్రతాప, ప్రౌఢ, ప్రౌఢప్రతాప, గజబేటకారేత్యాదులు. 'ప్రతాప' యను బిరుదు విజయనగర రాయలయం దనేకులకు గలదు. ఇమ్మడి దేవరాయ లనేక శాసనములలో ప్రతాపదేవరాయలని పేర్కొనబడియున్నాడు; ఈ పేరిటి వాడే యతని తమ్ము డొకడు గలడు. ఈనామ సాదృశ్యము భ్రమప్రమాదముల కాకరమై పరిశోధకులకు చిక్కును గలిగించుచున్నది. 'ప్రౌఢ' యను బిరుదు ఇమ్మడి దేవరాయల కొక్కనికే కలదని పరిశోధకుల యభిప్రాయము; కావున 'ప్రౌఢ దేవరాయ' లన్న, నిమ్మడి దేవరాయలే కాని యన్యులు గారని వాదించువారును గలరు. ఇది కేవలము పొరపాటు. ఇమ్మడి

దేవరాయలు గొన్ని శాసనములలో ప్రౌఢ దేవరాయలని పేర్కొనబడి యున్నను, ఆ పేరుగల రాజులలో నతను ద్వితీయుడే కాని ప్రథముడు గాడు. ఈ విషయము ఆతని పుత్రుడగు మల్లికార్జునరాయల శాసనముల వల్ల విదితమగుచున్నది. అందితడు తన పేరు ముమ్మడి ప్రౌఢ దేవరాయలనియును, తన తండ్రి యిమ్మడి ప్రౌఢ దేవరాయలనియు జెప్పియున్నాడు. ఇందువలన మొదటి ప్రౌఢ దేవరాయ లొకడుండెనని తెల్లమగుచున్నది. మొదటి దేవరాయలు శాసనములలో గానాదిక్కుగ ప్రౌఢ దేవరాయలని పేర్కొనబడి యున్నాడు. కావున నతడే మొదటి ప్రౌఢ దేవరాయలని మనము నిశ్చయింపవచ్చును. 'ప్రౌఢ ప్రతాప' యనునది ప్రత్యేకమైన బిరుదుగాదు. మొదటి రెండు బిరుదుల కూటమువలన నది యేర్పడినది. కావున దానిని వివరింపవలసిన యావశ్యకత లేదు. 'గజబేటకార' యను బిరుదును ప్రథమమున వాడుకకు దెచ్చిన వా డిమ్మడి దేవరాయలే. కావున గజబేటకార దేవరాయలన్న నిమ్మడి దేవరాయ లనుటకు సంశయముండ నవసరము లేదు. గజబేటకార యను మాటకు ఏనుగ వేటకాడని యర్థము. ఇమ్మడి దేవరాయల యనంతరము వజ్ర సింహాసనము నెక్కిన రాయలు కొందఱీ బిరుదును వహించియున్నారు; కాని యది ప్రత్యేకమిమ్మడి దేవరాయల బిరుదుగనే గ్రహింపబడుచున్నది.

## ఇమ్మడి విజయరాయలు
### (క్రీ. శ. ౧౪౪౬-౪౭)

ఇమ్మడి దేవరాయలు స్వర్గస్థుడైన వెంటనె విద్యానగరమున నేమి నడచెనో స్పష్టముగ దెలియదు. చరిత్రకారులందఱును ఆతని యనంతరము నతని కుమారుడు మల్లికార్జున రాయలు సింహాసనము నారోహించెనని యభిప్రాయ పడుచున్నారు. ఇది సరికాదు. ఇమ్మడి దేవరాయల పిమ్మట నతని తమ్ముడిమ్మడి విజయ నామాంతరుడగు ప్రతాప దేవరాయలు సింహాసనము నాక్రమించుకొని స్వల్పకాలము సామ్రాజ్యమును బాలించెనని శాసన సాక్ష్యము వలన దెలియవచ్చుచున్నది.* కాని యత డెట్లు సింహాసనము నెక్కగల్గెనో తెలియదు. మల్లికార్జునరాయలు పసివాడైన కారణమున నాతని పక్షమున నితడు రాజ్యకార్యములను నిర్వహించుచుండిన నుండవచ్చును. లేక, రాజ్యవ్యామోహముచే భ్రాతృజుని దొలగద్రోసి సింహాసనము నాక్రమించుకొని యుండిన నుండవచ్చును. ఇందు

* ఈ క్రింది శాసనములు, 23 fo 1905, 476 of 1921, 161 of 1905, Ec. III. i. Srirang. 107, ఇమ్మడి విజయరాయల రాజ్యకాలమున క్రీ. శ. ౧౪౪౬-౪౭ వ సంవత్సరమున వ్రాయించినవి. ఇమ్మడి దేవరాయల కాలపు శాసనములందును నితడు పేర్కొనబడి యున్నాడు. క్రీ. శ. ౧౪౪౧ లో నితడు కొండవీటి రాజ్యములో నధికారము సేయుచుండెను (420 of 1915); అంతకుముందు పెనుగొండ రాజధానిగ రాయదుర్గ రాజ్యమును పాలించుచుండెను. క్రీ. శ. ౧౪౩౫ వ సం॥వందు లక్ష్మీధరార్యుడను వైష్ణవ విద్వాంసున కితడొసగిన దాన శాసనమున దా నిమ్మడిదేవరాయల తమ్ముడననియు, తన పేరు గూడ దేవరాయలనియు, తన రాజధానీ నగరము ఘనశైల (పెనుగొండ) మనియు జెప్పుకొని యున్నాడు. మఱియు, దానోద్దిష్ట గ్రామమునకు ప్రతాపదేవరాయపుర మని క్రొత్తపేరు పెట్టుటవలన నిమ్మడి దేవరాయలకు ప్రతాపదేవరాయ లను నామాంతర ముండెనని నిశ్చయమగుచున్నది. (M A R. 1921, Para 62). ఈ సందర్భమున నిమ్మడి విరూపాక్షరాయల శ్రీశైల తామ్రపట్టికను జ్ఞప్తికి దెచ్చుకొనవలసి యున్నది. అందు విరూపాక్షరాయలు తన తండ్రి ప్రతాపదేవరాయలనియు, నత డిమ్మడి దేవరాయల తమ్ముడనియు, నతడు తన యన్నయగు నిమ్మడి దేవరాయల వలన ఘనాద్రి (పెనుగొండ) రాజ్యమును బొందెననియుం దెల్పియున్నాడు (Sources, No.26). కావున, విజయనామాంతరుడగు ప్రతాపదేవరాయలును నిమ్మడి విరూపాక్షుని తండ్రి యగు ప్రతాప దేవరాయలును భిన్నవ్యక్తులు గారనియు నొక్క పురుషుడే యనియు నత డిమ్మడి దేవరాయల తమ్ముడనియు స్థిరపడుచున్నది.

మొదటి యభిప్రాయమున కంటె రెండవదే సరి యైనదని తోచుచున్నది. ఏలనగా, విద్యారణ్య కాలజ్ఞానమునందు రత్నసింహాసనము నెక్కిన సంగమ వంశజాలగు పదుమువ్వురిలో, 'దే. ౨, మ' సంజ్ఞకులైన రాజుల మధ్య 'వి. ౨' పేర్కొనబడి యున్నాడు. § మఱియు నిమ్మడి విజయరాయలు తన శాసనములలో దానే స్వయము చక్రవర్తియై విజయనగర రాజధానినుండి సామ్రాజ్యమును బరిపాలించుచున్నట్లు చెప్పుకొని యున్నాడు. ఊపరి, విజయరాయలు రాజ్యము సేయుచుండిన కాలముననే మల్లికార్జునరాయలు కూడ విజయనగరమున సామ్రాజ్యము పీఠము నధిష్ఠించి ప్రత్యక్షపాలన సేయుచుండిన ట్లనేక శాసనము లుద్ఘోషించుచున్నవి. ఇమ్మడివిజయరాయలును మల్లికార్జున రాయలును ఇద్దఱును గూడి పొత్తున రాజ్యపాలన సేయుచుండిరని యెంచుట కాధారము లేదు. కావున ఇమ్మడి విజయరాయలు దన సోదరుని మరణానంతర మతని పుత్రుని బాల్యము నవకాశకఱచుకొని సింహాసనము నాక్రమించుకొనె ననియు, చిరకాలము నిజాధికారమును నిలుపుకొనుటకు శక్తిలేకపోవుటవలన నతడు మల్లికార్జున రాయలతో సంధిచేసికొని తన పూర్వాధికార స్థానమైన పెనుగొండకు బోయి యచట క్రీ. శ. ౧౪౬౫ పర్యంతము రాష్ట్రపాలన మొనర్చుచుండెననియు నూహింపవలసి యున్నది.

ఇమ్మడి విజయరాయలు రాజ్యముచేసిన కాలము స్వల్పమైనను, రాష్ట్రపాలకుల దుర్వ్యాపారముల నణచుట కతడు గట్టి ప్రయత్నము జేసెను. రాయమంత్రులు ప్రజలకడనుండి కానికెలను, కులసిద్ధాయములను బలాత్కారముగ గ్రహించెడివారు. విజయరాయలీ దురాచారమును రూపుమాప బ్రయత్న మొనర్చెను; కాని యత్నము సఫలము గాలేదు; మంత్రుల రాబడి నది గొంత తగ్గుటవలన రాయల సంస్కారోద్యోగము వారికి గిట్టలేదు; కావున రాయలను తృప్తిపెట్టుట కతని యాజ్ఞ నాచరణకు దెచ్చినట్లు వారు నటించినను, దమ దురాచారమును మానరైరి. రాయలు మరల నిరూపముల నంపవలసివచ్చెను. వాని వహి ఇది: 'ఈ రాజ్యమునందు ప్రతి రాజ్యారంభ సమయమునను మంత్రులు కుడి యెడమ చేతుల రైతులందఱి కడనుండియు బలాత్కారముగ గానుకలను గ్రహించుచున్నారు; తత్కారణమున బాధపడజాలక రైతులు పరదేశములకు బాఱిపోయిరి. దేవాలయములందు పూజా పురస్కారములును, ఉత్సవములును నిలిచిపోయినవి; దేశమున జీవ పీడలు ప్రబలినవి. పాఱిపోక నిలిచియుండిన జనులు మృత్యువు వాతబడిరి; కాదేని హింసల పాలైరి.' కావున రాయలవారీ బలాత్కార కరగ్రహణము నిషేధింప ననుగ్రహించిరి. ఈ నిరూప మన్నప్పు ఉదయుల నుద్దేశించి వ్రాయబడినది. అతడు దానిని కొన్నిస్థలములందు మాత్రమే తాల చెక్కించి శాసనముల నిలిపెను; నాగరను దేశ మంతటను జెక్కించెను. ఈ నిరూపము నంపిన తరువాత స్వల్పకాలముననె ఇమ్మడి విజయ రాయల యేలుబడి సమాప్తమగుటవలన నతడొనర్చిన సంస్కారప్రయత్నము వ్యర్థమైపోయెను; దానివలన పాలనా విధానమున స్థిరమైన మార్పిడియు గలుగలేదు.

(సశేషము)

---

§ 'హబుహబిబుదేరావిదేవి మరావి సంజ్ఞకా' అని-

౧. హ = హరిహర ౪. వి = విరూపాక్ష ౭. రా = రామచంద్ర ౧౦. వి = విజయ ౧౩. వి = విరూపాక్ష
౨. బు = బుక్క ౫. బు = బుక్క ౮. వి = విజయ ౧౧. మ = మల్లికార్జున
౩. హ = హరిహర ౬. దే = దేవరాయ ౯. దే = దేవరాయ ౧౨. రా = రాజశేఖర

# చెళ్లపిళ్ల శతావధాని

బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారికి ఆనాడు రాజాస్థానాలలోనూ ఈనాడు దేశమంతటా జరిగిన సన్మానాలలో వ్యత్యాసం ఉంది. ఆనాడు శతావధాని గారికి సన్మానాలు జరిగితే ప్రజలు ప్రేక్షకులుగా ఉండి ఆనందించారు. ఈనాడు ప్రజలే వారికి సన్మానం చేశారు. ఆనాడు వారు దిగ్విజయం చేసి సన్మానాలు అడిగి చేయించుకున్నారు. ఈనాడు ప్రజలు వారిని సన్మానిస్తూ తద్వారా తమను తాము గౌరవించుకున్నారు.

తిరుపతి వేంకట కవులది ఒక ప్రత్యేక శకం. వారికి పూర్వం కవిత్వం ఒక మూల కూర్చుని పిల్లిమొగ్గలు వేస్తూ కళాకాంతులు కోల్పోయింది. తిరుపతి వేంకటకవులు ఆ కవిత్వానికి ప్రాణం పోసి, ప్రజల మధ్యకు తెచ్చి, తెలుగు దేశంలో ఎన్నడూ కనని వినని కవితోద్యమం సాగించారు. ఇది ఒక సాంఘికోద్యమంగా సాగింది. అనేక వేలమంది యువకులలో కవితాశక్తి కవిత్వమూ కూడా పుట్టుకొచ్చాయి.




అయితే తిరుపతి వేంకటకవులు అవధానాల ద్వారా చేసిందేమిటి? కవిత్వంచేత పిల్లిమొగ్గలు వేయించటమే. అయినా ఈ పిల్లిమొగ్గలకూ అంతకుపూర్వం వారు వేయించిన పిల్లిమొగ్గలకూ ఏమీ సంబంధం లేదు. ఇది సాంఘికోద్యమం, అది కాదు.

తిరుపతి వేంకటకవులు శతావధానాలతో నిలిచిపోలేదు. వారి ఉద్యమం ఇంకా ముందుకు పోయింది. ప్రతి మనిషికీ అర్థమయే శైలిలో వారు అనేక కృతులు రచించారు. భారతాన్ని నాటకాల రూపంలో ప్రజలకు అందించారు.

చెళ్లపిళ్లవారు శిష్టవ్యావహారికంలో అనేక వందల వ్యాసాలు ప్రచురించి నవ్య సాహిత్యోద్యమానికి అంతులేని సేవ చేశారు. వ్యావహారికంలో విద్యాబోధ సాగే సుదినం వచ్చేటప్పటికి చెళ్లపిళ్లవారి వ్యాసాలు వ్యావహారికానికి ప్రమాణాలుగా ఉపకరించ గలుగుతాయి.

ప్రాత కవితారీతులను ఉన్నతికి తీసుకురావటమే కాక, నవ్యసాహిత్యోద్యమానికి పునాది వేసిన ఖ్యాతి కూడా చెళ్లపిళ్లవారికి దక్కింది. ఈనాడు సాగే అన్ని సాహిత్యోద్యమాలనూ వెనక్కు పొడిగిస్తే చెళ్ళపిళ్ళ వారివద్ద కలుస్తాయి.

తిరుపతి శాస్త్రిగారు పోగానే తిరుపతి వేంకటకవుల శకం అయిపోయిందని కొంతమంది అపోహపడ్డారు. కాని చెళ్ళపిళ్ళవారు ఆ శకాన్ని ఈనాటివరకూ పట్టుకొచ్చారు. ఇవాళ కూడా ఆయన నోట వచ్చినది కవిత్వం. ఆయన కూర్చున్నచోట సాహిత్య గోష్ఠి. ఇటువంటి గొప్ప పేరు సంపాదించిన మరొక కవి కాలంతో కదిలి ముందుకు పోవాలనే ఆసక్తి కనబరచటం సాధారణంగా జరగదు. కాని చెళ్ళపిళ్ళవారు ముందుకు పోతూనే వచ్చారు.

"నేం రాసిందంతా కవిత్వమా? కాదు," అని చెళ్లపిళ్లవారే స్వయంగా ఒకసారి అన్నారు. ఇతరుల కవిత్వానికి ఒక ప్రమాణమూ, తన కవిత్వానికి మరొక ప్రమాణమూ అనే పద్ధతి శతావధానిగారిలో లేదు.

ఏనుగు లెక్క సన్మానాలు చేయించుకున్న కవులు, చెళ్లపిళ్లవారి తరువాత వారు, మనలో చాలామంది ఉన్నారు. కాని వారిలో ఒకరు కూడా చెళ్లపిళ్లవారివలె సమాజాన్ని తమలోకి తీసుకోలేదు. అందరూ సమాజానికి అభిముఖంగా నిలబడి దానిమీద తమ కవిత్వాన్ని ప్రయోగించేవారే. వారు కవితాసేవకు ప్రతినిధులు కారు, తమ కవిత్వానికి మాత్రమే ప్రతినిధులు. ఈనాడు ప్రత్యక్షంగా సరస్వతీ స్వరూపులు ఒక్క చెళ్ళపిళ్ళవారే. వారి అనంతరం వచ్చే గొప్ప కవులు ప్రజలకు ప్రతినిధులుగా ముందుకు వస్తారనుకోవటానికి అవకాశం ఉంది.

చెళ్లపిళ్లవారి రచనల కంటెకూడా వారి జీవితమూ, కవితోద్యమమూ, సమకాలికులమీద వారి ప్రభావమూ చాలా ఎక్కువైనవి. చెళ్ళపిళ్ళ వారి పరిచయభాగ్యంగల వారిద్వారా ఎన్ని కథలు విన్నామో వాటికి అంతులేదు. ఈ కథలు తెలుగు సాహిత్యంలో శాశ్వతంగా ఉండిపోదగినవి. సారస్వతంలో శాశ్వతంగా నిలిచిపోయే రచనలు చేయగలవారి కంటె, సాహిత్య చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోవగల వ్యక్తిత్వం గలవారు అరుదు. చెళ్ళపిళ్ళవారు అటువంటి వ్యక్తి. ఆంగ్ల సాహిత్యచరిత్రలో జాన్సన్ ఎటువంటివాడో మన సాహిత్యచరిత్రలో చెళ్ళపిళ్ళవారు అటువంటివారు. వారికి జరిగిన ఈ సన్మానం నిజంగా సమగ్రం కావాలంటే వారి జీవిత విశేషాలూ, గాథలూ కష్టపడి సమకూర్చి తెలుగు సారస్వతంలో శాశ్వతంగా ఉండిపోదగిన గ్రంథం ఒకటి రచించాలి. చెళ్లపిళ్లవారు పండితులు, పరిశోధకులు, విమర్శకులు, వక్తలు, హాస్యశృంగారాది రససమృద్ధులు. వారి సమగ్ర స్వరూపం వ్యక్తం చేసే ఉద్గ్రంథం ప్రచురించటానికి సన్మాన సంఘంవారే పూనుకున్నట్లయితే చెళ్లపిళ్ళ వారి శిష్య ప్రశిష్యులు అనేకవేలమంది దాని రచనకు సహాయపడ గలరు.



# పన్నెండు నెలల తర్వాత హైదరాబాదులో—

డి. రా.

హైదరాబాదు సంస్థానంలో నిజాం నిరంకుశ ప్రభుత్వపు పీడ వదిలి సరిగా ఒక సంవత్సరం పూర్తి అయింది. ఈ సంవత్సర కాలం నుంచీ ఇండియా ప్రభుత్వంచే నియమింపబడిన మిలిటరీ ప్రభుత్వమే పని చేస్తూంది. పన్నెండు మాసాలపాటు మిలిటరీ ప్రభుత్వమే వుండటే అది ఒక అసాధారణమైన విషయమే అని భావించవచ్చు.

పోలీసుచర్య తరువాత ఏర్పడిన మిలిటరీ ప్రభుత్వాన్ని లెక్కలేనన్ని చిక్కు సమస్యలెదుర్కొన్నవి. సంస్థానపు పరిపాలన వ్యవస్థ ఛిన్నాభిన్నమయింది. అధికారవర్గం మార్పు చెందవలసి వచ్చింది. ఆర్థిక కష్టాలు చాలా ఏర్పడ్డాయి. సంస్థానం నుంచి వలసపోయిన కాందిశీకుల పునరావాసం, పూర్వస్థానాలకు ముస్లిముల తరలింపు, రజాకార్ల రూపుమాపటం, పూర్వ అధికారవర్గ దుశ్చేష్టలను విచారించటం మొదలైన అనేక క్లిష్టకార్యాలు నెరవేర్చవలసి వచ్చింది. వీటి అన్నిటికంటె కమ్యూనిస్టు సమస్య గొప్పదై కూర్చుంది. పైన పేర్కొనబడిన సమస్యలన్నిటిని మిలిటరీ ప్రభుత్వం చాలావరకు పరిష్కరించగలిగింది. కాని కమ్యూనిస్టు ఉపద్రవం మాత్రం ఫలానా గడువులోపల నిర్మూలించబడుతుందని చెప్పడానికి వీలులేకుండా వుంది. ఇప్పటికీ కమ్యూనిస్టులు చేసే హత్యల వార్తలు ప్రతి నిత్యం వస్తూనేవున్నవి. పౌరపాలన అంగీకరించినవారు గ్రామాలలో సురక్షితంగా నివాసం చేసే ఆస్కారం లేదు. కొద్దిపాటి కమ్యూనిస్టులు చాలామంది పట్టుబడినప్పటికీ గొప్ప నాయకులింకా పట్టుబడలేదు. వారు సాధించే దేమిటో స్పష్టంగా తెలియదు. నిషేధింపబడిన ఇండియా కమ్యూనిస్టు పార్టీకిది అనుబంధ సంస్థ అవునో కాదో సందేహాస్పదంగానే వుంది. తెలంగాణా ప్రాంతంలో ముఖ్యంగా వరంగల్లు, నల్లగొండ జిల్లాలలో వీరి హత్యావిధానం కొనసాగుతూనే వుంది. కాంగ్రెసుతో, ప్రభుత్వంతో సహకరించే వారే కమ్యూనిస్టులచే హత్యగావింపబడుతున్నారు.

మిలిటరీ ప్రభుత్వాన్ని "సంరక్షకప్రభుత్వం" అని కొందరు పెద్ద నాయకులే అన్నారు. శాంతి భద్రతలను కాపాడటమే కాక ఈ ప్రభుత్వం కొన్ని సంస్కరణలనుకూడా అమలుపరచుతూంది. నిజాంనవాబు స్వంతకమతాలైన సర్ఫెఖాసు ఇలాకా రద్దు చేయబడింది. ఒక చట్టం

ద్వారా జాగీర్లనుకూడా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటూంది. వెట్టి చాకిరీ రద్దు చేయబడింది. భూవిధానంలో మార్పు తేవడానికి భూ సంస్కరణ సమితి ఒకటి పనిచేస్తూంది. విద్యా విధానంలో కొద్దిపాటి మార్పులు కలిగాయి. ప్రభుత్వోద్యోగాల్లో అధిక సంఖ్యాకవర్గం వారికి స్థానాలు ఇతోధికంగా లభించే అవకాశం కల్పించబడింది. హైదరాబాదు రాజ్యాంగ పరిషత్తు నిర్మాణానికి ఎన్నికలు జరిపేందుకుగాను వయోజన వోటర్ల పట్టికలు తయారు చేయబడుతూన్నవి. పని బహు నెమ్మదిగా జరిగిందనిమాత్రం చెప్పక తప్పదు. అసలు రాజ్యాంగ పరిషత్తే ఏర్పడదనీ, దానికి బదులు జనవాక్య నిర్ధారణ జరపబడుతుందనీ ఒకస్థానిక ఆంగ్ల దిన పత్రిక వార్త ప్రకటించగా, ప్రభుత్వం ఆ వార్తను ఖండిస్తూ రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరిగి తీరతాయని స్పష్టంచేసింది. ఈపరిషత్తు స్థాపింపబడి పని ఆరంభం కావడానికి కింకా ఎట్లా లేదన్నా అర్థ సంవత్సరం పట్టవచ్చు. హైదరాబాదు ఇండియన్ యూనియనులో చేరాలా, సంస్థానవ్యవస్థ ఎలా వుండాలి, భాషా ప్రయుక్తంగా విభజించబడాలా, నిజాంవంశ భవిష్యత్తు ఏమిటి, సంస్థాన పరిపాలన వ్యవస్థ ఏ రూపంలో వుండాలి అనే విషయాలను ఈ పరిషత్తు నిర్ణయం చేస్తుందని తెలుస్తూంది. ఇంతవరకూ సంస్థానానికి ప్రత్యేకతలుగా వుంటూవచ్చిన కరోడ్గిరీ, నిజాం పోష్టు, నిజాం కరెన్సీ యథాప్రకారంగా చలామణీలో వున్నవి. పరిషత్తు పని ఎప్పుడు ముగుస్తుందో, శాసనసభ ఎన్నికలు ఎప్పుడు జరుగుతాయో అప్పుడే ఊహించరాదేమో!

ప్రస్తుతమున్న మిలిటరీ ప్రభుత్వాన్ని ద్వంద్వ ప్రభుత్వం అని చెప్పవచ్చు. జిల్లాలలో సివిల్ అడ్మినిస్ట్రేటర్లే కాక కాలాక్టార్లు కూడా వున్నారు. యూనియను అధికారులు, సంస్థానాధికారులు సంయుక్తంగా పరిపాలన నిర్వహించుతున్నారు. కాని యూనియన్ సివిల్ అడ్మినిస్ట్రేటర్లదే ఉన్నతాధికారం. ఉద్యోగులలో అవినీతి ప్రబలిందని ప్రముఖులు కూడా అంగీకరించారు. ప్రభుత్వం మారిందే కాని ఉద్యోగులలో ఉత్తమమైన మార్పు కలుగలేదని సామాన్యులు భావించుతున్నారు. ఇటీవల కొంతకాలం నుంచీ స్టేటు కాంగ్రెసు వారికీ, స్థానికోద్యోగులకీ కొన్ని జిల్లాలలో సంబంధాలు సరిగా లేవు. కారణమేమంటే ఉద్యోగస్థులు కొందరు వ్యక్తులతో చేతులు కలిపి అక్రమంగా ప్రవర్తించడం, కాంగ్రెసువారు దాన్ని విమర్శించడం, కాంగ్రెసు వారిలోని లోటుపాట్లను ఉద్యోగస్థులు వెతకనారంభించడం, వారిని కమ్యూనిస్టులనే నెపంపై అరెస్టులు చేయడం ఇత్యాది సంఘటనలు విశేషంగా జరిగాయి. జిల్లాలలోని అధికారులు, పోలీసులు, మిలిటరీకి చెందినకొందరు ప్రజలను పీడించడానికి వారిపై కమ్యూనిస్టులని ఆరోపించి తమ పని గడుపుకుంటున్నారని సర్వత్రా వినవస్తూంది. ఈ పరిస్థితి ఎంత విషమించిందంటే ఉద్యోగుల ప్రవర్తనకు అధిక్షేపణ తెలుపుతూ వరంగలు జిల్లా కాంగ్రెసు కమిటీవారు సత్యాగ్రహం చేయడానికి కూడా తీర్మానించారు. అగ్రనాయకులు కల్పించుకొని అంతవరకు రాకుండా ఆపారు. అగ్రనాయకులకూ, ప్రభుత్వ సభ్యులకూ అంతంతగానే వుంది.

హైదరాబాదులో 12 మాసాల వరకూ మిలిటరీ ప్రభుత్వమే వుండి, ప్రజాప్రాతినిధ్యం గల తాత్కాలిక మంత్రివర్గం ఏర్పడక పోవడానికి ప్రధాన కారణం— సంస్థానంలో ప్రధాన రాజకీయసంస్థ అయిన స్టేటు కాంగ్రెసులోని ఇరు వర్గాల విభేదాలు నానాటికీ హెచ్చుతూ వుండడమే. పోటీసంస్థ స్థాపనకు దారితీసిన ఈ విభేదాలను సర్దార్ పటేల్ విచారించి సంధి కుదిర్చారు, కాని విభేదాలు గర్భితాలైత్యాలయూ యని ఒక వర్గానికి చెందిన నాయకుడు స్పష్టంగా వ్రాశాడు ఒకానొక వ్యాసంలో. త్వరలో స్టేటు కాంగ్రెసు ఎన్నికలు జరగబోతూన్నవి. అధ్యక్ష పదవికి స్వామీ రామానందతీర్థా, శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారు పోటీ చేస్తున్నారు. ప్రాంతీయ కాంగ్రెసు అధ్యక్ష పదవులకు, డెలిగేట్ల స్థానాలకు ఈ ఉభయుల అనుచరులు పోటీలు పడుతున్నారు. ఇరుపక్షాల ప్రచారం ఆరంభమైంది. ఈ ఎన్నికలతో ఏ వర్గానికి ప్రజలలో అధిక ప్రాబల్యం వుందో తేలిపోతుంది. కాని విభేదాలు మాత్రం సమసిపోవు. భారత కాంగ్రెసు అధిష్ఠాన వర్గంవారు, సంస్థాన శాఖామాత్యుడు—సంస్థాన వ్యవస్థల భాగ్యవిధాత—

ఆయన సర్దార్ పటేల్ ఈ పోటీని నివారించే ప్రయత్నాలు చేయడం లేదు. ఎల్లకాలం జోక్యం కలిగించుకొని సరిదిద్దడానికి వారు ఉత్సహించడం లేదు. ఇటు సంస్థాన కాంగ్రెసు నాయకులలో తమకు తాము రాజీకివచ్చే సూచనలు కన్పించడం లేదు. పోటీలు అనివార్యమేనని తేలిపోయింది.

స్టేటు కాంగ్రెసులోని ఈ విభేదాలవల్ల, మిలిటరీ ప్రభుత్వాన్ని అంతరింప చెయ్యడానికి-కనీసం అందులో ప్రజాప్రతినిధులకు స్థానాలివ్వడానికైనా అవకాశాలు మృగ్యం. ఇటీవల హైదరాబాదుకు వచ్చి వెళ్ళిన భారతప్రభుత్వ సంస్థానశాఖ కార్యదర్శి శ్రీ యం. కె. వెల్లోడీ పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ తాత్కాలిక మంత్రివర్గ స్థాపన ప్రసక్తే ఇప్పుడు లేదు అని వెల్లడించారు. భారత ప్రభుత్వ మంత్రులలో ఎవరికీ ఈ అభిలాష లేదు. పశ్చిమ బెంగాల్, రాజస్థాన్ ప్రాంతాలలో కాంగ్రెసులో వర్గాలేర్పడి ఆ వర్గాలు పరస్పరం వ్యతిరేకించుతున్నందువల్ల ఆయా ప్రభుత్వ వ్యవస్థలకు ఎట్టి ఆంతరాయాలు కలిగాయో, పరిస్థితులను చక్కబెట్టడానికి కేంద్ర అధిష్ఠానవర్గం వారు ఎంత క్లిష్టతరమైన బాధ్యత వహించవలసి వచ్చిందో, రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు పనిచేస్తూ ఒడుదొడుకులు రావడంవల్ల యావత్తు కాంగ్రెసు సంస్థకే ఎట్టి అప్రతిష్ఠ కలిగిందో వారు బాగా గ్రహించారు. శైశవావస్థలో వున్న స్టేటు కాంగ్రెసులో ఇప్పుడే ఇంతటి తీవ్రవిభేదాలేర్పడితే, వీరి ప్రతినిధులు ప్రభుత్వాధికారంలోకి వస్తే అవి ఇంకా హెచ్చుతాయనీ, సంస్థాన భవిష్యత్తు నిర్ణయం కాకుండా వున్న ఈ సందిగ్ధసమయంలో విభేదాలున్న వారితో తాత్కాలిక మంత్రివర్గం ఏర్పడితే ఎన్ని అరిష్టాలు సంభవిస్తాయో ఢిల్లీ వర్గాల వారు ఊహించగలిగారు. పైగా కాశ్మీరు సమస్యవల్ల భారత ప్రభుత్వం తీరుబడిలేకుండా వుంది.

హైదరాబాదు సంస్థానంలో సత్వరంగా ఏమార్పు రావాలన్నా స్టేటు కాంగ్రెసులోని విభేదాలు పరిష్కారం కావడం ప్రథమావసరం. విభేదించే రెండు వర్గాలమధ్య శాశ్వత పరిష్కారం కుదిరి నాయకత్వం పోటీలేకుండా ఎన్నుకోబడాలి. లేదా ప్రజలు ఈ రెండువర్గాలను త్రోసివేసి పోటీలేకుండా వచ్చే మరో నాయకత్వాన్ని ఎన్నుకోవాలి. ఈ ప్రత్యామ్నాయానికి కొందరు కృషిచేస్తున్నారు. కాని వీరి సంఖ్య బహు స్వల్పంగా వుండడంచేత, అధిక సంఖ్యాకులు కాంగ్రెసు నాయకత్వమును ఆలోచించక ముఠాతత్వంలోనే పడి వుండడంచేత పరిస్థితిలో మార్పువచ్చే అవకాశాలు ఆశాజనకంగా లేవు.

---

## వినిపించడంలేదు

విజయవాడ రేడియో స్టేషన్ స్థాపించి ఒక ఏడు కావస్తున్నది. అయినా ఆంధ్రులలో చాల మంది ఇంతవరకూ ఆ స్టేషన్ నుంచి ప్రసారితమయ్యే కార్యక్రమాలను వినలేకపోతున్నారు. విద్యుచ్ఛక్తి ఉన్న పట్టణాల్లోనే విజయవాడ విన వీలవుతున్నది. ఆంధ్రలో ఎన్ని ఎలెక్ట్రిసిటీ ఉన్న పట్టణాలున్నాయో లెక్కవేసుకోవచ్చు. తక్కినా విద్యుచ్ఛక్తి లేని వూళ్ళలో బ్యాటరీ వుపయోగించే రేడియోసెట్లలో విజయవాడ వినబడటం లేదు. కారణ మేమిటంటే అది హై పవర్ ట్రాన్స్‌మిటింగ్ స్టేషన్ కాదు కాబట్టి.

రేడియో స్టేషన్ ఆంధ్రలో స్థాపన చేశారని ఆంధ్ర ప్రజానీకం సంతోషపడింది. కాని, మదనపల్లె లాంటి పెద్ద పట్టణాల్లో సైతం విజయవాడ స్టేషన్ విన వీలులేనందుకు విచారించవలసి ఉన్నది. ఆంధ్ర సంస్కృతి, గాన ప్రావీణ్యం ముక్కోటి ఆంధ్రులూ పెంపొందించుకుంటా రన్న ఆశయం సఫలత పొందలేదు. కాబట్టి వెంటనే ఇప్పటి విజయవాడ స్టేషన్లో హై పవర్ ట్రాన్స్‌మిటర్లు స్థాపించి, సమాంధ్రదేశంలో విజయవాడ స్టేషనును వినిపించ చెయ్యాలి అని అధికారులకు విజ్ఞప్తి చేస్తున్నాను.

కో. హనుమంతు

తెలుగు స్వతంత్ర సెప్టెంబర్-23-1949.

# 'జగన్నాథుని రథం'

'ఆరుద్ర'

శ్రీ.శ్రీ. "జగన్నాథుని రథచక్రాలు" అనే గేయాన్ని ఈ దశాబ్దపు అత్యుత్తమ కావ్యాల్లో ఒకటిగా మనం ఎంచుతాం. అది సర్వతోముఖ సౌందర్యంగల కావ్యం. అయితే "జగన్నాథుని రథచక్రాలు" వేటికి సాంకేతిక చిహ్నాలు? కవి గేయంనిండా పలుమార్లు జగన్నాథుని రథచక్రాలు వస్తున్నాయి అని హెచ్చరిక చేశాడుకదా? ఏవి వస్తున్నాయి?

"ఆదర్శసమాజము మనుష్య సమష్టి కంతరాత్మయగు భగవంతుని వాహనము, జగన్నాథుని యాత్రారథము. ఐక్యము, స్వాధీనత, జ్ఞానము, శక్తి ఆ రథముయొక్క నాలుగు చక్రములు" అని శ్రీ అరవిందయోగి ప్రవచనం.

శ్రీ శ్రీ గేయంలోని జగన్నాథుని రథం కూడా ఆదర్శ సమాజానికే చిహ్నం. ఈ రథచక్రాల విషయంలోకూడా శ్రీ అరవింద యోగి నిర్వచనం అనువర్తిస్తుంది; కానీ శ్రీ అరవింద యోగి ప్రకారం "జగన్నాథుని రథముయొక్క అసలు రూపము లేక నమూనా ఎవ్వరును ఎఱుగరు. ఏ శిల్పియును దానిని లిఖింప సమర్థుడు కాడు. ఆ ప్రతిమ విశ్వపురుషుని హృదయము నందు నిలిచియున్నది. అనేక ఆవరణములచే నావృతమై యున్నది. ద్రష్టలును కర్తలునగు అనేక భగవద్విభూతుల యనేక ప్రయత్నముల ద్వారమున దానిని మెల్లగా వెలువరించి స్థూలజగత్తున ప్రతిష్ఠించుట అంతర్యామియొక్క యభిసంధి."

ఈ వివరణమట్టుకూ శ్రీ శ్రీ జగన్నాథుని రథానికి సరిపోదు. జగన్నాథుని రథస్వరూపం కవికి తెలుసు. కవి, తరతరాల సాంప్రదాయాలకి, రకరకాల సిద్ధాంతాలకీ వారసుడు. వీటి మేలు కలయికల నిగ్గు ఒకానొక కొత్తవాదం. (అది చారిత్రిక, గతి తార్కిక భౌతికవాదం కావచ్చు). ఆ వాదం జగన్నాథుని రథాన్ని సంపూర్ణంగా మనస్సులో చిత్రించుకొంది. "ద్రష్టలును, కర్తలును అనేక భగవద్విభూతుల యనేక ప్రయత్నముల ద్వారము" కూడా మరొక రూపంలో శ్రీ శ్రీ గేయంలో నిగూఢంగా ఉంది. ద్రష్టలు, కర్తలు అయిన శ్రామిక జనాలియొక్క అనేక ప్రయత్నాల ద్వారంగా ఇక్కడ అది నిలిచి ఉంది. ఈద్వారం దేశదేశాలలోని సాంఘిక పరిశోధనల సారం. పరివర్తనల ఫలితం. అతి సహజమైన విక్రాంతి. ఈ విక్రాంతినుండి జగన్నాథుని రథాన్ని మెల్లమెల్లగా వెలువరించి వాస్తవిక జగత్తులో ప్రతిష్ఠించడమే కవియొక్క ఆశయం.

గేయంలో జగన్నాథుని రథం ద్వారంనుండి వెలువడింది. అది "ఆకాశపు దారులంట హడావుడిగ వెళిపోతున్నాది. అరచుకొంటూ వెళిపోతున్నాది." దానిని భూమార్గం పట్టించాలి. అప్పుడు "భూకంపం పుట్టిస్తాను" అని కవి చెపుతున్నాడు. జగన్నాథుని రథం భూమార్గం పట్టినప్పుడు భూకంపం వైకల్పికం కాదా! కాదంటాడు కవి. తప్పనిసరిగా అవసరం అని అతని మతం.

శ్రీ శ్రీ జగన్నాథుని రథం 'పతితులకూ, భ్రష్టులకూ, బాధాసర్పదష్టులకూ, బతుకు కాలి పనికిమాలి శనిదేవత రథచక్రపు టిరుసులలో పడి నలిగిన దీనులకూ, హీనులకూ' కొత్తజీవితాన్ని ఇచ్చేందుకు వస్తున్నాది. శ్రీ అరవింద యోగి వివరణ ప్రకారం 'జగన్నాథుని యీ రథము యొక్క అసలు పేరు సమాజము కాదు. సంఘము. బహుముఖము శిథిలము నగు జనసంఘమో, జనతయో కాదు. ఆత్మజ్ఞానము యొక్క భాగవత జ్ఞానము యొక్క ఏకముఖమైన శక్తియొక్క బలముచే నానందమున నిర్మింపబడు బంధనరహితమును అద్వైతమును నగు సంహతి, భాగవత సంఘము." నిస్సందేహంగా శ్రీ శ్రీ జగన్నాథుని రథంయొక్క అసలు పేరు బహుముఖం ప్రస్తుతం శిథిలం నిరాశోపహతం అయిన జనసంఘమే. జనతే.

జగన్నాథుని రథాన్ని గూర్చి అరవిందయోగి వివరణ ఇంకా చాలా ఉంది. దాన్ని ఆధారంగా చేసుకొంటే శ్రీశ్రీ సంకేతాలకి సర్దేశించని అపార్థాలు వస్తాయి. వివరణతో ఏకీభవించక పోయినా "ఆదర్శ సమాజమే జగన్నాథుని రథం-ఐక్యం, స్వాధీనత, జ్ఞానం, శక్తి ఆ రథ చక్రాలు" అన్న నిర్వచనం మట్టుకూ అక్షరాలా శ్రీ శ్రీ గేయానికి వర్తిస్తుంది.

శ్రద్ధాంజలి

# స్వర్గీయ బలిజేపల్లి ద్వారకనాథశాస్త్రి

“మీరాయన ఆగ్రా వెళుతున్నారా? అయితే మకాం ఎక్కడ?”

“అక్కడ బి. డి. శాస్త్రిగారని ఒకాయన కెమికల్ ఎగ్జామినర్ ఆఫీసులో పని చేస్తున్నారు. ఆయన యింట్లో.”

“మీకు తెలుసా, ఆయన?”

“నాకు పరిచయం లేదు. కాని, మా వూర్లో ఒక స్నేహితుడొకాయన ఉత్తరం యిచ్చాడు.”

ఉత్తర హిందూస్థానంలోని అనేక పట్టణాల్లో, ఏ రకం సంభాషణ ఎక్కడ జరిగినా దాక్షిణాత్యులు కలుసుకున్నా పరిపాటిగా ఉండేది.— శ్రీ బలిజేపల్లి ద్వారకనాథశాస్త్రిగారు ఎనిమిది సంవత్సరాల క్రితం పింఛను పుచ్చుకున్నంతవరకూ. ఇటీవల శ్రీ శాస్త్రిగారు శ్రీకాకుళంలో మరణించారన్న వార్త విని, ఒక ప్రియబాంధవుడిని పోగొట్టుకున్నట్టు విచారించని వారెవరూ నేడు ఉత్తర దేశంలో ప్రవాసంలో ఉన్న దాక్షిణాత్యుల్లో ఉండరు—ఆయన తరంవారు. తాము ఆగ్రా వెళ్ళినప్పుడు ఆయన ఆతిథ్యం యిచ్చాడనే కాదు. ఆ ఆత్మీయతకి కారణం: మానవ హృదయంలో గోచరించగల్గే అంతరాంతర ఆధ్యాత్మికౌన్నత్యాలు ఆయనలో ప్రతిఫలించేవి. ఆయన ఆతిథ్యభాగ్యం పొందిన వాళ్ళంతా, ఆయన చూపించిన ఔదార్యంలో వెయ్యోవంతు తిరిగి తమకతమ అతిథుల పట్ల చూపిస్తే ఎంత బాగుండును!

తమకు తామే అహూతులై వచ్చిన అతిథుల్ని నిండు హృదయంతో సత్కరించి, వారి సౌకర్యాలు చూడడం; ప్రముఖులైన దాక్షిణాత్యులెవరైనా ఆగ్రా వెళితే వారి గౌరవార్థం విందులు చెయ్యడం—ఎంత ఉదారస్వభావంగల వ్యక్తికైనా యిది కొన్నాళ్ళకి భరింపగ లేనిది అయి ఉండవచ్చు: అందులోనూ నెలకి ఆదాయం కొద్ది వందలకి మించి ఉండనప్పుడు! కాని శాస్త్రిగారిది కరుణార్ద్ర హృదయం. ఆయన వితరణకి పరిమితులు లేవు. ఒకనాడు ఎవరో అతిథిని ఆగ్రా పురవీధుల్లోంచి తీసికెళుతూ, శాస్త్రిగారు ఒక ధర్మశాల అరుగుమీద జబ్బుతో మూలుగుతున్న అనాథయుణ్ణి చూశారు. టాంగా కొంత దూరం వెళ్ళాక ఆయనలో ఏదో కదిలింది. వెంటనే టాంగా వెనక్కి మళ్ళించి, జబ్బు మనిషిని పలకరించి సంగతులన్నీ తెలుసుకున్నారు. ఆ జబ్బుమనిషి మలయాళీ దేశస్థుడు. ఎవరి వెంటనో నౌకరుగా వచ్చాడు. ఆగ్రా చేరేసరికి మలేరియా జ్వరం పట్టుకుంది. నౌకర్ని వదిలేసి యజమాని ప్రయాణంలో ముందికి పోయాడు. శాస్త్రిగారు ఆమలయాళీని ఆస్పత్రిలో చేర్పించి, జబ్బు తగ్గాక యింటికి తీసుకొచ్చి, రెండు మూడు రోజులు వేళపట్టున భోజనం పెట్టి, కొంత డబ్బిచ్చి తిరిగి యజమాని దగ్గిరకి పంపించేశారు.

శాస్త్రిగారు “పుడక ముందు నుండి పట్టమున కొడిగట్టిన పరిధి”, ఔదార్యం ప్రదర్శించకుండా ఉండలేక పోయేవారు. అప్పుడప్పుడు నేను నా అల్పత్వం వల్ల అనుకునేవాణ్ణి, శాస్త్రిగారు కొంచెమైనా లౌకికదృష్టి అలవరచుకుంటే బాగుండును అని. కాని జగదీశ్వరుడి సంకల్పం అది కాదు. అందుకే శాస్త్రిగారికి అనుకూలవతియైన భార్యను ప్రసాదించాడు. శ్లాఘనీయమైన పరోపకార జ్ఞానంతో, సున్నిత హృదయంతో, కరుణాశీలత్వంతో, “వాగర్థా వివసంపృక్తౌ” అన్నట్టు అన్ని వేళల్లోనూ అతని కండగా ఆమె నిలిచేది. వారి సంతానం కూడా అదే ఒరవడిలో జీవిస్తున్నారు. బాహ్యశుద్ధి, అంతశ్శుద్ధి— ఆయనకు పెట్టని సొమ్ములు.

స్వర్గీయ బలిజేపల్లి ద్వారకనాథ శాస్త్రిగారి ఆత్మకు శాంతి లభించు గాక అని మనబోటివారు ప్రార్థించడం వల్ల ఆయన ఆత్మశాంతి అప్రామాణికం అవుతుంది; అటువంటి ఉత్తమ పురుషులకు ఆత్మశాంతి లభించి తీరుతుంది.

—యమ్. యస్. కల్యాణసుందరం

నాకు అంతా అర్థమైంది. అందులో పెద్ద మనిషిగా కన్పించిన ఆయన్ని చూసి "నేను తీయలేదండీ!" అని అన్నాను దీనంగా.

"తీయకపోతే అది నీ జేబులోకి ఎట్లా వచ్చింది?" అని లాయరు పాయింటు లాగాడు.

"ఏమో! వీళ్లే నా జేబులో పర్సును పెట్టి నా మీద బనాయించారు—" నేను చెప్పేది పూర్తి కాకముందే "దొంగ లోంజడు," "దొంగ వేషాలు," "గజ టక్కరి" అని నాలుగు మూలలనుంచీ గాలి లోనికి ప్రసారిత మయాయి.

"నీమీద దొంగతనం అంటగట్టటానికి నీతో యేమైనా విరోధమా యీయనకి!" అన్నాడు పెద్ద మనిషి.

లోకంలో చాలామంది యిలాగే తమ పరిమితమైన ఆలోచనలతో ప్రతి విషయాన్నీ నిర్ణయిస్తారు. పోనీ తమది తప్పు అభిప్రాయమేమో అనేది వారి బుద్ధికి తట్టదు.

నేను "నిన్న" అనబోగానే, "యింకా చూస్తారేం, నలగదొడిచి స్టేషన్లో అప్పచెప్పక" అంటూ నాల్గు మూలలనుంచీ ప్రేక్షక జనం అరిచింది. వాళ్లు అలడమూ, కొట్టడమూ ఒకే సారి జరిగాయి. అబ్బ: ఆదెబ్బలు భరించలేక పోయాను. ఏడ్చాను. బతిమాలాను. కాళ్లు పట్టుకొన్నాను. కాస్త విశ్రాంతి తీసుకొంటున్నారులా వుంది, వీపుపై చేతులు వల్చబడినై.

ఒకాయన "ఇంకేం కొడతారు స్టేషన్లో అప్ప చెప్పండి" అని సలహా యిచ్చాడు చూడలేక.

"వీలు దొరికిందికదా అని " నిన్న సాయంత్రం యీయన జేబు కొట్టుందగా పట్టుకొని కొట్టానని యీ పన్నాగం పన్ని నన్ను కొట్టుతున్నారు." అన్నాను జాలి చూపిన పెద్ద మనిషితో.

ఇంకేముంది- మళ్లీ ఒక దజను చేతులు ఆడాయి ఒక అయిదు నిమిషాలు. ఒక మొద్దు చెయ్యి వచ్చి నా దవడమీద గట్టిగా తగిలింది. ఆ దెబ్బతో ముక్కువెంట, నోటివెంట నెత్తురు ధారగా కారటం మొదలెట్టింది. చూసి ఒక హృదయం గల పెద్దమనిషి "ఇంకేం కొట్టారయ్యా, మనిషి చస్తాడేమో. ఏం కొట్టారో ఏమో. ఇకనైనా స్టేషనులో అప్పచెప్పండి" అన్నాడు.

"దొంగతనం చేయటమేగాక ఆ పెద్దమనిషి మీదే తిరిగి దొంగతనం బనాయిస్తున్నావా!" అని అన్నాడు హాఫ్ సూటు దొంగను చూసి.

"చూడండి, యీ రాస్కెల్ ఎంత టక్కరో" అన్నాడు నిన్నటి దొంగ.

"దొంగ వెధవ బలేటక్కరి- చూస్తారేం, నాలుగు వుతకండి" అని అన్నాడు వుత్సాహంతో అప్పుడే వచ్చి ఆనందిస్తున్న ఒక పల్లెటూరి ప్రేక్షక మహాశయుడు.

"ఇది చాలక సినిమా గూడా ఎక్కడ చెడగొట్టుకోవడి? పోనీండి... యిక వెధవని." అని తనదారిని చక్కాబోయాడు నిన్నటి దొంగ.

అసలు గల్లంతు దొంగతనమాదొ. మాసేటప్పుడు ఆనందంతో ఒళ్లు మరచి చూచిన ప్రేక్షక జనం తిరిగి వెళ్లేటప్పుడు తమతమ జేబుల భద్రతను చూసుకొన్నారు. పాపం, ఏముంది! ముగ్గురు పల్లెటూరి అమాయకుల జేబులు ఖాళీ! తరచు యిలా యిటువంటి సమయాల్లో మోసపోయేది వాళ్లేగా! వెంటనే తమ తమ డబ్బు పోయిందని గల్లంతు చేశారు. మళ్లీ జనంలో కలవరం బయలుదేరింది. నేను యిప్పుడైనా నిజమైన దొంగ బయట పడతాడనే ఆనందంతో కారే రక్తాన్ని తుడుచుకొంటూ బయటపడి దొంగకోసం ఎదురుచూస్తున్నాను.

"ఇంకెవరుంటారు! ఇందాకటి జేబు దొంగదే యీపనీని" అంటూన్నారు.

నాగుండె ఆగిపోయింది. ఆలోచన లేదు. నిలువుగుడ్లు వేశాను.

"పారిపోయాడేమో పట్టుకోండి" అని అరుపులు. ఆమాటలు వింటుంటే నాఒళ్లు గగుర్పొడిచింది. నామార్గం ఏమిటో నాకు తెలిసింది. నేను పారిపోవాలి. దొంగతనాన్ని కత్తిన నేను కాని అయితేమాత్ర మేమిటి?

"పారిపోతాడేమో" అని నాకు మనకోపకారం చేసిన మార్గదర్శకుడైన అజ్ఞాత శ్రేయోభిలాషి ఋణం ఎప్పుడు, ఎలా తీర్చుకోగలను,

వెంటనే దొంగతనాన్ని — ఒకటికాదు నాలుగు కత్తిన నేనుకాని గబుక్కున ప్రక్క సందులోకి పరుగెత్తాను. మొదట్లో స్పష్టంగానూ, పిమ్మట అస్పష్టంగానూ 'దొంగను పట్టుకోండి' అని కేకలు వినిపించాయి కొంతదూరంవరకూ.



# మానవులా, మరబొమ్మలా?

★ పి. శై. మణి ★

ప్రజల జీవితాలేవిధంగా సాగితీరాలని ఆజ్ఞాపించడమన్నదే, అతి చాలా దారుణం! (కొన్నాళ్ళకు ప్రమాదకరంగాకూడా పరిణమించవచ్చును.) ఈ రాజకీయ వేత్తలూ, నీతి శాస్త్రజ్ఞులూ—వీళ్ళంతా తాము సకల సద్గుణ సంపన్నులూ, సర్వధర్మవేత్తలూ అయినట్టు, సాటి జనానీకాన్ని వారివారి అలవాట్లను, ఆశయాలను, జీవిత విధానాలను మార్చుకుని తీరాలని నిర్బంధ శాసనాలు చేస్తూ వుంటే—వారి ధీమాకు, అహంభావానికీ అంతులేని ఆశ్చర్యం కలుగుతూ వుంటుంది.

నాకుమట్టుకు, నలుగురికి చెప్పడమంటేనే ఎంతో సందేహంగా వుంటుంది. ఎవరి పరిస్థితులెటువుంటాయో, ఎవరికే సమయంలో యేది అవసరమో, ఎవరి అవసరాలకేది సూటిగా అనుకూలపడుతుందో ఏమీ తెలియనిదే—"ఇదే మంచిది. ఇలాగే నీవు నడుచుకోవాలి" అని. వారి కష్టసుఖాలు కనుక్కోనిదే, వారి మనోభావాలు తెలుసుకోలేనిదే బోధించడమెలాగ? — అసలు మాటకు వస్తే, నా మనస్సే నాకు పూర్తిగా తెలియదే! ఇక ఇతరుల ఆలోచనలూ, అభిప్రాయాలూ, ఆశలూ, ఆనందాలూ గురించి ఊహించడమే గాని అది ఎలాగ తెలుస్తుంది?

వ్యక్తులనుబట్టి, పరిస్థితులనుబట్టి మంచిచెడ్డలు మారుతూవుంటాయి. అటువంటప్పుడు, 'ఈ తీరున తిని, యీ అలవాట్లతో, యీ ఆదర్శం కోసమనే, యీవిధంగా ప్రజాబాహుళ్యం జీవించి తీరాలని నిర్బంధించబూనడం పరమ మూర్ఖం కాదూ? అనవసరంగా, అన్నిటిలోనూ కలుగజేసుకుని, దేశం మరమ్మతు చేస్తామనే పేరుతో, మానవులను మరబొమ్మలుగా మార్చ ప్రయత్నించడం అతి అన్యాయంకాదా?

ఇంకేం, యీ జీవితమన్నది విధి ప్రసాదితము, ఒక్కమాటే అనుభవించగల అమూల్య వస్తువు. ఎవరి యిష్టానుసారం వారిని సుఖపడనియ్యరాదా? మన మియ్యని దానిపై, మనకి యధికారమెక్కడిది? స్వల్ప విషయాల్లోకూడా, నీతి-నియమం అను పేరుతో ఆహార విహారాలకు, భావాలకుకూడా వ్యక్తి స్వాతంత్ర్య మరికట్టబూనడం మహాపరాధం.

"ఇదే నీతి. ఇలాగే బ్రతికి తీరాలి." అని, యే వ్యక్తినిగాని నిర్బంధించడానికి మన మెవరు? అసలు, జీవితమొక క్షణిక వ్యాపారం. నాలుగు చెరగులా కూడదీసి నలిగిపోకుండా, ఒలికిపోకుండా ఎవరి జీవితం వారు సాగించుకుంటుంటేనే 'త్రాహి, త్రాహి' అయిపోతున్నామే, యింక ఊరివారందరికీ ఉపదేశించాలనేగాకుండా, ఆజ్ఞలివ్వాలనే ఉబలాటమెందుకు!

—(సోమర్‌సెట్ మామ్‌నుండి)

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

### ఆంధ్రవిశ్వవిద్యాలయం: వైస్ ఛాన్సలర్

డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారు తమ వైస్ ఛాన్సలర్ పదవి కొరకు రాజీనామా, మొన్న 10 వ తేదీని సిండికేటు వారిచే ఆమోదింపబడినది. ఈ పదవిని భర్తీచేయుటకు అక్టోబరు 29 న ఆంధ్రవిశ్వవిద్యాలయపు సెనేటు సభ్యుల సమావేశం జరుగనున్నది.

మద్రాస్ ప్రభుత్వపు మాజీ సలహాదారుగాను, బొంబాయిరాష్ట్రపు తాత్కాలిక గవర్నరుగాను, రామపాదసాగర ప్రాజెక్టు పికగాను ఆంధ్రదేశంలో విశేషఖ్యాతిని గాంచియు, ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర సముపార్జనకై ఈమధ్య విజయవాడలో జరిగిన అఖిలాంధ్ర సభ తీర్మానములను కాంగ్రెసు వర్కింగు కమిటీ వద్దకు గొనిపోయి తాను చేయగల్గిన సేవను జేసియు, "ఆంధ్రానికే తన జీవితం అంకితం చేయ దలచుకొన్న" సర్ వెంకట రామమూర్తిగారు యీ వైస్ ఛాన్సలర్ పదవి కర్హులు, సమర్థులు.

ఇట్టి సదవకాశమును జారవిడువరాదని, సర్ రామమూర్తిగారినే వైస్ ఛాన్సలర్ గా ఎన్నుకోవలసిందని సెనేటు సభ్యులకు నా విన్నపము. ఈవిషయంలో ప్రముఖ ఆంధ్రులు, ఆంధ్ర సంఘం, విద్యార్థి సంఘాలు సర్ రామమూర్తిగారిని వైస్ ఛాన్సలర్ గా ఎన్నుకోవలసిందిగా సెనేటుసభ్యులను కోరుట వాంఛనీయము.

రాజమండ్రి కే.ఎస్. వి. కృష్ణారావు

### బి. కాం. హిందీ పరీక్ష

పాత నిబంధనావళి ప్రకారం బి. కాం. విద్యార్థులు రెండు సంవత్సరాలు కళాశాలలో హిందీ నేర్చుకొనిన పిమ్మట "గ్రూపు" పరీక్షతో పాటు, హిందీ పరీక్షకుకూడా కూర్చోవలసి వచ్చేది. కాని యీ సంవత్సరంనుంచి నూతన నిబంధనావళి ప్రకారం బి. కాం. మొదటి సంవత్సరాంతమందే మొట్టమొదటగా హిందీ పరీక్షకు హాజరవవలసి వస్తోంది.

బి. కాం. విద్యార్థులలో అధిక సంఖ్యాకులకు హిందీ అక్షరజ్ఞానంకూడా ఉండటం లేదనడంలో అతిశయోక్తి లేదు. రాయవలసిన హిందీ పరీక్ష "రాష్ట్రభాష" ప్రారంభంలో ఉంటోంది. సంవత్సరములోనే ఒనమాలనుండి రాష్ట్రభాష వరకు పరిజ్ఞానం సంపాదించటం చాలా దుర్లభమౌతోంది. విద్యార్థులలో అధిక సంఖ్యాకులు హిందీలో ఉత్తీర్ణులు కాకపోవడానికి కారణం కాలపరిమితి బహు తక్కువగా ఉండడమే. కాబట్టి పాత నిబంధనావళి ప్రకారంగా రెండు సంవత్సరాలు కళాశాలలో హిందీ అభ్యసించి, రెండవ సంవత్సరాంతమునందు హిందీ పరీక్షకు హాజరు కావలయునని నియమంయొక్క ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. ఈవిషయమునందు ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులు తగు శ్రద్ధ చూపెదరని ఆశించవచ్చా?

కాకినాడ యల్లావఝ్ఝుల రామారావు